# ప్రకటనము.

సుజనవర్యులారా!

శ్రీ భగవద్గీతలను పారాయణోపయుక్తముగ ముద్రించుచున్నవారిలో అర్థరహితముగఁ గొందఱును; తాత్పర్య రహితముగఁ గొందఱును, అర్థతాత్పర్యములు లేకయే కొందఱును, అర్థతాత్పర్యములతోఁ గొందఱును ముద్రించి చిత్రవిచిత్రములుగ బైండు చేయించి విక్రయించుచున్నారనుట సుప్రసిద్ధమే కదా!

వానిలో, కొన్ని సంప్రదాయవిరుద్ధార్థము గలవిగను, మఱికొన్ని స్వేచ్ఛానుసారముగ వ్రాయఁబడిన యర్థము గలవిగను, కొన్ని కావలసినంత యర్థము లేనివిగను వుండుటయే గాక విచిత్రమైన బైండ్లవలెనే విచిత్రములుగా నుండుటను జూచి శ్రీ శంకరభగవత్పాదకృత భాష్యమునకు సమముగ ప్రతిపద టీకాతాత్పర్యములు గలిగి యున్నయెడల సకల జనానందము గలుగు నని తలఁచి యిదివఱకు మాచే వ్రాయఁబడిన భగవద్గీతా భాష్యార్థచంద్రికయం దీ విషయము లన్నియునున్నను, అయ్యది సులభక్రయమునకు దొరకక పోవుటయేకాక, పదునెనిమి దధ్యాయములును చేతియం దిముడు లాగున నిట్టిదాని నొకటి వ్రాసి ముద్రించడమైనది.

నో రి - గు ద లింగ శాస్త్రులు.

ఓం

అష్టాదశాధ్యాయాంతర్గతము లయిన

# అష్టాదశశ్లోకములు.

శ్లో॥ నకాంక్షే విజయం కృష్ణ, నచ రాజ్యం సుఖానిచ ।
కిం నో రాజ్యేన గోవింద, కిం భోగై ర్జీవితేన వా॥ ౧

నజాయతే మ్రియతే వా కదాచి,
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో,
న హన్యతే హన్యమానే శరీరే॥ ౨

తత్త్వవిత్తు మహాబాహో, గుణకర్మవిభాగయోః ।
గుణాగుణేషు వర్తంత, ఇతి మత్వా న సజ్జతే॥ ౩

బ్రహ్మార్పణం బ్రహ్మహవి, ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం, బ్రహ్మకర్మసమాధినా॥ ౪

విద్యావినయసంపన్నే, బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకేచ, పణ్డితా స్సమదర్శినః॥ ౫

శనై శ్శనై రుపరమే, ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా, న కించి దపి చిన్తయేత్॥ ౬

భూమి రాపో నలో వాయుః, ఖం మనో బుద్ధి రేవచ ।
అహంకార ఇతీయం మే, భిన్నా ప్రకృతి రష్టధా॥ ౭

ఓమి త్యేకాక్షరం బ్రహ్మ, వ్యాహర న్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం, స యాతి పరమాంగతిమ్॥ ౮

అనన్యా శ్చింతయంతో మాం, యే జనాః పర్యుపాసతే ।
తేషాంనిత్యాభియుక్తానాం, యోగక్షేమంవహామ్యహమ్॥

అథవా బహునైతేన, కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహ మిదం కృత్స్న, మేకాంశేన స్థితో జగత్ ॥౧౦

మత్కర్మకృ న్మత్పరమో, మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు, య స్సమా మేతి పాండవ॥ ౧౧

అనపేక్ష శ్శుచి ర్దక్ష, ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ, యో మద్భక్త స్సమే ప్రియః ౧౨

యథా సర్వగతం సౌక్ష్మ్యా, దాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే, తథాత్మా నోపలిప్యతే॥ ౧౩

ప్రకాశంచ ప్రవృత్తించ, మోహమేవచ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని, న నివృత్తాని కాంక్షతి॥ ౧౪

అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః, పచా మ్యన్నం చతుర్విధమ్॥

య శ్శాస్త్రవిధి ముత్సృజ్య, వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి, న సుఖం న పరాంగతిమ్॥ ౧౬

అనుద్వేగకరం వాక్యం, సత్యం ప్రియహితంచ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ, వాఙ్మయం తప ఉచ్యతే॥౧౫ ।
సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచ॥

---

•

ఓం.

శ్రీకృష్ణాయ నమః.

# స్తోత్రశ్లోకములు.

---

వ్యాసం వసిష్ఠనప్తారం, శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే, శుకతాతం తపోనిధిమ్॥
అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరో హరిః ।
అఫాలలోచనశ్శంభు, ర్భగవాన్ బాదరాయణః॥
మునిం స్నిగ్ధాంబుదాభాసం, వేదవ్యాసం మకల్మషమ్ ।
వేదావాసం సరస్వత్యా, వాసం వ్యాసం నమామ్యహమ్॥

---

ఓం.

# శ్రీమద్గురుధ్యానప్రకారః.

---

వందే గురూణాం చరణారవిందే, సందర్శిత స్వాత్మసుఖావబోధే । జనస్యయే జాంగలికాయమానే, సంసారహాలాహలమోహశాంత్యై॥ వందే గురుపదద్వంద, మవాఙ్మానసగోచరమ్। రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురంమహః.

# శ్రీభగవద్గీతా పూర్వభాగమ్.

లక్ష్మీనాథసమారంభాం-నాథయామునమధ్యమామ్। అస్మదాచార్యపర్యంతాం-వందే గురుపరమ్పరామ్. 1. అస్మద్గురు సమారమ్భాం - నాథయామునమధ్యమామ్, లక్ష్మీవల్లభ పర్యంతాం - వందే గురుపరంపరామ్. 2.

ఇత్యాది తత్తత్సంప్రదాయాఽనుగుణం
గురుపరంపరాఽనుసంధానానంతరం అనుసంధేయమ్.

## స్తోత్రశ్లోకాః.

శుక్లాంబరధరం విష్ణుం-శశివర్ణం చతుర్భుజమ్, ప్రసన్నవదనం ధ్యాయే-త్సర్వవిఘ్నోపశాంతయే. 3. యస్య ద్విరదవక్త్రాద్యాః - పారిషద్యాః పరశ్శతమ్, విఘ్నంనిఘ్నంతి సతతం-విష్వక్సేనంతమాశ్రయే. 4. సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ, ఉపబృంహిత వేదాయ-నమో వ్యాసాయవిష్ణవే. 5, వ్యాసం వసిష్ఠనప్తారం-శక్తేః పౌత్రమకల్మషమ్, పరాశరాత్మజం వందే - శుకతాతం తపోనిధిమ్. 6. వ్యాసాయవిష్ణురూపాయ- వ్యాసరూపాయ విష్ణవే, నమోవై బ్రహ్మనిధయే - వాసిష్ఠాయ నమోనమః. 7. మునిం స్నిగ్ధాంబుదాభాసం - వేదవ్యాస మకల్మషమ్, వేదావాసం సరస్వత్యా-వాసం వ్యాసం నమామ్యహమ్. 8 అచతుర్వదనో బ్రహ్మా-ద్విబాహురపరో హరిః, అఫాలలోచన శ్శంభుర్భగవా-

న్బాదరాయణః. 9. కృష్ణం కమలపత్రాక్షం - పుణ్యశ్రవణ
కీర్తనమ్, వాసుదేవం జగద్యోనిం- నౌమినారాయణంహరిమ్.
10. కృష్ణాయ- యాదవేంద్రాయ-జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ-నమో వేదాంతవేదినే. 11. ప్రపన్న
పారిజాతాయ - వేత్రతోత్త్రైకపాణయే, జ్ఞానముద్రాయ
కృష్ణాయ- గీతామృతదుహేనమః. 12. సారథ్య మర్జునస్యా
జౌ-కుర్వన్ గీతామృతం దదౌ, లోకత్రయో వరాకాయతస్మై
కృష్ణాత్మనే నమః. 13 సర్వోపనిషదో గావో-దోగ్ధాగోపాల
నన్దనః, పార్థో వత్స స్సుధీ ర్భోక్తా - దుగ్ధం గీతామృతం
మహత్. 14.

## శ్రీ భగవద్గీతా మాహాత్మ్యమ్.

పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేన
స్వయం, వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభార
తమ్ । అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మమ్బత్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్. 15.
గీతాశాస్త్ర మిదం పుణ్యం - యఃపఠే త్ప్రయతః పుమాన్,
విష్ణోః పద మవాప్నోతి - భయశోకాది వర్జితః. 16. భారతా
మృత సర్వస్వం-విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్, గీతాగంగోదకం
పీత్వా- పునర్జన్మ నవిద్యతే. 17. గీతా సుగీతాః కర్తవ్యాః-
కి మన్యైః శ్శాస్త్రసంగ్రహైః, యా స్వయం పద్మనాభస్య-
ముఖపద్మాద్వినిస్సృతాః. 18 గీతాధ్యయనశీలస్య-ప్రాణాయామ

పరస్యచ, నైవ సంతీహ పాపాని--పూర్వజన్మకృతాన్యపి. 19. అకృత్య మపికుర్వాణో- భుంజానో వాయాతి సద్గతిః. ఘోరం వైవస్వతస్థానం - గీతాధ్యాయీ నపశ్యతి. 20. మలనిర్మోచనం పుంసాం - జలస్నానం దినేదినే, సకృద్గీతాంభసిస్నానం సంసారమలమోచనమ్. 21. శ్లోక మేకం తదర్ధంవా- పాదం పాదార్ధమేవవా, నిత్యం పఠతీ భక్త్యాయ- స్సమోక్ష మధిగచ్ఛతి. 22. సర్వశాస్త్రమయీ గీతా-సర్వవేదమయోహరిః సర్వతీర్థమయీ గంగా- సర్వధర్మమయో మనుః. 23. ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం-ఏకోదేవో దేవకీపుత్రఏవ, ఏకో మంత్రో దేవకీపుత్రనామ--కర్మా ప్యేకం దేవకీపుత్రసేవా. 24.

---

# అథ న్యాసః.

అస్య శ్రీభగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య - శ్రీవేదవ్యాసోభగవానృషిః- అనుష్టుప్ఛందః-శ్రీకృష్ణః పరమాత్మాదేవతా- అశోచ్యానన్వశోచ స్త్వమితిబీజమ్- సర్వధర్మాన్పరిత్యజ్యమా మేకం శరణం వ్రజేతిశక్తిః-అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామి మాశుచ ఇతికీలకమ్- మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి కవచమ్ - కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రమ్, అనాదిమధ్యాంతమనంతవీర్య మితిధ్యానమ్ - జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే గీతాపారాయణే

జపే వినియోగః - జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః - ఐశ్వర్యాత్మనే గోవిందాయ తర్జనీభ్యాం నమః-శక్త్యా త్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాం నమః - బలాత్మనే బల భద్రాయ అనామికాభ్యాం నమః - తైజసాత్మనే వాసుదేవా య కనిష్ఠికాభ్యాం నమః - విజయాత్మనే గాండీవధన్వనే అర్జు నాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః - జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయ నమః - ఐశ్వర్యాత్మనే గోవిందాయ శిరసేస్వా హా - శక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయైవషట్ - బలా త్మనే బలభద్రాయ కవచాయ హుం - తైజసాత్మనే వాసు దేవాయ నేత్రత్రయాయ వౌషట్ - విజయాత్మనేగాండీవ ధన్వనే అర్జునాయ వీర్యాయ అస్త్రాయఫట్ - ఓం భూ ర్భువస్సువరో మితి దిగ్బంధః.

## ధ్యానమ్.

కరకమలనిదర్శితాత్మముద్రః - పరికలితోన్నత బర్హి బర్హ చూడః, ఇతరకరగృహీత వేత్రతోత్రః - మమ హృది సన్నిధిమాతనోతు శౌరిః. 1. ఆతాద్రుపాణికమల ప్రణయ ప్రతోద - మాలోలహార మణికుణ్డల హేమసూత్రమ్, ఆనిశ్య్రమామ్బుకణ మమ్బుదనీల మన్యా - దాద్యం ధనం జయరథాభరణం మహోనః. 2. అగ్రేకృత్వాక మపి చర ణం జానునైకేనతిష్ఠ - న్పశ్చాత్పార్థం ప్రణయరసజుషా

చక్షుషా ఽవేక్షమాణా, సన్నో శ్రీ[illegible]ం [illegible] బద్ధ[illegible]
జ్ఞానముద్రా - [illegible] సన్నాతి
వేషః. ౬. వందే కృష్ణార్జునౌ [illegible] - నరనారాయణౌ వృష్ణి
ధృతరాష్ట్రసుతోన్మత్త గజ[illegible]హాణవల్లభౌ. ౭.

---

యద్వా, ఓం, అస్య శ్రీ భగవద్గీతాశాస్త్రమహామం
త్రస్య భగవాన్వేదవ్యాసఋషిః - అనుష్టుప్ ఛన్దః - శ్రీకృష్ణః
పరమాత్మా దేవతా- అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం
శ్చ భాషస ఇతిబీజం - సర్వధర్మాన్పరిత్యజ్యమామేకం శర
ణం వ్రజేతిశక్తిః - అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయి
ష్యామి మాశుచ ఇతి కీలకం - నైనంఛిందంతి శస్త్రాణి నైనం
దహతి పావక ఇత్యంగుష్ఠాభ్యాంనమః - నచైనంక్లేదయంత్యా
పో నశోషయతి మారుత ఇతితర్జనీభ్యాంనమః - అచ్ఛేద్యోఽ
యమదాహ్యోఽయమక్లేద్యో ఽశోష్యఏవ చేతిమధ్యమా
భ్యాంనమః - నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతన
ఇత్యనామికాభ్యాం నమః - పశ్య మేపార్థరూపాణి శతశోఽథ
సహస్రశ ఇతికనిష్ఠికాభ్యాం నమః - నానావిధాని దివ్యాని నా
నావర్ణాకృతీనిచేతి కరతలకర పృష్ఠాభ్యాంనమః. ఇతి కరన్యా
సః. అథ హృదయాదిన్యాసః - నైనం ఛిందంతి శస్త్రాణి నైనం
దహతి పావక ఇతిహృదయాయనమః - నచైవం క్లేదయంత్యా
పోనశోషయతి మారుత ఇతి శిరసేస్వాహా - అచ్ఛేద్యోఽయ
మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచేతి శిఖాయై
వషట్ నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతన ఇతి కవ

చాయహలుం - పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశ ఇతి నేత్రత్రయాయ వౌషట్-నానావిధాని దివ్యాని నానావర్ణా కృతీని చేతి అస్త్రాయ ఫట్ - భూర్భువస్సు వరోమితి దిగ్బంధః- ఓం శ్రీకృష్ణప్రీత్యర్థే గీతాపారాయణే జపేవా వినియోగః.

## ధ్యానమ్.

ఓం, పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం - వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్, అద్వైతా ఽమృతవర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీం - అంబత్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్. 1. నమోఽస్తుతే వ్యాసవిశాలబుద్ధే - ఫుల్లారవిందాయత పత్రనేత్రే, యేనత్వయా భారతతైలపూర్ణః - ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః. 2. ప్రసన్నపారిజాతాయ - తోత్రవేత్రైకపాణయే, జ్ఞానముద్రాయ కృష్ణాయ - గీతామృతదుహేనమః. 3. వాచకః ప్రణవోయస్య - క్రీడావస్త్వఖిలంజగత్, శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం - తం వందే దేవకీసుతమ్. 4. సర్వోపనిషదో గావో దోగ్ధాగోపాలనందనః, పార్థోవత్సస్సుధీర్భోక్తా - దుగ్ధం గీతామృతంమహత్. 5. వసుదేవసుతం వందే - కంసచాణూర మర్దనమ్, దేవకీపరమానందం - కృష్ణం వందే జగద్గురుమ్. 6. భీష్మద్రోణతటాజయద్రథజలా గాంధారనీలోత్పలా - శల్యగ్రాహవతీ కృపేణవహినీ కర్ణేనవేలాకులా, అశ్వత్థామ వికర్ణఘోర

మకరా దుర్యోధనావర్తినీ – సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ
కైవర్తకే కేశవ 7. పారాశర్యవచస్సరోజమమలం గీతార్థ
గంధోత్కటం – నానాఖ్యానక కేసరం హరికథా సంబోధనా
బోధితమ్, లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం
ముదా – భూయా ద్భారతపంకజం కలిమల ప్రధ్వంసినం
శ్రేయసే, 8. మూకం కరోతి వాచాలం – పంగుం లంఘయ
తేగిరిమ్, యత్కృపా త మహం వందే – పరమానంద మాధ
వమ్. 9. యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర మరుతః స్తున్వంతి
దివ్యైః స్తవై – ర్వేదై స్సాంగపదక్రమో పనిషద్భిర్గాయంతి
యం సామగాః, ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం
యోగినో – యస్యాంతం న విదు స్సురాసుర గణా దేవా
యతస్మై నమః. 10.

అతఃపరయథార్థం సమ్యూప్యజ్యపారాయణాదికం కార్యమ్,

# విషయసూచిక

పుటసంఖ్య.

పుట సంఖ్య.



విషయసూచిక - సమాప్తము.

# జ్ఞానసింధువు (వచనకావ్యము)

తెలుగు వచన వేదాంత గ్రంథము. చిదానందవధూత స్వాములవారు ఒక శ్వాసమునకు ఒక పద్యమువంతున మూడువేల ఆర్నూరు శ్వాసములకు 3600 పద్యములుగల గ్రంథమును ఒకదినమందే కన్నడ భాషలో రచియించియుండిరి. ఇట్టి మహత్తరమైన వేదాంత గ్రంథము ఆంధ్రులకెల్లరకు నుపయుక్తమగునటుల సామాన్యభాషాజ్ఞానము గల వారికి సైతము "బ్రహ్మజ్ఞానము" ఇట్టిదని తేటతెల్లముగా తెలియబాగున ముద్దులొలుకు మాటలతో సులభశైలిని తెలుగు వచనకావ్యముగ శ్రీ అద్వైతానందస్వామి వీరప్పగారిచే వ్రాయబడినది. ఇందు వేదాంతోపనిషత్ప్రతిపాదకములగు వాక్యములచే నొప్పారెడు సమస్త వేదాంత విషయము లిమిడియున్నవి. వేయేల ఒకసారి యీ గ్రంథమును చదివి వేదాంతసారామృతమును గ్రోలిన ధన్యులు కాగలరు. వెల 1 8 0

# శ్రీ కృష్ణరుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞాన శాస్త్రము

ఈ గ్రంథమునగల విషయములు:—ద్వారకాపురవర్ణన, శ్రీకృష్ణ రుక్మిణీ సంవాద ప్రారంభము, సాధన చతుష్టయములు, చతుర్విధ పురుషార్థ లక్షణములు, గురుమూర్తి ప్రభావము, శైవలక్షణము, భాగవతలక్షణము, జీవహింస లక్షణము, క్రమలక్షణము, కులలక్షణము, పిండోత్పత్తిలక్షణము, ప్రాప్తకర్మ లక్షణము, భక్తిలక్షణము, కర్మలక్షణము, యమదండన వివరము, యోగలక్షణము, అష్టాంగలక్షణము, పంచముద్ర లక్షణము, ప్రపంచోత్పత్తి లక్షణము, సాంఖ్యలక్షణము, తారకలక్షణము, జీవాత్మ పరమాత్మ లక్షణము, తను చతుష్టయ నిర్ణయము, షట్చక్ర నిర్ణయము, హంసలక్షణము, భగవంతుని విశ్వరూప లక్షణము, కాలప్రమాణ లక్షణము, మిథ్యాజగల్లక్షణము, మరణచిహ్నములు, అచల భావమున్నగు నవి గలవు. * వెల 1 4

* వీటి నన్నిటికిని పోస్టుఖర్చులు కొనువారే భరించవలెను

# హఠయోగప్రదీపిక.

ఇందు హఠయోగము చేయుటవలన ప్రయోజనమును, అష్టాంగము లగు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి లక్షణములును, ఆహారాది నియమములును, ఆసనప్రయోజనమును, ఆసనభేదములును ప్రాణాయామాభ్యాస లక్షణమును ప్రాణాయామ భేదములును, ప్రాణాయామ సౌకర్యార్థము, ధౌతికర్మ, వస్తికర్మ, నేతికర్మ, త్రాటకకర్మ, నౌలి, కపాలభాతియను షట్కర్మల లక్షణములును, వాని గుణములును, కుంభక భేదములును, కుండలీ ప్రయోజనమును, కుండలీప్రబోధ ప్రయోజనమును, దశవిధ ముద్రాస్వరూపమును, బంధత్రయప్రయోజనమును, రాజయోగమహిమయు, ప్రాణలయక్రమమును, శాంభవీముద్రా ప్రభావమును, ప్రత్యాహారభేదములు, ధారణాభేదములు, ధ్యానభేదములు, బ్రహ్మజ్ఞానిలక్షణము మొదలగు యోగి అనుసరింపవలసిన సమస్త విషయములును సులభశైలిలో వ్రాయబడి 128 ఆసనపటములును గలిగి మిక్కిలి అనుగుణ్యమై యున్నది యోగాభ్యాసము చేయువారికి ఈ గ్రంథము కల్పవృక్షమువంటిదని చెప్పుట అతిశయోక్తిగాదు. 216 పేజీలు గలిగి కాలికోబైండు చేయబడినది. పోస్టేజి 1-2-0 వెల 3 0 0

# శుకబ్రహ్మకైవల్యము అను,

## శుకమహాఋషి చరిత్రము

(శుకులు తనతండ్రివద్ద సమస్తము నేర్చి జనక మహారాజువలన సందేహ నివృత్తిపొందిన అనంతరము) శుకరంభల సంవాదరూపముగ అనేక దృష్టాంత శ్లోకములతో వ్రాయబడియున్నది. తుదిలేని సంసారసాగరమునంబడి మునుగుచు దరిగానక తల్లడిల్లుచున్న పామరులు సైతము ఈ గ్రంథము నొక్కసారి పఠించినయెడల వారు బ్రహ్మమిట్టిదని తెలిసికొని సంసారసాగరమును తరింపగలరనుట నిశ్చయము. 1 4 0

---

ఓమ్

# అథ శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్.

ధరోవాచ = భూదేవి యిట్లనెను.

శ్లో॥ భగవన్ పరమేశాన, భక్తిర వ్యభిచారిణీ॥
ప్రారబ్ధం భుజ్యమానస్య, కథంభవతి హే ప్రభో॥ ౧॥

తా. ఓ భగవంతుడా! అంతర్యామీ! ప్రభువా! ప్రారబ్ధము ననుభవించు వానికి పరమేశ్వరునియందు అఖండమైన భక్తి గలుగుటయెట్లు?

విష్ణురువాచ = విష్ణు విట్లనెను.

శ్లో॥ ప్రారబ్ధంభుజ్యమానోఽపి, గీతాభ్యాసరతస్సదా।
సముక్తస్స సుఖీలోకే కర్మణానోపలిప్యతే॥ ౨॥

తా. ఎవడు గీతాభ్యాసమునందు నిరతుడై యుండునో ఆతడు ప్రారబ్ధము ననుభవించుచుండినను "కర్మలిప్తుడు" గా నేరడు (అనుభవింప తగినకర్మగలవాడు కా నేరడు) లోకమునందు ఆతడే ముక్తుడు. సుఖియగు నతడే:—

శ్లో॥ మహాపాపాదిపాపాని, గీతాధ్యానంకరోతిచేత్।
క్వచిత్ స్పర్శంన కుర్వన్తి నళినీదళమంభసా॥ 3॥

తా. ఎవరైతే గీతాధ్యానమును చేయుదురో వారికి కమల పత్రమునకు నీరంటని చందంబున మహాపాపాది పాపములు కొంచమైనను నంటవు:—

శ్లో॥ గీతాయాః పుస్తకంయత్ర, యత్రపాఠః ప్రవర్తతే।
తత్రసర్వాణి తీర్థాని, ప్రయాగాదీని తత్రవై॥ ౪॥

తా. ఎచ్చట గీతాపుస్తక ముండునో, ఎచ్చట నిరుము ప్రాత్యేకముగ గీతాపారాయణము చేయుబడునో ఆ స్థలమునందు ప్రయాగ మొదలగు సమస్త తీర్థములుండును:—

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో, యోగినః పన్నగాశ్చయే।
గోపాల గోపికావాపి, నారదోద్ధవ పార్షదైః।
సహాయో జాయతే శీఘ్రం, తత్రగీతా ప్రవర్తతే॥ ౫॥

తా. ఎచ్చట గీతాపారాయణ, చేయబడుచుండునో, అచ్చట సమస్తదేవతలు, ఋషులు, యోగులు, అనంతుడు, వాసుకి, మొదలగు నాగులు, గోపాలురు, గోపికలు, భగవత్పార్షదవర్తులగు నారదోద్ధవాది పరమ భాగవతోత్తములతో కూడ శీఘ్రముగా సహాయత్వమును పొందును (సహాయులై యుందురు అని భావము.)

శ్లో॥ యత్రగీతావిచారశ్చ, పఠనం పాఠనంశ్రుతమ్।
తత్రాహం నిశ్చితంపృథ్వి! నివసామి సదైవహి॥ ౬॥

తా. ఓ భూదేవీ! ఎచ్చట గీతయొక్క విచారము, పఠనము, (చదువుట) పాఠనము (చదివించుట) శ్రవణము, జరుగుచుండునో, అచ్చట నిశ్చయముగా నేను వసించుచున్నాను:—

శ్లో॥ గీతాశ్రయోఽహంతిష్ఠామి,గీతామేచోత్తమంగృహమ్।
గీతాజ్ఞానముపాశ్రిత్య, త్రీన్లోకాన్పాలయామ్యహమ్॥ ౭॥

తా. నేను గీత నాశ్రయించి యున్నాను, గీతయే నాకు నుత్తమమైనగృహము, మఱియు గీతాజ్ఞానము నాశ్రయించియే మూడు లోకములను పాలించుచున్నాను:—

శ్లో॥ గీతామేపరమావిద్యా, బ్రహ్మరూపానసంశయః।
అర్ధమాత్రాక్షరానిత్యా, స్వనిర్వాచ్య పదాత్మికా॥ ౮॥

తా. గీత, బ్రహ్మరూపముగను, ప్రణవస్వరూపముగను, నాశ రహితముగను, అనిర్వాచ్యముగను, నిత్యముగను యుండునది గావున గీతయే నాపరమవిద్య:—

శ్లో॥ చిదానందేన కృష్ణేన, ప్రోక్తాస్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీపరానంద, తత్వార్థజ్ఞాన సంయుతా। ౯॥

తా. ఋగ్వేదాది వేదత్రయ రూపముగను, పరమానందరూపముగను, తత్వజ్ఞానగర్భితముగను, నుండు నీగీతను చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణభగవానుడు స్వయముగా నర్జునున కుపదేశించెను:—

శ్లో॥ యోష్టాదశ జపేనిత్యం, నరో నిశ్చలమానసః॥
జ్ఞానసిద్ధిం న లభతే, తతోయాతి పరంపదం॥ ౧౦॥

తా. ఏ పురుషుడు నిశ్చలమైన మనస్సుగలవాడై ప్రతిదినము పదునెనిమిది యధ్యాయములను జపించునో (పారాయణము చేయునో) అతడు జ్ఞాన, సిద్ధిని బొందును, దానిచే మోక్షమును బడయును:—

శ్లో॥ పాఠేసమర్థస్సంపూర్ణే, తదర్థంపాఠమాచరేత్।
తదా గోదానజంపుణ్యం లభతేనాత్రసంశయః॥ ౧౧॥

తా. సంపూర్ణ పాఠమును చదువుటయందు శక్తిలేనివాడు అర్థమైనను (తొమ్మిది అధ్యాయములైనను) చదువవలెను. దానివలన గోదానమంతటి పుణ్యము కలుగును, ఇందుకు సంశయములేదు.

శ్లో॥ త్రిభాగం పఠమానస్తు, గంగాస్నాన ఫలంలభేత్।
షడంశం జపమానస్తు సోమయాగ ఫలంలభేత్॥ ౧౨॥

తా. గీతయొక్క మూడుభాగములలో నొకభాగమగు, ఆరు అధ్యాయములను జదువువానికి గంగాస్నానఫలము ప్రాప్తమగును, ఆరింటిలో నొకభాగమును (మూడధ్యాయములను) పారాయణ మొనరించు వానికి సోమయాగ ఫలము లభించును.

శ్లో॥ ఏకాధ్యాయంతు యోనిత్యం, పఠతేభక్తిసంయుతః।
రుద్రలోకమవాప్నోతి, గణోభూత్వావసేచ్చిరమ్॥ ౧౩॥

తా. భక్తితో నెవడైతే యొక అధ్యాయమునైనను జదువునో అతడు, రుద్రలోకమును బొంది, రుద్రగణములతో నొకడై యచ్చట బహుకాలముండును.

శ్లో॥ అధ్యాయశ్లోకపాదంవా, నిత్యం యఃపఠతేనరః।
సయాతి నరతాంయావ న్మనుకాలం వసుంధరే॥ ౧౪॥

తా. ఓ భూదేవీ! ఏమనుష్యుఁడు అధ్యాయముల శ్లోకములందు నాల్గింట నొకభాగమునైనను నిత్యము పఠించునో, అతడు యొక మన్వంతరమువరకు మానవజన్మమునే బొందును.

శ్లో॥ గీతాయాశ్లోకదశకం, సప్తపంచ చతుష్టయమ్।
ద్వౌత్రీనేకం తదర్ధంవా, శ్లోకానాంయఃపఠేన్నరః॥ ౧౫॥
చన్ద్రలోక మవాప్నోతి, వర్షానామయుతంధ్రువమ్।
గీతాపాఠసమాయుక్తో,మృతోమానుషతాంవ్రజేత్॥ ౧౬॥

తా. ఏ మనుష్యుడు గీతయొక్క పదిశ్లోకములు గాని, లేక ఏడు, ఐదు, నాలుగు, మూడు, రెండు, అథవా ఒకటి గాని, తుదకు అర్ధశ్లోకమునైనను జదువునో, యతడు చంద్రలోకమును బొంది యచ్చట పదివేలసంవత్సరములుండును, ఇది నిశ్చయము. గీతాపారాయణమును జేయుచుండు మృతుడైన ఈ దేహనాశాంతమును మానవజన్మమునే పొందును.

శ్లో। గీతాభ్యాసం పునఃకృత్వా, లభతే ముక్తిముత్తమామ్।
గీతేత్యుచ్చారసంయుక్తో,మ్రియమాణోగతింలభేత్ ౧౭

తా. పైజెప్పబడినటుల, నరజన్మమును బొందినవాడు గీతాభ్యాసము నందు నిరతుడై యుత్తమమైన ముక్తిని బొందును, మరణకాలమున, "గీతా

గీతా!" అను శబ్దము నుచ్చరించుచు ప్రాణము విడుచువాడు సద్గతిని బొందును.

శ్లో॥ గీతార్థ శ్రవణాసక్తో మహాపాప యుతోపివా ।
వైకుంఠంసమ వాప్నోతి, విష్ణునాసహమోదతే॥ ౧౮॥

తా. మహాపాపముతో కూడిన వాడైనను గీతార్థమును వినుటయం దాసక్తుడగునో, వైకుంఠమును బొంది యచ్చట విష్ణువుతో గలిసి, సంతోషము గానుండును.

శ్లో॥ గీతార్థం ధ్యాయతేనిత్యం కృత్వాం కర్మాణిభూరిశః ।
జీవన్ముక్తసవిజ్ఞేయో, దేహాన్తే పరమంపదమ్॥ ౧౯॥

తా. ఎవడు అనేక కర్మముల జేసినను, ప్రతిదినము గీతార్థ విచారణ జేయుచుండునో, అతడు జీవన్ముక్తుడు అని తెలియదగినది. మఱియు దేహాన్తరమున పరమపదంబును గూడ బొందును:—

శ్లో॥ గీతామాశ్రిత్యబహవో, భూభుజోజనకాదయః ।
నిర్ధూత కల్మషాలోకే, గీతాయాతాః పరంపదమ్॥ ౨౦॥

తా. జనకుడు మొదలగు యనేక రాజషులు గీత నాశ్రయించిన వారలై, ఇహలోకమున కీర్తినిబొంది, పాపరహితులై యుత్తమైన పదమును బొందిరి.

శ్లో॥ గీతాయాః పఠనంకృత్వామాహాత్మ్యంనైవయ్యఃపఠేత్ ।
వృథాపాఠోభవేత్తస్య, శ్రమఏవహ్యుదాహృతః॥ ౨౧॥

తా. గీతను చదివి దాని మాహాత్మ్యమును ఎవడు చదువడో, అట్టివాని గీతాపఠనము కగినఫలము నిష్ఫల వ్యర్థమగును,-అందుచే నాతని గీతాపఠనము శ్రమకొరకే యని చెలుపబడినది.

శ్లో॥ ఏతన్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతియః ।
సతత్ఫలమవాప్నోతి, దుర్లభాంగతిమాప్నుయాత్॥ ౨౨॥

తా. అందువలన నీ మాహాత్మ్యముతో గూడిన గీతాభ్యాసము జేయువాడు మీద జెప్పబడిన ఫలమును బొంది దుర్లభమైన గతిని [మోక్షమును] బొందును.

సూతఉవాచ = సూతు డిట్లనెను.

శ్లో॥ మాహాత్మ్యమేతద్గీతాయా, మయాప్రోక్తంసనాతనమ్,
గీతాన్తేచ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్॥ ౨౩॥

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం సంపూర్ణమ్: —

తా. సనాతనమైన నీ గీతామాహాత్మ్యమును నేను దెలిపితిని. గీతా పారాయణానంతరమున ఎవడు దీనిని పఠించునో, వాడు పై జెప్పబడిన ఫలమును బొందును.

ఇట్లు వారాహ పురాణమందలి గీతా మాహాత్మ్యము,

సంపూర్ణము.

(ఓమ్ తత్ సత్)



ఓం.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

---

# శ్రీ భగవద్గీత-ప్రథమాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

---

## అర్జునవిషాదయోగము.

ధృతరాష్ట్ర ఉవాచ.—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ ౧

టీక. ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు చెప్పెను. హే సంజయ=ఓ సంజయుఁడా, ధర్మక్షేత్రే=పుణ్యభూమియైన, కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు, మామకాః=నావారలైన దుర్యోధనాదులును, పాండవాశ్చ=పాండురాజు పుత్రులైన ధర్మరాజాదులును, యుయుత్సవః=యుద్ధమును జేయవలయు ననియెడు కోర్కెగలవారై, సమవేతాః=కూడుకొనినవారలగుచు, కిమ్=ఏమి, అకుర్వత=చేసిరి.

తా. అయ్యా! సంజయుఁడా! పుణ్యభూమి యైన కురుక్షేత్రమునందు నాకుమారులైన దుర్యోధనాదులును, పాండురాజునకుఁ బుత్రులైన ధర్మనందనాదులును, యుద్ధమును జేయవలయు ననియెడు తలంపుతో సన్నద్ధులైరిగదా! ఏమి చేసిరి? ఆ విషయమును దెలుపుమనియె నని తాత్పర్యము.

సంజయ ఉవాచ,—

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ ౨

టీక. సంజయ ఉవాచ = సంజయుఁడు చెప్పెను. రాజా = రాజగు, దుర్యోధనః = దుర్యోధనుఁడు, వ్యూఢమ్ = వ్యూహాకారముగా రచింపఁబడిన, పాండవానీకంతు = పాండుపుత్రులయొక్క సైన్యముపైతే, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, ఆచార్యమ్ = ద్రోణాచార్యుని, ఉపసంగమ్య = సమీపించి, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = చెప్పెను.

తా. అయ్యా! ధృతరాష్ట్రుఁడా! రాజైన దుర్యోధనుఁడు, దృష్టద్యుమ్నాదులచేత శకటాద్యాకారములుగా నుండునట్లు నియమింపఁబడిన పాండవ సైన్యమును జూచినతోడనే ద్రోణాచార్యునియొద్దకుఁ బోయి యీ క్రిందఁ జెప్పఁబడఁబోవు మాటను జెప్పెనని తాత్పర్యము.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా ।
మాచార్య మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపద పుత్రేణ
తవ శిష్యేణ ధీమతా॥ ౩.

టీక. ఆచార్య = ఓ ద్రోణాచార్యుఁడా! తవ = నీకు, శిష్యేణ = శిష్యుఁడును, ధీమతా = బుద్ధిమంతుఁడును, ద్రుపదపుత్రేణ = ద్రుపదరాజునకుఁబుత్రుఁడును (అయిన) ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢామ్ = శకటాది వ్యూహాకారముగా రచింపఁబడినదియును, మహతీమ్ = గొప్పదియును (అగు) పాండుపుత్రాణామ్ = పాండురాజునకుఁ బుత్రులగు ధర్మనందనాదుల యొక్క, ఏతామ్ = ఈ, చమూమ్ = సేనను, పశ్య = చూడుము.

తా. ఓ ద్రోణాచార్యుఁడా! నీకు శిష్యుఁడును, బుద్ధిమంతుఁడును నగు ధృష్టద్యుమ్నునిచేత శకటాద్యాకారములుగా నిలుచునట్లు నియ

మింపఁబడినదియును, మిగుల గొప్పదియు నగు పాండవ సైన్యమును జూడుమని తాత్పర్యము,

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ ४
ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ ५
యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ ६

టీక. అత్ర=ఈ పాండవసేనయందు, మహేష్వాసాః=మిగుల గొప్ప వగు ధనుస్సులుగలవారును, యుధి=యుద్ధమునందు, భీమార్జునసమాః=భీముని తోడను, అర్జునునితోడను సమానులును (అగు), శూరాః=శూరులు, సంతి= కలరు, (వారెవ్వరనిన) యుయుధానః=(అత్యధికముగా యుద్ధమునుచేయు నట్టి) సాత్యకియును, విరాటశ్చ=(శత్రువులను విశేషముగా నేడిపించునట్టి) విరాటుఁడును, మహారథః=మహారథుఁడును, ద్రుపదశ్చ=(వృక్షమును ధ్వజమునందు చిహ్నమునుగా ధరించినవాఁడును) (అగు) ద్రుపదుఁడును, ధృష్టకేతుః=(శత్రువులకు భయంకరమైన ధ్వజము గల) ధృష్టకేతుఁడును, చేకితానః=(చికితానుఁడనువాని పుత్రుఁడైన) చేకితానుఁడును, వీర్యవాన్= (తేజోబలవిక్రమములు గల శత్రువులను నానావిధములుగా బరుగెత్తునట్లు చేయుటకుఁ దగిన) పరాక్రమముగల, కాశీరాజశ్చ = కాశీపట్టణాధిపతి యును, పురుజిత్ = (యుద్ధమునం దనేకులగు పురుషులను జయించిన) పురుజిత్తను రాజేంద్రుఁడును, కుంతిభోజశ్చ = (కుంతీదేవికిఁ దండ్రియైన) కుంతిభోజుఁడనువాఁడును, శైబ్యశ్చ=శిబిచక్రవర్తి కులమునందుఁ బుట్టిన, నరపుంగవశ్చ=రాజేంద్రుఁడును, విక్రాంతః=పరాక్రమము గల, యుధామన్యుశ్చ = (యుద్ధము నందు కోపవేగము గల) యుధామన్యుఁడును,

వీర్యవాన్ = పరాక్రమవంతుఁడైన, ఉత్తమౌజాశ్చ = (శ్రేష్ఠమగు బలము గల) ఉత్తమౌజుఁడును, సౌభద్రః = అభిమన్యుఁడును, ద్రౌపదేయాశ్చ = (ద్రౌపదీపుత్రులగు ప్రతివింధ్యాదులును అనునట్టి), ఏతే = ఈ, సర్వే = అందఱును, మహారథా ఏవ = మహారథులే.

తా. అయ్యా! ద్రోణాచార్యుఁడా! ఈ పాండవ సైన్యమునందున్న విరాటద్రుపదులు, సాత్యకి, ధృష్టకేతువు, చేకితానుఁడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, శైభ్యుఁడు, యుధామన్యుఁడు, ఉత్తమౌజుఁడు, అభిమన్యుఁడు, ధర్మ భీమార్జున నకుల సహదేవులవలన ద్రౌపదియందుఁ బుట్టిన ప్రతివింధ్యుఁడు, శ్రుతసోముఁడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శ్రుతసేనుఁడు, అనునట్టి రాజులందఱును మహారథులు. మఱియు, వీరందఱును మిగుల శ్రేష్ఠమగు ధనుస్సులుగలవారు. ఇంతియకాక వీరందఱును యుద్ధమునందు భీమార్జునులతో సమానులు. మఱియు, పరాక్రమ వంతులును, వీర్యవంతులు నునై యున్నారు. కాఁబట్టి ధృష్టద్యుమ్నునిచేత మాత్రమే యీసైన్య మంతయును నిలుపఁబడినదనియును, అల్పుఁడగు ధృష్టద్యుమ్నుని మనవారలలో నెవ్వఁడైన నొకఁడు జయింపఁగలఁడనియును దలఁచి, నేను బరితాపమును బొందుట యుచితముగాదని చెప్పకుము. మఱియు నీసైన్యమునందున్న వారందఱును మహారథులును, పరాక్రమాది గుణములు గలవారునునగుటచేత శత్రువులను దూరమునందుండియే తఱుమగలవారు, మఱియు వీరందఱును భీమార్జునులతో సమానులగుటచేత యుద్ధమును చేయుటయందు మిగుల నేర్పుగలవారు. మఱియును, పాండవసైన్యమునందున్న వారందఱును మహారథులేగాక యతిరథులునై యున్నారు, కావున నో ద్రోణాచార్యుఁడా! నీవు ఉపేక్షను జేయక మహోత్సాహముతో యుద్ధమును జేయుమని తాత్పర్యము.

"శ్లో॥ ఏకాదశ సహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్।
శస్త్రశాస్త్ర ప్రవీణస్తు మహారథ ఇతిస్మృతః॥
అమితాన్యోధయేద్యస్తు సంప్రోక్తోతి రథస్స్మృతః।
సమస్త్వేకేనయో యోద్ధా తన్న్యూనోర్ధరథో మతః॥"




ధనుఁడు, 2 భీష్ముఁడు, 3 కౌరవసైన్యము, 4 కృష్ణుఁడు, 5 అర్జునుఁడు, 6 చక్రరక్షకుఁడు
7 హనుమంతుఁడు, 8 భీష్మునిసారథి.

తా. పదునొకండువేల విలుకాండ్రతో యుద్ధమును జేయునట్టి సామర్థ్యము గలవాఁడును, శస్త్రవిద్యయందు మిగుల నేర్పు గలవాఁడును నగువాఁడు మహారథుఁ డనఁబడును. అపరిమితసంఖ్య గల రథికులతో యుద్ధమును జేయువాఁడు సమరథుఁ డనఁబడును. ఆ సమరథునికంటెఁ దక్కువవాఁ డర్థరథుఁ డనఁబడు నని తాత్పర్యము.

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్బ్రవీమి తే॥ 7

టీక. హే ద్విజోత్తమ = బ్రాహ్మణోత్తముఁడ వైన యో ద్రోణాచార్యుఁడా! యే = ఎవరు, మమ = నాయొక్క, సైన్యస్య = సేనకు, నాయకాః = రక్షకులో, తాన్ = వారలను, తే = నీకు, సంజ్ఞార్థమ్ = తెలియుటకొఱకు, బ్రవీమి = చెప్పుచున్నాను; యే తు = ఎవరైతే, అస్మాకమ్ = మనవారలలో, విశిష్టాః = శౌర్యముచేత శ్రేష్ఠులో తాన్ = వారిని, నిబోధ = తెలిసికొనుము.

తా. బ్రాహ్మణోత్తముఁడ వైన యో ద్రోణాచార్యుఁడా! మనసైన్యమునకు రక్షకులైనవారలను నీకు జ్ఞప్తిని చేయుటకొఱకు ఇప్పుడు వివరించుచున్నాను, అందులో నుత్తము లగువారలను వినుమని తాత్పర్యము.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ॥ 8

టీక. భవాన్ = నీవును, భీష్మశ్చ = భీష్ముఁడును, కర్ణశ్చ = కర్ణుఁడును, సమితింజయః = యుద్ధమునందు జయముగల, కృపశ్చ = కృపుఁడును, అశ్వత్థామా = అశ్వత్థామయును, సౌమదత్తిః = (సోమదత్తునకుఁ బుత్రుఁ డైన) భూరిశ్రవుఁడును.

తా. వారెవ్వరనిన ద్రోణుండవగు నీవును, భీష్ముండును, కర్ణుండును, యుద్ధములందు జయముగల కృపాచార్యుండును, అశ్వత్థామయును, వికర్ణుండును, సోమదత్తుని పుత్రుండగు భూరిశ్రవుండనియును తెలియఁగుమని తాత్పర్యము.

శ్లో॥ అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ ౯

టీక. అన్యే = (ఇపుడు చెప్పఁబడినవారికంటె) ఇతరులును, బహవః = అనేకులును, (అయిన) శూరాః = పరాక్రమవంతులును నగు సైంధవుఁడు శల్యుఁడు మొదలగువారును, మదర్థే = నా కొఱకు, త్యక్తజీవితాః = ప్రాణములనుగూడ వదలుకొనియున్నారు. (మఱియును) ఏతే = ఈ, సర్వే = అందఱును నానాశస్త్రప్రహరణాః = అనేకవిధములయిన శస్త్రములే సాధనములుగాఁ గలవారు. (అతఏవ = కావుననే) యుద్ధవిశారదాః = యుద్ధములయందు మిగుల నేర్పు గలవారు.

తా. అయ్యా! ద్రోణాచార్యుఁడా! ఇంకను అనేక శూరులు నానా విధములగు శస్త్రాస్త్రములయందుఁ బ్రవీణత గలవారై నా నిమిత్తము ప్రాణములనుగూడ విడిచిపెట్టుటకు సిద్ధముగ నున్నారని తాత్పర్యము.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ ౧౦

టీక. భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచేతఁ గాపాడఁ బడుచున్నదియును, తత్ = ప్రసిద్ధమైనదియును, (అగు) అస్మాకమ్ = మనయొక్క, బలమ్ = సైన్యము, అపర్యాప్తమ్ = అపరిమితమైనది, భీమాభిరక్షితమ్ = భీమునిచేతఁ గాపాడఁ బడుచున్న, ఏతేషామ్ = ఈ పాండవులయొక్క, ఇదమ్ = ఈ, బలంతు = సైన్యమైతే, పర్యాప్తమ్ = పరిమితి గలది,

తా. ఆచార్యా! ద్రోణాచార్యుఁడా! భీష్మునిచేఁ గాపాడఁబడు చున్న మన సైన్య మపరిమితమై యున్నది. భీముని చేతఁ గాపాడఁబడుచున్న పాండవ సైన్యము మితమై యున్నదని తాత్పర్యము.

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి॥ ౧౧

టీక. సర్వే=అంతటైన, భవంత ఏవహి = మీరే, సర్వేషు = సమస్తములైన, అయనేషు=వ్యూహప్రవేశ మార్గములయందు, యథాభాగమ్= మీకు నిర్ణయింపఁబడిన ప్రదేశములనువదలక, అవస్థితాస్సంతః=ఉన్నవార లగుచు, భీష్మమేవ=భీష్మాచార్యునే, అభిరక్షన్తు కాపాడుదురు గాక.

తా. అయ్యా! ద్రోణాచార్యుఁడా! మీరందఱును వారివారికి నిర్ణయింపఁబడిన స్థానములలో నుండి తొలఁగక మన సేనానాయకుఁడగు భీష్మునిఁ గాపాడుచుండవలయునని తాత్పర్యము.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

టీక. ప్రతాపవాన్=పరాక్రమశాలియును, కురువృద్ధః=కురుశ్రేష్ఠుఁడును (అగు) పితామహః=భీష్మాచార్యుఁడు, తస్య=పూర్వోక్త ప్రకారముగా స్తోత్రమును చేయుచున్న దుర్యోధనునకు, హర్షమ్=సంతోషమును సంజనయన్ = పుట్టించుచు, ఉచ్చైః = గట్టిగా, సింహనాదమ్ = సింహనాదమును, వినద్య=చేసి, శంఖమ్=శంఖమును, దధ్మౌ=పూరించెను.

తా. పరాక్రమశాలియును, కురుశ్రేష్ఠుఁడు నగు భీష్ముఁడు, ఆ విధముగా స్తోత్రమును జేయుచున్న దుర్యోధనునకు సంతోషమును బుట్టించుచు సింహనాదమును జేసి శంఖమును బూరించెనని తాత్పర్యము.

శ్లో॥ తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।
సహసై వాభ్యహన్యంత సశబ్దస్తుములో౽భవత్ ॥

టీక. తతః = ఆ, సేనానాయకుఁడైన భీష్ముఁడు సింహనాద శంఖ ధ్వనులను జేసిన పిమ్మట, (కౌరవసైనికులచేత) శంఖాశ్చ = శంఖములును, భేర్యశ్చ = భేరులును, పణవానకగోముఖాః = పణవము లనియెడు మద్దెల వాద్యవిశేషములును, ఆనకములను ఢక్కావాద్య విశేషములును, సంగీతానుసారములయిన యుద్ధవిశేషములును, సహసైవ = శీఘ్రముగానే, అభ్యహన్యంత = వాయింపఁబడెను, సః = ఆ వాద్యములవలన గలిగినధ్వని, తుములః = సంకులమైనదై, అభవత్ = ఆయెను.

తా. ఇట్లు భీష్మాచార్యుఁడు సింహనాద శంఖధ్వనులను జేయఁగానే కౌరవసైనికులు, శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు, గోముఖములు మొదలుగాఁ గలవియును, రోమోద్ధమముఁ గలుగఁజేయఁదగినవియును నగు వాద్యములను వాయించిరి. దానివలనఁ గలిగిన ధ్వని దిక్కుల నిండినదయ్యెనని తాత్పర్యము.

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥

టీక. తతః = అట్లు కౌరవసేనయందలి ధ్వనిని వినినపిమ్మట, శ్వేతైః = తెల్లనివి(అగు), హయైః = గుఱ్ఱములతో, యుక్తే = కూడినదియును, మహతి = గొప్పదియును (అగు), స్యందనే = రథమునందు, స్థితౌ = నివసించిన, మాధవః = కృష్ణుఁడును, పాండవశ్చైవ = అర్జునుఁడును, దివ్యౌ = మిగుల శ్రేష్ఠములు (అయిన), శంఖౌ = శంఖములను, ప్రదధ్మతుః = ఊదిరి.

తా. అట్లు కౌరవసేనయందు చేయఁబడిన ధ్వనిని విన్న పిమ్మట తెల్లని గుఱ్ఱములచేతఁ బూన్పఁబడినదియును, గొప్పదియునునగు రథమునం దున్న కృష్ణార్జునులు శంఖములను బూరించి రని తాత్పర్యము.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥

టీక. హృషీకేశః=(ఇంద్రియములకు నియామకుఁడైన) కృష్ణుఁడు, పాంచజన్యమ్ = (పంచజనుఁడను రాక్షసుని వలనఁ బుట్టిన) శంఖమును. దధ్మౌ = పూరించెను. ధనంజయః=అర్జునుఁడు, దేవదత్తమ్=దేవదత్తమను శంఖమును, దధ్మౌ = పూరించెను, భీమకర్మా = భయంకరమైన వ్యాపారముగల, వృకోదరః = భీముఁడు, పౌండ్రమ్ = పౌండ్రమను పేరుగల, మహాశంఖమ్ = గొప్పదగు శంఖమును, దధ్మౌ = పూరించెను.

తా. శ్రీకృష్ణుఁడు పాంచజన్యమను శంఖమును, అర్జునుఁడు దేవదత్తమను శంఖమును, భయంకరమగు వ్యాపారముగల భీముఁడు పౌండ్రమను గొప్పదగు శంఖమును బూరించిరని తాత్పర్యము.

శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ ౧౬

టీక. కుంతీపుత్రః=కుంతీదేవికిఁ బుత్రుఁడు (అయిన), యుధిష్ఠిరః= యుద్ధమునందు స్థిరముగా నిలుచునట్టి, రాజా=ధర్మరాజు, అనంతవిజయ మను పేరుగల శంఖమును, దధ్మౌ= పూరించెను. నకులః = నకులుఁడును, సహదేవశ్చ = సహదేవుఁడును, సుఘోషమణిపుష్పకౌ = సుఘోష మణిపుష్పకములను శంఖములను, ప్రదధ్మతుః = పూరించిరి.

తా. కుంతిమహాదేవికి బుత్రుఁడును, యుద్ధమునందు స్థిరముగా నిలుచువాఁడునగు నట్టి ధర్మరాజు అనంతవిజయ మను పేరుగల శంఖమును బూరించె, నకుల సహదేవులు సుఘోషమణి పుష్పకము లను శంఖములను బూరించిరని తాత్పర్యము.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీచ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥౧౭

టీక. (మఱియును) పరమేష్వాసః = శ్రేష్ఠమైన ధనుస్సుగల, కాశ్యశ్చ = కాశీరాజును, మహారథః = మహారథికుఁడు (అయిన), శిఖండీచ = శిఖండియును, ధృష్టద్యుమ్నః = ధృష్టద్యుమ్నుఁడును, విరాటశ్చ = విరాటుఁడును, అపరాజితః = జయింపఁబడని, సాత్యకిశ్చ = సాత్యకియును, (శంఖాన్ = శంఖములను) ప్రదధ్ముః = పూరించిరి.

తా. మఱియును, శ్రేష్ఠమైనధనుస్సు గల కాశీరాజును, మహారథులైన శిఖండియును, ధృష్టద్యుమ్నుఁడును, యుద్ధమునందు పరాభవమును పొందని సాత్యకియును వేఱువేఱుగా దమతమశంఖములను పూరించిరని తా.

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥

టీక. హే పృథివీపతే - ఓ ధృతరాష్ట్రుఁడా! ద్రుపదశ్చ - ద్రుపదరాజును, ద్రౌపదేయాశ్చ = ద్రౌపతీపుత్రులు (అయిన) ప్రతివింధ్యాదులును, మహాబాహుః = మిగుల భుజబలము గలవాఁడును, సౌభద్రశ్చ = సుభద్రాపుత్రుఁడును (అయిన) అభిమన్యుఁడును, సర్వశః = ఈ చెప్పఁబడిన యోధులందఱును, పృథక్ పృథక్ = వేఱు వేఱుగా, శంఖాన్ = శంఖములను, దధ్ముః = పూరించిరి.

తా. ఓ ధృతరాష్ట్రుఁడా! మఱియు ద్రుపదరాజును, ద్రౌపదీదేవి యొక్క పుత్రులగు ప్రతివింధ్యాదులును, మిగుల భుజబలముగల అభిమన్యుఁడును మొదలగువారందఱును వేర్వేఱుగా శంఖములను పూరించిరని తా.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥

టీక. తుములః = సంకులమైన, సః = అటువంటి, ఘోషః = శంఖధ్వని, నభశ్చ = ఆకాశమును, పృథివీం చైవ = భూమిని, వ్యనునాదయన్ = ప్రతి

ధ్వనులచేత నిండించిన దగుచు, ధార్తరాష్ట్రాణామ్ = దుర్యోధనాదుల
యొక్క, హృదయాని = హృదయములను, వ్యదారయత్ = భేదించెను.

తా. ఈ పైనచెప్పిన విధముగా కృష్ణార్జునులు మొదలగు వారిచేతఁ
జేయఁబడిన శంఖములయొక్క ధ్వను లొకటియై మిగుల సంకులమైన ధ్వని
యయ్యె. ఆ ధ్వని యాకాశమును భూమిని ప్రతిధ్వనులచేత నిండింపఁ
జేయుచు దుర్యోధనాదులయొక్క హృదయములను బ్రద్దలు సేసె నని తా.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః॥౨౦
హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే।

టీక. హేమహీపతే = ఓధృతరాష్ట్రుఁడా! అథ = రెండుతెగల
వారును శంఖధ్వనులను జేసినపిమ్మట, శస్త్రసంపాతే = శస్త్రములు పడుట,
ప్రవృత్తేసతి = ప్రవర్తించిన దగుచుండఁగా, కపిధ్వజః = హనుమద్ధ్వ
జుఁడు (అయిన), పాండవః = అర్జునుఁడు, వ్యవస్థితాన్ = యుద్ధమును
జేయుటకు నిశ్చయించుకొనియున్న, ధార్తరాష్ట్రాన్=ధృతరాష్ట్రునిపుత్రు
లగు దుర్యోధనాదులను, దృష్ట్వా = చూచి, ధనుః = వింటిని, ఉద్యమ్య=
ఎత్తిపెట్టి, తదా = ఆ సమయమునందు, హృషీకేశమ్ = ఇంద్రియప్రేర
కుఁడగు కృష్ణునితో, ఇదమ్ = ఈ వాక్యమును, అహ = పలికెను.

తా. ఓ ధృతరాష్ట్రుఁడా! అవ్విధముగ రెండుతెగలవారును శంఖ
ములను ప్రయోగించిన పిమ్మట హనుమంతుఁడు ధ్వజమునందుఁ గల యర్జు
నుఁడు పరుసగా నిలిచి యున్నవారును, యుద్ధమును జేయుటకు సిద్ధముగ
నున్న వారును నగు దుర్యోధనాదులను జూచి, యుద్ధము ప్రవర్తించుటను
దెలిసికొని వింటిని నెక్కుపెట్టి సర్వేంద్రియప్రేరకుఁడైన శ్రీకృష్ణు నుద్దే
శించి ఈ క్రింద వివరింపఁబోయెడు వాక్యమును చెప్పె నని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥

టీక. అర్జునఉవాచ = అర్జునుఁడు చెప్పెను, హేఅచ్యుత=భ్రష్టత లేని యో కృష్ణుఁడా! ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయొక్క, మధ్యే = మధ్యమునందు, మే = నాయొక్క, రథమ్ = రథమును, స్థాపయ = నిలుపుము.

తా. ఓ యచ్యుతుఁడా! ఈ రెండు సేనలయొక్క మధ్యప్రదేశమునందు రథమును నిలుపు మని తాత్పర్యము.

శ్లో॥ యావదేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కై ర్మయాసహ యోద్ధవ్య మస్మి న్రణసముద్యమే॥ ౨౨

టీక. అస్మిన్ = ఈ, రణసముద్యమే = యుద్ధముయొక్క ఉపక్రమము నందు, కైస్సహ = ఎవ్వరితోఁగూడ, మయా = నాచేత, యోద్ధవ్యమ్ = యుద్ధము చేయఁదగినది, అహమ్ = నేను, యోద్ధుకామాన్ = యుద్ధమును జేయవలయు నని యెడు కోర్కెగలవారై, అవస్థితాన్ = వచ్చియున్న, ఏతాన్ = ఈ, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనుఁడు మొదలగు వారిని, యావత్ = ఎంతదూరమునందుండి, నిరీక్షే = చూడఁగలనో, (తావత్ = అంత దూరమునందు, రథమ్ = రథమును, స్థాపయ = నిలుపుము).

తా. ఓ కృష్ణుఁడా! ఈ యుద్ధరంగమునందు నే నెవ్వరితో యుద్ధమును జేయఁదగియున్నదో చూడవలయును, మఱియు నెవ్వ రెవ్వరు యుద్ధమునకు వచ్చిరో తెలిసికొనవలయును. కావున మన రథమును వారంద ఱును గనఁ బడఁదగినంత దూరమునందు నిలుపు మని తాత్పర్యము.

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ ౨౩

టీక. దుర్బుద్ధేః = దుష్టబుద్ధిగల, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు, ప్రియచికీర్షవః = ప్రియమును జేయఁదలఁచినవారై, యే ఏతే = ఏవీరలు, అత్ర = ఈ యుద్ధభూమియందు, సమాగతాః = కలిసికొనిరో, ఏతాన్ = ఈ, యోత్స్యమానాన్ = యుద్ధమును జేయఁగలవారలను, అహమ్ = నేను, అవేక్షే = చూచుచున్నాఁడను.

తా. దుష్టబుద్ధిగల దుర్యోధనునకుఁ బ్రియమును జేయవలయు నని యెడం గోర్కెగలవారై యుద్ధమును జేయుటకొఱకు ఎవరెవరు సన్నద్ధులై వచ్చియున్నారో వారలను నేను జూడఁగోరుచున్నాఁడనని తాత్పర్యము.

సంజయ ఉవాచ.—

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥
భీష్మద్రోణప్రముఖతః సర్వేషాంచ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥

టీక. సంజయఉవాచ = సంజయుఁడు చెప్పెను. హే భారత = ఓధృతరాష్ట్రుఁడా ! గుడాకేశేన = నిద్రను నియామకుఁడైన యర్జునునిచేత, ఏవమ్ = ఈ ప్రకారముగా, ఉక్తః = చెప్పఁబడిన, హృషీకేశః = కృష్ణుఁడు, ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయొక్క, మధ్యే = మధ్యయందు, భీష్మద్రోణప్రముఖతః = భీష్మద్రోణులయొక్క యెదుటను, సర్వేషామ్ = అందఱైన, మహీక్షితామ్ = రాజులయొక్కయును, (పురతః = ఎదుటను), రథోత్తమమ్ = శ్రేష్ఠమగు రథమును, స్థాపయిత్వా = నిలిపి, పార్థ = (పృథయను నామధేయముగల కుంతికిఁ బుత్రుఁడవైన) ఓయర్జునుఁడా! సమవేతాన్ = (యుద్ధమును జేయుటకు కలిసియున్న), ఏతాన్ = ఈ, కురూన్ = కురువులను, పశ్య = చూడుము, ఇతి = ఇట్లని, ఉవాచ = చెప్పెను.

తా॥ భరతవంశమునందుఁ బుట్టిన యో ధృతరాష్ట్రుఁడా! నిద్రకు నియామకుఁడైన యర్జునుని చేత నీవిధముగాఁ జెప్పఁబడిన మాటలను విని సర్వేంద్రియ నియామకుఁడగు నారాయణుఁడు రెండు సేనల యొక్కయు, మధ్యమందు భీష్మద్రోణుల యొక్కయు, మఱియు నితరులగు రాజుల యొక్కయు, ఎదుట శ్రేష్ఠమగు రథమును నిలిపి, కుంతీపుత్రుఁడవైన యో యర్జునుఁడా! యుద్ధము చేయుటకుఁ గలిసియున్న యీ కురురాజులను జూడుమనియె నని తాత్పర్యము.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥ ౨౬
శ్వశురాన్ సుహృద శ్చైవ
సేనయో రుభయో రపి ।

టీక. అథ=అప్రకారము, తత్ర=కృష్ణుఁడు రథమును నిలిపినవాఁడగుచునుండఁగా, పార్థః=కుంతీపుత్రుఁడు (అయిన) అర్జునుఁడు, ఉభయోః= రెండువిధములైన, సేనయోరపి = సైన్యములయందును, స్థితాన్=ఉన్నట్టి, పితౄన్=పినతండ్రులును పెత్తండ్రులును (అయిన) భూరిశ్రవుఁడు మొదలగు వారలను, పితామహాన్ = తాతలగు భీష్మాదులను, ఆచార్యాన్= గురువులైన ద్రోణాదులను, భ్రాతౄన్=తోడఁబుట్టువులగు దుర్యోధనాదులను, పుత్రాన్= కుమారులగు లక్ష్మణాదులను, పౌత్రాన్=మనుమలను, మాతులాన్= మేనమామలగు శల్యుఁడు మొదలగువారలను, సఖీన్= స్నేహితులైన యశ్వత్థామాదులను, శ్వశురాన్ = భార్యలయొక్క తండ్రులను, సుహృదః = ఉపకారమును జేసినవారలను, అపశ్యత్ = చూచెను.

తా. ఆ ప్రకారము శ్రీకృష్ణుఁడు రథమును నిలుపఁగానే యుభయ సైన్యములయందును యుద్ధసన్నద్ధులై నిలిచియున్న పిన్నతండ్రులను పెద్ద తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, మామలను, అన్నదమ్ములను, కొమరులను, మనమలను, స్నేహితులను, ఉపకారములను జేసిన వారలను, కుంతీదేవికి బుత్రుఁడైన యర్జునుఁడు చూచెనని తాత్పర్యము.

శ్లో॥ తాన్ సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్॥
కృపయా పరయావిష్టో విషీద న్నిద మబ్రవీత్ ॥

టీక. కౌంతేయః = కుంతీపుత్రుఁడైన, సః = ఆ యర్జునుఁడు, అవస్థితాన్ = యుద్ధరంగమునందున్న, తాన్ = ఆ, సర్వాన్ = సమస్తమైన, బంధూన్ = చుట్టములను, సమీక్ష్య = చూచి, పరయా = మిగుల గొప్పదగు, కృపయా = కరుణచేత, ఆవిష్టః = వ్యాప్తుఁడై, విషీదన్ = వ్యసనమును పొందుచు, ఇదమ్ = ఈమాటను, అబ్రవీత్ = చెప్పెను.

తా. కుంతీదేవికిఁ బుత్రుఁడైన యీ యర్జునుఁడు యుద్ధరంగమునందున్నవారును, పైనఁ జెప్పఁబడినవారును నగు సమస్త బంధువులను చూచి యత్యధిక మగు దయగలవాఁడై దుఃఖించుచు శ్రీకృష్ణునితో నిట్లనియె నని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ ౨౮

టీక. అర్జునఉవాచ = అర్జునుఁడు చెప్పెను. కృష్ణ = ఓకృష్ణుఁడా! యుయుత్సుమ్ = యుద్ధమును జేయఁదలఁచి నదియును, సముపస్థితమ్ = యుద్ధ సన్నద్ధమై యున్నదియును, (అయిన) ఇదమ్ = ఈ స్వజనమ్ = బంధుజనమును, దృష్ట్వా = చూచి, మమ = నాయొక్క, గాత్రాణి =

అవయవములు, సీదంతి=శిథిలమగుచున్నవి. మే=నాయొక్క, ముఖంచ= నోరును, పరిశుష్యతి = ఎండుచున్నది. శరీరే=దేహమునందు, వేపథుశ్చ= వణఁకును, జాయతే = పుట్టుచున్నది. రోమహర్షశ్చ = గగుర్పాటును, జాయతే = పుట్టుచున్నది.

తా. అయ్యా ! కృష్ణుఁడా ! యుద్ధమును జేయుటకు యొదుర్కొని సమీపించియున్న యీ బంధుజనుల జూచి నా యవయవములు శిథిలము లగుచున్నవి. నోరు యెండిపోవు చున్నది. దేహము వణఁకుచున్నది. రోమాంచ మగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మేమనః॥ 30

టీక. మే=నాయొక్క, గాండీవమ్= గాండీవమనువిల్లు, హస్తాత్= హస్తమునుండి, స్రంసతే = జారుచున్నది, త్వక్చైవ = చర్మమును, పరిదహ్యతే=అంతటను దహింపఁబడుచున్నది, మే=నాయొక్క, మనశ్చ=మనస్సును, భ్రమతీవ= తిరుగుచున్న దానివలెనున్నది. (తస్మాత్=దానికలన) అవస్థాతుమ్=(రథముమీద) ఉండుటకు, నచశక్నోమి=సమర్థుఁడనుగాను.

తా. కృష్ణుఁడా ! కుడియందు నా గాండీవము చేతినుండి జారిపోవు చున్నది. నాదేహమునందు మిగులఁ బరితాపము గలుగుచున్నది. మనస్సు భ్రమించుచున్నది. కావున నేను రథముమీఁద నిలువఁజాలనని తా.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వాస్వజనమాహవే॥

టీక. హే కేశవ = (బ్రహ్మరుద్రులను దయచేత పరిపాలించునట్టి) ఓ కృష్ణా ! విపరీతాని = అనర్థసూచకములగు, నిమిత్తాని = శకునములను,

పశ్యామి = చూచుచున్నాను. (మఱియును) ఆహవే = యుద్ధమునందు, స్వజనమ్ = బంధుజనమును, హత్వా = చంపి, అను = పిమ్మట, శ్రేయశ్చ = శుభమును, నపశ్యామి = చూడడము లేదు.

తా. ఓ కేశవా! ఎడమ నేత్రము అదరుట మొదలుగాఁగల యనేకములయిన యపశకునములు నాకుఁ గనఁబడుచున్నవి. ఈయుద్ధమునందు బంధువులను, మిత్రులను జంపి తర్వాత నేను ఏమిసుఖమును బొందఁగల నని తాత్పర్యము.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ।
కిన్నో రాజ్యేన గోవింద కింభోగై ర్జీవితేన వా॥ 32

టీక. హేకృష్ణ = ఓ కృష్ణుఁడా! అహమ్ = నేను, విజయమ్ = గెలుపును, నకాంక్షే = కోరను, రాజ్యంచ = రాజ్యమును, నకాంక్షే = కోరను, సుఖానిచ = సుఖములను, నకాంక్షే = కోరను, హేగోవింద = (ఇంద్రియముల కధిష్ఠానమై యున్న) ఓ కృష్ణుఁడా! రాజ్యేన = రాజ్యముచేత, నః = మాకు, కిమ్ = ఏమిప్రయోజనము, జీవితేనవా = బ్రతుకుటచేతనైనను, కిమ్ = ఏమి ప్రయోజనము.

తా. అయ్యా! కృష్ణుఁడా! నేను జయమును రాజ్యమును సుఖములను కోరలేదు. గోవిందుఁడా! మాకు రాజ్యముచేతను, భోగములచేతను, జీవించి యుండుటచేతను ఏమి ప్రయోజనమని తాత్పర్యము.

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖానిచ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥

టీక. యేషామర్థే = ఎవరికొఱకు, నః = మాచేత, రాజ్యమ్ = రాజ్యము, కాంక్షితమ్ = కోరఁబడెనో, భోగాశ్చ = స్రక్చందన వనితాది భోగములును, సుఖానిచ = సుఖములును కాంక్షితాని = కోరఁబడినవో,

త్యక్తే = అటువంటి జీవంజములను, ప్రాణాంశ్చ = ప్రాణములను, ధనాని చ = ధనములను, త్యక్త్వా = విడిచి, యుద్ధే = యుద్ధమునందు, అవస్థితాః = యున్నవారయిరి.

తా. అయ్యా ! కృష్ణుఁడా ! ఎవరికొఱకు మాచేత రాజ్యమున్ను సుఖములును, కోరఁబడుచున్నవో యట్టి వారే ప్రాణములను, ధనములను వదలి యుద్ధసన్నద్ధులై వచ్చియున్నారని తాత్పర్యము.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।
మాతులాశ్శ్వశురాః పౌత్రా స్స్యాలాస్సంబంధిన స్తథా ॥

టీక. ఆచార్యాః = ఆచార్యులును, పితరః = తండ్రులును, పుత్రాః = పుత్రులును, తథైవచ = ఆ ప్రకారమే, పితామహాః = తాతలును, మాతులాః = మేనమామలును, శ్వశురాః = పడుచునిచ్చిన మామలును, పౌత్రాః = మనుమలును, స్యాలాః = బావమరుదులు, తథా = ఆప్రకారముగా, సంబంధినః = వియ్యంకులును, ఆగతాః = వచ్చియున్నారు.

తా. అయ్యా ! కృష్ణుఁడా ! ఆచార్యులును, తండ్రులును, పుత్రులును, తాతలును, మేనమామలును, పడుచునిచ్చిన మామలును, మనుమలును, బావమరుదులు ఆ ప్రకారముగానే మఱియు నితరులగు బంధువులును యుద్ధమునకు వచ్చియున్నారని తాత్పర్యము.

శ్లో॥ ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే ॥

టీక. హేమధుసూదన = (మధువనురాక్షసుని జంపిన) శ్రీకృష్ణుఁడా! ఘ్నతోఽపి = నన్ను సంహరించు చున్నప్పటికిని, ఏతాన్ = ఈదుర్యోధనాదులను, త్రైలోక్యరాజ్యస్య = ముజ్జగముల రాజ్యముయొక్క, హేతోరపి = నిమిత్తము కొఱకును, హన్తుమ్ = సంహరించుటకొఱకు, నేచ్ఛామి = ఇచ్ఛయింపను; మహీకృతే = భూరాజ్యముకొఱకు, నహన్మీతి = చంపననే; కిన్ను = ఏమి చెప్పవలయును;

తా. మధు వను రాక్షసుని జంపిన యో కృష్ణుఁడా! ఈ దుర్యోధ నాదులు ఇంపఁబూనిన నన్ను జంపినప్పటికిని, నాకు ముజ్జగముల దొరతనము దొరకి నప్పటికిని నేను జంపను, త్రైలోక్యరాజ్యమునందె యాపేక్ష లేని నేను భూలోక రాజ్యముకొఱకుఁ జంపనని యేమి చెప్పవలయు నని తాత్పర్యము.

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన।
పాపమేవాఽశ్రయేదస్మాన్ హత్వైతా నాతతాయినః॥

టీక. హేజనార్దన=ప్రళయకాలమునందు జనులను పీడించునట్టి ఓ కృష్ణుఁడా! ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను, నిహత్య=చంపి, (స్థితా నామ్ = ఉన్నటువంటి), నః = మాకు, కా=ఏమి, ప్రీతిః=సంతోషము, స్యాత్ = అగును. ఆతతాయినః = దుర్మార్గులు, (అయిన) ఏతాన్ = ఈ దుర్యోధనాదులను, హత్వా=చంపి, (స్థితాన్=ఉన్నటువంటి), అస్మాన్= మమ్ములను, పాపమేవ = పాపమే, ఆశ్రయేత్ = పొందును.

తా. ప్రళయకాలమునందు జనులను పీడించునట్టి ఓ కృష్ణుఁడా! ఈ దుర్యోధనాదులను చంపినయెడల మాకేమి ప్రీతి గలుగును? దుర్మార్గులైన వీరిని జంపినయెడల మాకు పాపమే గలుగు నని తాత్పర్యము.

శ్లో॥తస్మాన్నార్హావయంహంతుంధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥ 32

టీక. హే మాధవ=లక్ష్మీపతి యైన యో కృష్ణుఁడా! స్వజనమ్= బంధుజనమును, హత్వా = చంపి, కథమ్ = ఏప్రకారము, సుఖినః = సుఖము గలవారము, స్యామ=అగుదుము. తస్మాత్=అందువలన, వయమ్= మేము, సబాంధవాన్=బంధువులతోఁ గూడిన, ధార్తరాష్ట్రాన్=దుర్యోధ నాదులను, హంతుమ్ = చంపుటకొఱకు = నార్హాః = తగము.

తా. లక్ష్మీపతి వైన యో కృష్ణుఁడా! మేము బంధుజనులను జంపి యెట్లు సుఖమును బొందఁగలము. అందువలన మేము బంధువులతోఁ గూడిన దుర్యోధనాదులను జంపుటకుఁ దగినవారము గామని తాత్పర్యము.

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥ 3౮

టీక. యద్యపి = ఏవిధముచేత నైనను, లోభోపహతచేతసః = రాజ్యమునందలి ఆశచేతఁ బీడింపఁబడిన మనస్సులు గల, ఏతే = ఈ దుర్యోధనాదులు, కులక్షయకృతమ్ = వంశనాశముచేతఁ జేయఁబడిన, దోషంచ = దోషమును, మిత్రద్రోహే = మిత్రద్రోహమునందలి, పాతకంచ = పాపమును, నపశ్యంతి - చూడరు.

తా. అయ్యా! కృష్ణుఁడా! ఈ దుర్యోధనాదులు, రాజ్యలోభముచేతఁ జెడినమనస్సులు గలవారగుటవలన కులనాశము చేయుటవలనఁ గలుగు దోషమును, మిత్రద్రోహమువలనఁ గలుగునట్టి పాతకమును దెలిసికొనఁజాలరని తాత్పర్యము.

శ్లో॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 3౯

టీక. హేజనార్దన = ఓకృష్ణుఁడా! కులక్షయకృతమ్ = కులనాశముచేతఁ జేయఁబడిన, దోషమ్ = దోషమును, ప్రపశ్యద్భిః = చూచుచున్న, అస్మాభిః = మాచేత, అస్మాత్ = ఈ పాపమువలన, నివర్తితుమ్ = మరలుటకొఱకు, కథమ్ = ఏప్రకారము, నజ్ఞేయమ్ = తెలియఁదగినదిగాదు.

తా. ఓ కృష్ణుఁడా! కులనాశముచేత దోషము కలుగునని చక్కఁగా జూచుచున్న మేమీ పాపకృత్యమును వదలుకొనక యేవిధముగాఁ బ్రవర్తింపగల మని తాత్పర్యము.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత॥

టీక. కులక్షయే = కులనాశము, సతి = కలుగుచుండఁగా, సనాతనాః=శాశ్వతములైన, కులధర్మాః=వంశాచారములు, ప్రణశ్యంతి=నశించుచున్నవి. ధర్మే=కులాచారము, నష్టేసతి= నష్టమగుచు నుండఁగా, కృత్స్నమ్= సమస్తమైన, కులమ్=వంశమును, అధర్మః= అనాచారము. అభిభవత్యుత = పరిభవించుచున్నది. (అనఁగా నశింపఁజేయుచున్నదనుట.)

తా. అయ్యా! కృష్ణుఁడా! వంశము నశించుటవలన, అనాదియైన కులాచారములు నశించిపోవును, కులధర్మములు నశించుటచేత ఆ కులమునందు అధర్మము వ్యాపించునని తాత్పర్యము.

శ్లో॥ అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ ४०

టీక. కృష్ణ = ఓ కృష్ణుఁడా! అధర్మాభిభవాత్ = అన్యాయము వ్యాపించుటవలన, కులస్త్రియః= కులస్త్రీలు, ప్రదుష్యంతి= చెడిపోదురు వార్ష్ణేయ= కృష్ణుఁడా! స్త్రీషు = స్త్రీలు, దుష్టాసు = చెడిపోయినవారలగుచునుండఁగా, వర్ణసంకరః=వర్ణసాంకర్యము, జాయతే=పుట్టుచున్నది.

తా. అయ్యా! కృష్ణుఁడా! అధర్మము ధర్మమును నశింపఁజేయుటవలన కులస్త్రీలు చెడిపోదురు. కృష్ణుఁడా! కులస్త్రీలు చెడిపోయిరేని వర్ణసాంకర్య మగు నని తాత్పర్యము.

శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః॥

టీక. కులస్య= కులముయొక్క, సంకరశ్చ= సంకరము, కులఘ్నానామ్=కులమును నశింపఁజేసిన వారలకు, నరకాయైవ = నరకముకొఱకే,

భవతి = అగుచున్నది. (మఱియును) ఏషామ్ = ఈకులనాశకులయొక్క, పితరోహి = తండ్రులును, లుప్తపిండోదక క్రియాః = లోపించిపోయిన యుదక దానాది క్రియలు గలవారై, పతంతి = భ్రష్టులగుచున్నారు.

తా. అయ్యా! కృష్ణుఁడా! కులమునకు వర్ణసాంకర్య మగుట్యే కేని కులనాశకులకు నరకము గలుగును. మఱియును, అట్టి వారలయొక్క పితృదేవతలు పిండోదకాదుల నిచ్చువారు లేక పోవుటవలన అధోలోకములను బొందుదురని తాత్పర్యము.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

టీక. ఏతైః = ఈ. వర్ణసంకరకారకైః = వర్ణసంకరమును జేయుచున్న, కులఘ్నానామ్= కులనాశకులయొక్క, దోషైః= దోషములచేత, శాశ్వతాః = పరంపరాప్రాప్తములైన, జాతిధర్మాః = వర్ణాచారములును, కులధర్మాశ్చ కులధర్మములును, ఉత్సాద్యన్తే= పోఁగొట్టఁబడుచున్నవి.

తా. అయ్యా! కృష్ణుఁడా! వర్ణసంకరమును జేయునట్టి కులనాశకులయొక్క దోషములచేత శాశ్వతములైన వర్ణాచారములును కులాచారములును, ఆశ్రమధర్మములును, నశింపఁ జేయఁబడుచున్నవని తాత్పర్యము.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమః॥ ౪౪

టీక. జనార్దన = ఓ కృష్ణుఁడా! ఉత్సన్నకులధర్మాణామ్ = పోఁగొట్టఁబడిన కులధర్మములు గలిగిన, మనుష్యాణామ్ = మనుష్యులకు, నరకే = నరకమునందు, నియతమ్ = ఎల్లప్పుడును, వాసః = నివాసము, భవతి = అగుచున్నది, ఇతి = ఇట్లని, అనుశుశ్రుమ = వింటిమి.

తా. ఓ కృష్ణుఁడా! కులధర్మములను జెడఁగొట్టుకొనిన వారలకు, ఎల్లప్పుడును నరకమునందు నివాసము గలుగునని మనము వినియున్నాము.

రాజ్యమునకై యుద్ధమును జేసి కులధర్మములను బాడు సేయఁ గూడ దని తాత్పర్యము.

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥

టీక. యత్ = ఏకారణమువలన, వయమ్ = మేము, రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖమునందలి యాశచేత, స్వజనమ్ = బంధుజనమును, హంతుమ్ = చంపుటకొఱకు, ఉద్యతాః = ఉద్యుక్తుల మైతిమి. అహో = ఎంత ఆశ్చర్యము, బత = ఎంతకష్టము.

తా. అయ్యా! కృష్ణుఁడా! రాజ్యసుఖమునందలి యాశచేత బంధువులనుగూడఁ జంపుట కుద్యుక్తుల మైతిమి. ఇవ్విధముగ నుద్యుక్తులమై యెంత పాపమును జేయఁబూనితిమి. ఆహా యిదియెంతకష్టమని తాత్పర్యము.

శ్లో॥ యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥

టీక. శస్త్రపాణయః=ఆయుధహస్తులు, (అయిన) ధార్తరాష్ట్రాః= దుర్యోధనాదులు, అశస్త్రమ్=ఆయుధమునులేనివాఁడను, అప్రతీకారమ్= ప్రతిక్రియను జేయనివాఁడను, (అయిన) మామ్=నన్ను, రణే = యుద్ధమునందు, హన్యుర్యతి= చంపిరేని, తత్ = ఆ మరణము, మే=నాకు, క్షేమతరమ్ = మిగులమంచిది, భవేత్ = అగును.

తా. అయ్యా! కృష్ణుఁడా! ఆయుధములను ధరించిన దుర్యోధనాదులు ఆయుధములులేనివాఁడను, ప్రతిక్రియను జేయనివాఁడను అయిన నన్నుఁ జంపిరేని నాకు మిగుల మేలే కలుగు నని తాత్పర్యము.

సంజయ ఉవాచ.—

శ్లో॥ ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥ ౪౭॥

టీక. సంజయఉవాచ= సంజయుఁడు చెప్పెను. ఏవమ్ = ఈప్రకారముగా, అర్జునః = అర్జునుఁడు, ఉక్త్వా = చెప్పి. శోకసంవిగ్నమానసః= దుఃఖముచేత చలింపఁజేయఁబడిన మనస్సుగలవాఁడగుచు, సశరమ్= బాణములతోఁగూడిన, చాపమ్ = ధనుస్సును, విసృజ్య = విడిచి, సంఖ్యే = యుద్ధమునందు, రథోపస్థే= రథముమీఁద, ఉపావిశత్ = కూర్చుండెను.

తా. ఓ ధృతరాష్ట్రుఁడా! అర్జునుఁడీవిధముగాఁ జెప్పి దుఃఖముచేతఁ చలింపఁజేయఁబడిన మనస్సు గలవాఁడగుచు ధనుర్బాణములను విడిచిపెట్టి యుద్ధమునందు రథముమీఁదఁ గూర్చుండెనని తాత్పర్యము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జునవిషాద యోగోనామ
ప్రథమోఽధ్యాయః.

టీక. శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపదగల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు= వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే= శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైన, బ్రహ్మవిద్యాయామ్= బ్రహ్మజ్ఞానమందు, యోగశాస్త్రే= యోగశాస్త్రమందు (అనగా బ్రహ్మజ్ఞాన విషయకోపాయంబులను జెప్పునట్టిగ్రంథమందు), అర్జునవిషాద యోగోనామ = అర్జునుని వ్యసనసంబంధము గలది యని ప్రసిద్ధి నొందిన, ప్రథమః = మొదటిదైన, అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

తా. కృష్ణార్జునుల సల్లాపమున జ్ఞానరూపుఁడగు కృష్ణుఁడర్జునునితో బ్రహ్మజ్ఞానముం బొందఁదగిన యుపాయములఁ జెప్పెడి గ్రంథమున గుర్వాదుల జంపవలయునే యక్కటా యని యర్జునుఁడు శోకించిన విషయము గల మొదటిభాగము ముగిసెనని తాత్పర్యము.



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత - ద్వితీయాధ్యాయము.

## ఆంధ్ర టీకా తాత్పర్య సహితము.

## సాంఖ్య యోగము.

సంజయ ఉవాచ.—

శ్లో॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః॥ ౧

టీక. సంజయఉవాచ = సంజయుఁడు చెప్పెను. తథా=ఆ ప్రకారము, కృపయా = దయచేత, ఆవిష్టమ్ = వ్యాప్తమైనవాఁడును, విషీదన్తమ్ = వ్యసనమును బొందుచున్న వాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణమ్= కన్నీటిచేత నిండినదియు నడ్డుపఱుపఁ బడినదియునగు చూపుగలవాఁడును, (అగు) తమ్ = ఆ యర్జునుని గుఱించి, మధుసూదనః = శ్రీకృష్ణుఁడు, ఇదమ్ = ఈ క్రిందఁ జెప్పఁబడఁబోవు నట్టి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = చెప్పెను.

తా. అవ్విధముగా తనవారియందలి దయచేత తనవారలను జంపవలసి వచ్చెనే యని మిగుల వ్యసనమును బొంది కన్నీటిచేతఁ జూడఁజాలక

యున్న యర్జునునితో శ్రీకృష్ణుఁడీ క్రింద జెప్పఁబడఁబోవు వాక్యమును చెప్పెనని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥ ౨

టీక. శ్రీభగవానువాచ=భగవంతుఁడగు కృష్ణుఁడు చెప్పెను. హే అర్జున = ఓ యర్జునుఁడా ! కుతః = ఏహేతువువలన, విషమే = సంకటమునందు, అనార్యజుష్టమ్ = పామరులచేత సేవింపఁ బడినదియును, అస్వర్గ్యమ్ = స్వర్గలోకమును గలుగఁ జేయనిదియును, అపకీర్తికరమ్ = అపకీర్తిని గలుగఁజేయునదియును, (అగు) ఇదమ్ = ఈ, కశ్మలమ్= మోహము, త్వా = నిన్ను, సముపస్థితమ్ = పొందినది.

తా. అర్జునుఁడా ! యుద్ధమును జేయుటకుఁ దగిన సమయమునందు శూరులగువారికిఁ దగనిదియును, స్వర్గమును గలుగఁజేయనిదియును, అపకీర్తికిఁ గారణమైనదియును నయిన యీ దుఃఖరూపమైన పిరికితనము నీ కెట్లు గలిగెనని తాత్పర్యము.

శ్లో॥ క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

టీక. హేపార్థ = పృథయనునామెకు (కుంతీదేవికి) పుత్రుఁడనైన యో యర్జునుఁడా! క్లైబ్యమ్ = భయమును, మాస్మగమః= పొందకుము. త్వయి = నీయందు, ఏతత్ = ఈభయమును బొందుట, నోపపద్యతే = తగదు. హేపరంతప = శత్రువులను దపింపఁజేయునట్టి యర్జునుఁడా ! క్షుద్రమ్ = నీచమైన. హృదయదౌర్బల్యమ్ = మనస్సునందలి హీనతను (పిరికితనమును), త్యక్త్వా= విడిచి, ఉత్తిష్ఠ = (యుద్ధమునకు) లెమ్ము.

తా. కుంతీ పుత్త్రుఁడవైన యో యర్జునుఁడా! నీవు భయమును బొందకుము. నీవు భయమును బొందుట తగదు. శత్రువులను దపింపఁ జేయునట్టి యర్జునుఁడా! నీచమైన యీ భయమును విడిచిపెట్టి యుద్ధమును జేయుటకు లెమ్ము, అని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూధన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన॥ ౪

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. మధుసూదన = మధువను రాక్షసుని జంపినవాఁడవును, అరిసూదన = శత్రువులను సంహరించువాఁడవునునైన యో కృష్ణా! సంఖ్యే = యుద్ధమునందు, అహమ్= నేను, ఇషుభిః = బాణములచేత, పూజార్హౌ = పూజించుటకుఁ దగిన, భీష్మమ్ = భీష్మాచార్యుని, ద్రోణంచ = ద్రోణాచార్యుని, కథమ్=ఎట్లు, ప్రతియోత్స్యామి = కొట్టఁగలను.

తా. మధు వను రాక్షసుని సంహరించిన వాఁడవును, శత్రువులను సంహరించు వాఁడవును అయిన యో కృష్ణా! నేను పూజ్యులగు భీష్మ ద్రోణులను యుద్ధమునందు బాణములచేత నెట్లు కొట్టఁగలను, కొట్టఁజాలనని తాత్పర్యము.

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహలోకే ।
హత్వార్థ కామాంస్తు గురూనిహైవ
భుంజీయభోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ ౫

టీక: మహానుభావాన్= మహాత్ములు (అయిన), గురూన్=గురువులను, అహత్వా = చంపక, ఇహలోకే = ఈలోకమునందు, భోక్తుమ్ =

భుజించుటకు, భైక్ష్యమపి = బిచ్చమెత్తి సంపాదించిన ద్రవ్యముగూడ్క, శ్రేయోహి = శ్రేష్ఠమైనదిగదా! గురూంస్తు = (మహానుభావులగు) గురువులను, హత్వా = చంపి, రుధిరప్రదిగ్ధాన్ = నెత్తురుచేత వ్యాప్తములు (అయిన), అర్థకామాన్ = అర్థకామాత్మకములగు, భోగాన్ = శబ్దాదివిషయములను, ఇహైవ = ఈ లోకమునందే, భుంజీయ = అనుభవింపుదును.

తా. అయ్యా! కృష్ణుఁడా! మహానుభావులును, గురువులును అయిన భీష్మద్రోణాదులను జంపక బిచ్చము నెత్తి సంపాదించిన ద్రవ్యమును తిని జీవించుటయే శ్రేష్ఠము; ధర్మములు వదలి గురువులను జంపి వారి రక్తమును జూచి అర్థకామాత్మకము లగు భోగములను అనుభవించితినేని, యీ లోకమునందుమాత్ర మనుభవింపఁగలనే కాని పరలోకమునం దనుభవింపఁజాలనని తాత్పర్యము.

శ్లో॥ న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నోజయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తే ఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

టీక. కించ = ఇంతియకాదు. (వయమ్ = మనము) జయేమయద్వా = జయింపఁగలమో లేమో? (లేక) ధార్తరాష్ట్రాః = భీష్మాదులు, నః = మనలను, జయేయు ర్యది = జయింతురో యేమో, ఏతయోః = ఈజయాపజయముల రెంటిలోపల, నః = మనకు, కతరత్ = ఏది, గరీయః = శ్రేష్ఠమైనదో, ఏతత్ = ఈ జయాపజయరూప మైన కార్యమును, నవిద్మః = ఎఱుఁగము. యాన్ = ఏ భీష్మాదులను, హత్వా = సంహరించి, నజిజీవిషామః = జీవింపఁ గోరమో, తే = అటువంటి భీష్మాదులు, ప్రముఖే = అగ్రభాగమునందు, అవస్థితాః = వచ్చియున్నారు.

తా. అయ్యా! కృష్ణుఁడా! ఈ యుద్ధమునందు మనమే జయమును బొందుదుమో? లేక దుర్యోధనాదులే జయమును బొందుదురో? ఈ విష

యమును మనము తెలిసికొనలేక యున్నాము. మఱియును, భీష్మాదులను జంపినవెనుక మనము జీవింపలేమా ? అట్టి భీష్మాదు లిప్పుడు యుద్ధసన్నద్ధులై మనకెదుట వచ్చియున్నారు. కావున నిప్పుడు నాకేమియును దోఁచకయుండ లే దని తాత్పర్యము.

శ్లో॥ కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ ౭

టీక. కార్పణ్య... భావః— కార్పణ్య = కృపణత్వ మనియెడు. దోష=దోషముచేత, ఉపహత = కొట్టఁబడిన, స్వభావః = శౌర్యలక్షణములు గల, అహమ్ = నేను, ధర్మసమ్మూఢచేతాస్సన్ = ధర్మవిషయమై జ్ఞానములేని మనస్సుగలవాఁడనగుచు, త్వామ్=నిన్ను, పృచ్ఛామి=అడుగుచున్నాను. మే = నాకు, యత్ = ఏది, నిశ్చితమ్ = నిశ్చయింపఁబడిన, శ్రేయః = శ్రేయస్సు, స్యాత్ = అగునో, తత్ = దానిని, బ్రూహి = చెప్పుము, తే=నీకు, అహమ్=నేను, శిష్యః=శిష్యుఁడను, త్వామ్=నిన్ను, ప్రపన్నమ్ = శరణమును బొందిన, మామ్ = నన్ను, శాధి = శిక్షింపుము.

తా. అయ్యా! కృష్ణుఁడా! నేను కృపణత్వ మనియెడు దోషము చేతఁ గొట్టఁబడినస్వభావము గలవాఁడును, కాఁబట్టి ధర్మమిదియని నిర్ణయింపఁ జాలక యున్నాఁడను. ఏకార్యము శ్రేయస్కర మని నిర్ణయింపఁబడినదో యట్టిదానిని నాకుజెప్పుము. నేను నీకు శిష్యుఁడను, మఱియును నిన్ను శరణమును బొందినవాఁడను, కావున నన్ను శిక్షింపు మని తాత్పర్యము.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్ ।

అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాఽధిపత్యమ్॥ ౮

టీక. యత్=ఏ(శ్రేయస్సు), మమ=నాయొక్క, ఇంద్రియాణామ్=ఇంద్రియములకు, ఉచ్ఛోషణమ్=సంతాపమునుగలుఁగఁజేయునట్టి, శోకమ్=దుఃఖమును, అపనుద్యాత్=పోఁగొట్టునో, తత్=అటువంటి (శ్రేయస్సును), భూమౌ = భూలోకమునందు, అసపత్నమ్ = శత్రురహిత మైనదియును, ఋద్ధమ్ = సకల సమృద్ధులును గలదియును, (అగు) రాజ్యమ్=రాజ్యమును, సురాణామ్ = దేవతలయొక్క, ఆధిపత్యమ్ = ప్రభుత్వమును (అనఁగా దేవేంద్రపదవిని), అవాప్యాపి=పొందియును, నహిప్రపశ్యామి=చూడను.

తా. అయ్యా! కృష్ణుఁడా! భూలోకరాజ్యము గలిగినను, దేవలోకమునందలి యింద్రపదవిదొరకినను, నాయింద్రియములకు సంతాపమును గలుఁగఁజేయు చున్న యిప్పటి దుఃఖము పోదు. కాఁబట్టి భూలోక దేవలోకములయందలి ప్రభుత్వముకంటె నధిక మగు శ్రేయస్సును నాకుఁ జెప్పుము. అట్టి శ్రేయస్సు నాకుఁ గనఁబడ లేదు. కావున దానిని బోధించి నా దుఃఖమును బోఁగొట్టు మని తా. సంజయ ఉవాచ —

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీంబభూవ హ॥ ౯

టీక. పరంతపః = శత్రువులను దపింపఁజేయునట్టివాఁడును, గుడాకేశః=ఆలస్యమును జయించినవాఁడును, (అగు) అర్జునుఁడు, హృషీకేశమ్=ఇంద్రియప్రేరకుఁడు (అగు) కృష్ణునితో, ఏవమ్=ఈప్రకారముగా, ఉక్త్వా=చెప్పి, పునః = మరల, నయోత్స్యే = యుద్ధమును జేయను, ఇతి = ఇట్లని, గోవిందమ్ = (వేదలక్షణ మగు విద్యను దెలిసిన) కృష్ణునితో, ఉక్త్వా = చెప్పి, (తతః=పిమ్మట) తూష్ణీంబభూవహ = ఊరకుండెను.

తా. శత్రువులను దపింపఁజేయువాఁడును, ఆలస్యము లేనివాఁడును నగు నర్జునుఁడీవిధముగా సర్వేంద్రియనియామకుఁడగు కృష్ణునితోఁ జెప్పెను.

అంతట నూరకుండక మరల సేను యుద్ధము జేయ నని సర్వజ్ఞుఁడగు గోవిందునితోఁ జెప్పి యూరకుండె నని తాత్పర్యము,

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయో ర్మధ్యే విషీద న్తమిదం వచః॥౧౦

టీక. హే భారత = ఓధృతరాష్ట్రుఁడా! ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయొక్క, మధ్యే = మధ్యమునందు, విషీదన్తమ్ = దుఃఖమును బొందుచున్న, తమ్ = ఆయర్జునునిగుఱించి, హృషీకేశః = సర్వేంద్రియ ప్రేరకుఁడు (అయిన) శ్రీకృష్ణుఁడు, ప్రహసన్నివ = నవ్వుచున్నవానివలె నున్నవాఁడై, (అనఁగా నవ్వుచు) ఇదమ్ = ఈ క్రిందఁ జెప్పఁబడబోవునట్టి, వచః = వాక్యమును, ఉవాచ = చెప్పెను,

తా. ఓ ధృతరాష్ట్రుఁడా! రెండుసేనలయొక్క మధ్యమునందు నిలిచి యిదివరకుఁ జెప్పఁబడినప్రకారము వ్యసనమును బొందుచున్న యర్జునుని పరహసించు చున్న వానివలె శ్రీకృష్ణుఁడీక్రిందఁ జెప్పఁబడబోవు వాక్యమును జెప్పె నని తా. శ్రీభగవానువాచ.—

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచ న్తి పండితాః॥౧౧

టీక. (హే అర్జున = ఓయర్జునుఁడా!) త్వమ్ = నీవు, అశోచ్యాన్ = దుఃఖింపఁదగని భీష్మాదులనుగూర్చి, అన్వశోచః = దుఃఖించితివి, ప్రజ్ఞావాదాంశ్చ = పండితులమాటలను గూడ, భాషసే = చెప్పుచున్నావు. పండితాః = ఆత్మజ్ఞానము గలవారు, గతాసూన్ = మృతినొందిన వారిని గూర్చియు, అగతాసూంశ్చ = జీవించి యున్నవారిని గూర్చియు, నానుశోచన్తి = దుఃఖింపరు.

తా. ఓ యర్జునుఁడా! ఆత్మానాత్మ వివేకము గల పండితులు, చచ్చిన వారిని గూర్చికాని, జీవించియున్నవారినిగూర్చి కాని దుఃఖిం

పరు. నీవు పండితులవలె పైరాగ్యముగా మాట్లాడుచు, విచారింపఁగా దుఃఖింపఁ దగిన భీష్మాదులను గూర్చి పిచ్చివానివలె దుఃఖించితివి, ఇట్లు దుఃఖించుట నీకు తగ దని తాత్పర్యము.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్॥ ౧౨

టీక. అహమ్ = (సర్వేశ్వరుఁడను అయిన) నేను, జాతు = ఒకానొకప్పుడును, నాసమితిన = లేనివాఁడనుగాను, త్వంచ = నీవును, నాసీరితిన = లేనివాఁడవుగావు, ఇమే = ఈ, జనాధిపాః = భీష్మాదరాజులును, నాసన్నితిన = లేనివారునుగారు, వయంసర్వే = మనమందఱముము, అతః = ఈ దేహనాశనముకంటె, పరమ్ = పిమ్మట, నభవిష్యామ ఇతిన = లేకపోవు వారము గాము.

తా. అయ్యా! అర్జునుఁడా! సర్వేశ్వరుఁడ నగు నేను ఒకప్పుడును లేనివాఁడనుగాను, అనఁగా సర్వకాలములయందును నుండువాఁడను ; నావలె నీవును ఈ భీష్మాదులును స్థిరముగ నుండువారలే గాని, యేకాలమునందును లేనివారలు గారు. కాఁబట్టి మనమందఱమును మూఁడుకాలములయందును నుండువారమే యని తాత్పర్యము.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి॥ ౧౩

టీక. దేహినః = దేహము గల యాత్మకు, అస్మిన్ = ఈ కనఁబడుచున్న, దేహే = దేహమునందు, కౌమారమ్ = బాల్యావస్థయు, యౌవనమ్=మధ్యమావస్థయు, జరా = ముసలితనమును, యథా=ఏప్రకారమో, తథా = ఆప్రకారమే, దేహాంతరప్రాప్తిః = వేఱొక శరీరమును పొందుటయును, భవతి = అగుచున్నది. (కావున) ధీరః = పండితుఁడు, తత్ర=అ జనన మరణముల విషయమై, నముహ్యతి = మోహమును పొందఁడు.

తా. అర్జునా ఈ దేహమునందె బాల్య యౌవన వృద్ధత్వంబు లెట్లు గలుగుచున్నవో అటులనే మఱియొక శరీరముకూడ వచ్చుచున్నది. కాఁబట్టి బుద్ధిమంతుఁడగువాఁడు జననమరణములననుసరించి దుఃఖమును బొందఁడని తాత్పర్యము.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినో నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత॥౧౪

టీక. భారత=భరతకులమునందుఁ బుట్టినవాఁడవును, కౌంతేయ = కుంతీపుత్రుఁడవును, (అయిన) ఓ యర్జునుఁడా! మాత్రాస్పర్శాస్తు = ఇంద్రియములకు (శబ్దము) మొదలగు విషయములతోఁ (గలిగిన) సంయోగములైతే, శీతోష్ణసుఖదుఃఖదాః = శీతమును, ఉష్ణమును, (ఆ శీతోష్ణముల ద్వారా) సుఖదుఃఖములను ఇచ్చునవి. (మఱియును) ఆగమాపాయినః= రాకపోకలు గలవి (కావుననే) అనిత్యాః = నశించునట్టివి, (కావున) తాః = ఆ శీతోష్ణాదులను, తితిక్షస్వ = సహింపుము.

తా. భరతకులమునందుఁ (బుట్టినవాఁడవును), కుంతీదేవికిఁ బుత్రుఁడవును (అయిన) ఓ యర్జునుఁడా! ఇంద్రియములకు శబ్దము మొదలుగాఁగల విషయములతోఁ గలిగిన సంయోగములు శీతోష్ణాదులను గలుగఁజేసి యా శీతోష్ణాదులద్వారా సుఖమును, దుఃఖమును గలుగఁజేయును. మఱియును, అవి రాకపోకలు గలవి. కావున అవి నశించి పోవునట్టివే కాని స్థిరముగా నుండునట్టివి గావు. కాఁబట్టి నీవు వానిని సహింపుమని తాత్పర్యము.

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥౧౫

టీక. హేపురుషర్షభ = పురుషశ్రేష్ఠుఁడవైన యో యర్జునుఁడా! ఏతే = పైనఁజెప్పఁబడిన శీతము, ఉష్ణము మొదలగునవి, సమదుఃఖసుఖమ్ = దుఃఖమునందును సుఖమునందును సమబుద్ధి గలవాఁడును, ధీరమ్=

పండితుండును (అయాన్) యం హి పురుషం వ్యథయన్తి = ఏపురుషునైతే, నవ్యథయన్తి = పీడింపవో, సః = ఆ పురుషుండు, అమృతత్వాయ = మోక్షముకొఱకు, కల్పతే = సమర్థుండగుచు మన్నాడు.

తా. పురుషశ్రేష్ఠుండవైన యో యర్జునుండా! ఈ పైనం జెప్పంబడిన శీతోష్ణములు, సుఖదుఃఖములయందు సమానబుద్ధిగల యేపండితుని బాధింపంజాలవో; అటువంటి పండితుండు మోక్షమును బొందుటకుం దగినవాం డగునని తాత్పర్యము.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥

టీక. అసతః = లేనిదానికి, భావః = ఉనికి, నవిద్యతే = లేదు. సతః = కలదానికి, అభావః = లేకుండుట, నవిద్యతే = లేదు, అనయోః = ఈ, ఉభయోరపి = రెంటియొక్కయు, అన్తః తు = నిశ్చయమైతే, తత్త్వదర్శిభిః = బ్రహ్మవేత్తలచేత, దృష్టః = చూడంబడెను.

తా. లేనిపదార్థము వుండదనియును, ఉండేపదార్థము లేకపోదనియును, బ్రహ్మవేత్తలగువారు ఈ రెంటియొక్కయు నిశ్చయమును తెలిసికొనిరని తాత్పర్యము.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి॥

టీక. యేన = ఏపరబ్రహ్మముచేత, ఇదమ్ = ఈ కనంబడుచున్న, సర్వమ్ = ప్రపంచమంతయును, తతమ్ = వ్యాపింపంబడినదో, తత్ = ఆ బ్రహ్మమును, అవినాశితు = నాశములేని దానినిగా, విద్ధి = తెలిసికొనుము. (మఱియును) అవ్యయస్య = నాశములేని, అస్య = ఈ బ్రహ్మమునకు, వినాశమ్ = నాశమును, కర్తుమ్ = కలిగించుటకొఱకు, కశ్చిత్ = ఎవండును, నార్హతి = తగండు.

తా. ఓ యర్జునుఁడా ! ఈ కనఁబడుచున్న ప్రపంచమంతయును విష్ణువను పేరుగల యేపరబ్రహ్మముచేత, ఎండమావులచేత నుదకప్రవాహము వలెనే వ్యాపింపఁ బడినదో (అనఁగా నెండమావులయం దుదకభ్రాంతి కలిగినట్లు ఏ పరబ్రహ్మమునం దీ జగద్భ్రాంతి గలుగుచున్నదో) అట్టి బ్రహ్మము నశించిపోదని తెలిసికొనుము. మఱియు నో యర్జునుఁడా ! నాశము లేనిదానికి నాశమును కలిగించుట కెవ్వఁడును సమర్థుఁడు గాఁడని యెఱుంగు మని తాత్పర్యము.

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ ౧౮

టీక. నిత్యస్య = ఎల్లప్పుడును ఏకరూపమైనదియును, అనాశినః = నాశము లేనిదియును, అప్రమేయస్య = ప్రత్యక్ష ప్రమాణము మొదలగు ప్రమాణములలో నే ప్రమాణముచేతను తెలియ శక్యము గానిదియును, (అయిన) శరీరిణః=ఆత్మకు, ఇమే= ఈ, దేహాః=దేహములు, అన్తవన్త= నాశముగలవి, (ఇతి=ఇట్లని, వివేకిభిః=తత్త్వవేత్తలచేత) ఉక్తాః= చెప్పఁబడినవి, తస్మాత్ = అందువలన, హేభారత = ఓ యర్జునుఁడా ! యుధ్యస్వ = యుద్ధమును జేయుము.

తా. ఎప్పటికి నుండునట్టిదియును, నాశము లేనిదియును, ప్రత్యక్ష ప్రమాణము మొదలగు ప్రమాణములలో నే ప్రమాణముచేతను తెలియ శక్యము కానిదియును, అగుదేహికి (ఆత్మకు) ఈశరీరములు నాశముగలవి యని యాత్మవేత్తలు చెప్పుచున్నారు. కాఁబట్టి యో యర్జునుఁడా ! నీవు విచారమును బొందక యుద్ధమును జేయు మని తాత్పర్యము.

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥

టీక. యః=ఎవ్వఁడు, ఏనమ్= ఈయాత్మను, హన్తారమ్=చంపెడువానినిగా, వేత్తి= తెలిసికొనుచున్నాఁడో, యశ్చ= ఎవ్వఁడు, ఏనమ్ =

ఈయాత్మను, హతమ్ = చంపఁబడినవానినిగా, మన్యతే = తలఁచుచున్నాఁడో తౌ, తౌ = వారు, ఉభౌ = ఇద్దఱును, నవిజానీతః = తెలిసికొనిన వారలుగారు, అయమ్ = ఈయాత్మ, నహన్తి = చంపఁడు, నహన్యతే = చంపఁబడఁడు.

తా. ఓ యర్జునుఁడా ! ఈయాత్మ చంపు నని తలఁచువాఁడును, ఈ యాత్మ చంపఁబడు నని తలఁచువాఁడును తెలిసినవారు గారు, (అనఁగా నవివేకు లనుట) ఈ యాత్మ చంపునట్టిదియును గాదు, చంపఁబడు నదియును గాదు అని తాత్పర్యము.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ ౨౦

టీక. అయమ్ = ఈయాత్మ, కదాచిత్ = ఒకానొకప్పుడును, నజాయతే = పుట్టువాఁడుగాఁడు. కదాచిత్ = ఒకానొకప్పుడును, నమ్రియతేవా = మరణమును బొందువాఁడు గాఁడు, నభూత్వా = (పూర్వము) లేక, భూయః = మరల (క్రొత్తగా) భవితావాన = కలుగువాఁడు గాఁడు భూత్వా = (పూర్వము) ఉండి, భూయః = మరల, నవాభవితావాన = లేకపోవువాఁడు గాఁడు, (తస్మాత్ = కాఁబట్టి అయమ్ = ఈయాత్మ, అజః = పుట్టువు లేనివాఁడు, నిత్యః = నాశము లేనివాఁడు, శాశ్వతః = సర్వకాలములయందును ఒక్కవిధముగానే యుండువాఁడు, పురాణః = అనాదియైనవాఁడు, (శరీరే = నశించునట్టి) దేహము, హన్యమానే సతి = అనేకవిధములుగా మాఱుచున్నప్పటికిని, అయమ్ = ఈ యాత్మ, నహన్యతే = మార్పఁబడఁడు.

తా. అర్జునుఁడా ! ఈయాత్మ యెప్పటికిని పుట్టువాఁడును, మరణమును బొందువాఁడును గాఁడు. మఱియు, కొంతకాలముండి పిమ్మట లేక

పోవు వాఁడును, కొంతకాలము లేక పిమ్మట నుండువాఁడును గాఁడు. కావున పుట్టువు లేనివాఁడనియును, నాశము లేనివాఁ డనియును, సర్వకాలములయందును ఒక్క విధముగానే యుండువాఁడనియును అనాదియైనవాఁ డనియును తెలిసికొనుము. కావుననే యీ యాత్మ, శరీరము మాఱిపోవుచున్నప్పటికిని మాఱిపోవువాఁడు గాఁ డని తాత్పర్యము.

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్॥ ౨౧

టీక. హే పార్థ = ఓ యర్జునుఁడా! యః = ఎవఁడు, ఏనమ్ = ఈ యాత్మను, (అనఁగా) 'న జాయతే' అనునట్టి మంత్రముచేతఁ జెప్పఁబడిన లక్షణములుగల యాత్మను, అవినాశినమ్=కడపటిదైన భావవికారములేనివానినిగాను, అనఁగా నాశనము లేనివానినిగాను, నిత్యమ్ = పరిణామము లేనివానినిగాను, అనఁగా మాఱుట లేనివానినిగాను, అజమ్= పుట్టుక లేనివానినిగాను, అవ్యయమ్=క్షీణించుట లేనివానినిగాను, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః = ఆ, పురుషః = జనుఁడు, కథమ్ = ఏప్రకారముగా, కమ్ = ఎవనిని, ఘాతయతి = చంపించుచున్నాడు, కథమ్ = ఏప్రకారముగా) కమ్ = ఎవనిని, హన్తి = చంపుచున్నాఁడు.

తా. ఓయర్జునుఁడా! అంతటను సత్తారూపముగానుండు నీ యాత్మ నాశమునొందుట, మాఱురూపమునొందుట, పుట్టుట, క్షీణించుట,(మునుపు లావుగానుండి పిమ్మట సన్నగించుట) అనునట్టి వికారములు లేనివాఁడై ఎల్లప్పుడును ఏకరీతిగా నుండునట్టివాఁడని యాత్మస్వరూపము నెవ్వఁ డెఱుంగునో వానికి ఆత్మకంటె వేఱుపదార్థ మేదియును లేదు. ఒకఁడు నొకనిచేత నింకొకని జంపించుచున్నాఁ డనియును, ఒకఁడు మఱియొకనిని జంపుచున్నాఁ డనియును జెప్పుటకు వీలులేదు. కావున నోయర్జునుఁడా! నీవు యుద్ధమం దెవరిని జంపినను, జంపించినను, నీవు చంపువాఁడవును,

వంపించువాఁడవును గానేరవు గనుక సంకోచింపక యుద్ధమును జేయుము అని యర్జునునితోఁ గృష్ణుఁడు చెప్పెనని తాత్పర్యము.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨

టీక. నరః=మానవుఁడు, జీర్ణాని = చినిఁగిన, వాసాంసి = వస్త్రములను, విహాయ= వదలి, అపరాణి = ఇతరములును, నవాని = క్రొత్తవియును, (అగు) వాసాంసి=వస్త్రములను, యథా=ఏప్రకారము, గృహ్ణాతి= గ్రహించుచున్నాఁడో, తథా = ఆప్రకారము, దేహీ = ఆత్మ, జీర్ణాని= శిథిలములు (అయిన), శరీరాణి = దేహములను, (విహాయ = వదలి) అన్యాని = ఇతరములును, నవాని = క్రొత్తవియును (అయిన), శరీరాణి = దేహములను, సంయాతి = పొందుచున్నాఁడు.

తా. అర్జునుఁడా! మానవుఁడు చినిగిపోయిన వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను ధరించు విధముగా, ఆత్మయును ముసలితనము, రోగము మొదలగువానిచేత శిథిలము లగు దేహములను వదలి క్రొత్తదేహములను బొందుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥ ౨౩

టీక. ఏనమ్ = ఈయాత్మను, శస్త్రాణి = ఆయుధములు, నవా ఛిందన్తి = ఛేదింపవు. ఏనమ్= ఈయాత్మను, పావకః = అగ్నిహోత్రుఁడు, నదహతి = కాల్పఁడు, ఆపః = ఉదకములు, ఏనమ్ = ఈయాత్మను, నక్లేదయన్తి = తడపవు, మారుతః = వాయువు, ఏనమ్ = ఈయాత్మను, నశోషయతి = కృశింపఁజేయఁడు.

తా. అర్జునుఁడా ! ఈ యాత్మను శస్త్రములు ఛేదింప లేవు, అగ్నిహోత్రుఁ డీయాత్మను గాల్పఁజాలఁడు, ఉదకములు ఈ యాత్మను దడిపి చంపివేయ లేవు, వాయుదేవుఁడు ఈ యాత్మను యెండించి చంపఁజాలఁడని తాత్పర్యము.

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్య స్సర్వగతస్థాణు
రచలోఽయం సనాతనః॥ ౨౪
అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ
మవికార్యోఽయ ముచ్యతే ।

టీక. అయమ్ = ఈ యాత్మ, అచ్ఛేద్యః = ఛేదింపఁ దగినవాఁడు గాఁడు; అయమ్ = ఈయాత్మ, అదాహ్యః = దహింపఁదగినవాఁడు గాఁడు, అక్లేద్యః = తడపఁ దగినవాఁడు గాఁడు, అశోష్యఏవచ = ఎండింపఁజేయఁ దగినవాఁడు గాఁడు, అయమ్ = ఈయాత్మ, నిత్యః = త్రికాలములయందును వుండువాఁడు, సర్వగతః = సర్వవ్యాపకుఁడు, స్థాణుః = నిశ్చల స్వభావుఁడు, అచలః = చలింపనివాఁడు, సనాతనః = అనాదియైన వాఁడు, అవ్యక్తః = నేత్రములు మొదలుగాఁగల యింద్రియములకు గోచరముగాని వాఁడు, అచిన్త్యః = మనస్సునకు గోచరము గానివాఁడు, అవికార్యః = వికారమును బొందఁదగనివాఁడు, (ఇతి = ఈలాగని) ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. అయ్యా ! అర్జునుఁడా ! ఈ యాత్మ శస్త్రములు మొదలగు నాయుధములచేత ఛేదింపఁ దగినవాఁడు గాఁడు. అగ్నిచేతఁ గాల్పఁ దగిన వాఁడు గాఁడు. ఉదకముచేతఁ దడపఁదగినవాఁడు గాఁడు. వాయువుచేత నెండించఁ దగినవాఁడు గాఁడు. మఱియు నీయాత్మ మూఁడు కాలముల

యుండును స్థిరముగ నుండువాఁడనియును, సర్వవ్యాపకుఁడనియును, సుస్థిరుఁడై యొక స్థానమువదలి యొకలోకస్థానము పొందనివాఁడనియును, చలనాదిక్రియలు లేని వాఁడనియును, అనాదియైనవాఁడనియును, నేత్రములు మొదలగు నిం యింద్రియములచేతఁ దెలియ శక్యముగానివాఁడనియును, వికారములులేని వాఁడనియును, మనస్సుచేతఁ గూడఁ దెలియ శక్యముగానివాఁడనియును చెప్పఁబడుచున్నాఁడు. కావున, దేహము నశించుటచేత ఆత్మ నశింపఁడు. కాఁబట్టి వ్యసనమును బొందకుమని తాత్పర్యము.

శ్లో॥ తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ ౨౫

టీక. తస్మాత్ = అందువలన, ఏవమ్ = ఈ చెప్పఁబడిన ప్రకారముగా, ఏనమ్ = ఈ యాత్మను, విదిత్వా = తెలిసికొని, అనుశోచితుమ్ = దుఃఖించుటకొఱకు, నార్హసి = తగవు.

తా. ఆప్రకారముగా, ఆత్మ సర్వగతుఁడనియును, వికారము లేని వాఁడనియును, నిత్యుఁడనియును, నశింపఁబడఁడనియును చెప్పఁబడుట వలన ఆత్మ చంపఁబడఁడనుము, ఇట్లు తెలిసికొనిన పిమ్మట, యోయర్జునుఁడా! నీవు వ్యసనమును బొందుటకుఁ దగినవాఁడవు గావని తా.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥

టీక. హేమహాబాహో = మిగులఁ బ్రశస్తమగు భుజబలముగల యోయర్జునుఁడా! అథచ = అట్లుగాక, ఏనమ్ = ఈయాత్మను, నిత్యజాతమ్ = ఎప్పుడును పుట్టునట్టివానినిగాను, నిత్యమ్ = ఎప్పుడును, మృతంవా = మరణమును బొందువానినిగానైనను, మన్యసేయది = తలఁచుచుంటివేని, తథాపి = అలాగైనప్పటికిని, త్వమ్ = నీవు, ఏవమ్ = ఈ ప్రకారముగా, శోచితుమ్ = దుఃఖించుట కొఱకు, నార్హసి = తగవు.

తా. మిగులఁ బ్రశస్తమగు భుజబలముగల యోయర్జునుఁడా! ఒక వేళ నీవు ఈయాత్మ సర్వకాలములయందును పుట్టుచుండుననియును, మరణ

మును బొందునని యైనను తలఁచెదవేమో? అట్లు తలఁచినప్పటికిని అట్టి జనన మరణములు గలుగుట సహజమే కనుక నీవు వ్యసనమును బొందుట తగదని తాత్పర్యము.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ ౨౭

టీక. హి = ఏ కారణమువలన, జాతస్య = పుట్టినవానికి, మృత్యుః = మరణము, ధ్రువః = నిశ్చయమో, మృతస్యచ = మరణమును బొందినవానికిని, జన్మ = పుట్టువు, ధ్రువమ్ = నిశ్చయమో, తస్మాత్ = ఆహేతువువలన, అపరిహార్యే = పరిహరింప శక్యము గాని, అర్థే = అర్థమునందు త్వమ్ = నీవు, శోచితుమ్ = దుఃఖమును బొందుటకు, నార్హసి = తగవు.

తా. ఓ యర్జునుఁడా! పుట్టినదానికి జావును, చచ్చినదానికి పుట్టుకయును గలుగుట నిశ్చయమై యున్నది. కావున అవశ్యకముగాఁ గలుగుచున్న జనన మరణముల విషయమై నీవు వ్యసనమును బొందుట యనుచితముగా దని తాత్పర్యము.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ ౨౮

టీక. హేభారత = ఓ యర్జునుఁడా! భూతాని = శరీరములు, అవ్యక్తాదీని = స్పష్టము గాని ఆది గలవియును, (అనఁగా మొదటఁ గనఁబడ నివియును) వ్యక్తమధ్యాని = స్పష్టమైన మధ్యకాలము గలవియును, (అనఁగా) మధ్యకాలమునందు (గనఁబడుచున్నవియును), అవ్యక్తనిధనాన్యేవ = స్పష్టముగాని అంతము గలవియును, (అనఁగా మరణము నొందిన పిమ్మట కనఁబడనివియును), భవన్తి = అగుచున్నవి. తత్ర = అట్టి శరీరముల విషయమై, పరిదేవనా = ఏడ్చుట, కా = ఏమిటి.

తా. ఓ యర్జునుఁడా! ఈ శరీరములు పుట్టకమునుపు కనఁబడుట లేదు. పుట్టినపిమ్మట కొంతకాలము కనఁబడుచున్నవి. తుదకు మరణమును

బొంది కొందటివలెనే కనఁబడక పోవు చున్నవి. కావున, ఇటువంటి శరీరములను గూర్చి వ్యసనమును బొందుట యనుచితము గా దని తాత్పర్యము.

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవకశ్చిత్॥ 29

టీక. కశ్చిత్ = ఒకానొకఁడు, ఏనమ్ = ఈ యాత్మను, ఆశ్చర్యవత్ = పూర్వమునందుఁ జూడఁబడనిదియును, అద్భుత మైనదియూను అగు వస్తువును అకస్మాత్తుగాఁ జూచినట్లు, పశ్యతి = చూచు చున్నాఁడు. అన్యశ్చ = మఱియొకఁడు, తథైవ = ఆ ప్రకారముగానే, ఏవమ్ = ఈ యాత్మను, ఆశ్చర్యవత్ = పూర్వమునందుఁ జెప్పఁబడనిదియును, అద్భుత మైనదియును అగు వస్తువునుగుఱించి అకస్మాత్తుగాఁ జెప్పినట్లు, వదతి = చెప్పుచున్నాఁడు, అన్యః = ఇతరుఁడు, ఏనమ్ = ఈ యాత్మను, ఆశ్చర్యవత్ = పూర్వమునందు విననిదియును, అద్భుత మైనదియును అగు దానిని అకస్మాత్తుగా వినినట్లు, శృణోతిచ = వినుచున్నాఁడు. శ్రుత్వాపి = వినియును, (దృష్ట్వాపి = చూచియును, ఉక్త్వాపి = చెప్పియును), ఏనమ్= ఈ యాత్మను, కశ్చిత్ = ఒకానొకఁడు, వేదనచైవ= తెలిసికొనుటయే లేదు.

తా. ఓ యర్జునుఁడా! ఒకానొకఁడు యీ యాత్మను పూర్వమునందుఁ జూడఁబడనిదియును, అద్భుత మైనదియును అగు వస్తువును, అకస్మాత్తుగా జూచినట్లు చూచుచున్నాఁడు. ఆ ప్రకారముగానే మఱియొకఁడు యీ యాత్మను చెప్పుచున్నాఁడు. మఱియొక్కఁడా ప్రకారముగానే వినుచున్నాఁడు. ఒకానొకఁడు చూచియును, చెప్పియును, వినియును యీ యాత్మను దెలిసికొనలేకయే పోవుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥ 30

టీక. హే భారత = ఓ యర్జునుఁడా! సర్వస్య = సకలమైన దేవ మనుష్యాది ప్రాణిసమూహముయొక్క, దేహే=శరీరము, (వధ్యమానేపి= సంహరింపఁబడుచున్నను), అయమ్ = ఈ, దేహీ=ఆత్మ, నిత్యమ్=ఎల్లప్పుడును, అవధ్యః = చంపఁదగినవాఁడు గాఁడు. తస్మాత్ = ఆ కారణము వలన, త్వమ్ = నీవు, సర్వాణి = సమస్తమైన, భూతాని = భీష్మాదిశరీరములను గుఱించి, శోచితుమ్ = దుఃఖించుటకొఱకు, నార్హసి = తగవు.

తా. ఓ యర్జునుఁడా! సమస్తప్రాణులయొక్క దేహములు సంహరింపఁబడినప్పటికిని, ఆ శరీరములయొక్క లోపలనుండునట్టి యాత్మ చంపఁబడఁడు. కాఁబట్టి నీవు సమస్తమైన భీష్మాదిశబ్దములకు అర్థమైన జీవులను గుఱించి దుఃఖమును బొందఁగూడదని తాత్పర్యము.

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥

టీక. అపిచ = ఇంతియగాదు, స్వధర్మమ్ = స్వకీయమైన క్షత్రియధర్మమును, అవేక్ష్య = ఆలోచించి, నవికమ్పితుమ్ = చలించుటకొఱకు, నార్హసి = తగవు. హి = ఏలననఁగా, ధర్మ్యాత్ = ధర్మశాస్త్రమునుండి తొలఁగని దైన, యుద్ధాత్ = యుద్ధముకంటె, అన్యత్ = ఇతరము (అయిన), శ్రేయః = శ్రేయస్సు, క్షత్రియస్య = క్షత్రియునకు, నవిద్యతే = లేదు.

తా. ఓ యర్జునుఁడా! శోకమోహములను విడుచుటకు, ఇదివఱకు జెప్పఁబడిన కారణములే గాదు, మఱియొక కారణముగూడఁ గలదు. ఏమనఁగా, క్షత్రియులకు ధర్మశాస్త్రోక్తమైన యుద్ధముకంటె నితరమగు ధర్మమేదియును లేదు. మఱియును, కులధర్మమును వదలఁగూడదు. కాఁబట్టి క్షత్రియుఁడవగు నీవు నీకులధర్మము గదా యని యాలోచించి యుద్ధమునుండి తొలఁగిపోకుమని తాత్పర్యము.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్॥

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! యదృచ్ఛయా = కోరికయే, ఉపపన్నమ్ = వచ్చినదియును, అపావృతమ్ = తెరవఁబడిన, స్వర్గద్వారమ్ = స్వర్గమునకు ద్వారమువంటిదియును, (అగు) ఈదృశమ్ = ఇటువంటి, యుద్ధమ్ = యుద్ధమును, యే = ఏరాజులు, లభన్తే = పొందుచున్నారో, తే = అట్టి, క్షత్రియాః = రాజులు, సుఖినః = సుఖము గలవారు, భవన్తి = అగుచున్నారు.

తా. ఓ యర్జునుఁడా! కోరికయే వచ్చినదియును, తెరువఁబడిన స్వర్గ ద్వారమువంటిదియును అగు నిటువంటి యుద్ధమును, ఏ రాజులు పొందుచున్నారో ఆ రాజులు సుఖవంతు లగుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ అథ చేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి॥ ౩౩

టీక. అథ = లేక, త్వమ్ = నీవు, ధర్మ్యమ్ = ధర్మయుక్తమైన, ఇమమ్ = ఈ, సంగ్రామమ్ = యుద్ధమును, నకరిష్యసిచేత్ = చేయకపోతి వేని, తతః = అట్లు చేయకపోవుటవలన, స్వధర్మమ్ = క్షత్రియకులమునకుఁ దగిన ధర్మమును, కీర్తించ = కీర్తిని, హిత్వా = వదలి, పాపమ్ = పాపమును అవాప్స్యసి = పొందఁగలవు.

తా. అయ్యా! అర్జునుఁడా! అట్లు గాక నీవు ధర్మయుక్తమైన యుద్ధముఁ జేయక యూరకుంటివేని కులధర్మము విడిచినవాఁడ వగుదువు. మఱియును, పరమేశ్వరుఁడు మొదలగువారితో యుద్ధమును జేసి జయించి పాశుపతాస్త్రము మొదలుగాఁ గల యస్త్రములను గ్రహించుటవలనఁ గలిగిన కీర్తిని పోఁగొట్టుకొనినవాఁడ వగుదువు. ఇట్లు ధర్మకీర్తు లను రెంటిని వదలుకొనుటవలన పాపమును పొందుదువు. కాఁబట్టి నీవు యుద్ధమును జేయు మని తాత్పర్యము.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ ౩౪

టీక. (ఓ యర్జునుఁడా!) భూతాని = దేవతలు, ఋషులు, మనుష్యులు మొదలగువారు, తే = నీయొక్క, అవ్యయామ్ = చిరకాలముండునట్టి, అకీర్తించాపి = అపకీర్తినిఁగూడ, కథయిష్యంతి = చెప్పఁగలరు. సంభావితస్య చ = గౌరవింపఁబడినవానికి, అపకీర్తిః = అపకీర్తి, మరణాత్ = మరణముకంటె, అతిరిచ్యతే హి = అధికమైన దగుచున్నది గదా.

తా. ఓ యర్జునుఁడా! నీవు యుద్ధమును జేయకపోతివేని దేవతలు, ఋషులు, మనుష్యులు మొదలగువారందఱును, ఒకరితోనొకరు మాటలాడునప్పుడు ధర్మాత్ముఁడును, శూరుఁడును కాకపోవుటచేత అర్జునుఁడు స్వధర్మత్యాగమును జేసెనని చిరకాలముదనుక నిన్ను నిందింతురు. నీవట్టి యపకీర్తిని బొందుట యుక్తముగాదు. మఱియును ధర్మాత్ముఁడనియును, శూరుఁడనియును, మఱియు ననేకసుగుణములు గలవాఁడనియును, గౌరవింపఁబడినవానికి అపకీర్తి మరణముకంటె నధిక మగు దుఃఖమును గలుగఁజేయును. కాఁబట్టి నీ వపకీర్తిని బొందక యుద్ధమును చేయు మని తాత్పర్యము.

శ్లో॥ భయా ద్రణా దుపరతం
మన్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్॥ ౩౫

టీక. (ఓ యర్జునుఁడా!) యేషామ్ = ఏ దుర్యోధనాదులకు, త్వమ్ = నీవు, బహుమతః = గౌరవింపఁబడినవాఁడవు, (అభూః = అయితివో, తే = అటువంటి) మహారథాః = మహారథులైన దుర్యోధనాదులు, త్వామ్ = నిన్ను, భయాత్ = భయమువలన, రణాత్ = యుద్ధమునుండి, ఉపరతమ్ = మరలినవానినిగా, మన్యన్తే = తలఁతురు, బహుమతః = (ఇంతవఱకు వారిచేత) సన్మానింపఁబడినవాఁడవు, భూత్వాచ = అయ్యును, లాఘవమ్ = (ఇఁకను) అగౌరవమును, యాస్యసి = పొందగలవు.

తా. ఓ యర్జునుఁడా! ఇప్పుడు నీవు యుద్ధమును వదలిపోయిన యెడల పూర్వము దుర్యోధనాదులు నిన్ను శూరునిఁగాను, గుణవంతునిఁగాను తలఁచిరో, ఆ దుర్యోధనాదులే యిప్పుడు కర్ణాదులతో యుద్ధమును జేసినయెడల చచ్చిపోదు నను భయముచేత అర్జునుఁడు యుద్ధమును వదలి పోయినాఁడు గాని బంధువులను జంపవలసివచ్చె నని దయచేత వదలి పోయిన వాఁడు గాఁడని తలఁతురు. అందువలన నీకు అగౌరవము గలుగును. కావున నీవు యుద్ధమును వదలుట యనుచితముగా దని తాత్పర్యము.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః।
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరన్ను కిమ్॥

టీక. (ఓయర్జునుఁడా!) అహితాః=శత్రువు లగు దుర్యోధనాదులు, తవ=నీయొక్క, సామర్థ్యమ్=సామర్థ్యమును, నిందతః=నిందించుచున్న వారగుచు, అవాచ్యవాదాన్ = చెప్పఁగూడని మాటలను, వదిష్యన్తి = చెప్పఁగలరు. తతః = (అట్లు నిందించుటవలన వచ్చునట్టి దుఃఖముకంటె, దుఃఖతరమ్=ఎక్కువదుఃఖము, నుకిం= ఏమికలదు? (ఏమియు లేదనుట).

తా. ఓ యర్జునుఁడా! నీవిప్పుడు యుద్ధమునుజేయక యూరకుంటి వేని దుర్యోధనుఁడు మొదలగువారు నీవు సామర్థ్యము లేనివాఁడవని చెప్పుటయేగాక నోటఁ బట్టఁగూడని తిట్టులను తిట్టుదురు. కాఁబట్టి నీవు యుద్ధమునువిడుచుట యనుచితముగాదు. మఱియును, ప్రసిద్ధుఁడ వగు నీకు ఇతరులు నిందించుటవలనఁ గలిగెడు దుఃఖముకంటె అధికదుఃఖమును గలుగఁజేయు నట్టిది యేది కలదు? ఏదియును లేదని తాత్పర్యము.

శ్లో॥ హతోవా ప్రాప్స్యసేస్వర్గం జిత్వావాభోక్ష్యసేమహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 32

టీక. హేకౌన్తేయ = ఓ యర్జునుఁడా! హతోవా = (యుద్ధమునందు శత్రువులచేత) చంపఁబడినవాఁడవైతివేని, స్వర్గమ్ = స్వర్గమును,

ప్రాప్స్యసే = పొందఁగలవు, జిత్వా = జయించితివేని, మహీమ్ = భూమిని, భోక్ష్యసే = అనుభవింపఁ గలవు. తస్మాత్ = అందువలన, యుద్ధాయ = యుద్ధముకొఱకు, కృతనిశ్చయస్సన్ = చేయఁబడిన నిశ్చయము గలవాఁడవగుచు, ఉత్తిష్ఠ = లెమ్ము.

తా. ఓ యర్జునుఁడా! యుద్ధమునందు నీవు శత్రువులచేత జయింపఁబడితివేని స్వర్గలోక సుఖముల ననుభవింపఁ గలవు. అట్లు గాక నీవే శత్రువులను జయించిన యెడల భూలోకరాజ్యము ననుభవింపఁగలవు. కాఁబట్టి (నీవు మరణమును పొందినను, జయించినను నీకు లాభముగలదు గనుక) యుద్ధమును చేయుటకొఱకు నిశ్చయించుకొని లెమ్మని తాత్పర్యము.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

టీక. సుఖదుఃఖే = సుఖదుఃఖములను, సమే = సమానములనుగా, కృత్వా = చేసి, లాభాలాభౌ = (ఆ సుఖదుఃఖములకుఁ గారణములైన) లాభాలాభములను. జయాజయౌ = (ఆ లాభాలాభములకుఁ గారణములైన) జయాపజయములను, సమౌ = సమానములనుగా, కృత్వా = చేసి, తతః = పిమ్మట, యుద్ధాయ = యుద్ధముకొఱకు, యుజ్యస్వ = సన్నద్ధుఁడవగుము. ఏవం చేత్ = ఇట్లు యుద్ధమును జేసితివేని, పాపమ్ = పాపమును, నావాప్స్యసి = పొందవు.

తా. అయ్యా! అర్జునుఁడా! సుఖమునందును, దుఃఖమునందును సమాన బుద్ధిగలవాఁడ వగుము. మఱియు నో యర్జునుఁడా! ఆ సుఖదుఃఖములకు గారణములైన లాభనష్టములు గలిగినపుడు గూడ సంతోషవ్యసనములను పొందకుండుము. మఱియును, లాభనష్టములకుఁ గారణములైన జయాపజయముల యందుఁగూడ సమబుద్ధి గలవాఁడవై యుండుము. ఈ విధముగా సర్వవిషయముల యందును సుఖదుఃఖములను, రాగద్వేషములను వదలి యుద్ధమును జేయుట కొఱకుఁ బ్రవర్తింపుము. ఇట్లు సర్వమునందును

సమబుద్ధిగలవాఁడవై యుద్ధమునందుఁ బ్రవర్తించినయెడల నీకుఁ బాపము గలుగనేర దని తాత్పర్యము.

శ్లో॥ ఏషా తే௨భిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! సాంఖ్యే = బ్రహ్మవిషయమై, ఏషా = ఈ, బుద్ధిః = జ్ఞానము, అభిహితా = (ఇదివఱకు) చెప్పఁబడినది, యయా = ఎటువంటి, బుద్ధ్యా = వివేకముతో, యుక్తః = కూడుకొనినవాఁడవై, కర్మబంధమ్ = సంసారమును, ప్రహాస్యసి = విడిచిపెట్టఁగలవో, ఇమామ్ = ఇటువంటి వివేకమును, యోగేతు = కర్మయోగమువిషయమై, శృణు = వినుము.

తా. ఓ యర్జునుఁడా! నీ కిదివఱకు "నజాయతే మ్రియతే వా కదాచిత్" అను శ్లోకము మొదలుగాఁగల శ్లోకములచేత బ్రహ్మవిషయమైన జ్ఞానము నుపదేశించితిని, ఇఁకను ఆబ్రహ్మజ్ఞానమునకు (గారణమైన కర్మయోగమును చెప్పెదను వినుము. కర్మయోగమును తెలుపునట్టి యీ బుద్ధిని తెలుసుకొనినయెడల కర్మముచేతఁ గలిగిన సంసారబంధమును బోఁగొట్టుఁ కొనఁగల వని తాత్పర్యము.

శ్లో॥ నేహాభిక్రమనాశో௨స్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

టీక. ఇహ = మోక్షమార్గమైన యీ నిష్కామ కర్మయోగమునందు, అభిక్రమనాశః = ప్రారంభనాశము, నాస్తి = లేదు. ప్రత్యవాయః = (ప్రారంభించినపిమ్మట ముగియకమునుపు, అనఁగా మధ్యకాలమునందు స్వల్పదోషములు గలుగుటవలన) దోషము, నవిద్యతే = లేదు. అస్య = ఈ, ధర్మస్య = నిష్కామ కర్మయోగము యొక్క, స్వల్పమపి = లేశమైనను, (అనఁగా నిష్కామకర్మమును ప్రారంభించుట మాత్రముగూడ) మహతః = మిగుల

మిగుల గొప్పది యైన, భయాత్ =(జననమరణ ప్రవాహరూప మైన సంసా
రమువలని) భయమువలన, త్రాయతే = రక్షించుచున్నది.

తా. అర్జునుఁడా! ఫలాభిలాషను వదలి కర్మమును జేయుటకు
ప్రారంభించి యంతటితోఁ జాలించుకొనుటచేతఁ గూడ ఫలము కలదు మఱి
యును, ప్రారంభించిన పిమ్మట ముగియుటకు పూర్వము, అనఁగా మధ్య
కాలమునందు స్వల్పదోషము లేవియైనను కలిగినప్పటికిని దోషము లేదు.
మఱియును, మోక్షమార్గ రూపమైన యీ నిష్కామకర్మమును కొంచె
ముగాఁ జేసినను, మిగుల గొప్పదియును, జననమరణ ప్రవాహరూప మైనది
యును నగు సంసారమువలని భయమునుండి తొలఁగిపోవు నని తాత్పర్యము.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన ।
బహుశాఖాహ్యనన్తాశ్చబుద్ధయోఽవ్యవసాయినామ్॥

టీక. హే కురునన్దన = ఓ యర్జునుఁడా! ఇహ = మోక్షమునకు
సాధన మైన యీ నిష్కామకర్మయోగమునందు, వ్యవసాయాత్మికా = (భగ
వత్ప్రీతికరముగా వేదోక్తకర్మములను జేసినయెడల మోక్షప్రతిబంధక మైన
సంసారమును దాఁటవచ్చును అనునట్టి) నిశ్చయమే స్వరూపముగాఁ గల,
బుద్ధిః = అభిప్రాయము, ఏకైవ = ఒక్కటియే, (భవతిహి = అగుచున్నదిగదా!)
అవ్యవసాయినామ్ = (భగవత్ప్రీతికై అనుకర్మములను చేసినయెడల సంసార
మును దాఁటవచ్చును, అనునట్టి) నిశ్చయము లేనివారికి, బుద్ధయః =
అభిప్రాయములు, బహుశాఖాః = పెక్కు భేదములు గలవియును, (కనుకనే)
అనన్తాశ్చ = కడలేనివియును, (భవన్తిహి = అగుచున్నవిగదా!)

తా. ఓ యర్జునుఁడా! లోకమునందెవరైనను అనిత్యమైన స్వర్గాదిసుఖ
ములను గోరక భగవత్ప్రీతికొఱకైనవారై మోక్షమును గోరి యజ్ఞాది వేదోక్తకర్మము
లను భగవదర్పణముగాఁ జేయుచుండిరేనియెడల అట్టివారికి సాంఖ్యబుద్ధి
వేఱు, యోగబుద్ధి వేఱు, అనునట్టి భేదబుద్ధి లేక రెండును ఒక్కటే యనునట్టి
యభిప్రాయము గలుగుచున్నది. పిమ్మట సంసారబంధము పోయి తప్పక

మోక్షము గలుగును అనునట్టి నిశ్చయబుద్ధియును, తరువాత మోక్షము కూడ గలుగును. అట్టి నిశ్చయబుద్ధి లేనివారికి నానావిధములును, సంసారహేతు భూతములును అయిన విపరీతబుద్ధులు వేలువేలుగాఁ గలుగుచున్నవి. అందు వలన వారొక బుద్ధియందును నిశ్చయములేక అన్నిటియందును సందేహము గలవారై "సంశయాత్మా వినశ్యతి" అను న్యాయముచేత జననమరణరూపమైన సంసార సముద్రమందు మునిఁగి నశించుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥ ౪౨

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! అవిపశ్చితః = పండితులు గాని వారు, వేదవాదరతాః = వేదవాక్యములయొక్క అర్థవాదములయందు ఆసక్తులై, అన్యత్ = (స్వర్గాదిసుఖముకంటె) ఇతరమైనది, నాస్తి = లేదు, ఇతి = ఇట్లని, వాదినః = చెప్పెడి స్వభావము గలవారగుచు, ఇమామ్ = ప్రసిద్ధమైనదియును, పుష్పితామ్ = (పూచిన మోదుగుచెట్టువలె) రమ్యమైనదియును, (అయిన) యామ్ = ఏ, వాచమ్ = వాక్యమును (కర్మకాండ శ్రుతిని) ప్రవదన్తి = బాగుగఁ జెప్పుచున్నారో, (అట్టివారికి మనస్సునందు వ్యవసాయాత్మికమైన బుద్ధియుండదు).

తా. వేదములయందు అనేక భాగములు కర్మకాండమును జెప్పునట్టివి, స్వల్పభాగములు జ్ఞానకాండమును జెప్పునట్టివి. అందుఁ గర్మములను జెప్పునట్టి భాగములు ఆకర్మములను జేయుటవలన మిక్కిలి యొక్కఁ గలుగుటకుఁగాను, ఈ క్రతువును జేసినయెడల అఖండసుఖమును బొందునని చెప్పుచున్నవి. అట్టి వేదవాక్యము లన్నియు అర్థవాదవాక్యములు, అట్టి వేదవాక్యములను, స్వల్పజ్ఞానముగలవారు వేదార్థతత్త్వమును దెలిసికొనఁజాలక స్వర్గాదిఫలమే యుత్తమఫలమనియు, దానికంటె నన్యమైనవస్తువు (ఐశ్వర్యముఁగాని మోక్షము గాని) లేదనియును చెప్పుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

టీక. (కించ= మఱియును, ఆ యవిద్వాంసులు) కామాత్మానః = పుత్రకళత్ర ధనధాన్యాది మనోరథములయందు స్వభావము గలవారును, స్వర్గపరాః = స్వర్గమే గొప్పపురుషార్థముగాఁ గలవారును, (అయి) జన్మకర్మఫలప్రదామ్= జన్మమనెడి కర్మములయొక్క ఫలము నిచ్చునట్టిదియు, భోగైశ్వర్యగతిం ప్రతి = సౌఖ్యము యొక్కయు ఈశ్వరత్వము యొక్కయు ప్రాప్తినిగూర్చి, క్రియావిశేషబహుళామ్ = అనేకకర్మ భేదములు గలదియైన, (ఏ వాక్కును చెప్పుచున్నారో అట్టివారికి మనస్సునందు వ్యవసాయాత్మికబుద్ధి యుండదు.)

తా. ఆ యవిద్వాంసులు కామాసక్తు లగుటచేత మోక్ష మొకటి యున్నదనియెఱుఁగక స్వర్గాదిసుఖమే ముఖ్యమైన ప్రయోజన మని తలఁచి ఏవాక్కులు స్వర్గాదిసుఖమునను భవించుటకును, పశుపుత్రకళత్రాది సకలవస్తు సమృద్ధి గలుగుటకును సాధనములో, ఏవాక్యములచేత ఉత్తమ మధ్యమ అధమములును, కర్మఫలములును అయిన దేవజన్మము, పశ్వాదిజన్మము, మనుష్యజన్మము కలుగునో అట్టిమాట లాడుచు మూఢులై జననమరణ రూపమైన సంసారమందు ప్రవర్తించు చున్నారని తాత్పర్యము.

శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥ 44

టీక. తేషామ్=అట్టివారును, (అనఁగా కామాసక్తత్వాది గుణయుక్తులును) భోగైశ్వర్య ప్రసక్తానామ్= విషయసుఖానుభవమునందును ప్రభుత్వమందును ఆసక్తులైనవారును, తయా = క్రియావిశేషబహుళమైన యీ పుష్పితవాక్కు చేత, అపహృతచేతసామ్ = అపహరింపఁబడిన మనస్సుగల వారియొక్క, సమాధౌ= అంతఃకరణమునందు, వ్యవసాయాత్మికా=నిశ్చ

యమే స్వరూపముగాఁ గల-అనఁగా సాంఖ్యయోగ రూపమైన, బుద్ధిః= అభిప్రాయము, నవిధీయతే = సంభవింపదు.

తా. ఇట్లు కామాసక్తులై స్వర్గాదిసుఖమే ప్రధాన ఫలమని తలంచి ప్రక్చందనాది విషయసుఖానుభవమును, ప్రభుత్వమును కోరి వానియందే చెల్లినమనస్సుగలవారై ఈకర్మములను జేసినయెడల భోగైశ్వర్యాదులుగలుగును అనునట్టి వేదములయందలి యర్థవాదవాక్యములను పూచినమోదుగ వలె ఫలములేనివని యెఱుంగక నమ్మి భ్రమపడు ఈ పదమున కీయర్థము. ఈవాక్యమున కీతాత్పర్యము అని నిశ్చయించి చెప్పఁదగిన ప్రజ్ఞ లేనివారికి నిశ్చయాత్మక మైనదియును, ఆత్మస్వరూపమును తెలిసికొనుటకు సాధన మైనదియును అగు సాంఖ్యయోగ రూపబుద్ధి వారి యంతఃకరణములయం దెంతమాత్రమును గలుగదు గావున వారు ఆత్మస్వరూపజ్ఞానము లేని వారై మోక్షమునుపొందక సంసారమందే యెల్లప్పుడును ప్రవర్తింతురని తాత్పర్యము.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

టీక. హేఅర్జున= ఓయర్జునుఁడా! వేదాః= వేదములు, త్రైగుణ్య విషయాః = సంసారమే విషయముగాఁ గలవి. (కావున, త్వమ్ = నీవు) నిస్త్రైగుణ్యః=కోర్కెలేనివాఁడవును, నిర్ద్వంద్వః = శీతోష్ణాది ద్వంద్వ ములు లేనివాఁడవును, నిత్యసత్త్వస్థః= సర్వకాలము నందును సత్త్వగుణ మును ఆశ్రయించినవాఁడవును, నిర్యోగక్షేమః= యోగక్షేమములులేనివాఁ డవును, ఆత్మవాన్ = ఆత్మజ్ఞానము గలవాఁడవును, భవ = అగుము.

తా. అయ్యా! అర్జునుఁడా! కర్మములను జెప్పునట్టి వేదములు, సకలదుఃఖములను గలిగించునట్టిసంసారమే విషయముగాఁ గలవి. కాబట్టి నీవట్టి సంసారమును వదలుకొనుట కొఱకు నిష్కాముఁడవును, శీతోష్ణాది ద్వంద్వములను సహించువాఁడవును, సర్వకాలములయందును సత్త్వగుణము

నాశ్రయించు వాఁడవును, యోగక్షేమములు లేనివాఁడవును అయి ఆత్మజ్ఞానముగలిగి యుండు మని తాత్పర్యము.

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥46॥

టీక. ఉదపానే = బావి మొదలగు వానియందు, యావాన్ + అర్థః ఎంతప్రయోజనము, (యథా = ఏప్రకారము, భవతి = అగుచున్నదో) తావాన్ + అర్థః = అంతప్రయోజనము, సర్వతః = సర్వస్థలములయందును, సంప్లుతోదకే = నిండిన యుదకముగల మడుగు మొదలగు వానియందు, (భవతి = అగుచున్నది), తథా = ఆప్రకారము, సర్వేషు = సమస్తములైన, వేదేషు = వేదములయందు, యావాన్ + అర్థః = ఎంత ప్రయోజనము, భవతి = అగుచున్నదో; తావాన్ + అర్థః = అంత ప్రయోజనము, విజానతః = (ఆత్మతత్త్వమును) తెలిసికొనిన, బ్రాహ్మణస్య = బ్రహ్మజ్ఞాననిష్ఠునకు, భవతి = అగుచున్నది.

తా. అయ్యా! అర్జునుఁడా! బావి మొదలుగాఁ గల వానియందు స్నానపానాదిరూపమైన ప్రయోజనమెంత కలుగుచున్నదో, ఆప్రయోజన మంతయును సంపూర్ణముగా నిండిన యుదకముగల మడుగు మొదలగువాని యందు (గలుగుచున్న విధముగ సకల వేదములయందును, వేదోక్తములగు కర్మములయందును, ఎంత ఫలము గలదో, ఆ ఫలమంతయును, ఆత్మతత్త్వమును తెలిసికొనునట్టి బ్రహ్మనిష్ఠునకుఁ గలుగు చున్న దని తాత్పర్యము.

శ్లో॥ కర్మ ణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూ ర్మాతే సంగోఽస్త్వకర్మణి॥

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! తే = నీకు, కర్మణ్యేవ = కర్మములను జేయుటయందే, అధికారః = అధికారము. (అస్తి = కలదు) కదాచన = ఒకానొకప్పుడును, ఫలేషు = కర్మఫలములయందు, అధి

కారః = అధికారము, మా (అస్తు) = లేకుండుగాక. (త్వమ్ = నీవు), కర్మఫలహేతుః = కర్మముల యొక్క ఫలమైన జన్మమునకుఁ గారణమైన వాఁడవు, మాభూః = కాకుము. తే = నీకు, అకర్మణి = కర్మములను చేయకుండుటయందు, సఙ్గః = ప్రీతి. మాస్తు = లేకుండవలయును.

తా. ఓ యర్జునుఁడా! నీ విప్పుడు కురు భీష్మాదివధనుగూర్చి వ్యసనము నొందుచున్నావు గనుక పామరత్వము గలవాఁడవై యున్నావు. ఆ హేతువు చేత నిప్పుడు నీవు వేదోక్తకర్మములను జేయుటకే అధికారివి గాని, జ్ఞాననిష్ఠ కధికారివి కావు, ఆ కర్మములను యెల్లప్పుడును ఫలమును గోరక భగవదర్పణముగానే చేయవలయును. ఫలమును గోరి చేసినయెడల కర్మఫలమైన జన్మము నీకు సంభవింపక తప్పదు. అట్లని కర్మములను చేయకుండుటయందు ప్రీతి గలవాఁడవు గాక ఫలమును గోరక అక్కఱతో వేదోక్తకర్మములను జేయవలయును. కావున ప్రకృతమందు యుద్ధకర్మము నీకుఁ జేయఁదగినదై యున్న దని తాత్పర్యము.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

టీక. హేధనంజయ = ఓ యర్జునుఁడా! (త్వమ్=నీవు) యోగస్థః= యోగమునం దున్నవాఁడవై, సఙ్గమ్ = ఫలాభిలాషను, త్యక్త్వా = విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః = చిత్తశుద్ధివలనఁ గలుగునట్టి జ్ఞానప్రాప్తియందును, అట్టి జ్ఞానము కలుగక పోవుటయందును, సమః = సమానుఁడవు. భూత్వా = అయి, కర్మాణి = కర్మములను, కురు = చేయుము. సిద్ధ్యసిద్ధ్యోః = (పైన చెప్పఁబడిన) జ్ఞానము కలుగుటయందును, కలుగక పోవుటయందును, సమత్వమ్ = సమబుద్ధి కలిగియుండుట, యోగః = యోగము, ఇతి = ఇట్లని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నది.

తా. అయ్యా! అర్జునుఁడా! నీవు యోగనిష్ఠుండవై నేను చేయుకర్మములవలన, ఈశ్వరుఁడు సంతోషింపవలయును. అనియెడు కోర్కెనుగూడ

వదలి చిత్తశుద్ధివలనఁ గలుగునట్టి జ్ఞానము కలుగుటయందును, అట్టి జ్ఞానము కలుగక పోవుటయందును సముఁడవై (అనఁగా అట్టి జ్ఞానము కలిగినను, కలుగకపోయినను, సంతోషవ్యసనములను వదలినవాఁడవై) స్వకులోచితములైన సత్కర్మములను చేయుము. చిత్తశుద్ధివలనఁ గలుగునట్టి జ్ఞానము లభించినను, లభింపక పోయినను సమబుద్ధితో నుండుట యోగ మనఁబడు నని తాత్పర్యము.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ ౪౯

టీక. హేధనంజయ = ఓయర్జునుఁడా ! హి = ఏకారణమువలన, బుద్ధియోగాత్ = సమత్వబుద్ధితోఁ గూడుకొనిన, కర్మణః = నిష్కామకర్మముకంటె) (బుద్ధిసంబంధవిరుద్ధమ్ = సమత్వబుద్ధియొక్క సంబంధములేని, కర్మ = కామ్యకర్మము, దూరేణ = అత్యంతమును, అవరమ్ = తక్కువమైనదో, (తస్మాత్ = అందువలన), బుద్ధౌ = సమత్వబుద్ధియందు (లేక) సాంఖ్యబుద్ధియందు. శరణమ్ = రక్షకమును, అన్విచ్ఛ = కోరుము. ఫలహేతవః = ఫలాభిలాష గలవారు, కృపణాః = నీచులు.

తా. ఓ యర్జునుఁడా ! సమత్వబుద్ధితోఁ గూడుకొనిన నిష్కామకర్మముకంటె కామ్యకర్మము మిగులఁ దక్కువయైనది. కాఁబట్టి ఫలాభిలాషనువదలి కర్మమును చేయుము, అట్లు జేయునపుడు, పరమార్థజ్ఞానము తప్ప మఱియేదియును సంసారబంధమును బోఁగొట్టఁ జాలదని తలఁచి పరమార్థజ్ఞానమునే కోరుము. మఱియును, స్వర్గాదిఫలములను గోరువారు నీచులు గనుక నీవు ఫలములను గోరకు మని తాత్పర్యము.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥

టీక. బుద్ధియుక్తః = సమత్వబుద్ధితోఁ గూడుకొనినవాఁడు, (కర్మ = స్వాపేక్షోచిత కర్మమును, అనుతిష్ఠన్ = అనుష్ఠించుచు), ఇహ = ఈలోకమునందు, ఉభే = రెండైన, సుకృత దుష్కృతే = పుణ్యపాపములను, (యస్మాత్ = ఏ కారణమువలన) జహాతి = విడిచిపెట్టుచున్నాఁడో, తస్మాత్ = ఆ కారణమువలన) యోగాయ = సమత్వబుద్ధియోగముకొఱకు, యుజ్యస్వ = సన్నద్ధుఁడ వగుము. కర్మసు, = కర్మములయందు, కౌశలమ్ = చాతుర్యము, యోగః = సమత్వబుద్ధియోగము, (ఇతి = ఇట్లని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తా. ఓ యర్జునుఁడా! కర్మములను చేయునపుడు ఫలము సిద్ధించినను, సిద్ధింపకపోయినను, సంతోషవ్యసనములు లేక సమబుద్ధితో నుండువాఁడు సుఖదుఃఖములకు కారణము అగు పుణ్యపాపములను, ఈ లోకమునందే విడిచిపెట్టుచున్నాఁడు, కాఁబట్టి నీవుకూడ ఫలము కలిగినను, కలుగక పోయినను, సంతోషవ్యసనములను పొందక సమబుద్ధి గలవాఁడవై స్వాపేక్షోచిత కర్మమును చేయుటకు ప్రవర్తింపుము. మఱియు నోయర్జునా! కర్మములను చేయునపుడు ఫలము సిద్ధించినను, సిద్ధింపక పోయినను సంతోష వ్యసనములను వదలుకొని సమబుద్ధితో నుండుట యనునట్టి యోగము మిగుల సామర్థ్యము కలది యని తాత్పర్యము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥

టీక. బుద్ధియుక్తాః = సమత్వబుద్ధితోఁ గూడుకొనిన, మనీషిణః = (ఆత్మానాత్మవివేకముగల) పండితులు, కర్మజమ్ = కర్మమువలనఁ బుట్టిన, ఫలమ్ = ఫలమును, త్యక్త్వా = విడిచి, జన్మబంధవినిర్ముక్తాః = జన్మ మనియెడు బంధమువలన విడువఁబడినవారై, అనామయమ్ = సర్వోపద్రవరహితమైన, పదమ్ = స్థానమును, గచ్ఛంతిహి = పొందుచున్నారు గదా.

తా. ఓ యర్జునుఁడా! సమత్వబుద్ధితోఁ గూడుకొనిన పండితులు, కర్మముల వలనఁబుట్టిన ఫలమును వదలి జన్మ మనియెడు బంధము లేనివారై సర్వోపద్రవరహిత మైన విష్ణుపదమును, అనఁగా మోక్షమును పొందుదురు గదా యని తాత్పర్యము.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52

టీక. (ఓ యర్జునుఁడా!) యదా = ఎప్పుడు, తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, మోహకలిలమ్ = దేహాభిమాన మనియెడు కాలుష్యమును, వ్యతితరిష్యతి = దాఁటఁగలదో, తదా = అప్పుడు, శ్రోతవ్యస్య = వినఁదగిన యర్థమువలనను; శ్రుతస్యచ = విన్న యర్థమునకును, నిర్వేదమ్ = వైరాగ్యమును, గంతాసి = పొందుదువు.

తా. ఓ యర్జునుఁడా! నీబుద్ధియేను దేహమే నే ననియెడు తలంపు యెప్పుడు విడిచిపోవునో; ఆ సమయమునందు కర్మకాండముచేత వినఁదగినదాని తోడను, ఇదివఱకు విన్న దానితోడను ప్రయోజనము లేదు; కాఁబట్టి నీకు వినఁదగిన యర్థములయందును, విన్న యర్థములయందును వైరాగ్యము (చాలు ననియెడు తలంపు) కలుగునని తాత్పర్యము.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥ 53

టీక. (హేపార్థ = ఓ యర్జునుఁడా! ప్రాక్ = ఇఁతకు పూర్వము) శ్రుతివిప్రతిపన్నా = కర్మకాండశ్రుతులచేత విక్షేపమును పొందియున్న తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, యదా = ఎప్పుడు, నిశ్చలా = చలింపనిదై, సమాధౌ = పరమాత్మయందు, అచలా = స్థిరమైనదై, స్థాస్యతి = ఉండఁగలదో, తదా = అప్పుడు, యోగమ్ = యోగఫలమును, అవాప్స్యసి = పొందఁగలవు.

తా. ఓ యర్జునుఁడా! నానావిధము లైన యర్థవాద వాక్యములను వినుటచేత, ఇదివఱకు విక్షేపమును పొందియున్న నీబుద్ధి యెప్పుడు విక్షేప రహిత మైనదై పరమాత్మయందు ప్రవేశించి యితరము లగు విషయములయందలి కోర్కెలను వదలుకొని నిశ్చలమై యుండునో, అప్పుడు జీవాత్మ పరమాత్మలకు భేదము లే దనునట్టిదియును, కర్మయోగమువలనఁ గలుగు నట్టిదియును అగు పరమార్థజ్ఞానమును పొందఁగల వని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ ౫౪

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను, కేశవ = ఓకృష్ణుఁడా! సమాధిస్థస్య = (ఇదివఱకుఁ జెప్పఁబడిన) సమాధియం దున్న, స్థితప్రజ్ఞస్య = నేను బ్రహ్మనైతిని అనునట్టి నిశ్చయబుద్ధి గలవానికి, భాషా = లక్షణము, కా = ఏది, స్థితధీః = నేను బ్రహ్మనైతిని అనునట్టి నిశ్చయబుద్ధి కలవాఁడు, కిమ్ = ఏవిధముగా, ప్రభాషేత = పలుకును, కిమ్ = ఏవిధముగా, ఆసీత = ఉండును, కిమ్ = ఏవిధముగా, వ్రజేత = ప్రవర్తించును.

తా. ఓ కృష్ణా ఇదివఱకుఁ జెప్పఁబడిన సమాధియం దున్నవాఁడును, నేను బ్రహ్మనైతిని అనునట్టి నిశ్చయబుద్ధి గలవాఁడును అగు మానవునకు లక్షణమేది? అనఁగా, అటువంటివాఁడు లోకులచేత నేమని పలువఁబడును? మఱియును, నేను బ్రహ్మనైతిని అనునట్టి నిశ్చయబుద్ధి కలవాఁడు, ఏవిధముగా మాటలాడును? ఎట్లు కూర్చుండును? ఏవిధముగా ప్రవర్తించును? అని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫

టీక. శ్రీభగవానువాచ = శ్రీభగవంతుఁడు చెప్పెను. హే పార్థ = ఓ యర్జునుఁడా! ఆత్మన్యేవ = ఆత్మయందే, ఆత్మనైవ = ఆత్మ చేతనే, తుష్టః = సంతోషించిన వాఁడై, యదా = ఎప్పుడు, మనోగతాన్ = మనస్సునందున్న, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోర్కెలను, ప్రజహాతి = బొత్తిగా విడిచిపెట్టుచున్నాఁడో, తదా = అప్పుడు, స్థితప్రజ్ఞః = నిశ్చలమైన ప్రజ్ఞ కలవాఁడు,(ఇతి = ఇట్లని,) ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఓ యర్జునుఁడా! ఎప్పుడు మనస్సునందలి కోర్కెలన్నింటిని వదలుకొని ఆత్మచేతనే (తనచేతనే) ఆత్మయందే (తనయందే సంతోషించుచున్నవాఁడు) అనఁగా, ఆత్మారాముఁడు అగుచున్నాఁడో, అప్పుడు స్థితప్రజ్ఞుఁడు (నిశ్చలమైన యాత్మజ్ఞానము గలవాఁడు) అనఁబడుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధ స్థితధీ ర్మునిరుచ్యతే॥ 56

టీక. దుఃఖేషు = దుఃఖములయందు, అనుద్విగ్నమనాః = క్షోభమును పొందని చిత్తము కలవాఁడును, సుఖేషు = సుఖములయందు, విగతస్పృహః = ఆశలేనివాఁడును, వీతరాగభయక్రోధః = ప్రియము,భయము, కోపము, (అనునవి) లేనివాఁడును, (అయిన) మునిః = ముని, స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు, (ఇతి = ఇట్లని) ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

తా. ఓ యర్జునుఁడా! దుఃఖములు వచ్చినప్పుడు మనస్సునందు క్షోభమును పొందనివాఁడును, సుఖములు వచ్చినపుడు ఆశ లేనివాఁడును, ప్రియము, భయము, కోపము అనునవి లేనివాఁడును అగు మునివరుఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

టీక. యః = ఏమునివరుఁడు, సర్వత్ర = సర్వస్థలములయందును, అనభిస్నేహః = అభిమానము లేనివాఁడో, తత్తత్ = ఆయా, శుభాశుభమ్ = శుభమును అశుభమును, ప్రాప్య = పొంది, నాభినందతి = సంతోషింపఁడో, నద్వేష్టి = ద్వేషమును పొందఁడో, తస్య = అట్టి మునివరునియొక్క, ప్రజ్ఞా = (ఆత్మానాత్మ వివేకమువలనఁ గలిగిన) జ్ఞానము, ప్రతిష్ఠితా = మిగుల స్థిరమైనది, (భవతి = అగుచున్నది).

తా. ఓ యర్జునుఁడా! ఏమునివరుఁడు భార్య, పుత్త్రులు, ధనము మొదలగువానిలో దేనియందును అభిమానము లేనివాఁడును, అప్పుడప్పుడు కలుగునట్టి శుభములయందు సంతోషమును, అశుభములయందు ద్వేషమును లేనివాఁడును అగునో; అట్టి మునివరునకు, ఆత్మానాత్మ వివేకమువలనఁ గలిగిన జ్ఞానము మిక్కిలి స్థిరమైన దగుచున్న దని తాత్పర్యము.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

టీక. (యర్జునుఁడా!) యదా = ఎప్పుడు, అయమ్ = ఈయోగి, ఇంద్రియార్థేభ్యః = సకలవిషయములవలనను, ఇంద్రియాణి = చెవులు మొదలైన యింద్రియములను, కూర్మః = తాఁబేలు, సర్వశః = అంతటను, అంగానీవ = కాళ్లు చేతులు మొదలైన యవయవములనువలెనే, సంహరతే = ఉపసంహరించుచున్నాఁడో, తదా = అప్పుడు, తస్య = ఆ యోగియొక్క, ప్రజ్ఞా = (ఆత్మానాత్మవివేకమువలనఁ గలిగిన) జ్ఞానము, ప్రతిష్ఠితా = మిగుల స్థిరమైనది, భవతి = అగుచున్నది.

తా. ఓ యర్జునుఁడా! తాఁబేలు తన యవయవములను లోనికి యీడ్చుకొనువిధముగ యోగి యగువాఁడు యెప్పుడు ఇంద్రియములను విషయముల మీఁదికి పోకుండునట్లు చేసి లోపలనే యిముడ్చుకొనుచున్నాఁడో అప్పుడు ఆ యోగికి ఆత్మానాత్మవివేకమువలనఁ గలిగిన జ్ఞానము స్థిరమైయుండు నని తాత్పర్యము.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ ౫౯

టీక. నిరాహారస్య = (ఇంద్రియములచేత) శబ్దాది విషయములను గ్రహింపని, దేహినః = జీవునకు, విషయాః = శబ్దాది విషయములయొక్క అనుభవములు, రసవర్జమ్ = అభిలాషను మాత్రము వదలి, వినివర్తన్తే = మరలి పోవుచున్నవి. అస్య = (విషయములను ఇంద్రియములచేత గ్రహింపక దేహాభిమానమును వదలుకొనిన) స్థితప్రజ్ఞునకు, పరమ్ = పరమాత్మను, దృష్ట్వా = చూచి, రసోపి = అభిలాషయును, నివర్తతే = మరలి పోవుచున్నది.

తా. ఓ యర్జునుఁడా! ఇంద్రియములచేత శబ్దము మొదలుగాఁ గల విషయములను గ్రహింపక యాహారము నవలంబించి యున్న దేహాభిమానికి విషయములయొక్క అనుభవము మాత్రము పోవునుగాని విషయములయందలి ప్రియము (అనఁగా విషయముల ననుభవింపవలయు ననెడి కోర్కె) పోదు. అట్టి కోర్కె నేను బ్రహ్మనైతి నని, తనను బ్రహ్మమునుగా తెలిసికొనిన స్థితప్రజ్ఞునకు పోవు నని తాత్పర్యము.

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ ౬౦

టీక. హే కౌంతేయ = ఓ యర్జునుఁడా! యతతోపి = ప్రయత్నమును చేయుచున్న వాఁ డయినప్పటికిని, విపశ్చితోపి = విద్వాంసుఁడు అయినప్పటికిని, పురుషస్య = పురుషునియొక్క, మనోపి = మనస్సునుకూడ, ప్రమాథీని = మిగుల క్షోభమును పెట్టునట్టి స్వభావము గల, ఇంద్రియాణి = ఇంద్రియములు, ప్రసభమ్ = బలాత్కారముగా, హరన్తిహి = హరించుచున్నవి గదా.

తా. ఓ యర్జునుఁడా! మాటిమాటికిని విషయములయందలి దోషములను గని పెట్టి యింద్రియములను విషయములమీఁదికిఁ బోకుండునట్లు ప్రయత్నమును చేయుచున్నప్పటికిని, విద్వాంసుఁడు అయినప్పటికిని, పురు

షుని యొక్క వివేకముకల మనస్సునుగూడ, అత్యధికమగు క్షోభమును గలుగఁ జేయునట్టి స్వభావము గల యింద్రియములు బలాత్కారముగ హరించి విషయములమీఁదికి బోవునట్లు చేయును గదా యని తాత్పర్యము.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧

టీక. తాని = అట్లు మిగుల క్షోభమును గలుగఁజేయునట్టి స్వభావము కలవియును, సర్వాణి = సమస్తములును, (అయిన యింద్రియములను) సంయమ్య = స్వాధీనముగాఁ జేసికొని, యుక్తః=నిశ్చలచిత్తుఁడు (అయిన) సన్న్యాసి, మత్పరః=(వాసుదేవుఁడనైన) నాయందు ఆసక్తిగలవాఁడై, ఆసీత=ఉండవలయును. యస్య = ఏసన్న్యాసియొక్క, వశే = స్వాధీనమందు, ఇంద్రియాణి=ఇంద్రియములు, వర్తంతే హి=ఉంచున్నవో, తస్య = అట్టి సన్న్యాసికి, ప్రజ్ఞా = ప్రజ్ఞ ప్రతిష్ఠితా = స్థిరమైనదై యుండును.

తా. ఓ యర్జునుఁడా! మోక్షమును పొందఁగోరువాఁడు, మిక్కిలి క్షోభమును గలుగఁ జేయునట్టి సకలేంద్రియములను స్వాధీనముగాఁ జేసికొని నిశ్చలచిత్తుఁడును, సర్వమును వదలుకొనినవాఁడును, వాసుదేవుఁడే సర్వాత్మ స్వరూపుఁ డనియును, వాసుదేవునికంటె నితరమేమియును లేదనియును, తలఁచుచున్నవాఁడును నై యుండవలయును. మఱియు నో యర్జునుఁడా! ఇంద్రియములు ఏ సన్న్యాసికి అభ్యాసవశముచేత స్వాధీనములై యుండునో, అట్టివానికి, ఆత్మానాత్మ వివేకమువలనఁ గలిగిన ప్రజ్ఞ స్థిరముగా నుండు నని తాత్పర్యము.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

టీక. విషయాన్ = (లోకములోని) పదార్థములనుగురించి, ధ్యాయతః = ఆలోచించుచున్న, పుంసః = పురుషునకు, తేషు = ఆ పదార్థ

మాలయందు, సంగః = ప్రీతి, ఉపజాయతే = పుట్టుచున్నది. సంగాత్ = ప్రీతివలన, కామః = ఆశ, సంజాయతే = కలుగుచున్నది. కామాత్ = ఆశవలన, క్రోధః = కోపము, అభిజాయతే = పుట్టుచున్నది.

తా. ఓ అర్జునుఁడా ! లోకములోని పదార్థములనుగూర్చి ఆలోచించు చున్న పురుషునకు ఆ పదార్థములయందు ప్రీతి కలుగుచున్నది. అట్టి ప్రీతివలన ఆశ కలుగుచున్నది. ఆ యాశవలన కోపము పుట్టు చున్నదని తా.

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ ౬౩

టీక. క్రోధాత్ = కోపమువలన, సమ్మోహః = అవివేకము, భవతి = అగుచున్నది; సమ్మోహాత్ = అవివేకమువలన, స్మృతివిభ్రమః = స్మృతి యొక్క నాశము, భవతి = అగుచున్నది; స్మృతిభ్రంశాత్ = స్మృతినశించుటవలన, బుద్ధినాశః = బుద్ధియొక్క నాశము, భవతి = అగుచున్నది; బుద్ధినాశాత్ = బుద్ధియనునదినశించుటవలన, ప్రణశ్యతి = నశించిపోవుచున్నాఁడు.

తా. ఓ అర్జునుఁడా ! అట్లు తాను, కోరినకోర్కెలు నెఱవేరకపోవుట వలనఁ గలిగిన కోపమువలన (తనకును, ఇతరులకును నపకారమును కలుగఁజేయవలెనని తలంపువలన) అవివేకము (ఈ కార్యము చేయఁదగినది, ఈ కార్యము చేయఁదగనిది కాదు, అనునట్టి తెలివి లేకపోవుట) సంభవించుచున్నది. అట్టి తెలివిలేమితనమువలన, శాస్త్రములను చదువుటచేతను, సద్గురూపదేశము చేతను పొందఁబడిన సంస్కారమువలన, (ఆత్మనిష్ఠమైయున్న యనుభవజ్ఞానమువలన) కలిగినస్మృతి (జ్ఞప్తి) నశించిపోవుచున్నది, అనఁగా, జ్ఞప్తికి వచ్చుటకుఁ దగినకారణము లున్నప్పటికిని జ్ఞప్తికి రాకపోవుట సంభవించుచున్నది. అట్లు స్మృతి యనునది నశించుటవలన, ఈ కార్యము చేయఁదగనిది, ఈ కార్యము చేయఁదగినది కాదు అని తెలుసుకొనుటకుఁదగిన యోగ్యత అంతఃకరణమునకు లేకపోవుచున్నది. అట్లు యుక్తా

యోః శ్రేయములను తెలిసికొనుటకుఁ దగిన యోగ్యత బుద్ధికి లేక పోవుటవలన నశించి (పురుషార్థహీనుఁడై) పోవుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥ 64

టీక. రాగద్వేషవియుక్తైః = రాగద్వేషములచేత విడువఁబడినవియును, ఆత్మవశ్యైః = స్వాధీనము అయినవియును, (అయిన) ఇంద్రియైః = ఇంద్రియములచేత, విషయాన్ = విషయములను, చరంస్తు = అనుభవించుచున్నవాఁ డైనను, విధేయాత్మా = స్వాధీన మైన మనస్సు కలవాఁడు, ప్రసాదమ్ = చిత్తనైర్మల్యమును, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

తా. ఓ యర్జునుఁడా! రాగద్వేషములు లేనివియును, స్వాధీనము అయినవియును అయినయింద్రియములచేత శబ్దాదివిషయములను అనుభవించుచున్న వాఁడైనను, (అనఁగా, రాగద్వేషములను వదలి శరీరసంరక్షణము కొఱకు మాత్రము కావలసిన యన్నపానాదులను భుజించుచున్న వాఁ డైనను) స్వాధీన మైనమనస్సు కలవాఁడు అయిన మహనీయుఁడు చిత్తనైర్మల్యమును (అనఁగా చిత్తస్వాస్థ్యమును) పొందుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

టీక. ప్రసాదేసతి = చక్కగా చిత్తశుద్ధి కలుగుచుండఁగా, అస్య = ఈ యతియొక్క, సర్వదుఃఖానామ్ = సకలదుఃఖములకు, హానిః = నాశము, ఉపజాయతే = కలుగుచున్నది. ప్రసన్నచేతసః = నిర్మలమయిన చిత్తము కలవానికి, ఆశు = శీఘ్రముగా, బుద్ధిః = నేను బ్రహ్మ మనియెడి తలంపు, పర్యవతిష్ఠతిహి = స్థిర మగుచున్నది కదా.

తా. ఓ యర్జునుఁడా! చిత్తము నిర్మల మయిన పక్షమున సకల దుఃఖములును నశించి పోవును. మఱియును, నిర్మల మైన చిత్తము కలవానికి

నేను బ్రహ్మ నయితి ననియెడు జ్ఞానము స్థిరముగా నుండును కదా! అని తాత్పర్యము.

శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా ।
నచాభావయత శ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ ౬౬

టీక. అయుక్తస్య = చిత్తశుద్ధిలేనియోగికి, బుద్ధిః = ఆత్మజ్ఞానము, నాస్తి = లేదు. (మఱియును) అయుక్తస్య = చిత్తశుద్ధి లేనియోగికి, భావనాచ = ఆత్మజ్ఞానమునందభినివేశమును, (బ్రహ్మజ్ఞానమును సాధించుకొనవలయు నని గట్టిపట్టుదలతో తనను బ్రహ్మనుగా ధ్యానము చేయుటయును) నాస్తి = లేదు. అభావయతశ్చ = భావనను (ఊహను) చేయనివానికి, శాంతిః = బాహ్యపదార్థములమీఁదికి మనస్సు పోకుండుట. నాస్తి = లేదు. అశాన్తస్య = బాహ్యపదార్థములమీఁదికి బుద్ధిని పోకుండునట్లు చేయనివానికి; సుఖమ్ = సుఖము, కుతః = ఎట్లు, భవతి = అగుచున్నది.

తా. ఓ అర్జునుఁడా! చిత్తశుద్ధి లేని యోగికి నేను బ్రహ్మనయితి ననియెడు జ్ఞానముండదు. మఱియును, చిత్తశుద్ధిలేనివానికి ఆత్మజ్ఞానమును సంపాదించుకొనవలయు నని గట్టిపట్టుదలతో తనను ఆత్మనుగా దలఁచుటయును కలుగనేరదు. అట్లు తలఁపనివానికి చిత్తోపరమము, (బాహ్యపదార్థముల మీఁదికి మనస్సు పోకుండుట) కలుగనేరదు. బాహ్యపదార్థముల మీఁదికి మనస్సు పోకుండునట్లు చేయనివానికి పరమానందమును కలుగఁజేయునట్టి మోక్షసుఖము కలుగనేర దని తాత్పర్యము.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥ ౬౭

టీక. హి = ఏకారణమువలన, ఇంద్రియాణామ్ = ఇంద్రియములు, చరతాం(తామ్) = (విషయములయందు) ప్రవర్తిల్లుచుండఁగా, యత్ =

యత్ మనః = మనస్సు, అనువిధీయతే = అనుసరించి ప్రవర్తించు చున్నదో.
(తస్మాత్ = ఆ కారణము వలన) తత్ = అట్టి ఇంద్రియములతో సమ
ముగఁ బ్రవర్తించు చున్న, మనః = మనస్సు, అస్య = ఈ యతియొక్క,
ప్రజ్ఞామ్ = (ఆత్మానాత్మ వివేకమువలనఁ గలిగిన) జ్ఞానమును, వాయుః =
వాయువు. అంభసి = ఉదకమునందు, నావమ్ ఇవ = ఓడనువలెనే,
హరతి = హరించు చున్నది.

తా. ఓ అర్జునుఁడా! విషయములమీఁదికి బోవు చున్న యింద్రి
యములతోఁ జేరఁబోని మనస్సుకూడ విషయములమీఁదికి బోయినచో నేని,
అట్టి మనస్సు, సముద్రము నందలి యోడను వాయువు నశింపఁజేయు విధ
ముగ యతియొక్క ఆత్మానాత్మ వివేకము వలనఁ గలిగిన జ్ఞానమును నశిం
పఁ జేయుచున్న దని తాత్పర్యము.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

టీక. హేమహాబాహో = అత్యధికమైన భుజబలముగల యో యర్జు
నుఁడా! తస్మాత్ = అందువలన, యస్య = ఏ యతియొక్క, ఇంద్రియాణి =
ఇంద్రియములు, ఇంద్రియార్థేభ్యః = విషయములనుండి, సర్వశః = సర్వ
ప్రకారములచేత, నిగృహీతాని = నిగ్రహింపఁబడినవి; భవంతి = అగుచు
న్నవో; తస్య = ఆ యతియొక్క, ప్రజ్ఞా = (ఆత్మానాత్మ వివేకమువలనఁ
గలిగిన) జ్ఞానము, ప్రతిష్ఠితా = స్థిరమైనది, (భవతి = అగుచున్నది.)

తా. అత్యధికమైన భుజబలము గల యో యర్జునుఁడా! ఆ కార
ణము వలన (ఇంద్రియ నిగ్రహము లేకపోవుటవలన దోషము కలుగును.
కనుక) ఏ యతియొక్క యింద్రియములు విషయములనుండి సర్వప్రకార
ముల చేతను నిగ్రహింపఁబడిన వగుచున్నవో, అట్టి యతికి, ఆత్మానాత్మ
వివేకమువలనఁ గలిగిన జ్ఞానము స్థిరమై యుండు నని తాత్పర్యము.

శ్లో॥ యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥**

టీక. యా = (ఆత్మను గోచరముగ జేసికొనునట్టి) ఏ బుద్ధి, (లేక) ఏ బ్రహ్మనిష్ఠ, సర్వభూతానామ్= (అవివేకు లయిన) సకల ప్రాణులకును, నిశా=(గోచరము కాకపోవుటవలన) రాత్రివలె ప్రకాశము లేనిది, (భవతి = అగుచున్నదో,) తస్యామ్ = ఆత్మను గోచరముగాఁ జేసికొనునట్టి) ఆ బుద్ధియందు, (లేక) బ్రహ్మనిష్ఠయందు, సంయమీ = ఇంద్రియనిగ్రహము కల పురుషుఁడు, జాగర్తి = మేలుకొనుచున్నాఁడు. యస్యామ్ = (శబ్దాదివిషయములను గోచరముగాఁ జేసికొనునట్టి) ఏ బుద్ధియందు, లేక) ఏ అజ్ఞానావస్థయందు (భూతాని = అవివేకులైన) సకల ప్రాణులును, జాగ్రతి = మేలుకొనుచున్నారో, సా = (శబ్దాదులను గోచరముగఁ జేసికొనునట్టి) ఆబుద్ధి, (లేక) ఆ యజ్ఞానావస్థ, పశ్యతః = (ఆత్మతత్త్వమును) చూచుచున్న, మునేః = మునివరునకు, నిశా = (అవిద్యాస్వరూప మగుట వలన) రాత్రివలె ప్రకాశము లేనిది, (భవతి = అగుచున్నది.)

తా. ఓ అర్జునుఁడా! అవివేకులైన సకలప్రాణులకును, ఆత్మతత్త్వమును గోచరముగఁ జేసికొనునట్టి బుద్ధి, (లేక) బ్రహ్మనిష్ఠ, గోచరము కాదు. కనుక రాత్రివలెఁ బ్రకాశము లేని దగుచున్నది. ఇంద్రియములను జయించిన పురుషుఁడు, ఆత్మతత్త్వమును గోచరముగాఁ జేసికొనునట్టి ఆ బుద్ధియందు, (లేక) బ్రహ్మనిష్ఠయందు మేలుకొనుచున్నాఁడు అనఁగా, ఆత్మావలోకనమును చేయుచున్నాఁడు. మఱియును, వివేకరహితు లయిన సకలభూతములును, శబ్దాదివిషయములను గోచరముగాఁ జేసికొనునట్టి బుద్ధియందు, (లేక) అజ్ఞానావస్థయందు మేలుకొనుచున్నవి, అట్టిబుద్ధి (లేక) అట్టి అజ్ఞానావస్థ, ఆత్మతత్త్వమును చూచుచున్న మునివరునకు, అవిద్యాస్వరూప మగుటవలన, రాత్రివలెఁ బ్రకాశము లేని దగు చున్న దని తాత్పర్యము.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ॥ ౭౦

టీక. ఆపూర్యమాణమ్ = అనేక (నదులలోని యుదకముచేత) సంపూర్ణముగా నిండింపఁబడినదియును, అచలప్రతిష్ఠమ్=హద్దుమీరని(లేక) స్థిరమైన వునికి కలదియును, (అయిన) సముద్రమ్= సముద్రమును, ఆపః= (వర్షము మొదలగువానివలనఁ గలిగిన) ఉదకములు, యద్వత్ = ఏవిధముగా, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, తద్వత్ =అవిధముగానే, సర్వే= సమస్తములు (అయిన), కామాః = కోర్కెలు, యమ్= ఏబ్రహ్మనిష్ఠుని, ప్రవిశన్తి=ప్రవేశించుచున్నవో, సః=ఆబ్రహ్మనిష్ఠుఁడు, శాన్తిమ్= (విషయ నివృత్తిరూప మైన) మోక్షమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు, కామ కామీ = విషయములయం దభిలాష కలవాఁడు, నాప్నోతి = మోక్ష మును) పొందఁడు.

తా. ఓ అర్జునుఁడా! అనేకము లైన నదులలోని యుదకములచేత సంపూర్ణముగా నిండింపఁబడిన దైనప్పటికిని, హద్దుమీరని (లేక) స్థిర మైన వునికి కలది అయిన సముద్రమునందు, వర్షోదకము మొదలుగాఁ గల యుదకములు ఏవిధముగా ప్రవేశించుచున్నవో అటులనే సకలకోర్కెలును, సకల కోర్కెలచేతను నిండినవాఁడును, సుఖములు వచ్చినను, దుఃఖ ములు వచ్చినను, సంతోషవ్యసనములను పొందక సర్వకాలములయందును సమభావమును పొందియున్న బ్రహ్మనిష్ఠునియందుఁ బ్రవేశించి లీనమగు చున్నవో, అతడు ముక్తిని బొందుచున్నాఁడు. విషయములయం దభి లాష గలవాడు ముక్తిని బొందఁడని తాత్పర్యము.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి॥ ౭౧

టీక. యః = ఏ, పుమాన్ = పురుషుఁడు, సర్వాన్ = సమస్తము
లైన, కామాన్ = విషయములను, విహాయ = వదలి, నిస్స్పృహః =
(ఆ విషయములు కావలయు ననియెడు) తలంపు లేనివాఁడును, నిర్మమః =
నాది యను సంకల్పమును వదలిన వాఁడును, నిరహంకారః =
గర్వము లేనివాఁడును, (అయి) చరతి = సంచరించుచుండునో, సః =
ఆ పురుషుఁడు, శాన్తిమ్ = చిత్తోపరమమును, (సకల దుఃఖనివృత్తి రూప
మైన మోక్షమును) అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

తా. ఓ అర్జునుఁడా! లోకములో ఏ మానవుఁడు సకలవిషయము
లను వదలి విషయములు కావలయు ననియెడు తలంపు లేనివాఁడును, ఏ
వస్తువు నందును నాది యనియెడు అభిప్రాయము లేనివాఁడును, గర్వము
లేనివాఁడును అయి యుండునో అట్టి పురుషుఁడు సకలదుఃఖనివృత్తి రూప
మైన మోక్షమును పొందు నని తాత్పర్యము.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! ఏషా = (ఇదివఱకుఁ జెప్పఁబడిన)
ఈ స్థితిః = నిష్ఠ, బ్రాహ్మీ = బ్రహ్మసంబంధిని యైనది. ఏనామ్ = ఈ బ్రహ్మ
నిష్ఠను, ప్రాప్య = పొంది, నవిముహ్యతి = మోహమును చెందఁడు. అస్యామ్ =
ఈ బ్రహ్మనిష్ఠయందు, అంతకాలేపి = ముసలితనమునం దైనను, స్థిత్వా =
ఉండి, బ్రహ్మనిర్వాణమ్ = మోక్షమును, ఋచ్ఛతి = పొందుచున్నాఁడు.

తా. ఓ యర్జునుఁడా! ఇదివఱకుఁ జెప్పఁబడిన నిష్ఠయంతయును
బ్రహ్మవిషయ మైనది. ఇటువంటి బ్రహ్మనిష్ఠను పొందినవాఁడు మరల మోహ
మును చెందఁడు. మఱియు నో యర్జునుఁడా! ఈ బ్రహ్మనిష్ఠను ముసలితనము
నం దవలంబించినప్పటికిని తప్పక మోక్షమును పొందు నని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మ పర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగోనామ
ద్వితీయోఽధ్యాయః.

టీక. వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యామ్ = నూరువేల శ్లోకములు గలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధ శాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాద రూపమైన, బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా బ్రహ్మజ్ఞాన విషయ సోపానములను చెప్పునట్టి గ్రంథమందు) సాంఖ్యయోగోనామ = సాంఖ్యయోగ మనియెడు పేరు కల, ద్వితీయః = రెండవదైన, అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

తా. వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరు వేలశ్లోకములు గలదియును, శాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు సాంఖ్య యోగమును తెలుపునట్టి రెండవ భాగము ముగిసెను.

ఓం తత్సత్.
శ్రీ కృష్ణార్పణమస్తు

—(*)—

ఓం.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత - తృతీయాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

## కర్మయోగము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హేజనార్దన = ఓ కృష్ణుఁడా! కర్మణః = కర్మముకంటె, బుద్ధిః = జ్ఞానము, జ్యాయసీ = శ్రేష్ఠమైనది. (ఇతి = ఇట్లని.) తే = నీకు, మతా చేత్ = ఇష్ట మయ్యె నేని, తత్ = అయితే, కేశవ = ఓ కృష్ణుఁడా! ఘోరే = భయంకర మైన, కర్మణి = కర్మమునందు, మామ్ = నన్ను, కిమ్ = ఎందుకు, నియోజయసి = నియమించుచున్నావు.

తా. ఓ కృష్ణుఁడా! నిష్కామకర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠమైన దని నీకు సమ్మత మయ్యెనేని; అయితే, ఓ కృష్ణా! మిక్కిలి భయంకర మైన కర్మమునందు నన్నేల నియమించెదవు. అనఁగా కర్మముల నెందుకు జేయుమనియెద వని అర్జునుఁడు అడిగెనని తాత్పర్యము.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥

టీక. వ్యామిశ్రేణేవ=మిశ్రితమైన దానివలెనున్న, వాక్యేన=వాక్యముచేత, మే= నాయొక్క, బుద్ధిమ్=బుద్ధిని, మోహయసీవ= మోహపెట్టుచున్నవానివలె నున్నాఁడవు, యేన= దేనిచేత, అహమ్=నేను, శ్రేయః = మోక్షమును, ఆప్నుయామ్ = పొందుదునో, ఏకమ్ = (జ్ఞానకర్మములలో) ఒక్కటైన, తత్ = దానిని, నిశ్చిత్య = నిశ్చయించి, వద= చెప్పుము.

ఓ కృష్ణుఁడా ! నీ వాక్యములలో కొన్ని కర్మమే ముఖ్య మనునట్టి యర్థమును బోధించు చున్నట్లును, మఱికొన్ని జ్ఞానమే ముఖ్యమనునట్టి యర్థమును బోధించు చున్నట్లును, కనఁబడుచున్నవి. అందువలన, నీవు నా బుద్ధికి మోహమును కల్పించు చున్నవానివలెఁ గనఁబడుచున్నావు. ఓ కృష్ణా! నేను దేనిచేత మోక్షమును పొందుదునో, అటువంటిదానిని ఒక్కదానిని అనఁగా జ్ఞానకర్మములలో నొక్కదానిని నిశ్చయించి నాకు చెప్పి మోక్షము కలుగునట్లు చేయు మని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను. అనఘ= పాపరహితుఁడవైన యో యర్జునుఁడా! పురా =పూర్వమునందు, అస్మిన్=ఈ, లోకే= లోకమునందు, మయా=నాచేత, సాంఖ్యానామ్= ఆత్మానాత్మవివేకము కలవారలకు, జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను, యోగినామ్ = కర్మఠులకు, కర్మయోగేన = కర్మయోగముచేతను, (శేష) కర్మ మనియెడు నుపాయముచేతను, ద్వివిధా = రెండుప్రకారములు గల నిష్ఠా = స్థితి, ప్రోక్తా = చెప్పఁబడినది.

పాపరహితుఁడవైన యో యర్జునుఁడా ! సృష్ట్యాదియందు (శేష) రెండవ యధ్యాయమునందు, ఆత్మానాత్మవివేకము గలవారును, బ్రహ్మ

చర్యాశ్రమమున నుండియే సన్న్యసించినవారును, వేదాంతవాక్యముల యందలి తాత్పర్యమును చక్కఁగా దెలిసికొని యాత్మతత్త్వమును గుర్తెఱింగినవారును, పరమహంస స్వరూపులును అయిన సన్న్యాసులకు జ్ఞానమని యెడు యోగముచేతను, (బ్రహ్మతోఁ జేర్చునట్టి యుపాయముచేతను) కర్మమునుచేసి చిత్తశుద్ధిని కలిగించుకొని జ్ఞానమును సంపాదించుకొని ఆ జ్ఞానముచేత మోక్షమును పొందవలయు ననియెడు తలంపు కలవారలకు అనఁగా కర్మఠులకు, కర్మయోగముచేతను, బ్రహ్మనిష్ఠ యొక్కటియే రెండుప్రకారములై యున్నదని నేను చెప్పితి నని తాత్పర్యము.

శ్లో॥ నకర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥     ౪

టీక. పురుషః=నరుఁడు, కర్మణామ్ = యజ్ఞాది కర్మములయొక్క, అనారమ్భాత్ = చేయక పోవుటవలన, నైష్కర్మ్యమ్ = బ్రహ్మస్వరూపానుభవమును (మోక్షమును), నాశ్నుతే = పొందఁడు. సన్న్యసనాదేవ= కర్మములను విడుచుటవలననే, సిద్ధిమ్ = కార్యసిద్ధిని (మోక్షమును) నచ సమధిగచ్ఛతి = పొందఁడు.

ఓ యర్జునుఁడా! ఫలమును గోరక కర్మములను జేసినయెడల, అట్టి కర్మములు సకలపాపములను బోఁగొట్టి చిత్తశుద్ధిని గలుగఁజేసి జ్ఞానమును గలుగఁజేయు చున్నవి. ఆ జ్ఞానము, ఆత్మానుభవమును, (మోక్షమును) గలుగఁజేయు చున్నది. కావున లోకమం దెవ్వడు మోక్షమును గోరునో అట్టివాఁడు ఫలమును గోరక కర్మములను జేసియే తీరవలయును. కష్టమని సోమరితనముచేత కర్మములను చేయక పోయినయెడల మోక్షమును బొందఁడు. మఱియును, కర్మములను చేయక విడుచుటవలననే మోక్షముకలుగు నని తలఁచెద వేమో అట్లు తలఁపవలదు. మోక్షోపయోగియైన జ్ఞానముకలిగిన పిమ్మటనే కర్మత్యాగము మోక్షహేతు వగును గాని అట్టి జ్ఞానము లేని

మొదల కర్మత్యాగము మోక్షహేతువు గాదు. కావున పురుషుఁడు కర్మత్యాగమును జేసినంత మాత్రముచేతనే మోక్షమును బొందఁడు. గనుక మోక్షమును బొందుటకు కర్మములను జేసియే తీరవలయునని తాత్పర్యము.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ 5

టీక. హి = ఏకారణమువలన, ప్రకృతిజైః = మాయవలనఁ గలిగిన, గుణైః = సత్త్వరజస్తమోగుణములచేత, (అజ్ఞః = మూఢుఁడైన) సర్వః = సమస్తజనుఁడును, అవశః = అస్వతంత్రుఁడై, కర్మ = కర్మమును, కార్యతే = చేయింపఁబడుచున్నాఁడో, (తత్ = ఆ కారణమువలన), కశ్చిత్ = ఒకానొక పురుషుఁడును, జాతు = ఒకానొకప్పుడును, క్షణమపి = అల్పకాలమైనను, అకర్మకృత్ = కర్మమును జేయనివాఁడై, నతిష్ఠతిహి = ఉండఁడు గదా.

ఓ అర్జునుఁడా! లోకములోని అవివేకులందఱును మాయాతత్త్వము వలనఁ గలిగిన రాగద్వేషాది గుణములకు లోఁబడి స్వతంత్రము లేనివారై సర్వకాల సర్వావస్థలయందును ఏదో యొక కర్మమును చేయుచునేయుందురు. కాని ఏకర్మమును చేయక క్షణమాత్రమైన నుండరు. కావున జ్ఞానరహితు లగువారు కర్మసన్న్యాసమును చేయఁగూడ దని తాత్పర్యము.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥

టీక. యః = ఎవ్వఁడు, కర్మేంద్రియాణి = వాక్కు పాణిపాదము పాయువు ఉపస్థ (అనియెడు) ఇంద్రియములను, సంయమ్య = నిగ్రహించి, మనసా = మనస్సుచేత, ఇంద్రియార్థాన్ = శబ్దాదివిషయములను, స్మరన్ = స్మరించుచు, ఆస్తే = ఉన్నాఁడో, సః = అట్టివాఁడు, విమూఢాత్మా =

వివేకశూన్య మైన మనస్సు కల, మిథ్యాచారః = దబ్బరయాచారము కలవాఁడు, (పాపాచారము కలవాఁడు, (లేక) డాంబికుఁడు), (ఇతి = ఇట్లని) ఉచ్యతే = చెప్పఁబడు చున్నాఁడు.

ఓ యర్జునుఁడా! వాక్పాణి పాదపాయూపస్థ లనియెడు నింద్రియ ములచేత నే కార్యమును చేయక సన్న్యాసి వేషమును ధరించి మనస్సు చేత బ్రహ్మను గుఱించి యాలోచింపక, శబ్దస్పర్శ రూప రసగంధము లనియెడు విషయములను స్మరించుచు, ఏ మానవుఁడు వున్నాఁడో; అట్టి మానవుఁడు (కపట సన్న్యాసి) వివేకశూన్య మైన మనస్సు గల పాపా చారుఁ డనఁబడు నని తాత్పర్యము.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే॥ 7

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! యస్తు = (అవివేకి యైన) ఏ పురుషుఁడు, ఇంద్రియాణి=(చెవులు మొదలుగాఁ గల) జ్ఞానేంద్రియములను, (వివేకము కల) మనస్సుచేత (లేక) మనసాసహ = మనస్సుతోఁ గూడ, నియమ్య = నిగ్రహించి, కర్మేంద్రియైః = వాక్కు, పాణి పాదము మొద లుగాఁగల యింద్రియములచేత, కర్మయోగమ్=కర్మయోగమును, అసక్తః= ఫలాభిలాష లేనివాఁడై, ఆరభతే = ఆరంభించు చున్నాఁడో, సః=అట్టి పురుషుఁడు, విశిష్యతే=(కపటసన్న్యాసికంటె) ఉత్తముఁడగుచున్నాఁడు.

ఓ యర్జునుఁడా! అవివేకి యైన యే మానవుఁడు, త్వక్కు, నేత్రము, చెవి, జిహ్వ, ఘ్రాణము అనియెడు జ్ఞానేంద్రియములను వివేకము గల మనస్సుచేత, (లేక) మనస్సుతోఁ గూడ నిగ్రహించి అనఁగా శబ్ద స్పర్శరూప రసగంధముల మీఁదికిఁ బోకుండునట్లు చేసి యీశ్వరపరము లనుగాఁ జేయుచు, వాక్కు, పాణి, పాదము, వాయువు, ఉపస్థ అని

యెవఁడు కర్మేంద్రియముల చేత కర్మయోగమును, ఫలాభిలాష లేనివాఁడై చేయుచున్నాఁడో; అట్టి మానవుఁడు ఈశ్వరార్పణబుద్ధితో చేయఁబడిన కర్మముల మహిమచేత చిత్తశుద్ధి కలవాఁ డగుచున్నాఁడు. కనుక, కపట సన్న్యాసికంటె ఉత్తముఁ డగుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥ ౮

టీక. హి = ఏకారణమువలన, అకర్మణః = కర్మమును చేయకుండుట కంటె, కర్మ = కర్మమును చేయుట, జ్యాయః = శ్రేష్ఠమైనదో; (అతః = ఈ కారణమువలన, హే అర్జున = ఓ అర్జునుఁడా!) త్వమ్ = నీవు, నియతమ్ = నిత్యమైన, కర్మ = కర్మమును, కురు = చేయుము. అకర్మణః = కర్మమును చేయని, తే = నీకు, శరీరయాత్రాపిచ = దేహస్థితియును, నప్రసిద్ధ్యేత్ = ప్రసిద్ధమైనది గాక పోవును. (అనఁగా జరుగ దనుట).

ఓ యర్జునుఁడా! కర్మమును చేయ కుండుటకంటె నిత్యములైన సంధ్యావందనాది కర్మములను చేయుట యెక్కువ యుత్తమమై యున్నది. కావున నీవు నిత్యము లగు శ్రౌతస్మార్తకర్మములను చేయుము. మఱియు, నో యర్జునుఁడా! నీవు నిత్యములైన కర్మములను చేయక పోతివేని కర్మరహితుఁడవైన నీకు దేహయాత్రకూడ సిద్ధింప దని తాత్పర్యము.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర॥ ౯

టీక. హే కౌంతేయ = ఓ అర్జునుఁడా! యజ్ఞాత్ = విష్ణుప్రీతికొఱకు (అయిన) కర్మణః = కర్మముకంటె, అన్యత్ర = ఇతరమైన, కర్మమునందు, అయమ్ = ఈ, లోకః = లోకము, కర్మబంధనః = కర్మబంధముగలది, భవతి = అగుచున్నది. (తస్మాత్ = అందువలన) ముక్తసంగః = విడువఁబడిన ఫలా

షిలాష కలవాఁడవై, తదర్థమ్ = ఆ విష్ణుప్రీతికొఱకు, కర్మ = కర్మమును, సమాచర = చక్కఁగాఁ జేయుము.

ఓ యర్జునుఁడా! విష్ణువు కొఱకుఁ జేయఁబడుచున్న కర్మముకంటె నితరములగు కర్మములన్నియును, బంధమును, (జననమరణాది నానావిధ దుఃఖములను) కలిగించును. కావున నీవు ఫలాభిలాషను వదలి శ్రౌత స్మార్త కర్మములను విష్ణుప్రీతికొఱకు శ్రద్ధాభక్తులతో చక్కఁగాఁ జేయుమని తాత్పర్యము.

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్॥౧౦

టీక. ప్రజాపతిః = బ్రహ్మదేవుఁడు, సహయజ్ఞాః = యజ్ఞములతోఁ గూడిన, ప్రజాః = ప్రజలను, సృష్ట్వా = పుట్టించి, (హే ప్రజాః = ఓ ప్రజలారా!) అనేన = ఈ యజ్ఞము చేత, (యూయమ్ = మీరు), ప్రసవిష్యధ్వమ్ = ఉత్తరోత్తరాభివృద్ధిని చేయుఁడు. ఏషః = ఈయజ్ఞము, ఇష్టకామధుక్ = ఇష్టము లగు కోర్కెల నిచ్చునట్టిది, అస్తు = అగుఁగాక. (ఇతి = ఇట్లని) పురా = సృష్టికాలమునందు. ఉవాచ = చెప్పెను.

ఓ అర్జునుఁడా! బ్రహ్మదేవుఁడు యజ్ఞములతోఁ గూడ మూఁడు వర్ణముల వారిని పుట్టించి, ఓ ప్రజలారా! మీరందఱును ఈయజ్ఞమును చేయుచు, ఉత్తరోత్తరాభివృద్ధిని పొందుఁడనియును, ఈ యజ్ఞము కామధేనువువలె మీ కోర్కెల నన్నిటిని యిచ్చునదనియును, లోకముల నన్నిటిని సృష్టి చేసిన కాలమునందుఁ జెప్పెను. కావున నీవు శ్రౌతస్మార్త కర్మములను విడువక చేయవలసిన దని తాత్పర్యము.

శ్లో॥ దేవాన్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥ ౧౧

టీక. అనేన = ఈయజ్ఞముచేత, దేవాన్ = దేవతలను, (హావిర్భాగైః = హావిర్భాగములచేత) భావయత = తృప్తిని పొందింపుడు; తే = అట్లు మీచేతఁ దృప్తిని పొందింపఁబడిన, దేవాః = దేవతలు, వః = మిమ్ములను, (వృష్ట్యాదినా = వర్షము మొదలగువానిచేత) భావయన్తు = వృద్ధిని పొందింతురుగాత. పరస్పరమ్ = ఒకరినొకరు, భావయన్తః = వృద్ధిని పొందించుకొనుచు, పరమ్ = సర్వోత్తమమైన, శ్రేయః = శ్రేయస్సును, (మోక్షమును లేక) స్వర్గమును) అవాప్స్యథ = పొందుదురు.

ఓ ప్రజలారా! మీరందఱును ఈ యజ్ఞముచేత ననఁగా యజ్ఞములయందించునట్టి హావిర్భాగములచేత దేవతలను తృప్తిని పొందింపుఁడు. అట్లు మీచేత దృప్తిని పొందింపఁబడిన దేవతలు వర్షము మొదలగువానిచేత అన్నము మొదలగువానిని మీకిచ్చి మిమ్ములను తృప్తిని పొందింతురు. ఇట్లు ఒకరి నొకరు తృప్తిని పొందించుకొనుచు సర్వోత్తమ మగు మోక్షమును, (లేక) సర్వోత్తమమైన స్వర్గమును పొందుదురని తాత్పర్యము.

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥ ౧౨

టీక. యజ్ఞభావితాః = యజ్ఞములచేత సత్కరింపఁబడిన, తే = ఆ, దేవాః = దేవతలు, వః = మీకొఱకు, ఇష్టాన్ = సమ్మతములైన, భోగాన్ = భోగములను దాస్యన్తేహి = ఇయ్యఁగలరు గదా! యః = ఎవ్వఁడు, ఏభ్యః = ఈదేవతలకొఱకు, అప్రదాయ = ఈయక, తైః = ఆదేవతలచేత, దత్తాన్ = ఇయ్యఁబడిన భోగములను, భుఙ్క్తే = అనుభవించుచున్నాఁడో, సః = అట్టి మానవుఁడు, స్తేనఏవ = చోరుఁడే.

ఓ ప్రజలారా! యజ్ఞములచేత సత్కరింపఁబడిన దేవతలు మీకిష్టములైన భోగములను కలుగఁజేయుదురుగదా. లోకములో ఏమానవుఁడు దేవతలకు హావిర్భాగాదులను ఇయ్యక దేవతలచేత నీయఁబడిన స్త్రీపశుపుత్త్రి

...త్రాది భోగ్య పదార్థములను అనుభవించు చున్నాఁడో అట్టివాఁడు చోరుఁడే యగు నని తాత్పర్యము.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥

టీక. యజ్ఞశిష్టాశినః = యజ్ఞమునందు భగవదర్పణమును చేయఁగా మిగిలినదియును, అమృత మనియెడు పేరుకలదియును, (అయిన) అన్నమును భుజించునట్టి, సంతః = సత్పురుషులు, సర్వకిల్బిషైః = సకల పాపముల చేతను, ముచ్యంతే = విడువఁబడుచున్నారు. యేతు = ఎవ్వరైతే, ఆత్మ కారణాత్ = తమ యుదరపూరణ నిమిత్తము, పచంతి = పాకము చేయుచున్నారో (భుజించుచున్నారో); పాపాః = పాపులు (అయిన), తే = వారలు, అఘమ్ = పాపమును, భుంజతే భుజించుచున్నారు. (అనుభవించుచున్నారు).

ఓ ప్రజలారా! యజ్ఞములయందు భగవంతునకు సమర్పింపఁగా మిగిలినవియును, అమృత మనఁ దగినవియును అయిన యన్నాదులను భుజించునట్టి సత్పురుషులు సర్వపాపములనుండియును విముక్తులగుదురు. మఱియును, ఎవ్వరుతమ యుదరపూరణమాత్రముకొఱకే పచనము చేయుచున్నారో, అట్టివారు పాపమును అనుభవించుచున్నవా రగుదు రని తాత్పర్యము.

శ్లో॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪

టీక. అన్నాత్ = (శుక్ల శోణితరూపముగ పరిణమించునట్టి)అన్నము వలన, భూతాని = సకలప్రాణిశరీరములును, భవంతి = పుట్టుచున్నవి, పర్జన్యాత్ = (వర్షరూపముగ పరిణమించునట్టి) మేఘమువలన, అన్నసంభవః = అన్నముయొక్క పుట్టువు, భవతి = అగుచున్నది. యజ్ఞాత్ = యజ్ఞ

మువలన, పర్జన్యః = మేఘము, భవతి = అగుచున్నది. యజ్ఞః = యజ్ఞము, కర్మసముద్భవః = కర్మమువలనఁ బుట్టునది, భవతి = అగుచున్నది.

ఓ యర్జునుఁడా! శుక్లశోణితరూపముగఁ బరిణమించునట్టి యన్నము వలన సకల ప్రాణిశరీరములును కలుగు చున్నవి. వర్షరూపముగఁ బరిణమించు నట్టి మేఘమువలన అన్నము కలుగుచున్నది. యజ్ఞము వలన మేఘము కలుగు చున్నది. యజ్ఞము కర్మమువలనఁ గలుగుచున్నది. కావున కర్మము అవశ్యముగఁ జేయఁదగిన దని తాత్పర్యము.

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ ౧౫

టీక. కర్మ = కర్మమును, బ్రహ్మోద్భవమ్ = వేదము కారణముగాఁగల దానినిఁగా, విద్ధి = తెలిసికొనుము. బ్రహ్మ = వేదమును, అక్షరసముద్భవమ్ = అక్షరపరబ్రహ్మము కారణముగాఁగల దానినిఁగా, విద్ధి = తెలిసి కొనుము. తస్మాత్ = అందువలన, బ్రహ్మ = వేదము, సర్వగతమ్ = సర్వస్థలముల యందును వ్యాపించినదై, నిత్యమ్ = ఎల్లప్పుడును, (లేక) నాశము లేనిదై, యజ్ఞే = యజ్ఞమునందు, ప్రతిష్ఠితమ్ = ఉంచఁబడినది.

ఓ అర్జునుఁడా! కర్మము వేదమువలనఁ బుట్టినది, వేదము పరమాత్మ వలనఁ బుట్టినది, కావున వేదము సర్వమునందును వ్యాపించినదై సర్వకాలముల యందును(లేక)సర్వమును తెలుపునట్టిదై(లేక) నిత్యమై యజ్ఞమునం దుంచఁబడినది. కాఁబట్టి, అనఁగా జగచ్చక్రప్రవృత్తికి కర్మము కారణమై నదికనుక, సర్వకాలములయందును యజ్ఞమును చేయవలసినదని తాత్పర్యము.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ సజీవతి॥ ౧౬

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! ఏవమ్ = ఈవిధముగా, ప్రవర్తితమ్ = ప్రవర్తింపఁజేయఁబడిన, చక్రమ్ = (కర్మసమూహరూపమైన) జగచ్చక్రమును, యః = ఎవ్వఁడు, ఇహ = ఈ లోకమునందు, నానువర్తయతి = అనుష్ఠింపఁడో, సః = అట్టి మనుజుఁడు, అఘాయుః = పాపాయుష్యము కలవాఁడును, ఇంద్రియారామః = ఇంద్రియములచేత విషయములందు క్రీడించుచున్నవాఁడును, (కావున) మోఘమ్ = వ్యర్థముగా, జీవతి = జీవించుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఇట్లు, అనఁగా ఈశ్వరునిచేత వేదయజ్ఞపూర్వకముగా (వేదము యజ్ఞము అనునవి ముందు కలుగునట్లుగా) ప్రవర్తింపఁజేయఁబడిన జగచ్చక్రమును అనువర్తింపక అనఁగా, జగచ్చక్రప్రవృత్తికి కారణమును, వేదచోదితమును అయిన కర్మమును చేయక ఏ పురుషుఁడు ఇంద్రియములచేత విషయములయందే క్రీడించుచుండునో; అట్టివాఁడు పాపభూయిష్ఠమైన జీవనము (జీవితకాలము) కలవాఁడు అగుటచేత నిష్ప్రయోజనముగా జీవించుచున్నాఁడు. కావున కర్మాధికారియైన యవివేకి కర్మమును చేయవలసిన దని తాత్పర్యము.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥ ౧౭

టీక. యః = ఏ, మానవస్తు = మానవుఁడైతే, ఆత్మరతిరేవ = తనయందే ప్రీతి కలవాఁడును, ఆత్మతృప్తశ్చ = తనచేతనే తృప్తిని పొందువాఁడును, ఆత్మన్యేవ = తనయందే, సంతుష్టః = సంతోషమును పొందుచున్నవాఁడును, స్యాత్ = అగునో; తస్య = ఆయాత్మవేత్తకు, కార్యమ్ = చేయఁదగినది, న విద్యతే = లేదు.

ఓ యర్జునుఁడా! లోకములో విద్వాంసుఁడైన యేమానవుఁడైతే అనఁగా, ఏ సన్న్యాసియైతే, తనయందే ప్రీతి కలవాఁడును, తన చేతనే

తృప్తిని పొందువాఁడును, తనయందే సంతోషమును పొందువాఁడును అగు నో, అట్టి యాత్మవేత్త చేయఁదగిన కర్మమేదియును లేదని తాత్పర్యము.

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
నచాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ ౧౮

టీక. తస్య= ఆ బ్రహ్మవేత్తకు, ఇహ = ఈలోకమందు, కృతేన= కర్మమును చేయుటచేతను, అర్థః = ప్రయోజనము, నైవ (అస్తి) = లేనే లేదు. అకృతేన = కర్మమును చేయకుండుటచేతను, కశ్చన = ఒకా నొకటియైన, (అర్థః = ప్రయోజనము) న (అస్తి) లేదు. (కిం) చ= మఱి యును, అస్య = ఈ బ్రహ్మవేత్తకు, సర్వభూతేషు = ఎల్లవస్తువులయం దును, అర్థవ్యపాశ్రయః = ప్రయోజనమునకు ఆధారమైన, కశ్చిత్ = ఒకానొక పదార్థమును, న = లేదు.

బ్రహ్మవేత్త పరబ్రహ్మమును తెలిసికొనుట యనునట్టి సర్వోత్తమ మైన ప్రయోజనము కలవాఁడగుటవలనను, విధినిషేధములు లేనివాఁ డగుటవలనను, ఆ బ్రహ్మవేత్తకు కర్మములను జేయుటచేతఁ గాని, కర్మము లను చేయకుండుటచేతఁ గాని ఫలమేమియును లేదు. కావున, బ్రహ్మ మొదలుగాఁ గల వస్తువులయందు తనపనినిమిత్తము ఆశ్రయింపఁదగినవస్తు వొకటియును లేదని తాత్పర్యము.

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥

టీక. హి = ఏకారణమువలన, అసక్తః = ఫలాపేక్ష లేనివాఁడై, కర్మ = కర్మమును, సమాచరన్ = చేయుచు, పూరుషః = పురుషుఁడు, పరమ్= మోక్షమును, ఆప్నోతి= పొందుచున్నాఁడో, తస్మాత్= ఆకార ణమువలన, (త్వమ్=నీవు) అసక్తః (సన్) = ఫలమును గోరనివాఁడై సత

తమ్ = ఎల్లప్పుడును, కార్యమ్ = చేయఁదగిన, కర్మ = కర్మమును, సమాచర = చేయుము.

ఓ అర్జునుఁడా! ఫలాభిలాషను వదలి విధిచోదితమైన కర్మమును చేయువాఁడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును. కనుక నీవు ఫలాభిలాషను వదలి చేయఁదగిన కర్మమును చేయుమని తాత్పర్యము.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తు మర్హసి॥ ౨౦

టీక. హి = ఏకారణమువలన, జనకాదయః = జనకచక్రవర్తి అశ్వపతి మొదలగువారు, కర్మణైవ = కర్మముచేతనే, సంసిద్ధిమ్ = మోక్షమును, (గంతుమ్ = పొందుటకు) ఆస్థితాః = ప్రవర్తించిరో; తస్మాత్ = ఆకారణమువలన, త్వమపి = నీవును, లోకసంగ్రహమేవ = లోకముయొక్క ప్రయోజనమునే, సంపశ్యన్ = చూచుచున్నవాఁడవై, కర్తుమ్ = (శ్రౌతస్మార్త కర్మములను) చేయుటకొఱకు, అర్హసి = తగుదువు.

ఓ యర్జునుఁడా! జనకచక్రవర్తి, అశ్వపతి మొదలుగాఁగల రాజర్షులందఱును, కర్మముచేతనే పరిశుద్ధమైన అంతఃకరణము కలవారై మోక్షమును పొందుటకొఱకు ప్రవర్తించిరి; కావున నీవుకూడ లోకముయొక్క ప్రయోజనమునే చూచి కర్మమును చేయవలసినదే కాని విడుచుట తగదని తాత్పర్యం.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ ౨౧

టీక. శ్రేష్ఠః = ఉత్తముఁడు, యద్యత్ = ఏయేకర్మమును, ఆచరతి = ఆచరించుచున్నాఁడో, ఇతరః = ఇతరమైన, జనః = జనము (అనఁగా పామరులు), తత్తదేవ = ఆయాకర్మమునే, ఆచరతి = ఆచరించుచున్నది. సః = అట్టి యుత్తముఁడు, యత్ = దేనిని, ప్రమాణమ్ =

ప్రమాణముగా, కురుతే = చేయుచున్నాఁడో, లోకః = పామరజనము, తత్ = ఆ ప్రమాణమునే, అనువర్తతే = అనువర్తించు చున్నది.

శ్రీ అర్జునుఁడా! ఉత్తముఁడు ఏయేకర్మమును ఆచరించుచున్నాఁడో; ఇతరమైన పామరజనము కూడ అయా కర్మమునే ఆచరించు చున్నది. మఱియును, అట్టి యుత్తముఁడు లౌకిక వైదిక వాక్యములలో నేయేవాక్యము ప్రమాణముగా జేయుచున్నాఁడో పామరజనులుకూడ ఆయా వాక్యములనే ప్రమాణములనుగా తలఁచు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ ౨౨

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! మే = నాకు, కర్తవ్యమ్ = చేయఁదగిన కర్మము, నాస్తి = లేదు. త్రిషు = మూఁడు అయిన, లోకేషు = లోకముల యందు, కించన = కొంచెమైనను, అనవాప్తమ్ = పొందఁబడనిది, నాస్తి = లేదు. అవాప్తవ్యమ్ = పొందఁదగినది, నాస్తి = లేదు. తథాపి = అయినప్పటికిని, కర్మణి = కర్మమునందు, వర్త ఏవచ = ప్రవర్తించుచునే యున్నాను.

ఓ అర్జునుఁడా! నాకు చేయఁదగిన కర్మ మేదియును లేదు. మఱియును, మూఁడు లోకములయందును కొంచెమైనను నాచేతఁ బొందఁబడనిది కాని, పొందఁదగినది కాని లేదు, అట్లు యేదియును లేక పోయినప్పటికిని నేను కర్మమునందు ప్రవర్తించుచునే యున్నాను. అనఁగా, కర్మములను చేయుచున్నా నని తాత్పర్యము.

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ౨౩

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! అహమ్ = నేను, జాతు = ఒకప్పుడును, అతన్ద్రితః = ప్రమాదము లేనివాఁడనై, కర్మణి = కర్మమునందు,

నవర్తేయం యది = ప్రవర్తింపకపోతినేని, మనుష్యాః = మనుష్యులు, సర్వశః = సర్వప్రకారములచేతను, మమ = నాయొక్క, వర్త్మ = మార్గమును, అనువర్తంతే = అనుసరించి ప్రవర్తించుచున్నారు.

ఓ అర్జునుఁడా! నేను సర్వకాలములయందును జాగరూకుఁడనై కొంచెమైనను పొరఁబాటులేక కర్మములను చేయక పోతినేని లోకములోని మానవులందఱును, నావలె కర్మములను చేయక యూరకుందురు. అట్లు చేయక పోవుటచేత భ్రష్టులగుదురు. కావున నేనుగూడ లోకసంగ్రహము కొఱకు కర్మములను జేయుచున్నారనని తాత్పర్యము.

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యా మిమాః ప్రజాః॥

టీక. అహమ్ = నేను, కర్మ = కర్మమును, నకుర్యాం చేత్ = చేయక పోతినేని, ఇమే = ఈ, లోకాః = జనులు, ఉత్సీదేయుః = నశించిపోదురు, అహమ్ = నేను, సంకరస్యచ = వర్ణసాంకర్యమునకును, కర్తా = కర్తను, స్యామ్ = అగుదును; ఇమాః = ఈ, ప్రజాః ఏ ప్రజలను. ఉపహన్యామ్ = దుర్గతిని పొందించినవాఁడ నగుదును.

ఓ అర్జునుఁడా! నేను కర్మమును జేయకపోతి నేని యెల్లవారును నన్ను దృష్టాంతమునుగాఁ జేసికొని లోకస్థితికి కారణమైన కర్మమును చేయక చెడి పోదురు. అట్లగుటజేత నేను వర్ణసాంకర్యమును జేసినవాఁడ నగుదును, అట్లగుటచేత నీ ప్రజలనందఱిని దుర్గతిని పొందించినవాఁ డగుదు నని తాత్ప.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥

టీక. హే భారత = ఓ అర్జునుఁడా! అవిద్వాంసః = పామరులు, కర్మణి = కర్మమునందు, సక్తాః = ఆసక్తి కలవారై, (అనఁగా కర్మఫలము కావలయు ననియెడు తలంపు కలవారై) యథా = ఏప్రకారము, కుర్వన్తి =

(కర్మములను) చేయుచున్నారో, విద్వాన్ = ఆత్మజ్ఞానము కలవాఁడు, తథా = ఆ ప్రకారము, అసక్తస్సన్ = ఫలాభిలాష లేనివాఁ డగుచు లోకసంగ్రహమ్ = లోకసంగ్రహమును, చికీర్షుః = చేయ నిచ్ఛయించిన వాఁడై, కుర్యాత్ = (కర్మములను) చేయవలయును.

ఓ అర్జునుఁడా! ఆత్మజ్ఞానము లేనివాఁడు కర్మఫలము నాకు కావల యునని యెడు తలంపు గలవాఁడై యేవిధముగా శ్రద్ధాభక్తులతో కర్మము లను చేయుచున్నాఁడో; అట్లు ఆత్మజ్ఞానము కలవాఁడును, అప్రకారము గానె శ్రద్ధాభక్తుల నవలంబించి కర్మఫలమునందు ఆసక్తి లేనివాఁ డగుచు లోకసంగ్రహము చేయుటకొఱకు కర్మములను చేయవలసినదని తా.

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్॥

టీక. విద్వాన్= ఆత్మజ్ఞానము కలవాఁడు, కర్మసంగినామ్=కర్మము నందు ఆసక్తి కల, అజ్ఞానామ్=అవివేకులయొక్క, బుద్ధిభేదమ్= (కర్మము చేయఁదగినది అనియెడు) సంకల్పమునకు చలనమును, నజనయేత్ =పుట్టింప గూడదు. (కింతు = ఇఁక నే మనిన) యుక్తః = సమాహితచిత్తుఁడై, స్వయమ్ = తాను) సమాచరన్ = ఆచరించుచు, సర్వకర్మాణి = అన్ని కర్మములను, జోషయేత్ = (ఇతరులచేత) చేయింపవలయును.

ఓ అర్జునుఁడా! ఆత్మజ్ఞానము కలవాఁడు కర్మమునందు ఆసక్తి కల యవివేకులయొక్క బుద్ధికి భేదమును చేయఁగూడదు. మఱి యే మనిన నిశ్చలచిత్తుఁడై తాను చేయుచు సకల కర్మములను యితరులచేతఁగూడఁ జేయింప వలయు నని తాత్పర్యము.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ ౨౭

టీక. అహంకారవిమూఢాత్మా = అహంకారభావముచేత (దేహాదులే నేననియెడు తలంపుచేత) (యుక్తాయుక్తములను) తెలియని మనస్సు గల పురుషుఁడు, ప్రకృతేః = మాయయొక్క (మాయవలనఁ బుట్టిన) గుణైః = కార్యాకార్యరూపము లైన యింద్రియముల చేతను, ఆ యింద్రియముల యొక్క వికారములచేతను, సర్వశః = నానావిధములుగాఁ జేయఁబడుచున్న, కర్మాణి = కర్మములను, కర్తా = చేసినవాఁడను, అహమ్ = నేను, ఇతి = ఇట్లని, మన్యతే = తలఁచుచున్నాఁడు.

దేహాదులే నేననియెడు తలంపుచేత యుక్తాయుక్తములు, ఆత్మానాత్మలు మొదలగు వానిని తెలిసికొనుటకు తగిన శక్తి లేని మనస్సు కల పురుషుఁడు అనఁగా అవివేకి, మాయవలనఁ బుట్టినట్టివియును, కార్యకారణ రూపము లైనవియును అయిన యింద్రియాదులచేత నానావిధములుగాఁ జేయఁబడుచున్న కర్మములను జేసినవాఁడను నేనని తలఁచుచుండు నని తాత్పర్యము.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥ ౨౮

టీక. మహాబాహో = అధికమైన భుజబలము కల యోయర్జునుఁడా! గుణకర్మ విభాగయోః = వాగాదీంద్రియ విభాగముయొక్కయు, వచన దానాది క్రియావిభాగము యొక్కయు, తత్త్వవిత్తు = వాస్తవమును తెలిసినవాఁ డైతే, గుణాః = ఇంద్రియములు, గుణేషు = విషయముల యందు, వర్తంతే = ప్రవర్తించుచున్నవి. ఇతి = ఇట్లని, మత్వా = తలఁచిన, సజ్జతే = కర్తృత్వాభిమానము కలవాఁడు కాఁడు.

అధికమైన భుజబలముకల యోయర్జునుఁడా! ఇవి కర్మేంద్రియము లనియును, ఇవి జ్ఞానేంద్రియము లనియును, ఇవి కర్మేంద్రియములయొక్క కార్యము లనియును, ఇవి జ్ఞానేంద్రియముల యొక్క కార్యము లని

యును, తెలిసికొనినవాఁడు ఇంద్రియములు విషయములయందు ప్రవర్తించు చున్నవని తలఁచి తాను కర్తృత్వాభిమానమును పొందఁడు. అనఁగా కూటస్థుఁడును, అసంగుఁడును, చిద్రూపుఁడును అగు బ్రహ్మను నేనని యును, నేను ఏ కర్మమును చేయువాఁడను కానని యును తలఁచి బ్రహ్మ రూపుఁడై యుండు నని తాత్పర్యము.

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు ॥
తానకృత్స్నవిదోమందాన్కృత్స్నవిన్నవిచాలయేత్ ॥

టీక. ప్రకృతే = మాయయొక్క, గుణ = గుణములచేత, (అనఁగా) దేహము, ఇంద్రియములు మొదలుగాఁగల వికారములచేత, సమ్మూఢాః = మూఢులైనవారు (అనఁగా దేహేంద్రియాదులే మే మని తలఁచువారు), యే = ఎవరు, గుణకర్మసు = దేహేంద్రియాదులయొక్క వ్యాపారములయందు, సజ్జంతే = ఆసక్తికలవారగుచున్నారో, మందాన్ = మూఢులును, అకృత్స్నవిదః = సర్వమును తెలియనివారును, (అయిన) తాన్ = అట్టి కర్మఠులను, కృత్స్నవిత్ = సర్వమును తెలిసిన బ్రహ్మవేత్త, నవిచాలయేత్ = కర్మభ్రష్టులనుగాఁ జేయఁగూడదు.

మాయయొక్క గుణములచేత ననఁగా దేహేంద్రియాది వికారములచేత మూఢులైనవారును, అనఁగా దేహేంద్రియాదులే మే మని తలఁచువారును, దేహేంద్రియాదులయొక్క వ్యాపారములయందాసక్తి కలవారును, సర్వమును తెలియనివారును, మూఢులును అయిన కర్మఠులను, సర్వమును తెలిసిన బ్రహ్మవేత్త కర్మములయందాసక్తి లేనివారినిగాఁ జేయఁ గూడ దని తాత్పర్యము.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వవిగతజ్వరః॥ 30

టీక. సర్వాణి = సమస్తములైన, కర్మాణి = కర్మములను, మయి = (పరమేశ్వరుఁడనైన) నాయందు, సన్న్యస్య = సమర్పించి, అధ్యాత్మచేతసా = వివేకబుద్ధిచేత, నిరాశీః = ఆశ లేనివాఁడవును, నిర్మమః = మమకారము లేనివాఁడవును, భూత్వా = అయి, విగతజ్వరః = పోయిన సంతాపము కలవాఁడ వగుచు, యుధ్యస్వ = యుద్ధమును చేయుము.

ఓ అర్జునుఁడా! సకలకర్మములను నాయందు సమర్పించి వివేకబుద్ధిచేత (నేను కర్తను, ఈశ్వరునికొఱకు భృత్యునివలె కర్మమును చేయుచున్నాననియెడు తలంపుచేత) నిష్కాముఁడవును, మమకారము లేనివాఁడవును అయి సంతాపరహితుఁడవై యుద్ధమును జేయుమని తాత్పర్యము.

శ్లో॥ యే మే మతమిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపికర్మభిః॥ 31

టీక. యే = ఏ, మానవాః = మనుష్యులు, శ్రద్ధావన్తః = (నామాటయందు) నమ్మకము కలవారును, అనసూయన్తః = అసూయ లేనివారునగుచు, మే = నాయొక్క, ఇదమ్ = ఈ, (అనఁగా ముందు చెప్పఁబడిన) మతమ్ = అభిప్రాయమును, నిత్యమ్ = ఎల్లప్పుడును. అనుతిష్ఠన్తి = అనుసరించు చున్నారో, తేఽపి = వారుగూడ, కర్మభిః = పుణ్యపాప రూప కర్మములచేత, ముచ్యన్తే = విడువఁబడుచున్నారు.

ఫలమును గోరక కర్మములను ఈశ్వరప్రీతికై చేయవలయును, అని యిదివఱకు నేను చెప్పిన ప్రకారముగా నామాటను నమ్మి లేనిదోషమును నామాటయందు దారోపింపక యెల్లప్పుడును కర్మములను యీశ్వరార్పణముగాఁ జేయువారుకూడ జ్ఞానులవలె పుణ్యపాపరూపములైన కర్మములవలనఁ గలుగునట్టి జననమరణ ప్రవాహమనెడి బంధమును విడుచుచున్నారని తా.

శ్లో॥ యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః॥ 32

టీక. యేతు = ఎవరైతే, ఏతత్ = ఈపూర్వోక్తమైన, మే = నా యొక్క, మతమ్ = అభిప్రాయమును, అభ్యసూయన్తః = నిందించుచు నానుతిష్ఠన్తి = అనుసరింపరో, సర్వజ్ఞానవిమూఢాన్ = సకల నిర్గుణ విషయకములైన సమస్త జ్ఞానములయందును మూఢులైన, తాన్ = వారిని, నష్టాన్ = చెడిపోయినవారినిగా, విద్ధి = తెలిసికొనుము.

నేను ముందుఁ జెప్పిన ప్రకారముగా ఫలమును గోరక యీశ్వరార్పణముగా యెవరు కర్మములను జేయక నామతమును నిందింతురో వారు; సగుణోపాసన యిట్టిది, నిర్గుణోపాసన యిట్టిది అని తెలిసికొనలేక బహువిధములుగా అజ్ఞానులై చెడిపోవుదు రని తెలిసికొమ్మని అర్జునునితో శ్రీకృష్ణుఁడు చెప్పె నని తాత్పర్యము.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33

టీక. జ్ఞానవానపి = సదసద్విభాగజ్ఞానము కలవాఁడైనప్పటికిని, స్వస్యాః = స్వకీయమైన, ప్రకృతేః = జన్మాంతరసంస్కారమునకు, సదృశమ్ = అనుగుణముగా, చేష్టతే = సంచరించుచున్నాఁడు; భూతాని = సకలప్రాణులును, ప్రకృతిమ్ = జన్మాంతర సంస్కారమును, యాంతి = పొందుచున్నారు, (తతః = అందువలన) నిగ్రహః = ఇంద్రియజయమును, (లేక) నా యాజ్ఞయును, కింకరిష్యతి = ఏమి చేయఁగలదు.

ఓ అర్జునుఁడా! సదసద్వివేకము కలవాఁడైనప్పటికిని తనయొక్క జన్మాంతర సంస్కారమునకు; అనఁగా, పూర్వజన్మమునందు చేసిన ధర్మాధర్మములవలన పుట్టినదియును, ఈ జన్మమునందు ఫలము నిచ్చుటకుఁగా అభివ్యక్తమైనదియును, అయిన సంస్కారమునకు దగినట్లుగా సంచరించుచున్నాఁడు. కావున సకలభూతములును, తమ తమ పూర్వజన్మమునందలి కర్మానుసారముగ సంచరించుచున్నారు. కాఁబట్టి, ఇంద్రియనిగ్రహము

కాని, విధినిషేధరూప మైన నాయాజ్ఞ కాని యేమి చేయఁగలదు. ఏమి యును చేయఁ జాల దని తాత్పర్యము.

శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 34

టీక. రాగద్వేషౌ = ఇష్టవస్తువునందలి ప్రీతియును, అనిష్టవస్తువు నందలి ద్వేషమును, ఇన్ద్రియస్యేన్ద్రియస్య = ప్రతీంద్రియముయొక్కయును, అర్థే = శబ్దాదివిషయములయందు, వ్యవస్థితౌ = ఉన్నవి, (కావున) హి = ఏకారణమువలన, తౌ = ఆ రాగద్వేషములు, అస్య = ఈ పురుషునికి, (అనఁగా, మోక్షమును గోరువానికి) పరిపన్థినౌ = (మేలును పోఁగొట్టునవి యగుటచేత) శత్రువులో, (తత్ = ఆ కారణమువలన) తయోః = ఆ రాగద్వేషములకు, వశమ్ = అధీనత్వము, నాఽఽగచ్ఛేత్ = పొందఁగూడదు.

లోకమందు వేదాంతశాస్త్రజ్ఞానము సద్గురూపదేశమును లేనివాఁడు యెవఁడైనను, వేదదేవతానిందను జేసినప్పుడు, ఆ దూషణము శాస్త్రనిషిద్ధ మైనను, అది తన కనుకూల మని తోఁచినందున, అదే సరి యని ఆదూషణ మును (శబ్దమును) ఆనందముగా వినుచున్నాఁడు, వేదాంతముల కర్థమును చెప్పుచున్నచోటికి అతాత్తుగా తాను పోయియు ఆ వేదాంతార్థమును వినుట శాస్త్రవిహిత మైనను తనకు ప్రతికూల మని తోఁచినందున ఆ వేదాం తార్థమును (శబ్దమును) వినుటయందు ప్రీతి లేనివాఁ డగుచున్నాఁడు. ఇట్లు శాస్త్ర నియమమును వదలి పూర్వ జన్మసంస్కారమును అనుసరించి తన కనుకూల మని తోఁచినయెడల శాస్త్రనిషిద్ధము లైనను, శబ్దాది విషయ ములయందు ప్రీతి గలవాఁడును, తనకు ప్రతికూల మని తోఁచినయెడల శాస్త్రవిహితము లైనను శబ్దాదులయందు ద్వేషము గలవాఁడును అగుచు న్నాఁడు. ఇష్టానుసారముగా ప్రవర్తించునట్టి రాగద్వేషములు మోక్షమును చెఱుచునవి గనుక పురుషునకు శత్రువులు. అట్టి శత్రువు లైన రాగద్వేష

మునకు అధీనుఁడు కాక జితేంద్రియుఁడై శాస్త్రాచార్యోపదిష్ట మార్గమును ననుసరించి యుండవలయు నని తాత్పర్యము.

శ్లో॥ శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ ౩౫

టీక. స్వనుష్ఠితాత్ = చక్కఁగా నాచరింపఁబడిన, పరధర్మాత్ = ఇతర వర్ణాశ్రమములకుఁ దగిన ధర్మముకంటెను, విగుణః = గుణము లేనిదైనను, స్వధర్మః = తనదు వర్ణాశ్రమములకుఁ దగిన ధర్మము, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది. స్వధర్మే = తనయొక్క వర్ణాశ్రమములకుఁ దగిన ధర్మమునందు, నిధనమ్ = మరణము, శ్రేయః = ఉత్తమము. పరధర్మః = ఇతర వర్ణాశ్రమ ములకుఁ దగిన ధర్మము, భయావహః = (నరకపాతాదులచేత) భయమును కలిగించు నట్టిది.

ఓ యర్జునుఁడా! ఇతరవర్ణాశ్రమములకుఁ దగిన ధర్మమును యే లోపమును లేకుండ ఆచరించుటవలనఁ గలుగునట్టి ఫలముకంటె తనయొక్క వర్ణాశ్రమములకుఁ దగిన ధర్మము కొంచెము లోపము కలదైనప్పటికిని యెక్కువ ఫలమును కలుగఁజేయును. కావున తనయొక్క వర్ణాశ్రమములకుఁ దగిన ధర్మమునయందున్నవానికి మరణము కలిగినను నరకపాతము లేదు. కనుక స్వధర్మము శ్రేష్ఠమైన దనియును, పరధర్మము నవలంబించి బ్రతికి యున్నను స్వధర్మమును వదలుకొనిన దోషముచేత నరకపాతము కలుగును గనుక పరమ ధర్మము శ్రేష్ఠము కా దనియును తాత్పర్యము.

అర్జున ఉవాచ —

శ్లో॥ అథ కేన ప్రయుక్తో౽యం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ ౩౬

టీక. అర్జునఉవాచ = అర్జునుఁడు అడుగుచున్నాఁడు. హే వార్ష్ణేయ = ఓ కృష్ణుఁడా! అథ = అయితే, అయమ్ = ఈ, పూరుషః = పురు

ష్ణుఁడు, అనిచ్ఛన్నపి = ఇచ్ఛ లేనివాఁ డైనప్పటికిని, బలాత్ = బలాత్కారముగా, నియోజితఇవ — నియమింపఁబడినవాఁడువలెనే, కేన — దేనిచేత, ప్రయుక్తః = ప్రేరేపింపఁబడినవాఁడై, పాపమ్ = పాపమును, చరతి = ఆచరించుచున్నాఁడు.

ఓ కృష్ణుఁడా! అయితే, లోకములోని ప్రతిమానవుఁడును పాపమును చేయవలయు ననియెడు కోర్కె లేనివాఁడై యుండియును, బలాత్కారముగా రాజుచేతఁ బ్రేరేపింపఁబడినవారివలెఁ బాపమును చేయుచున్నాఁడు గదా! ఏమి కారణముచేత నిట్లు చేయుచున్నాఁడు? అని తాత్పర్యము.

శ్రీభగవానువాచ:—

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 37

టీక. శ్రీభగవానువాచ = భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. ఏషః = ఇప్పుడు నీచేత నడుగఁబడిన హేతువు, రజోగుణసముద్భవః = రజోగుణము కారణముగాఁ గల, కామః = కామము, ఏవ ఏష — ఈ కామమే, క్రోధః = (ఒకానొకనిచేతఁ గొట్టఁబడినదై క్రోధరూపముగా), (పరిణమతే = పరిణమించుచున్నది). (మఱియును) ఏషః = ఈ కామము, మహాశనః = అధికమైన భక్షణము కలది. మహాపాప్మా = అధికమైన పాపమే స్వరూపముగాఁ గలది. (కావున) ఏనమ్ = ఈ కామమును, ఇహ = ఈ మోక్షమార్గమునందు, (లేక) సంసారమునందుండి మోక్షమును గోరువానికి, వైరిణమ్ = శత్రువునుగా, విద్ధి = తెలిసికొనుము.

ఓ అర్జునుఁడా! కోర్కె లేనివానిచేతఁ గూడ బలాత్కారముగా పాపమును జేయించునట్టి రజోగుణమువలనఁ బుట్టిన కామము, మఱియును, ఇట్టి కామమే ఒకానొకదానిచేత కొట్టఁబడినదై క్రోధరూపముగాఁ బరిణమించుచున్నది. మఱియును, ఈ కామము మిక్కిలి పాపస్వరూపమైనదియును, అధికమైన భక్షణము కలదియును అయియున్నది. కావున యీ

కామమును, మోక్షమార్గమునందు (లేక) సంసారమునందు వుండి మోక్షమును గోరువానికి శత్రువునుగాఁ దెలిసికొను మని తాత్పర్యము.

శ్లో॥ ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥

టీక. యథా = ఏప్రకారముగా, ధూమేన = (సహజమైన) పొగచేత, వహ్నిః=అగ్ని, ఆవ్రియతే=కప్పఁబడుచున్నదో; యథా=ఏప్రకారముగా, మలేన = మాలిన్యముచేత, ఆదర్శశ్చ = అద్దమును, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథా = ఏ ప్రకారముగా, ఉల్బేన = మావిచేత, గర్భః = గర్భము, ఆవృతః = కప్పఁబడునో, తథా = ఆప్రకారముగా, తేన=ఆ కామముచేత, ఇదమ్=ఈజ్ఞానము, ఆవృతమ్ = కప్పఁబడెను.

ఓ అర్జునుఁడా! సహజమైన పొగచేత నగ్నియును, మాలిన్యముచేత అద్దమును, మావిచేత గర్భమును, (కడుపులోని శిశువును) ఆవరింపఁబడినట్లు కామముచేత (కోర్కెచేత) జ్ఞాన మావరింపఁబడె నని తాత్పర్యము.

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥ 39

టీక. హేకౌంతేయ= ఓ అర్జునుఁడా! దుష్పూరేణ = దుఃఖముచేత నిండింపఁ దగినదియును, అనలేన = తృప్తిలేనిదియును, కామరూపేణ = ఇచ్ఛారూపమైనదియును, జ్ఞానినః = జ్ఞానికి, నిత్యవైరిణా = సర్వకాలములయందును శత్రువును (అయిన), ఏతేన = ఈ కామముచేత, జ్ఞానమ్ = జ్ఞానము, ఆవృతమ్ = కప్పఁబడెను.

ఓ అర్జునుఁడా! దుఃఖముచేత నిండింపఁదగినదియును, తృప్తి లేనిదియును, ఇచ్ఛారూపమైనదియును, జ్ఞానికి సర్వకాలములయందును శత్రువైనదియును అయిన కామముచేత జ్ఞానము ఆవరింపఁబడె నని తాత్పర్యము.

శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥

టీక. ఇంద్రియాణి = ఇంద్రియములును, మనః = మనస్సును, బుద్ధిః = బుద్ధియును, అస్య = ఈ కామమునకు, అధిష్ఠానమ్ = ఆశ్రయము, (ఇతి = ఇట్లని), ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఏషః = ఈ కామము, ఏతైః = ఈ యింద్రియములచేత, జ్ఞానమ్ = జ్ఞానమును, ఆవృత్య = కప్పి, దేహినమ్ = దేహాభిమానము కల మానవుని, విమోహయతి = నానావిధములుగా మోహింపఁ జేయుచున్నది.

ఇంద్రియములును, మనస్సును, బుద్ధియును యీ కామమునకు ఆశ్రయమని చెప్పఁబడును; ఈ కామము యీ యింద్రియములచేత జ్ఞానమును కప్పి (దేహాభిమానము కల మానవుని దేహమే నేనని తలఁచువానిని) నానావిధములుగా మోహపెట్టుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥౪౧॥

టీక. హే భరతర్షభ = ఓ అర్జునుఁడా! హి = ఏకారణమువలన, కామః = (ఇంద్రియ మనోబుద్ధులు ఆధారముగాఁ గల) కామము, విమోహయతి = మోహపెట్టుచున్నదో, తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, ఆదౌ = మొదట, ఇంద్రియాణి = ఇంద్రియములను, నియమ్య = నిగ్రహించి, జ్ఞానవిజ్ఞాననాశనమ్ = ఆత్మజ్ఞానమును, (పరోక్షజ్ఞానమును) అనుభవ జన్యజ్ఞానమును, (అపరోక్షజ్ఞానమును) నశింపఁజేయునదియును, పాప్మానమ్ = పాపాచారములు కలదియును, (అయిన) ఏనమ్ = ఈ కామమును, ప్రజహి = లెస్సగా విడువుము.

ఓ యర్జునుఁడా! ఏ కారణమువలన యింద్రియ మనోబుద్ధులు ఆధారముగాఁ గల కామమును మోహపెట్టుచున్నదో, ఆ కారణమువలన నీవు.

ముందుగా పంచేంద్రియములను నిగ్రహించి ఆత్మజ్ఞానమును, ఆత్మానుభవము వలనఁ గలిగిన జ్ఞానమును, (అనఁగా పరోక్షాపరోక్షజ్ఞానములను) నశింపఁ జేయునదియును, పాపాచారములు గలదియును అయిన యీ కామమును శీఘ్రముగా విడిచిపెట్టుమని తాత్పర్యము.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥ ౪౨

టీక. (పండితాః = జ్ఞాననిష్ఠులు), ఇంద్రియాణి = చెవులు మొదలైన యింద్రియములను, పరాణి = (దేహాదులకంటె) శ్రేష్ఠములైనవి, (ఇతి = ఇట్లని) ఆహుః = చెప్పుచున్నారు. తథా = ఆప్రకారముగానే, మనః = మనస్సు, ఇంద్రియేభ్యః = ఇంద్రియములకంటె, పరమ్ = ఉత్కృష్టమైనది, (ఇతి = ఇట్లని) ఆహుః = చెప్పుచున్నారు. మనసస్తు = మనస్సుకంటె, బుద్ధిః = బుద్ధి, పరా = శ్రేష్ఠమైనది, (ఇతి = ఇట్లని) ఆహుః = చెప్పుచున్నారు. యస్తు = ఏయాత్మయైతే, బుద్ధేః = బుద్ధికంటె, పరతః = శ్రేష్ఠమైనదో, సః = ఆ యాత్మ, పరః = (అన్నిటికంటె) శ్రేష్ఠమైనది, (ఇతి = ఇట్లని) ఆహుః = చెప్పుచున్నారు.

ఓ అర్జునుఁడా! పండితులు చెవులు మొదలైన యింద్రియములను దేహాదులకంటె శ్రేష్ఠము అయిన వనియును, ఆప్రకారముగానే మనస్సు యింద్రియములకంటె శ్రేష్ఠమైనదియును, మనస్సుకంటె బుద్ధి యుత్తమమైన దనియును, బుద్ధికంటె మఱియును అన్నిటికంటెను, ఆత్మ యుత్తమమైన దనియును చెప్పుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ ఏవంబుద్ధేఃపరంబుద్ధ్వా సంస్తభ్యాఽత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

టీక. హే మహాబాహో = ఓ అర్జునుఁడా! ఏవమ్ = ఈ ప్రకారముగా, బుద్ధేః = బుద్ధికంటె, పరమ్ = వ్యతిరిక్తుఁ డయిన, ఆత్మానమ్ =

ఆత్మను, జ్ఞాత్వా = ఎఱింగి, ఆత్మనా = (పరిశుద్ధమైన) మనస్సుచేత, ఆత్మానమ్ = మనస్సును, సంస్తభ్య = లెస్సగా నిగ్రహించి, దురాసదమ్ = దుఃఖముచేతఁ బొందఁదగనిదియును, కామరూపమ్ = కామస్వరూపమైనదియును, (అయిన) శత్రుమ్ = శత్రువును, జహి = చంపుము.

తా॥ అర్జునుఁడా! ఈ విధముగా బుద్ధికంటె వ్యతిరిక్తుఁడైన పరమాత్మను తెలిసికొని (సాక్షాత్కారము చేసికొని) పరిశుద్ధమైన మనస్సుచేత మనస్సును లెస్సగా నిగ్రహించి దుఃఖముచేఁ బొందఁదగనిదియును, కామస్వరూపమైనదియును అగు శత్రువును చంపుమని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః.

టీ॥ వైయ్యాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యామ్ = లక్షశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రము (అయిన) శ్రీమహాభారతే = సంస్కారమైన మహాభారత గ్రంథమందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = ఉపనిషత్తులయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంభాషణరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానముసంబంధము, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞాన విషయ శోపాయములను చెప్పునట్టి యోగశాస్త్రమునందు) కర్మయోగో నామ = కర్మయోగ మను పేరు గల, తృతీయః = మూఁడవదైన, అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరు వేలశ్లోకములు గలదియును, శాస్త్రమును (అయిన) మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునలయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు కర్మయోగమును దెలుపునట్టి మూఁడవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీ వాసుదేవార్పణ మస్తు.

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత - చతుర్థాధ్యాయము.

## ఆంధ్రటీకా తాత్పర్యసహితము.

## జ్ఞానయోగము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వా న్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧

టీక. శ్రీభగవానువాచ = సంపత్కరుఁడైన కృష్ణుఁడు చెప్పెను. అవ్యయమ్ = నాశనము లేనిదియును, ఇమమ్ = రెండు మూఁడు అధ్యాయములచేతఁ జెప్పఁబడినదియును, (అయిన) ఈ, యోగమ్ = యోగమును, (పురా = సృష్ట్యాదియందు) వివస్వతే = సూర్యునికొఱకు, ప్రోక్తవాన్ = చెప్పినవాఁడను, (అస్మి = అయితిని). వివస్వాన్ = సూర్యుఁడు, మనవే = మనువుకొఱకు, ప్రాహ = విశేషముగాఁ జెప్పెను. మనుః = మనువు, ఇక్ష్వాకవే = ఇక్ష్వాకునికొఱకు, అబ్రవీత్ = చెప్పెను.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓీ అర్జునుఁడా! నాశము లేనిదియును, రెండు మూఁడు అధ్యాయములచేతఁ జెప్పఁబడినదియును అయినయీ యోగమును, అనఁగా కర్మయోగోపాయముచేతఁబొందఁదగినదియును, జ్ఞాననిష్ఠయే స్వరూపముగాఁ గలదియును నగు యోగమును,

సృష్ట్యాదియందు సూర్యునికొఱకు ఉపదేశించితిని. ఆసూర్యుఁడు శ్రాద్ధదేవుఁడను మనువున కుపదేశించెను. ఆ మనువు తన పుత్రుఁడైన యిక్ష్వాకు మహారాజున కుపదేశించె నని తాత్పర్యము.

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప॥ 2

టీక. హే పరంతప = శత్రువులను తపింపఁజేయునట్టి యో యర్జునుఁడా! రాజర్షయః = రాజశ్రేష్ఠు లగు నిమిచక్రవర్తి మొదలగువారు, ఏవమ్ = ఈ ప్రకారముగా, ప్రాప్తమ్ = పొందఁబడిన, (అనఁగా పారంపర్య క్రమముచేతఁ బొందఁబడిన) ఇమమ్ = ఈ యోగమును, విదుః = ఎఱుఁగుదురు. సః = అటువంటి, యోగః = యోగము, మహతా = దీర్ఘమైన, కాలేన = కాలముచేత, ఇహ = ఈ కాలమునందు, నష్టః = నశించినది, (అభవత్ = అయెను).

శత్రువులను తపింపఁజేయునట్టి యో యర్జునుఁడా! ఇట్లు పరంపరా ప్రాప్తమైనదియును, కర్మజ్ఞాననిష్ఠారూపమును అయిన యీ యోగమును ఇక్ష్వాకు మొదలుగాఁగలవారివలన నిమిచక్రవర్తి మొదలుగాఁగల రాజశ్రేష్ఠులు తెలిసికొనిరి. ఇట్లు పరంపరాప్రాప్తమైనదియు నెఱుఁగఁబడిన ఈ యోగము, చిరకాలముచేత చెప్పువారు లేనందున నశించుటవలన యిప్పుడు నశించెనని తాత్పర్యము.

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥ 3

టీక. పురాతనః = పూర్వమునం దున్నదియును, సః = విచ్ఛిన్న సంప్రదాయము గలదియును అగు; అయమ్ = ఈ, యోగ ఏవ = యోగమే, త్వమ్ = నీవు, భక్తః = భక్తుఁడవు, సఖా చ = స్నేహితుఁడవును, (అసి = అయితివి) ఇతి = ఇట్లని, తే = నీకొఱకు, మయా = నాచేత, అద్య = ఇప్పుడు, ప్రోక్తః = చెప్పఁబడెను. హి = ఏకారణమువలన, ఏతత్ =

ఈ యోగము (జ్ఞానము), ఉత్తమమ్ = శ్రేష్ఠ మైనదో, (తస్మాత్ = ఆకారణమువలన) రహస్యమ్ = గోప్య మైనది.

ఓ అర్జునుఁడా! నీవు నాకు భక్తుఁడవును, స్నేహితుఁడవును, (సమానవయస్కుఁడవును, సహాయుఁడవును) అగుటచేత పూర్వము నందే యున్నదియును, మధ్యకాలమునందు విచ్ఛిన్నమైన సంప్రదాయము గలదియును అయిన యీ యోగము నీకుఁ జెప్పఁబడినది. ఈ యోగము (జ్ఞానము) శ్రేష్ఠమైనది కనుక గోప్య మైన దని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవా నితి॥ ౪

టీక. అర్జున ఉవాచ=అర్జునుఁడు అడిగెను. [illegible] పుట్టువు, అపరమ్ = ఇప్పుడు, వివస్వతః = సూర్యునియొక్క [illegible] = పుట్టువు, [illegible] = మునుపు, ఆదౌ=సర్గాదియందు, త్వమ్=నీవు, ప్రోక్తవాన్ ఇతి = చెప్పినవాఁడవైతి వనుమాట రీతి కలదో, ఏతత్ = ఈ మాటను, కథమ్ — ఎట్లు, విజానీయామ్ = తెలియుదును.

అర్జునుఁడు [illegible] — ఓ కృష్ణుఁడా! [illegible] కృష్ణ [illegible] ఇట్లు నీవు ఇప్పుడు జన్మించినవాఁడవు [illegible] సూర్యునకు చెప్పితి నని చెప్పినమాటను నే నెట్లు నమ్ముదు నని తాత్పర్యము.

శ్రీభగవానువాచ —

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప॥ ౫

టీక. శ్రీభగవాన్ ఉవాచ=శ్రీకృష్ణమూర్తి చెప్పెను. హే అర్జున= ఓ అర్జునుఁడా! మే చ = నాకును, తవ చ=నీకును, బహూని = అనేకము

లైన, జన్మాని = జన్మములు, వ్యతీతాని = అతిక్రమించినవి, సర్వాణి = సమస్తము లయిన, తాని=ఆ జన్మములను, అహమ్= నేను, వేద = ఎఱుంగుదును. హే పరంతప = ఓ. అర్జునుఁడా! త్వమ్=నీవు, న వేత్థ=ఎఱుఁగవు.

శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి చెప్పుచున్నాఁడు.—ఓ అర్జునుఁడా! నాకును, నీకును, అనేకము లైన జన్మములు గతించినవి. సమస్తము లయిన యా జన్మములను నేను గుర్తెఱుంగుదును. ఓ. అర్జునుఁడా! నీ వెఱుంగవని తా.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥

టీక. అహమ్ = నేను, అజోఽపి సన్ = పుట్టువు లేనివాఁడ నైనను, అవ్యయాత్మాఽపి సన్=నాశరహిత మైన స్వభావము కలవాఁడ నై, భూతానామ్=బ్రహ్మాది సమస్తభూతములకు, ఈశ్వరోఽపి సన్ = నియామకుఁ డైన వాఁడ నై, స్వామ్ = స్వకీయ మైన, ప్రకృతిమ్ = (త్రిగుణాత్మక మైన) మాయను, అధిష్ఠాయ = స్వాధీనముగాఁ జేసికొని, ఆత్మమాయయా= నా మాయచేత, సంభవామి = పుట్టుచున్నాను.

నేను పుట్టువు లేనివాఁడను, నాశరహిత మైన స్వభావము కలవాఁడను, బ్రహ్మాది సమస్తభూతములకును నియామకుఁడను అయి నాసంబంధ మైనదియును, త్రిగుణాత్మక మైనదియును అయిన మాయను అవలంభించి నా మాయచేత నేను పుట్టుచున్నానని తాత్పర్యము.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

టీక. హే భారత=భరతకులమునందుఁ బుట్టిన యో యర్జునుఁడా! యదా యదా=ఎప్పుడెప్పుడు, ధర్మస్య=వర్ణాశ్రమాది ధర్మమునకు, గ్లానిః= హాని, భవతి = అగుచున్నదో; అధర్మస్య = అధర్మమునకు, అభ్యుత్థానమ్=ఉత్పత్తి, భవతి=అగుచున్నదో; తదా తదా=అప్పుడప్పుడు, ఆత్మ

నమ్ = (నిగ్రహానుగ్రహసామర్థ్య మైన) దేహమును, (మాయయా=మాయ చేత) అహమ్ = నేను, సృజామిహి=సృజించుచున్నానుగదా!

భరతకులమునందుఁబుట్టినయో యర్జునుఁడా! ఎప్పుడెప్పుడు బ్రాహ్మ ణాదివర్ణముల వారిచేతను, బ్రహ్మచర్యాద్యాశ్రమముల చేతను, ఆ బ్రాహ్మ ణాదులకును ఆశ్రమాదులకును తగినయాచారములచేతను తెలియఁదగినది యును, వేదోక్తమును అయిన ధర్మమునకు నాశము సంభవించునో; (మఱి యును, వేదనిషిద్ధ మైన యధర్మము ఎప్పుడెప్పుడు అభివృద్ధిని పొందునో; ఎప్పుడెప్పుడు (అటువంటి సమయములందు) ధర్మాధర్మముల యొక్కయు, ధర్మాధర్మకర్తలైనవారి యొక్కయు, నిగ్రహానుగ్రహములకుఁ దగిన శరీ రమును సర్వలోకనియామకుఁడ నైన నేను నామాయచేత సృజించు చున్నానని తాత్పర్యము.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥　　౮

టీక. సాధూనామ్=సన్మార్గప్రవర్తకులయొక్క, పరిత్రాణాయ= రక్షణకొఱకును, దుష్కృతామ్ = పాపాత్ములయొక్క, వినాశాయచ = నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ = ధర్మమును నిలుపుటకొఱకును, యుగేయుగే=ప్రతియుగమునందును, సంభవామి = పుట్టుచున్నాఁడను.

ఓ యర్జునుఁడా! తాము సన్మార్గమునందు ప్రవర్తింపఁ జేయునట్టి సజ్జ నులను కాపాడుటకొఱకును, తాము పాపకార్యములను చేయుచు లోకుల చేతఁగూడ పాపకార్యములను చేయించునట్టి దుష్టులనునశింపఁజేయుటకొఱ కును, శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడిన ధర్మమును చెడకుండఁగ గాపా డుట కొఱకును, ప్రతియుగమునందును పుట్టుచున్నాఁడనని తాత్పర్యము.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥　౯

ఓ అర్జునుఁడా! మానవలోకమునందు కర్మములవలనఁగలుగునట్టిసిద్ధి శీఘ్రముగా అగుచున్నది. కనుక మానవులందఱును కర్మములసిద్ధిని గోరుచున్నవారలై యీలోకమునందు యింద్రుఁడు మొదలుగాఁగల దేవతలను సేవించుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥ ౧౩

టీక. మయా=నాచేత, చాతుర్వర్ణ్యమ్=బ్రాహ్మణక్షత్రియాది వర్ణచతుష్టయము, గుణకర్మవిభాగశః=సత్త్వాదిగుణములయొక్కయు, తపశ్శమదమాది కర్మములయొక్కయు, విభాగముచేత సృష్టమ్=సృజింపఁబడెను. తస్య=ఆ సృష్టికర్మమునకు, కర్తారమపి=కర్తనైనప్పటికిని, మామ్=నన్ను, అకర్తారమ్=కర్తను గానివానిని గాను, అవ్యయమ్=నాశములేనివానిని గాను, విద్ధి=తెలిసికొనుము.

ఓ అర్జునుఁడా! బ్రాహ్మణక్షత్రియాదివర్ణచతుష్టయము సత్త్వాదిగుణముల యొక్కయు, తపశ్శమదమాది కర్మములయొక్కయు విభాగముచేత సృజింపబడినది. మఱియు నో యర్జునుఁడా! అటువంటిసృష్టికి నేను కర్తనైనప్పటికిని నన్ను కర్తను గానివానినిగా దెలిసికొనుమని తాత్పర్యము.

శ్లో॥ న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలేస్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥౧౪

టీక. కర్మాణి=సృష్ట్యాదికర్మములు, మామ్=నన్ను, నలింపంతి=అంటవు. మే=నాకు, కర్మఫలే=కర్మఫలమునందు, స్పృహా=ఇచ్ఛ, న=లేదు. ఇతి=ఇట్లని, మామ్=నన్ను, యః=ఎవ్వఁడు, అభిజానాతి=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, కర్మభిః=కర్మములచేత, నబధ్యతే=కట్టఁబడఁడు.

ఓ అర్జునుఁడా! సృష్ట్యాదికర్మములు నన్ను అంటవు. నాకు కర్మఫలమునం దభిలాష లేదు. ఇట్లని నన్ను యెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు కర్మములచేత కట్టఁబడఁడు (బద్ధుఁడు కాఁడు) అని తాత్పర్యము.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్॥

టీక. ఏవమ్=ఈప్రకారముగా, జ్ఞాత్వా=తెలిసి, పూర్వైః=ప్రాచీనులయిన, ముముక్షుభిరపి=మోక్షాపేక్ష కలవారిచేతఁగూడ, (లేక) పరులకు మోక్షమును కలుగఁజేయునట్టి వారిచేతఁగూడ, కర్మ=కర్మము, కృతమ్=చేయఁబడెను. తస్మాత్=ఆ కారణమువలన, త్వమ్=నీవు, పూర్వైః=ప్రాచీనులైన జనకాదులచేత, కృతమ్=చేయఁబడినదియును, పూర్వతరమ్=ప్రాచీనమైనదియును, (అయిన) కర్మైవ=కర్మమునే, కురు=చేయుము.

ఓ అర్జునుఁడా! నేను కర్తను గాననియును, నాకు కర్మఫలమునందు అభిలాష లేదనియును తెలిసికొని ప్రాచీనులయిన ముముక్షువుల చేతఁగూడ (లేక) పరులకు మోక్షమును కలుగఁజేయువారలయిన నని మోక్షము తలఁపు కలవారిచేతఁగూడ కర్మము చేయఁబడినది. కాఁబట్టి నీవు ప్రాచీనులైన జనకాదులచేతఁ జేయఁబడినదియును, ప్రాచీనమైనదియును అయిన కర్మమునే చేయుమని తాత్పర్యము.

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

టీక. కర్మ=కర్మము, కిమ్=ఎట్టిది, అకర్మ=అకర్మము, కిమ్=ఎట్టిది, ఇతి=ఇట్లని, అత్ర=ఈ కర్మాకర్మముల విషయమై, కవయోఽపి=బుద్ధిమంతులుఁగూడ, మోహితాః=మోహమును చెందినవారు, (అతః=ఇందు

వలన) తే=నీకొఱకు, తత్=ఆ, కర్మ=కర్మమును, అకర్మ=అకర్మమును, ప్రవక్ష్యామి=చక్కఁగా చెప్పఁగలను. యత్=ఏ కర్మాకర్మములను, జ్ఞాత్వా=తెలిసి, అశుభాత్=దుఃఖకరమైన సంసారమువలన, మోక్ష్యసే=విడువఁగలవో.

ఓ అర్జునుఁడా! కర్మమనఁగా నెట్టిదో, అకర్మము, (కర్మాభావము) అనఁగా, ఎట్టిదో తెలియఁజాలక యీ కర్మాకర్మముల విషయమై బుద్ధిమంతులు గూడ మోహమును చెందిరి, కాఁబట్టి ఏ కర్మాకర్మములను తెలిసి దుఃఖకరమైన సంసారమువలన(జననమరణదుఃఖ ప్రవాహమువలన)విడువఁగలవో (అనఁగా) ముక్తుఁడ వగుదువో, అటువంటి కర్మాకర్మములను నీకొఱకు చక్కఁగా జెప్పెదనని తాత్పర్యము.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్య గహనా కర్మణో గతిః॥ ౧౭

టీక. యతః=ఏ కారణమువలన, కర్మణః=కర్మాకర్మ వికర్మముల యొక్క, గతిః=యథార్థగతి, గహనా=తెలియశక్యము కానిదో, (తస్మాత్=అందువలన) కర్మణః=శాస్త్రవిహితమైన కర్మముయొక్క, (తత్త్వమ్=యాథార్థ్యము) బోద్ధవ్యమ్=తెలియఁదగినది, (అస్తి=ఉన్నది.) అకర్మణశ్చ=అకర్మముయొక్క, (తత్త్వమ్=యాథార్థ్యము) బోద్ధవ్యమ్=తెలియఁదగినదై, (అస్తి=ఉన్నది.)

ఓ అర్జునుఁడా! కర్మాకర్మ వికర్మములయొక్క గతి తెలియ శక్యము కానిదైయున్నది గనుక, శాస్త్రవిహితమయిన కర్మముయొక్కయు, శాస్త్ర నిషిద్ధమైన కర్మముయొక్కయు, అకర్మముయొక్కయు (ఊరకుండుట యొక్కయు) యాథార్థ్యము తెలియఁదగినదై యున్నదని తాత్పర్యము.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥

టీక. కర్మణి=వ్యాపారమాత్రమునందు, అకర్మ=కర్మాభావమును, యః=ఏ పురుషుఁడు, పశ్యేత్=చూచునో; అకర్మణిచ=కర్మాభావము నందును, కర్మ=కర్మమును, యః=ఏ పురుషుఁడు, పశ్యేత్=చూచునో; సః=ఆ పురుషుఁడు, మనుష్యేషు=మనుష్యులయందు, బుద్ధిమాన్=బుద్ధిమంతుఁడును, సః=వాఁడే, కృత్స్నకర్మకృత్ – సకలకర్మములను చేసినవాఁడును, సః=వాఁడే, యుక్తః=యోగియును, భవేత్=అగును.

ఓ అర్జునుఁడా! ఏ పురుషుఁడు వ్యాపారమునందు కర్మాభావమును చూచునో, కర్మాభావమునందు కర్మమును చూచునో, అట్టి పురుఁషుడు మనుష్యులయందు బుద్ధిమంతుఁడును, సకలకర్మములను చేసినవాఁడును, యోగియును అగు నని తాత్పర్యము.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ ౧౯

టీక. యస్య=కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచునట్టి ఏ పురుషునియొక్క, సర్వే=సమస్తము లయిన, సమారంభాః=కర్మములు, కామసంకల్పవర్జితాః=కోర్కెలతోడను, (అనఁగా కోర్కె- [illegible]) సంకల్పముతోడను శూన్యము లయినవై, (అనుష్ఠింపఁబడుచున్నవో) జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్=(కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచుట అనునట్టి) జ్ఞానమనియెడు అగ్నిచేత కాల్పఁబడిన (శుభాశుభరూపము లయిన) కర్మములుకల, తమ్=ఆ పురుషుని, పండితమ్=పండితునిగా, బుధాః=విద్వాంసులు, ఆహుః=చెప్పుచున్నారు.

ఓ అర్జునుఁడా! కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచునట్టి యే విద్వాంసునియొక్క కర్మము లన్నియును, కోర్కె-

లను, ఆ కోరికలకు కారణము అయిన సంకల్పములను వదలి అనుష్ఠింపఁ బడుచున్నవో; కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచుట అనునట్టి జ్ఞానముచేతఁ గాల్పఁబడిన ఆ పురుషుని పండితునిఁగా విద్వాంసులు చెప్పుచున్నారని తాత్పర్యము,

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ ౨౦

టీక. సః = (కర్మమునందు అకర్మమును అకర్మమునందు కర్మమును చూచునట్టి) ఆ పురుషుఁడు, కర్మఫలాసంగమ్ = కర్తృత్వాభిమానమును, ఫలాభిలాషను, త్యక్త్వా = విడిచి, నిత్యతృప్తః = సర్వకాలములయందును, (స్వాత్మానందానుభవముచేత) తృప్తుఁడైనవాఁడును, నిరాశ్రయః—ఆధారశూన్యుఁడును, (అగుచు) కర్మణి=కర్మమునందు, అభిప్రవృత్తోఽపి=ప్రవర్తించి నప్పటికిని, కించిత్=ఒక్కదానిని, (ఏ కర్మమును) నకరోతి = చేయుచున్నవాఁడే కాఁడు,

ఓ అర్జునుఁడా! కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచునట్టి ఆ పురుషుఁడు కర్తృత్వాభిమానమును, కర్మఫలాభిలాషను వదలి సర్వకాలములయందును స్వాత్మానందానుభవముచేత తృప్తిని పొందినవాఁడును, ఆధారశూన్యుఁడును అగుచు, కర్మమునందు ప్రవర్తించి నప్పటికిని, ఒక్కదానిని (అనఁగా, ఏ కర్మమును) చేయుచున్నవాఁడే కాఁడని తాత్పర్యము.

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౨౧

టీక. నిరాశీః=ఆశలు లేనివాఁడును, యతచిత్తాత్మా= నియమింపఁబడిన చిత్తమును దేహమును కలవాఁడును, త్యక్తసర్వపరిగ్రహః=విడువఁబడిన సకలవస్తుసంపాదనము గలవాఁడును, శారీరం కేవలమ్ = శరీరము

నిలుచుటకుమాత్రము తగిన; కర్మ=కర్మమును, కుర్వన్=చేయుచున్న వాఁడును, (అయిన మానవుఁడు) కిల్బిషమ్=(పుణ్యపాపఫలమైన) సంసారమును (లేక) బంధమును, నఆప్నోతి=పొందఁడు,

ఓ అర్జునుఁడా! ఆశలులేనివాఁడును, చిత్తమును శరీరమును స్వాధీనముచేసికొనినవాఁడును, సమస్తవస్తుసంపాదనమును వదలుకొనినవాఁడును అయిన వాఁడు శరీరము నిలుచుటకుమాత్రము తగిన భిక్షాటనాదికర్మమును చేయుచున్నను, పుణ్యపాపములవలనఁ గలుగునట్టి సంసారరూపబంధమును పొందఁడని తాత్పర్యము.

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥　　౨౨

టీక. యదృచ్ఛాలాభసంతుష్టః=అయాచితముగా సంభవించిన యాహారపదార్థముతో తృప్తినిఁ బొందినవాఁడును, ద్వంద్వాతీతః=శీతము ఉష్ణము మొదలుగాఁగల జంటలలును అతిక్రమించినవాఁడును, విమత్సరః=మాత్సర్యము లేనివాఁడును, సిద్ధౌ=(ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధించుటయందును, అసిద్ధౌ=ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధింపక పోవుటయందును, సమః=సమానమైన బుద్ధి గలవాఁడును, (అగువాఁడు) కృత్వాపి=[భిక్షాటనము మొదలుగాఁగల కర్మములను), ననిబధ్యతే=(సంసారముచేత) కట్టఁబడఁడు. (అనఁగా సంసారమును పొందఁడు).

ఓ అర్జునుఁడా! అయాచితముగా సంభవించిన ఆహారాదిపదార్థముతో తృప్తిని పొందినవాఁడును, శీతము ఉష్ణము సుఖము దుఃఖము మొదలుగాఁగల జంటలను అతిక్రమించినవాఁడును, ఇతరుల గొప్పదనమునుసహింపక తనదుగొప్పఁదనమునుకోరనివాఁడును(అనఁగా, వైరబుద్ధిలేనివాఁడును]ఆహారాదులు అప్రయత్నముగా లభించినపుడును లభింపనపుడునుకూడసమమైన బుద్ధికలవాఁడును అగు ముముక్షువు భిక్షాటనము మొదలుగాఁగలకర్మములను చేసిన నసంసారముచేత బంధింపఁబడఁడు అని . తా.

శ్లో॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ ౨౩

టీక. గతసంగస్య=అభిమానము లేనివాఁడును, ముక్తస్య=(కామ క్రోధాదులగు సంసారమునుండి) విడుపఁబడినవాఁడును, జ్ఞానావస్థితచేతసః = బ్రహ్మజ్ఞానమునందు నిలిచియున్న చిత్తము కలవాఁడును, యజ్ఞాయ = విష్ణుప్రీతికొఱకు, ఆచరతః= (యజ్ఞాదికర్మములను) ఆచరించుచున్నవాఁడగు, [అయిన] అస్య=ఈబ్రహ్మజ్ఞానియొక్క, కర్మ=కర్మము సమగ్రమ్=ఫలముతోఁ గూడ, ప్రవిలీయతే=నశించుచున్నది.

ఓ అర్జునుఁడా! అభిమానము లేనివాఁడును, ధర్మాధర్మములు, కామ క్రోధములు మొదలగునవి కారణముగాఁగల సంసారమునుండి విడుపఁబడినవాఁడును, బ్రహ్మజ్ఞానమునందే నిలిచియున్న చిత్తము కలవాఁడును, విష్ణుప్రీతికొఱకు యజ్ఞము మొదలుగాఁగల కర్మములను ఆచరించుచున్నవాఁడును అయిన యిట్టి బ్రహ్మజ్ఞానియొక్క కర్మము ఫలముతోఁ గూడ నశించిపోవుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మసమాధినా॥ ౨౪

టీక. అర్పణమ్=(హోమసాధనమైన) స్రుక్స్రువాదికము, బ్రహ్మైవ=బ్రహ్మస్వరూపమే, హవిః=(అన్నము, నేయి మొదలుగాఁగల)హోమ ద్రవ్యసమూహము, బ్రహ్మైవ = బ్రహ్మస్వరూపమే, బ్రహ్మణా =(బ్రహ్మ స్వరూపుఁడైన) యజమానునిచేత, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మ స్వరూపమయిన అగ్నియందు, హుతమ్=(చేయఁబడు) హోమము, బ్రహ్మైవ = బ్రహ్మ స్వరూపమే, బ్రహ్మకర్మ సమాధినా = బ్రహ్మ మనియెడు కర్మమునందు

చిత్తైకాగ్రతగల, తేన=ఆ యజమానునిచేత, గంతవ్యమ్=పొందఁదగిన ఫలము, బ్రహ్మైవ = బ్రహ్మమే.

ఓ యర్జునా! హోమసాధనము అయిన స్రుక్స్రువాదులును, అన్నము నెయ్యి మొదలుగాఁగల హోమద్రవ్య సముదాయములును, యజమానుఁడును, అగ్నియును, హవనక్రియయును, బ్రహ్మరూపమగు కర్మమునందు చిత్తైకాగ్రతగల యజమానునిచేత పొందఁదగిన ఫలమును, అనునట్టి సర్వమును బ్రహ్మస్వరూపమే కాని బ్రహ్మముకంటె భిన్నము కాదని తాత్పర్యము.

శ్లో॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।

బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ ౨౫

టీక. అపరే = మతికొందఱు, (అయిన) యోగినః = యోగులు, (కర్మనిష్ఠులు) దైవమ్ = ఇంద్రాది దేవతలనుద్దేశించి చేయఁబడునట్టియజ్ఞమేవ=(జ్యోతిష్టోమాది)యజ్ఞమునే, పర్యుపాసతే (ఫలాపేక్షతో)చేయుచున్నారు. అపరే=మఱికొందఱు, (బ్రహ్మవేత్తలు) యజ్ఞేనైవ=నిరుపాధికుఁడైన ఆత్మచేతనే, (బ్రహ్మాత్మైకత్వభావనచేతనే) యజ్ఞమ్=ఉపాధితోఁ గూడుకొనిన ఆత్మను, (జీవుని) బ్రహ్మాగ్నౌ=నిరుపాధికమైన పరబ్రహ్మ అనునట్టి అగ్నియందు, ఉపజుహ్వతి=హోమము చేయుచున్నారు.

కర్మయోగులు ఇంద్రవరుణాది దేవతల నుద్దేశించి చేయఁబడుయజ్ఞమును చిత్తశుద్ధికొఱకుఁ జేయుచున్నారు. అట్టియజ్ఞములను అదివఱకు చేసియుండుటచేత చిత్తశుద్ధిరూపఫలమును పొందినయతులు నిర్విశేష పరబ్రహ్మమునియెడునగ్నియందు బుద్ధ్యాద్యుపాధులతోఁ గూడుకొనినవాఁడును అఁకలి మొదలుగాఁగల సకల సంసారధర్మములుకలవాఁడును, అయిన జీవునినిరుపాధికమైన యాత్మచేతనే హోమమును చేయుచున్నారు. అనఁగా సోపాధికుఁడైన జీవునకును నిరుపాధికుఁడైన పరమాత్మకును భేదములేదని తెలిసి

కాని సోపాధికుఁడైన జీవుని నిరుపాధిక బ్రహ్మ మనియెడు నగ్నియందు హోమము చేయుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ ౨౬

టీక. అన్యే=మఱికొందఱగు నైష్ఠిక బ్రహ్మచారులు, శ్రోత్రాదీని=చెవి మొదలుగాఁగల ఇంద్రియాణి=ఇంద్రియములను, సంయమాగ్నిషు=నియమము లనియెడు నగ్నులయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు. అన్యే=మఱికొంద ఱగు గృహస్థులు, శబ్దాదీన్ = శబ్దము మొదలుగాఁగల, విషయాన్ = విషయములను, ఇంద్రియాగ్నిషు=ఇంద్రియము లనియెడు నగ్నులయందు, జుహ్వతి = హోమముచేయుచున్నారు.

ఓ అర్జునుఁడా! కొందఱగు నైష్ఠిక బ్రహ్మచారులు చెవులు మొదలుగాఁగల ఇంద్రియములను నియమములనియెడు నగ్నులయందు హోమమును చేయుచున్నారు. అనఁగా నింద్రియములను నిగ్రహించి నియమములే ప్రధానముగాఁ గలవారైయున్నారని భావము. మఱియును మఱికొందఱగు గృహస్థులు శబ్దములు మొదలుగాఁగల విషయములను ఇంద్రియము లనియెడు నగ్నులయందు హోమమును చేయుచున్నారు. అనఁగా, మఱికొందఱైన గృహస్థులు విషయములను అనుభవించెడు కాలమునందుఁగూడ విరుద్ధములగు విషయములను వదలి అవిరుద్ధము లయిన విషయములనే గ్రహించుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ ౨౭

టీక. అపరే = మఱికొందఱు, సర్వాణి=సమస్తములయిన, ఇంద్రియకర్మాణి = జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియముల యొక్కయు

వ్యాపారములను, ప్రాణకర్మాణి=ప్రాణవాయువు మొదలుగాఁ గల పది వాయువులయొక్కయు వ్యాపారములను, జ్ఞానదీపితే=(చమురు చేతవలెనే) జ్ఞానముచేతఁ బ్రజ్వలింపఁ జేయఁబడిన, ఆత్మసంయమయోగాగ్నౌ=స్వస్వరూప మయిన) ఆత్మయందు మనస్సునునిరోధించుటయేస్వరూపముగాఁ గల యోగ మనియెడు నగ్నియందు, జుహ్వతి = హోమమును చేయుచున్నారు.

ఓ అర్జునుఁడా! మఱికొందఱు సమస్తము లయిన జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియములయొక్కయు, ప్రాణాపానవ్యానోదానసమానము లనియెడు ప్రాణవాయువులయొక్కయు, నాగ, కూర్మ, కృకర, దేవదత్త ధనంజయము లనునట్టి యుపవాయువుల యొక్కయు, కర్మములను చమురు చేతను వలెనే ఆత్మజ్ఞానముచేతఁ బ్రజ్వలింపఁజేయఁబడిన ఆత్మయందు మనస్సును నిరోధించుటయే స్వరూపముగాఁ గల యోగ మనియెడు నగ్నియందు హోమమును చేయుచున్నారని తాత్పర్యము:

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః ॥ ౨౮

టీక. అపరే = మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః=పుణ్యతీర్థములయందు ద్రవ్యముల నిచ్చుట యనియెడు యజ్ఞముకలవారు, అపరే=మఱికొందఱు తపోయజ్ఞాః=కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగు తపస్సే యజ్ఞముగాఁ గలవారు. అపరే=మఱికొందఱు, యోగయజ్ఞాః=ప్రాణాయామ ప్రత్యాహారాదులే స్వరూపముగాఁగల (లేక) చిత్తవృత్తినిరోధమే స్వరూపముగా గల యోగమే యజ్ఞముగాఁ గలవారు. అపరే=మఱికొందఱు, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః = నియమపూర్వకముగ ఋగ్వేదము మొదలుగాఁగల వేదములనుచదువుట, ఆవేదములయొక్కయు వేదాంగములయొక్కయు అర్థమునుచక్కఁగాఁ దెలిసికొనుట అనునవియేయజ్ఞముగాఁగలవారు, అపరే=మఱి

కొందఱు. యతయః=(మోక్షమును గుఱించి ప్రయత్నము చేయువారై సంశిత వ్రతాః=మిగుల తీక్ష్ణములయిన వ్రతములుకలవారు, (ఇట్లుగాదేని) అపరే=మఱి కొందఱు, యతయః=జయింపఁబడిన యింద్రియములు కలవారు, అపరే= మఱికొందఱు, సంశితవ్రతాః = తీక్ష్ణముగా జేయఁబడిన నీమముకలవారు.

ఓ అర్జునా! మఱికొందఱు ద్రవ్యార్థదానములయందును, ద్రవ్యకాల ములయందును ద్రవ్యముల నిచ్చుట యనియెడు యజ్ఞము గలవారు. మఱి కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణములు మొదలుగాఁగల తపస్సే యజ్ఞముగా గలవారు. మఱికొందఱు, ప్రాణాయామ ప్రత్యాహారాదులే స్వరూపముగా గల (రేక) చిత్తవృత్తినిరోధమే స్వరూపముగాఁగల యోగమే యజ్ఞముగా గలవారు. మఱికొందఱు, ఋగ్వేదము మొదలుగాఁగల వేదములను శాస్త్రములను చదువుట, వేదములయొక్కయు వేదాంగములయొక్కయు అర్థమును చక్కగాఁ దెలిసికొనుట అనునవియే యజ్ఞముగాఁ గలవారు, మఱి కొందఱు మోక్షమునుగుఱించి ప్రయత్నము చేయునట్టి స్వభావముకలవారై మిక్కిలి తీక్ష్ణములుగాఁ జేయఁబడిన నీమములు గలవారు అని తాత్పర్యము.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ ౨౯
అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి॥ ౩౦

టీక. అపరే=మఱికొందఱు, ప్రాణాయామపరాయణాః=ప్రాణా యామమునందాసక్తికలవారై, ప్రాణాపానగతీః=ప్రాణాపానవాయువుల యొక్కగతులను, రుద్ధ్వా=అడ్డుపఱచి, (కుంభకమును చేసి) అపానే = అపానవాయు వ్యాపారమునందు, ప్రాణమ్=ప్రాణవాయువ్యాపారమును (పూరకమును) తథా=ఆ ప్రకారముగానే, ప్రాణే=ప్రాణవాయువ్యా పారమునందు, అపానమ్=అపానవాయు వ్యాపారమును, (రేచకమును) జుహ్వతి=హోమమును చేయుచున్నారు. అపరే = మఱికొందఱు, నియ

తాహారాస్సన్తః=పరిమితమైన యాహారమును భుజించువారగుచు, ప్రాణాన్ = ప్రాణవాయుభేదములను, ప్రాణేషు = ప్రాణవాయుభేదముల యందు, జుహ్వతి = హోమమును చేయుచున్నారు.

మఱికొందఱు ప్రాణాయామమునం దాసక్తి కలవారై పూరక మను పేరు గల ప్రాణాయామమును చేయుచున్నారు. అటులనే మఱికొందఱు రేచక మను పేరు గల ప్రాణాయామమును చేయుచున్నారు. మఱికొందఱు కుంభక మను పేరు గల ప్రాణాయామమును చేయుచున్నారు. మఱియు, మఱికొందఱు నియతమైన యాహారము కలవారై ఏయేవాయువు జయింపఁబడుచున్నదో ఆయా వాయువునందు జయింపఁబడని వాయువులను హోమము చేయుచున్నారని (ప్రవేశపెట్టుచున్నారని) తాత్పర్యము.

శ్లో॥ సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ।
యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ॥ 30 ॥

టీక. యజ్ఞవిదః = (ఇప్పుడు చెప్పఁబడిన) యజ్ఞములను తెలిసికొనిన, ఏతే=ఈ, సర్వేపి=అందఱును, యజ్ఞక్షపితకల్మషాః = (ఇప్పుడు చెప్పఁబడిన) యజ్ఞములచేత నాశము చేయఁబడినపాపము కలవారై, యజ్ఞశిష్టామృతభుజః=(ఇప్పుడు చెప్పఁబడిన) యజ్ఞములను చేయఁగా మిగిలిన కాలమునందు అమృత మనియెడు శాస్త్రోక్తాన్నమును (హోమమును, వైశ్వదేవమును, బలిహరణము, స్వా[illegible]నివేదనము, అతిథిపూజ మొదలగువానిని చేసిన పిమ్మట యన్నమును) భుజించినవారు (అగుచు), సనాతనమ్=నిత్యమైన, బ్రహ్మ=బ్రహ్మమును, యాంతి=పొందుచున్నారు.

ఇప్పుడు చెప్పఁబడిన పండ్రెండువిధము లగు యజ్ఞములను తెలిసికొని అనుష్ఠించువా రందఱును యజ్ఞములచేత నశింపఁజేయఁబడిన పాపము కలవారు అగుదురు. మఱియును, ఇట్టి యజ్ఞములచేత సకలపాపములను పోఁగొట్టుకొనినవారు ఈ యజ్ఞములను చేయఁగా మిగిలినకాలమునందు

అమృత మనియెడు శాస్త్రోక్తాన్నమును భుజించుచు నిత్యమైన బ్రహ్మ మును (మోక్షమును) పొందుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥

టీక. అయజ్ఞస్య = (ఇప్పుడు చెప్పఁబడిన) యజ్ఞములలో నొక యజ్ఞమును లేనివానికి, అయమ్ = ఈ, లోకః = మానవలోకము, నాస్తి = లేదు, హే కురుసత్తమ = కురువంశపురాజులలో నుత్తముఁడ వైన యో యర్జునా! అన్యః = (ఈ లోకముకంటె) వే అయిన, లోకః = పుణ్య లోకము, కుతః = ఎట్లు ?

ఇప్పుడు చెప్పఁబడిన పండ్రెండు విధము లైన యజ్ఞములలో నొక యజ్ఞమును అయినను చేయనివానికి స్వల్పసుఖములకు స్థాన మైన ఈ లోకమే లేకపోవు చుండఁగా సర్వదా సుఖకర మైన పుణ్యలోక మెట్లు కలుగును ? కలుగ దని తాత్పర్యము.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

టీ. ఏవమ్ = ఈవిధముగా, బహువిధాః = అనేకవిధము లైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః = వేదముయొక్క, ముఖే = ద్వారము నందు, వితతాః = విస్తరించి చెప్పఁబడినవి, సర్వాన్ = సమస్తము అయిన, తాన్ = ఆ యజ్ఞములను, కర్మజాన్ = (మనోవాక్కాయములయొక్క) కర్మములవలనఁ బుట్టినవానినిగా, విద్ధి = తెలియుము. ఏవమ్ = ఈవిధ ముగా, (యజ్ఞము మొదలుగాఁ గల కర్మములు ఆత్మసంబంధములు కావ నియు, మనోవాక్కాయములయొక్క వ్యాపారము లనియును) జ్ఞాత్వా = తెలిసికొని, విమోక్ష్యసే = (సంసారమునుండి) విడువఁబడఁగలవు.

ఓ అర్జునుఁడా! ఇవ్విధముగా అనేకవిధము లయిన యజ్ఞములు వేదము నందు విస్తారముగాఁ జెప్పఁబడినవి. ఆయజ్ఞములన్నిటిని మనోవాక్కాయ

ములయొక్క కర్మములవలనఁబుట్టినవానినిగాఁ దెలిసికొనుము. ఈవిధముగా దెలిసికొని (యజ్ఞము మొదలగు కర్మములు ఆత్మ సంబంధములు కావని యును, మనోవాక్కాయములయొక్క వ్యాపారములనియును తెలిసికొని) సంసారమునుండి విడువఁబడినవాఁడవగుదువు ముక్తుఁడవగుదువు) అని తా.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥ 33

టీక. హేపరంతప=ఓ అర్జునుఁడా! ద్రవ్యమయాత్ = ద్రవ్యసాధనసాధ్య మయిన, యజ్ఞాత్ = యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః=జ్ఞాన మనియెడు యజ్ఞము, శ్రేయాన్ = మిగుల శ్రేష్ఠమైనది. హేపార్థ = ఓ అర్జునుఁడా! సర్వమ్=సమస్తమైన, కర్మ=కర్మము, అఖిలమ్=నిరవశేషముగా, జ్ఞానే=జ్ఞానమునందు, పరిసమాప్యతే=సమాప్తిని పొందింపబడు చున్నది.

ఓ అర్జునుఁడా! ద్రవ్యసాధనసాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానమని యెడు యజ్ఞము మిగుల శ్రేష్ఠమైనది. ఓ అర్జునుఁడా! అన్నికర్మములును నిరవశేషముగా జ్ఞానమునందు పరిసమాప్తిని పొందు చున్నవి అని తా.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ 34

టీక. తత్త్వదర్శినః=తత్త్వవేత్తలు (అయిన), జ్ఞానినః = జ్ఞానులు, తే = నీకొఱకు, యత్ = ఏజ్ఞానమును, ఉపదేక్ష్యంతి = ఉపదేశింపఁగలరో, తత్ = ఆ జ్ఞానమును, ప్రణిపాతేన = సాష్టాంగ నమస్కారము చేతను, పరిప్రశ్నేన=విమర్శించి యడుగుటచేతను, సేవయా=గురుశుశ్రూషచేతను, విద్ధి= తెలిసికొనుము.

ఓ అర్జునుఁడా! తత్త్వవేత్తలయిన జ్ఞానులు నీకే జ్ఞానమును ఉపదేశింపఁగలరో అట్టి జ్ఞానమును సాష్టాంగ నమస్కారముచేతను, మోక్ష మెట్లు కలుగును? విద్య యన నేది? అవిద్య యన నేది? అనునట్టి చక్కని ప్రశ్నముల చేతను, గురుశుశ్రూష చేతను తెలిసికొనుమని తాత్పర్యము.

శ్లో॥ యద్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥ 3౫॥

టీక. హే పాండవ = ఓ అర్జునుఁడా! యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొని, పునః = మరల, ఏవమ్ = ఈవిధముగా, మోహమ్ = మోహమును, నయాస్యసి = పొందవో; యేన = ఏ జ్ఞానముచేత, అశేషేణ = నిశ్శేషముగా, భూతాని = భూతములను, ఆత్మని = నీయందే, ద్రక్ష్యసి = చూడఁగలవో; అథో = పిమ్మట, మయి = ప్రత్యక్షస్వరూపుఁడనైన నాయందు, ద్రక్ష్యసి = చూడఁగలవో; (తత్ = అటువంటి జ్ఞానమును, విద్ధి = తెలిసికొనుము).

ఓ అర్జునుఁడా! ఏ జ్ఞానమును తెలిసికొని మరల నిట్టి మోహమును చెందవో; ఏ జ్ఞానముచేత నిశ్శేషముగా సకలభూతములను నీయందు జూడఁగలవో, పిమ్మట నాయందుఁ జూడఁగలవో, అటువంటి జ్ఞానమును గురుశుశ్రూషాదులను చేసి తెలిసికొమ్మని తాత్పర్యము.

శ్లో॥ అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవే నైవ వృజినం సంతరిష్యసి ॥ 3౬॥

టీక. సర్వేభ్యః = సమస్తమైన, పాపేభ్యః = పాపమును చేసినవారల కంటె, పాపకృత్తమః = అధికపాపాత్ముఁడవు, అపిచేదసి = అయితివేని, త్వమ్ = నీవు, జ్ఞానప్లవేనైవ = జ్ఞానమనియెడు తెప్పచేతనే, సర్వమ్ = సమస్తమైన, వృజినమ్ = పాపసముద్రమును, సంతరిష్యసి = లెస్సగాఁ దాఁటఁగలవు.

ఓ అర్జునుఁడా! పాపాత్ము లందఱికంటెను నీవు పాపాత్ముఁడవు, అయినను జ్ఞాన మనియెడు తెప్పచేతనే పాప మనియెడు సముద్రమును దాఁటఁగల వని తాత్పర్యము.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ 37

టీక. హే అర్జున=ఓ అర్జునుఁడా, సమిద్ధః=లెస్సగా ప్రజ్వలింపఁ జేయఁబడిన, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, ఏధాంసి = కట్టెలను, యథా= ఏప్రకారముగా, భస్మసాత్=భస్మమునుగా, కురుతే=చేయుచున్నాఁడో, తథా = ఆప్రకారముగా, జ్ఞానాగ్నిః = జ్ఞాన మనియెడు నగ్ని, సర్వకర్మాణి = సమస్తకర్మములను, భస్మసాత్కురుతే = భస్మముగాఁ జేయుచున్నది.

ఓ అర్జునుఁడా! లెస్సగా బ్రజ్వలింపఁ జేయఁబడిన యగ్నిహోత్రుఁడు కట్టెలను యేవిధముగా భస్మమునుగాఁ జేయుచున్నాఁడో ఆవిధముగానే జ్ఞాన మనియెడు నగ్ని ప్రారబ్ధకర్మములనుదప్పఁ దక్కిన యాగామిసంచితములగు సకలకర్మములను భస్మముగాఁ జేయును అని తాత్పర్యము.

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ 38

టీక. ఇహ = ఈ తపోయోగాదులలోపల, జ్ఞానేన = జ్ఞానముతో, సదృశమ్ = సమానముగా, పవిత్రమ్= పావనమైనది, నవిద్యతేహి = లేదు కదా! తత్ = ఆ జ్ఞానమును, యోగసంసిద్ధః = కర్మయోగముచేతను, సమాధియోగము చేతను సిద్ధిని పొందినవాఁడు, కాలేన=చిరకాలముచేత, ఆత్మని=తనయందు, స్వయమ్=తానే, విందతి=పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా ఇదివఱకుఁ జెప్పఁబడిన కారణములచేత ఆలోచింపఁగా జ్ఞానముకంటె పవిత్రమైనది యేదియును లేదు. మఱియును, కర్మయోగముచేతను,

సమాధియోగముచేతను యోగ్యతను పొందిన ముముక్షువు, చిరకాలమునకు తనయందు ఆట్టియాత్మజ్ఞానమును స్వయముగానే పొందుచున్నాఁడని తా.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి॥ 39

టీక. శ్రద్ధావాన్ = (గురూపదిష్ట వేదాంతవాక్యార్థానుష్ఠానమునందు) ఆసక్తి కలవాఁడును, సంయతేంద్రియః=జయింపఁబడిన యింద్రియములు కలవాఁడును (అయిన) వాఁడు, జ్ఞానమ్=ఆత్మజ్ఞానమును, లభతే= పొందుచున్నాఁడు జ్ఞానమ్ = ఆత్మజ్ఞానమును, లబ్ధ్వా=పొంది, పరామ్= సర్వోత్తమ మయిన, శాంతిమ్=శాంతిని, (మోక్షమును) అచిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి=పొందు చున్నాఁడు.

ఓ అర్జునుఁడా! గురూపదిష్ట వేదాంతవాక్యార్థములయందు నమ్మకము కలవాఁడును, గురూపదిష్ట వేదాంతవాక్యార్థమును తెలిసికొని అనుష్ఠించుటయందాసక్తి కలవాఁడును, జయింపఁబడిన యింద్రియములు కలవాఁడును అయిన పురుషుఁడు బ్రహ్మజ్ఞానమును పొందు చున్నాఁడు; అట్టి జ్ఞానమును పొందిన పిమ్మట సర్వోత్తమ మైన శాంతిని (మోక్షమును) పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥

టీక. అజ్ఞశ్చ = గురూపదిష్ట వేదాంతవాక్యార్థమును తెలియనివాఁడును, అశ్రద్దధానశ్చ=(గురూపదిష్ట వేదాంతవాక్యార్థమునందు నమ్మకము లేనివాఁడును, సంశయాత్మాచ=(గురూపదిష్ట వేదాంత వాక్యార్థమునందు) సందేహముతోఁ గూడిన చిత్తము కలవాఁడును, వినశ్యతి=నశించిపోవు చున్నాఁడు, సంశయాత్మనః=సందేహముతోఁ గూడిన చిత్తము కల

వానికి, అయమ్ = ఈ, లోకః = లోకము, నాస్తి = లేదు. పరః = అన్యము, (అయిన) లోకః = లోకము, నాస్తి=లేదు, సుఖంచ = సుఖము కూడ, నాస్తి=లేదు.

ఓ అర్జునుఁడా! గురూపదిష్ట వేదాంతవాక్యార్థమును తెలియనివాఁడును, ఒకవేళ నేదో యొకవిధముగా తెలిసికొన్నను దానియందు నమ్మకము లేనివాఁడును, ఒకవేళ తెలిసికొన్నను, నమ్మకము కలిగియున్నను, నాకు యిది సిద్ధించునో సిద్ధింపదో అను సందేహముతోఁ గూడిన చిత్తము కలవాఁడును చెడిపోవును. మఱియును, ఈ మూఁడువిధములైన వారిలో సంశయాత్ముఁడు సర్వవిధములచేతను జెడిపోవును. ఎట్లనిన,—సంశయము కలవానికి ధనార్జనము వివాహము మొదలగునవి సిద్ధింపవు, కనుక ఈ లోకమును లేదు. యజ్ఞాదులను చేయలేక పోవుటవలన ధర్మము పుట్టదు కనుక పరలోకమును లేదు, ఏ పదార్థమును అనుభవించినయెడల యేమి వచ్చునో యను సందేహముతో ఏ భోగమును లేనివాఁడగును కనుక సుఖముకూడ లేదు. కాఁబట్టి పైనఁ జెప్పఁబడిన ముప్పురిలోపల సంశయాత్ముఁడు సర్వవిధములచేతను చెడిపోవు నని తాత్పర్యము.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ॥ ౪౧

టీక. హేధనంజయ=ఓ అర్జునుఁడా! యోగసన్న్యస్తకర్మాణమ్ = జ్ఞానయోగముచేత విడువఁబడిన కర్మములు కలవాఁడును, జ్ఞానసంఛిన్నసంశయమ్=జ్ఞానముచేత ఛేదింపఁబడిన సందేహము కలవాఁడును, ఆత్మవంతమ్=(బ్రహ్మనిష్ఠయందు) అప్రమత్తుఁడును (అయిన) వానిని, కర్మాణి= కర్మములు, ననిబధ్నంతి=బంధింపఁజాలవు.

ఓ అర్జునుఁడా! జ్ఞానయోగముచేత విడువఁబడిన కర్మములు కలవాఁడును, జ్ఞానముచేత ఛేదింపఁబడిన సంశయము కలవాఁడును, బ్రహ్మ

నిశ్చయుఁడు ప్రమాదమును పొందక యుండువాఁడును అయినవానిని కర్మములు బంధింపఁజాల వని తాత్పర్యము.

శ్లో॥ తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥ ४२

టీక. భారత = ఓ అర్జునుఁడా! తస్మాత్ = అందువలన జ్ఞానకర్తా స్వజ్ఞాన విషయమునందు సంశయము కలవాఁడు నశించును కనుక), అజ్ఞాన సంభూతమ్=అజ్ఞానమువలనఁ బుట్టినదియును, హృత్స్థమ్ = హృదయము నందున్నదియును, (అయిన) ఆత్మనః=నీయొక్క, ఏనమ్=ఈ, సంశయమ్= సందేహమును, జ్ఞానాసినా = ఆత్మజ్ఞానమను ఖడ్గముచేత, ఛిత్త్వా= ఛేదించి, యోగమ్=(ఆత్మజ్ఞానమునకు సాధనమైన) కర్మయోగమును, ఆతిష్ఠ=చేయుము; ఉత్తిష్ఠ=(యుద్ధమునకొఱకు) లెమ్ము.

ఓ అర్జునుఁడా! జ్ఞానకర్తాస్వజ్ఞానమునందు సంశయము కలవాఁడు నశించును కనుక అజ్ఞానమువలనఁ బుట్టినదియును, హృదయమునందున్నది యును అయిన నీయొక్కయీ సంశయమును, ఆత్మజ్ఞానమనియెడు ఖడ్గము చేత ఛేదించి, ఆత్మజ్ఞానమునకు సాధనమైన కర్మయోగమును చేయుము. ఇప్పుడు యుద్ధమును చేయుటకొఱకు లెమ్ము అని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ
చతుర్థోఽధ్యాయః.

టీక. వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహ స్ర్యామ్ = నూఱువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందో

బ్రహ్మశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే=సంపత్కరమైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి=భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు=ప్రశస్తజ్ఞానసంపదకలభగవంతునిచేతఁజెప్పఁబడిన,ఉపనిషత్సు=వేదాంతములయందు, శ్రీకృష్ణార్జున సంవాదే=శోభాయుక్తమైనకృష్ణార్జునులయొక్క సంవాదరూపము(అయిన)బ్రహ్మవిద్యాయామ్=బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే=యోగశాస్త్రమునందు, (నఱఁగా)బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను చెప్పునట్టి గ్రంథమందు] జ్ఞానయోగో నామ=జ్ఞానయోగమనియెడు పేరుగల, చతుర్థః=నాల్గవదైన, అధ్యాయః=భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును,శాస్త్రమును అయినమహాభారతమునందలిభీష్మపర్వమునందుప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును,బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయినయోగశాస్త్రమునందు జ్ఞానయోగమును తెలుపునట్టి నాల్గవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీ వాసుదేవార్పణ మస్తు.



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# శ్రీభగవద్గీత - పంచమాధ్యాయము,

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము,

---

## కర్మసన్న్యాసయోగము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥

టీక. అర్జున ఉవాచ=అర్జునుఁడు చెప్పెను. హేకృష్ణ=ఓకృష్ణుఁడా! కర్మణామ్ = (శాస్త్రీయము లయిన) కర్మములయొక్క, సన్న్యాసమ్ = పరిత్యాగమును; పునః=మరల, తేషామేవ = ఆ శాస్త్రీయములయిన కర్మములయొక్కయే, యోగంచ = అనుష్ఠానమును; శంససి=చెప్పుచున్నావు. ఏతయోః = ఈ రెంటిలోపల, యత్=ఏది, శ్రేయః = మేలయినదిగా; సునిశ్చితమ్ = చక్కఁగా నిశ్చయింపఁబడినదో, తత్=అటువంటి, ఏకమ్ ఒక్కదానిని, మే = నాకు, బ్రూహి = చెప్పుము.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.— ఓ కృష్ణుఁడా! నీవు శాస్త్రీయము లయిన కర్మములయొక్క పరిత్యాగమును, మరల ఆ శాస్త్రీయము లయిన కర్మములయొక్కయే అనుష్ఠానమును చెప్పుచున్నావు. ఈ రెంటిలోపల యేది

మేలయినదిగా చక్కఁగా నిశ్చయింపఁబడినదో అట్టిదాని నొక్కదానిని నాకుఁ జెప్పుమని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ సన్న్యాసం కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥ ౨

టీక. శ్రీ భగవానువాచ=సంపత్కరుఁడైన శ్రీకృష్ణుఁడు చెప్పెను. సన్న్యాసః = కర్మసన్న్యాసము, కర్మయోగశ్చ=కర్మయోగము (అను నట్టి) ఉభౌ=రెండును, నిశ్శ్రేయసకరౌ=(జ్ఞానోత్పత్తికి కారణములయిన వగుటచేత) మోక్షమును కలుగఁజేయునవి.(భవతః=అగుచున్నవి.) తయోస్తు = (మోక్షహేతువులయిన) ఆ రెంటిలోపల, కర్మసన్న్యాసాత్= జ్ఞానరహితమైన) కర్మసన్న్యాసముకంటె, కర్మయోగః= కర్మయోగము విశిష్యతే = అధికమైన దగుచున్నది.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ అర్జునుఁడా! కర్మముల యొక్క పరిత్యాగము, కర్మములయొక్క అనుష్ఠానము అను రెండును, జ్ఞానము కలుగుటకు కారణము అయిన వగుటచేత మోక్షమునుకలుగఁజేయు నవియే అగుచున్నవి, అయినను, ఆ కర్మసన్న్యాస కర్మయోగములలోపల ఆత్మజ్ఞానరహితమైన కర్మసన్న్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమైన దని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖంబంధాత్ప్రముచ్యతే॥

టీక. హే మహాబాహో=అధికమైన భుజబలము కల ఓయర్జునుఁడా! హి = ఏకారణమువలన, నిర్ద్వంద్వః=రాగద్వేషాదులులేనివాఁడు సుఖమ్ = అనాయాసముగా, బంధాత్ = సంసారబంధమువలన, ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడో, (తస్మాత్=ఆ కారణమువలన), యః=

ఎవ్వఁడు, నద్వేష్టి=(ఏప్రాణియందును) ద్వేషింపఁడో, నకాంక్షతి=(ఏ ఫలమును) కోరఁడో, సః = అట్టిమానవుఁడు, నిత్యసీసన్న్యా =సర్వకాలములయందును (కర్మమునందు ప్రవర్తించినకాలమునందుగూడ) సన్న్యాసి (ఇతి = ఇట్లని) జ్ఞేయః = తెలియఁదగినవాఁడు.

అధికమైన భుజబలముగల యోయర్జునుఁడా! ఏకారణమువలన రాగద్వేషములు లేనివాఁడు అనాయాసముగా, కర్మబంధమునుండి(సంసారమునుండి) విడువఁబడుచున్నాఁడో ఆకారణమువలన లోకములో నేపురుషుడు ఏప్రాణియందును ద్వేషము లేనివాఁడగునో యే ఫలమును కోరనివాఁడగునో, అట్టివాఁడు సర్వకాలములయందును, అనఁగా కర్మములను చేయుచున్న కాలమునందుఁగూడ సన్న్యాసియని తెలియఁదగినవాఁడని తాత్ప.

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ ౪

టీక. బాలాః = మూఢులు, సాంఖ్యయోగౌ = కర్మసన్న్యాస కర్మయోగములను, పృథక్ = విరుద్ధములును భిన్నములును అయిన ఫలములు కలవానినిగాను, ప్రవదన్తి = చెప్పుచున్నారు. పండితాః= పండితులు, నప్రవదన్తి=చెప్పుటలేదు. ఉభయోః=కర్మసన్న్యాస కర్మయోగములలోపల, ఏకమ్ = ఒకదానిని, సమ్యక్ = లెస్సగా, ఆస్థితోఽపి=ఆశ్రయించినవాఁడయినను, ఉభయోః=సాంఖ్యయోగములయొక్క, ఫలమ్ = ఫలమును, విందతే = పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! అవివేకులు కర్మసన్న్యాస కర్మయోగములనువిరుద్ధములును, భిన్నములును అయిన ఫలములుకలవానినిగా జెప్పుచున్నారు. పండితులు అప్రకారముగా చెప్పుటలేదు. ఈ కర్మసన్న్యాస కర్మయోగములలో ఒకదానిని ఆచరించినను యీకర్మసన్న్యాస కర్మయోగముల రెంటియొక్కయు ఫలమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ ౫

టీక. సాంఖ్యైః = జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత, యత్ = ఏ, స్థానమ్ = చోటు, ప్రాప్యతే = పొందఁబడినదో, తత్ = ఆస్థానము, యోగైరపి = కర్మయోగము కలవారిచేతఁగూడ, గమ్యతే = పొందఁబడుచున్నది. యః = ఏ పురుషుఁడు, సాంఖ్యమ్ = జ్ఞానమును, యోగంచ = యోగమును, ఏకమ్ = సమానఫలమును ఇచ్చువానినిగా, పశ్యతి= చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో) సః (ఏవ)= అట్టివాఁడే, (సమ్యక్= చక్కఁగా) పశ్యతి= చూచుచున్నాఁడు. (తెలిసికొనుచున్నాఁడు)

ఓ అర్జునుఁడా! జ్ఞాననిష్ఠులయిన సన్న్యాసులచేత పునరావృత్తిరహితమైన యే మోక్షము పొందఁబడుచున్నదో; అట్టి మోక్షము కర్మయోగులచేతఁ గూడ చిత్తశుద్ధిద్వారా పొందఁబడుచున్నది. కాఁబట్టి, ఏ పురుషుఁడు సాంఖ్యయోగములు రెండును ఒక్క ఫలమునకే కారణములగుచున్నవని తెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడే పరమార్థమును చక్కఁగాఁ దెలిసినవాఁడగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి॥ ౬

టీక. మహాబాహో= అధికమైన భుజబలము గల యో యర్జునుఁడా! సన్న్యాసస్తు= (పరమార్థజ్ఞానముతోఁ గూడిన) సన్న్యాసమయితే, అయోగతః= కర్మయోగము లేక, ఆప్తుమ్= పొందుటకొఱకు, దుఃఖమ్ = శక్యము కానిది, (లేక) దుఃఖమ్= దుఃఖమును, ఆప్తుమ్= పొందుటకొఱకు, (భవతి= అగుచున్నది.) యోగయుక్తః= వేదోక్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితో చేయువాఁడు, మునిః = (జ్ఞాననిష్ఠచేత) సన్న్యాసి, (భూత్వా = అయి) బ్రహ్మ = అపరోక్షమును, నచిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందు

చున్నాడు. (టీక) యోగయుక్తః = వేదోక్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయునట్టి, మునిః = మననశీలుఁడు (ధ్యానమును చేయువాఁడు) బ్రహ్మ=(పరమాత్మ జ్ఞాననిష్ఠయే స్వరూపముగాఁగల) పరమార్థసన్న్యాసము, నచిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందు చున్నాఁడు.

అధిక మైన భుజబలము కలయో యర్జునా! వేదోక్తకర్మముల నాచరింపనివానికి, పరమార్థజ్ఞానముతోఁ గూడిన సన్న్యాసము దొఱకుట దుర్లభము. (టీక) వేదోక్తకర్మముల నాచరింపనివాని సన్న్యాసము దుఃఖమును పొందుటకొఱకే అగు చున్నది. వేదోక్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్షను వదలి చేయువాఁడు చిత్తశుద్ధిద్వారా కలిగిన జ్ఞాననిష్ఠచేత సన్న్యాసియై మిగుల శీఘ్రముగా సత్యజ్ఞానాది లక్షణములు కల యాత్మను పొందుచున్నాఁడు. (టీక) వేదోక్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్షను వదలి చేయునట్టి ముని (ధ్యానము చేయువాఁడు) పరమాత్మజ్ఞాననిష్ఠయే స్వరూపముగాఁ గల పరమార్థసన్న్యాసము శీఘ్రముగా పొందు చున్నాఁడు అని తాత్పర్యము.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ 7

టీక. యోగయుక్తః = కర్మయోగముతోఁ గూడుకొనినవాఁడును, (ప్రథమమ్=ముందుగా) విశుద్ధాత్మా = పరిశుద్ధ మైన యంతఃకరణముగలవాఁడును, (తతః = పిమ్మట) విజితాత్మా = జయింపఁబడిన దేహము గలవాఁడును, తతః=పిమ్మట, జితేంద్రియః = జయింపఁబడిన యింద్రియములు కలవాఁడును, (తతః=పిమ్మట) సర్వభూత = సకలభూతములకును, ఆత్మభూత=ఆత్మయయిన, ఆత్మా=ప్రత్యక్చైతనము కలవాఁడును, (అయిన పురుషుఁడు) కుర్వన్నపి = (లోకసంగ్రహముకొఱకు కర్మములను) చేయుచున్నను, నలిప్యతే = (కర్మబంధములచేత) అంటఁబడఁడు.

ఓ అర్జునుఁడా ! వేదోక్తము లయిన నిత్యనైమిత్తికకర్మములను ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయువాఁడు ముందుగా పరిశుద్ధమైన చిత్తము కలవాఁ డగును. పిమ్మట జయింపఁబడిన కార్యకారణసంఘాతము కలవాఁడు అనఁగా బాహ్యేంద్రియజయము కలవాఁడు అగును. అనంతరమందు అంతరింద్రియజయము కలవాఁడు అగును. పిమ్మట బ్రహ్మాదిస్తంబపర్యంతము లయిన సకలభూతములకును ఆత్మ యైన ప్రత్యక్చైతనము కలవాఁ డగును. అనఁగా సకలభూతాంతర్యామి యగు నాత్మయే తా ననుపట్టి సమ్యగ్జ్ఞానము కలవాఁడగును, పిమ్మట యిట్టిపురుషుఁడు లోకసంగ్రహముకొఱకు కర్మములను చేయుచున్నను కర్మబంధము కలవాఁడు గాఁ డని తా.

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్య న్శృణ్వ న్స్పృశ న్జిఘ్ర న్నశ్న న్గచ్ఛ న్స్వప న్శ్వసన్॥
ప్రలప న్విసృజ న్గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥ ౯

టీక. యుక్తః=నిష్కామకర్మము గల యోగి, తత్త్వవిత్ = (క్రమముగా) పరమార్థతత్త్వమును తెలిసినవాఁడై, పశ్యన్ = చూచుచున్నను, శృణ్వన్ = వినుచున్నను, స్పృశన్ = స్పృశించుచున్నను, జిఘ్రన్ = ఆఘ్రాణించుచున్నను, అశ్నన్ = భుజించుచున్నను, గచ్ఛన్ = నడుచుచున్నను, స్వపన్ = నిద్రించుచున్నను, శ్వసన్ = (ఊపిరిని) విడుచుచున్నను, ప్రలపన్ = పలుకుచున్నను, విసృజన్ = (మలమూత్రములను) విడుచుచున్నను, గృహ్ణన్ = గ్రహించుచున్నను, ఉన్మిషన్ = (కన్నులను) మూయుచున్నను, నిమిషన్నపి = (కన్నులను) తెఱచుచున్నను, ఇంద్రియాణి = ఇంద్రియములు, ఇంద్రియార్థేషు = శబ్దాది విషయములయందు, వర్తన్త ఇతి = ప్రవర్తించుచున్న వని, ధారయన్ = అనుసంధానముచేయుచు, (తలఁ

చును) కించిత్=ఒకదానిని (ఇంచుకయైనను) నైవకరోమీతి = (నేను) చేయుచున్నవాఁడను కానని, మన్యేత=తలఁచును.

ఫలాభిలాషను వదలి ఈశ్వరార్పణబుద్ధితో నిత్యనైమిత్తికాదికర్మములను చేయునట్టి పురుషుఁడు క్రమముగా పరమార్థతత్త్వమును తెలిసినవాఁడై చూచుచున్నను, వినుచున్నను, స్పృశించుచున్నను, భుజించుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, ఊపిరిని విడుచుచున్నను, మాటలాడుచున్నను, మలమూత్రములను విడుచుచున్నను, ఇంద్రియములు శబ్దాది విషయములయందు ప్రవర్తించుచున్నవి కాని నేనొకఁడు కార్యమును చేయుచుండుట లేదని, అనఁగా నాయందు కర్తృత్వము లేదని తలఁచునని తా.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా॥ ౧౦

టీక. యః = ఏ పురుషుఁడు, కర్మాణి = సమస్తకర్మములను, బ్రహ్మణి = పరమాత్మయందు, ఆధాయ = సమర్పించి, సంగమ్=ఫలాభిలాషను, (లేక) మోక్షఫలమును గూడ, త్యక్త్వా=వదలి, కరోతి=చేయుచున్నాఁడో, సః=అట్టి పురుషుఁడు, అంభసా=ఉదకముచేత, పద్మపత్రమివ=తామరాకువలె, పాపేన=పాపముచేత, నలిప్యతే=అంటఁబడఁడు.

ఓ అర్జునా! ఏమానవుఁడు సకలకర్మములను పరమాత్మయందు సమర్పించి ఫలమునందు కోర్కెను (లేక) మోక్షఫలమునుకూడ విడిచిపెట్టుచున్నాఁడో అటువంటి మానవుఁడు ఉదకముచేత తామరాకువలె పుణ్యపాపరూపమైన కర్మబంధముచేత సంబంధమును పొందఁడని తా.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే॥

టీక. యోగినః=కర్మము నాచరించువారు, సంగమ్ = కర్మఫలాభిలాషను, త్యక్త్వా = వదలి, ఆత్మశుద్ధయే=చిత్తశుద్ధికొఱకు, (కేవలేన=

మమత్వములేని) కాయేన = శరీరముచేతను, (కేవలేన = మమత్వములేని) మనసా=మనస్సుచేతను, కేవలేన = మమత్వములేని) బుద్ధ్యా=బుద్ధిచేతను, కేవలైః=మమత్వాభిమానశూన్యము అయిన, ఇంద్రియైరపి=ఇంద్రియముల చేతఁగూడ, కర్మ=వేదోక్త నిత్యనైమిత్తికకర్మమును, కుర్వంతి = చేయుచున్నారు.

ఓ అర్జునా! కర్మయోగము నవలంబించినవారు కర్మఫలము కోరక చిత్తశుద్ధికొఱకు మమత్వశూన్యము లైన మనోవాక్కాయములచేతను, ఇంద్రియములచేతను గూడ కర్మమును చేయుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ ౧౨

టీక. యుక్తః=నిష్కామకర్మయోగి, ఫలమ్=ఫలాభిలాషను, త్యక్త్వా= విడిచి, కర్మ=కర్మమును, (కుర్వన్ =చేయుచు), నైష్ఠికీమ్ = నిష్ఠయందుఁ బుట్టిన (ఆత్మనిష్ఠచేతఁగలిగిన, శాంతిమ్=నిర్వికారత్వమును, (మోక్షమును) ఆప్నోతి=పొందుచున్నాఁడు. అయుక్తః=ఫలాపేక్షతో(కర్మమును చేయువాఁడు, కామకారేణ=కోర్కెచేత, ఫలే = ఫలమునందు, సక్తః=ఆసక్తి కలవాఁడై, నిబధ్యతే=(కర్మబంధములచేత) కట్టఁబడుచున్నాఁడు.

నిష్కామకర్మయోగి ఫలాభిలాషను వదలి కర్మములను జేయుచు చిత్తశుద్ధిద్వారా ఆత్మనిష్ఠచేత కలిగిన మోక్షమును పొందుచున్నాఁడు. ఫలాభిలాషతో కర్మమును చేయువాఁడు కోర్కెచేత ఫలమునందాసక్తి కలవాఁడై కర్మబంధముచేతఁ బంధింపఁబడుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్॥ ౧౩

టీక. దేహీ = దేహాభిన్నమైన ఆత్మను చూచువాఁడు, (దేహము కంటె భిన్నుఁడని తలఁచువాఁడు) మనసా=(వివేకము గల) బుద్ధిచేత, సర్వ

కర్మాణి = సకలకర్మములను, సన్న్యస్య = సన్న్యసించి, వశీ=జితేంద్రియుఁడును, నైవకుర్వన్ = (ఏకర్మమును స్వయముగా) చేయనివాఁడును, నకారయన్ = (ఏకర్మమును ఇతరులచేత, లేక దేహేంద్రియాదులచేత) చేయింపనివాఁడును, (అగుచు) నవద్వారే=తొమ్మిదిద్వారములు గల, పురే=పట్టణమువంటి దేహమునందు, సుఖమ్=అనాయాసముగా, ఆస్తే=ఉన్నాఁడు (నివసించుచున్నాఁ డనుట).

ఓ అర్జునా! తనను దేహముకంటె భిన్నునిఁగాఁ దలఁచువాఁడు వివేకముకలబుద్ధిచేత నిత్యము, నైమిత్తికము, కామ్యము, ప్రతిషిద్ధము అను నట్టి కర్మములను అన్నిటిని పరిత్యజించి జితేంద్రియుఁడును, స్వయముగా కర్మములను చేయనివాఁడును, ఇతరులచేత (లేక) దేహేంద్రియాదులచేత, కర్మములను చేయింపనివాఁడునునై (కర్తృత్వకారయితృత్వము లేనివాఁడై) తొమ్మిదిద్వారములు గల పట్టణమువంటి దేహమునం దేమియును ఆయాసములేనివాఁ డగుచు నివసించు చున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే। ౧౪

టీక. ప్రభుః = దేహాదుల కధిపతి (అయిన యాత్మ), లోకస్య=లోకమునకు, కర్తృత్వమ్=కర్తృత్వమును, నసృజతి=సృజించుచుండలేదు. కర్మాణి=కర్మములను, నసృజతి=సృజించు చుండలేదు. కర్మఫల సంయోగమ్=కర్మఫలములయొక్క సంబంధమును, నసృజతి = సృజించు చుండ లేదు. (కింతు=ఇఁక నేమన) స్వభావః=మాయ, ప్రవర్తతే=ప్రవర్తించు చున్నది.

దేహాదుల కధిపతి యైన యాత్మ, నీ వీ కర్మమును చేయు మని లోకమునకు కర్తృత్వమును సృజించు చుండలేదు. (అనఁగా ఆత్మ ఇతరులచేత ఏకార్యమును చేయించు చుండలేదనుట) ఆత్మకర్మములను సృజించుచుండ

లేదు (అనఁగా లోకముచేత చేయఁదగిన కర్మ మిదియని సృజింపలేదనుట) ఆత్మ లోకమునకు అట్టియకర్మఫలముయొక్క సంబంధమును కలుగఁజేయుచుండఁగా (అనఁగా ఈ కర్మమును చేయువాఁడు ఈఫలమును అనుభవింపవలసినదని నిర్ధారణమును చేయలేదనుట) అయితే, చేయుచున్నదియును, చేయించుచున్నదియును, ఏది యనఁగా అవిద్యాలక్షణమైన మాయ సర్వమును చేయునదియును, చేయించునదియును నై యున్నదని తా.

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥ ౧౫

టీక. విభుః = పరమేశ్వరుఁడు, కస్యచిత్ = ఒకానొక జంతువుయొక్కయు, పాపమ్ = పాపమును, నాదత్తే = గ్రహించుచుండ లేదు. సుకృతం చైవ = పుణ్యమును కూడ, నాదత్తే = గ్రహించుచుండ లేదు. అజ్ఞానేన = అవివేకముచేత, జ్ఞానమ్ = వివేకము, ఆవృతమ్ = ఆవరింపఁబడినది. తేన = ఆకారణముచేత, జంతవః = జీవులు, ముహ్యంతి = మోహమును పొందుచున్నారు.

పరమేశ్వరుఁడు ఏజంతువులయొక్కయు పుణ్యపాపములను గ్రహించుటలేదు. అవివేకముచేత వివేకము కప్పఁబడినది. అనఁగా పరమేశ్వరుఁడు జంతువులయొక్క పుణ్యపాపములను గ్రహించుచున్నాఁడనియెడు నవివేకముచేత పరమేశ్వరుఁడు ఎవరియొక్కయు పుణ్యపాపములను గ్రహించుట లేదనియెడు తెలివి కప్పఁబడినది. అందువలన సకలజీవులును మోహమును పొందుచున్నారు. అనఁగా పరమేశ్వరుఁడు మన పుణ్యపాపములను గ్రహించుచున్నాఁడని మోహమును చెందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ॥
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ ౧౬

టీక. ఆత్మనః = పరమాత్మయొక్క, జ్ఞానేనతు = (వేదాంతవాక్యార్థశ్రవణమననాదులవలన కలిగినదియును, ఆత్మవిషయమును అయిన) జ్ఞానముచేత, యేషామ్ = ఎవరియొక్క, తత్ = ఆ, అజ్ఞానమ్ = అవివేకము, నాశితమ్ = పోఁగొట్టఁబడినది. (భవతి = అగుచున్నదో) తేషామ్ = ఆ జంతువులయొక్క, జ్ఞానమ్ = (వేదాంతవాక్యార్థశ్రవణమననాదులవలనఁ గలిగిన) జ్ఞానము, ఆదిత్యవత్ = (పదార్థములను) సూర్యుఁడువలెనే, తత్పరమ్ = ఆ యజ్ఞానమునకంటెఁ బరమైనదియును, పరిపూర్ణమును (అయిన) పరమార్థతత్త్వమును (బ్రహ్మస్వరూపమును) ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నది.

ఓ అర్జునా! గురూపదిష్ట వేదాంతవాక్యార్థము అను శ్రవణ మననాదులు చేయుటవలనఁ గలిగినదియును, ఆత్మవిషయమును అయిన జ్ఞానముచేత ఆవరణ విక్షేపశక్తికలదియును, మోహమును, కలుగఁజేయుచున్నదియును, అవిద్య యనియును మాయ యనియును చెప్పఁబడుచున్నదియును అయిన యెవరిజ్ఞానము నశింపఁజేయఁబడుచున్నదో వారియొక్క జ్ఞానము సకలపదార్థములను సూర్యుఁడు ప్రకాశింపఁజేయునట్లు ఆ యజ్ఞానమునకంటె పరమైనదియును, పరిపూర్ణమును అయిన పరమార్థతత్త్వమును (బ్రహ్మస్వరూపమును) ప్రకాశింపఁజేయుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ౧౭

టీక. తద్బుద్ధయః = ఆ పరబ్రహ్మమందే బుద్ధి కలవారును, తదాత్మానః = ఆ పరబ్రహ్మమే ఆత్మస్వరూపముగాఁ గలవారును, తన్నిష్ఠాః = ఆ పరబ్రహ్మమునందే అభినివేశము కలవారును, తత్పరాయణాః = ఆ పరబ్రహ్మమే సర్వోత్తమమైనగతిగా గలవారును (అయిన) పురుషులు, జ్ఞాననిర్ధూతకల్మషాస్సంతః = జ్ఞానముచేతఁ బోఁగొట్టఁబడినపాపముకలవారగుచు, అపునరావృత్తిమ్ = పునరావృత్తి లేనిమోక్షమును, గచ్ఛంతి = పొందుచున్నారు.

ఓ అర్జునుఁడా! ఆ పరబ్రహ్మమునందే బుద్ధికలవారును, ఆపరబ్రహ్మమే యాత్మస్వరూపముగాఁ గలవారును, ఆపరబ్రహ్మమునందే అభినివేశము కలవారును, ఆ పరబ్రహ్మమే పొందఁదగినస్థానముగాఁగలవారును అయిన పురుషులు జ్ఞానముచేత పోఁగొట్టఁబడినపాపము కలవారగుచు పునరావృత్తి రహితమైన మోక్షమును పొందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః ॥ ౧౮

టీక. విద్యావినయసంపన్నే = వేదార్థ పరిజ్ఞానముతోడను, (లేక) బ్రహ్మవిద్యతోడను, వినయముతోడను కూడుకొనిన, బ్రాహ్మణే=బ్రాహ్మణునియందును, గవి=గోవునందును, హస్తిని=ఏనుఁగునందును, శుని చైవ= కుక్కయందును, శ్వపాకే=కుక్కనుకోసి వండుకొనునట్టి చండాలుని యందును, పండితాః=విద్వాంసులు, సమదర్శినః=(నిర్దోషమును, ఒక్కటియును వికారరహితమును అయిన బ్రహ్మమును)సమముగా(లేక)సమానమైన దానినిగా జూచునట్టి స్వభావము కలవారు.

వేదార్థ పరిజ్ఞానము (లేక) బ్రహ్మవిద్య; వినయము,(అహంకారము లేక పోవుట(లేక) గొప్పవాఁడనను తలంపు లేకపోవుట) అనువానితోఁగూడుకొనినవాఁడును,(అనఁగా విద్వాంసుఁడును వినీతుఁడును)అయినబ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, కుక్కనుకోసి కొని వండుకొనునట్టి చండాలునియందును,బ్రహ్మవేత్తలు సత్త్వరజస్తమో గుణముల చేతను,సత్త్వరజస్తమోగుణముల యొక్క సంస్కారముల చేతనుస్పృశింపఁబడినదియును, దోషరహితమైనదియును,ఏకమును,క్రియారహితమును అయిన బ్రహ్మమును సమముగా (లేక) సమానమైనదానినిగాజూచువా అగుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమంబ్రహ్మతస్మాద్బ్రహ్మణితేస్థితాః॥౧౯

టీక. ఏషామ్=ఎవరియొక్క, మనః = మనస్సు, సామ్యే = (సర్వభూతములయందును, బ్రహ్మమురియొక్క)సమభావమునందు, స్థితమ్=(నిశ్చలమై) ఉన్నదో, తైః = వారిచేత, ఇహైవ=ఈలోకమునందే, సర్గః= జన్మము (సంసారము) జితః = జయింపఁబడెను. హి=ఏ కారణము వలన, సమమ్=ఏకమైన, బ్రహ్మ=బ్రహ్మము, నిర్దోషమ్=దోషరహితమైనదో, తస్మాత్ = ఆ కారణమువలన, తే=ఆ సమదర్శనులు, (సకల భూతముల యందును బ్రహ్మమును సమముగా జూచువారు)బ్రహ్మణి=బ్రహ్మమునందు, స్థితాః = ఉన్నవారు.

ఓ అర్జునుఁడా! ఎవ్వరియొక్క మనస్సు సకల భూతములయందును బ్రహ్మము సమముగా నున్నదను విషయమునందు నిశ్చలమైయున్నదో అట్టివారు యీ లోకమునందే (బ్రదికియున్న కాలమునందే)జన్మమును సంసారమును) జయించినవారగుచున్నారు. మఱియును ఏకమైన (భేదశూన్యమైన) బ్రహ్మము దోషరహితమైనది కనుక సర్వభూతములయందును బ్రహ్మమును సమముగా జూచువారు బ్రహ్మమునందేయున్నవారు (బ్రహ్మభావమును పొందినవారు అగుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్యచాప్రియమ్ । స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః॥

టీక. స్థిరబుద్ధిః=సర్వభూతములయందును వున్న ఆత్మసముఁడును, ఒక్కఁడును, నిర్దోషుఁడును అనునట్టి నిశ్చలజ్ఞానబుద్ధి కలవాఁడును, అసంమూఢః=మోహము లేనివాఁడును, (అయిన) బ్రహ్మవిత్=బ్రహ్మజ్ఞాని, బ్రహ్మణి = బ్రహ్మమునందు, స్థితస్సన్=ఉన్నవాఁ డగుచు, (కర్మమును చేయనివాఁడు అనఁగా సన్న్యాసి అగుచు, ప్రియమ్=ఇష్టమును,ప్రాప్య=

పొంది, నప్రహృష్యేత్=సంతోషింపఁగూడదు; అప్రియమ్=అనిష్టమును ప్రాప్య=పొంది, నోద్విజేత్=భయమునుపొందఁగూడదు, దుఃఖింపఁగూడదనుట.

సర్వభూతములయందును వున్న ఆత్మ ఒక్కఁడు సముఁడు, నిర్దోషుఁడు అనునట్టి నిశ్చయబుద్ధికలవాఁడును, మోహములేనివాఁడును(అయిన బ్రహ్మజ్ఞాని బ్రహ్మమునం దున్నవాఁడగుచు, (కర్మమును జేయనివాఁడగుచు అనఁగా సన్న్యసియగుచు) ప్రియమును పొంది సంతోషింపఁగూడదు, అనిష్టమును పొంది, తత్తఱపాటు కలవాఁడు (వ్యసనముకలవాఁడు కాఁగూడదు] అని తాత్పర్యము.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్।
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ ౨౧

టీక. బాహ్యస్పర్శేషు = బాహ్యమునందలి విషయములందు, (శబ్దాదులయందు' అసక్తాత్మా = అంటని యంతఃకరణము గల, యః=ఏ పురుషుఁడు, ఆత్మని=అంతఃకరణమునందు, సుఖమ్=ఉపశమము, శాంతి యనియెడు) సుఖము, యత్ = ఏది, (అస్తి=కలదో) తత్=అట్టి సుఖమును, విందతి=పొందుచున్నాఁడో, సః=అట్టివాఁడు, బ్రహ్మయోగయుక్తాత్మా సన్=బ్రహ్మనిష్ఠమైన సమాధితోఁ గూడుకొనిన యంతఃకరణముగలవాఁడగుచు, అక్షయమ్=నాశరహితమైన, సుఖమ్=సుఖమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

తా. అర్జునా! బాహ్యవిషయములయందు(శబ్ద స్పర్శ రూప రసగంధములయందు) అపేక్షలేని అంతఃకరణము కలవాఁడు, అంతఃకరణమునందు శాంతి యనియెడు సుఖమును పొందుచున్నాఁడు. ఆ పురుషుఁడు (శబ్దాది విషయములయందు ప్రేమను వదలి శాంతి యనియెడు సుఖమును పొందిన వాఁడు) బ్రహ్మయోగముతో (బ్రహ్మనిష్ఠమైనచిత్తస్థైర్యముతో)గూడుకొనిన

వాఁడగుచు నాశములేని సుఖమును (మోక్షరూపసుఖమును) పొందుచున్నాఁడని తాత్పర్యము,

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥ ౨౨

టీక. హేకౌంతేయ = ఓ అర్జునుఁడా! సంస్పర్శజాః=విషయేంద్రియ సంపర్కమువలనఁ బుట్టిన, భోగాః=అనుభవములు, (సుఖములు) యే=ఏవి, సంతి=కలవో, తే=ఆయనుభవములు,(లేక) అసుఖములు, హి=ఏకారణమువలన, దుఃఖయోనయఏవ=దుఃఖమునకు కారణములే, (అభూవన్=అయెనో, కించ=ఇంతియగాక) ఆద్యంతవంతశ్చ=ఆద్యంతములు కలవియును, (అభూవన్=అయెనో, తస్మాత్=ఆకారణమువలన) బుధః= (పరమార్థతత్త్వమును తెలిసిన) విద్వాంసుఁడు, తేషు=ఆభోగములయందు, నరమతే = రమింపఁడు.

ఓ అర్జునుఁడా! విషయేంద్రియ సంయోగమువలనఁ బుట్టిన సుఖానుభవములు దుఃఖములకు కారణము లయినవే యయినవియును, మఱియును ఆద్యంతములు కలవియును, (క్షణికములయినవియును) అనుటలఁచిపరమార్థతత్త్వమును తెలిసినవాఁడు (విద్వాంసుఁడు) విషయసుఖానుభవములయందు ఆసక్తికలవాఁడు కాఁడని తాత్పర్యము.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥ ౨౩

టీక. ఇహైవ=ఈలోకమునందే, (బ్రతికియున్న కాలమునందే) యః=ఏ పురుషుఁడు, శరీరవిమోక్షణాత్ = దేహమును విడుచుటకంటె, ప్రాగేవ=పూర్వమునందే, (బహిర్గతము కాకమునుపే) కామక్రోధోద్భవమ్ = కామక్రోధములు కారణములుగాఁగల, వేగమ్ = వేగమును, సోఢుమ్ = సహించుటకొఱకు, శక్నోతి = సమర్థుఁ డగుచున్నాఁడో,

సః=అటువంటి, నరః = మనుష్యుఁడు, యుక్తః = సమాహితచిత్తుఁడు, (ఇంద్రియనిగ్రహము కలవాఁడు) సుఖీ = సుఖముకలవాఁడు (భవతి = అగుచున్నాఁడు.)

ఓ అర్జునుఁడా! ఏ పురుషుఁడు బ్రతికియున్నంతవఱకును, అనఁగా మరణకాలమువఱకును కామక్రోధములయొక్క వేగమును (రోమాంచము, నేత్రవికాసము, ముఖవికాసము, అనునవి మొదలుగాఁగల కామవేగమును. శరీరము వణఁకుట, చెమట, పెదవులను కొఱకుట, కన్నులను నెఱ్ఱచేయుట అనునవి మొదలుగాఁగల క్రోధవేగమును)బహిర్గతముకాకమును సహించుచున్నాఁడో అట్టి పురుషుఁడుఇంద్రియనిగ్రహముకలవాఁడును, సుఖముకల వాఁడును అగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామ
స్తథాఽన్తర్జ్యోతిరేవయః।
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ ౨౪

టీక. యః=ఏ పురుషుఁడు; అంతస్సుఖఏవ = అంతరాత్మయందే సుఖము కలవాఁడో, తథా = ఆప్రకారముగా, యః = ఏ పురుషుఁడు అంతరారామఏవ = ఆత్మయందేక్రీడకలవాఁడో, తథా=ఆప్రకారముగా, యః=ఎవ్వఁడు, అంతర్జ్యోతిరేవ=అంతరాత్మయందే ప్రకాశము కల వాఁడో, సః=అటువంటి, యోగీ = సమాహితచిత్తుఁడు, (జీవన్నేవ = బ్రదికియున్నవాఁడగుచునే) బ్రహ్మభూతస్సన్ = బ్రహ్మరూపుఁడైనవాఁ డగుచు, (బ్రాహ్మనిర్వాణమ్=బ్రహ్మానందమును) (మోక్షమును అధిగచ్ఛతి= పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఏ పురుషుఁడు బాహ్యవిషయములయందు సుఖబుద్ధి లేనివాఁడై అంతరాత్మయందే (తనయందే) సుఖము కలవాఁడును, బాహ్య

క్రీడలు లేనివాఁడై అంతరాత్మయందే (తనయందే) క్రీడించువాఁడును, శ్రోత్రాదీంద్రియములచేత ప్రకాశము(జ్ఞానము) లేనివాఁడై, అంతరాత్మయందే(తనయందే) ప్రకాశము కలవాఁడును అగుచున్నాఁడో, అటువంటి సమాహితచిత్తుఁడు బ్రదికియున్నవాఁడగుచునే బ్రహ్మరూపుఁడై బ్రహ్మానందమును (మోక్షమును) పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ లభంతే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః॥ ౨౫

టీక. క్షీణకల్మషాః=నశించిన పాపములుకలవారును, ఛిన్నద్వైధాః = ఛేదింపఁబడిన సంశయములు కలవారును, యతాత్మానః = నిగ్రహింపఁబడిన మనస్సుమొదలగు నింద్రియములు కలవారును, సర్వభూతహితే=సకలప్రాణులయొక్కయు అనుకూల్యమునందు, రతాః=ఆసక్తికలవారును(అయిన), ఋషయః=జ్ఞానులు, బ్రహ్మనిర్వాణమ్ = మోక్షమును, లభంతే = పొందుచున్నారు.

నశించినపాపములు కలవారును, ఛేదింపఁబడిన సకల సంశయములుకలవారును, నిగ్రహింపఁబడిన మనస్సు మొదలుగాఁగల యింద్రియములుకలవారును, సకలప్రాణులయొక్కయు మేలునందుఆసక్తికలవారును, (హితసాకృత్యమును చేయువారును) అయిన జ్ఞానులు మోక్షమునుపొందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ ౨౬

టీక. కామక్రోధవియుక్తానామ్=కామము, క్రోధము (అనువాని చేత) విడువఁబడినవారును, యతచేతసామ్=నియమితమైన యంతఃకరణము కలవారును, విదితాత్మనామ్ = తెలియఁబడిన ఆత్మతత్త్వము కలవారును, (అయిన) యతీనామ్ = సన్న్యాసులకు, అభితః=అంతటను, (ఈలోకము

నందును పరలోకమునందును) బ్రహ్మనిర్వాణమ్=మోక్షము, వర్తతే= ఉన్నది.

ఓ, అర్జునుఁడా! కామక్రోధములు లేనివారును, బాహ్యవిషయముల మీఁదికిఁబోకుండునట్లు నియమింపఁబడిన అంతఃకరణము కలవారును, ఆత్మ తత్త్వమును తెలిసికొనినవారును (సాక్షాత్కారముగాఁ జేసికొనఁబడినపర మాత్మ కలవారును) అయిన సన్న్యాసులకు (బ్రహ్మనిష్ఠులకు) ఈశరీర ములో నున్నపుడును, ఈశరీరముపోయినపుడును మోక్షమున్నది. అనఁగా దేహాంతరమందే గాక బ్రదికియున్నపుడుకూడ మోక్షము కలిగియే యున్న దని తాత్పర్యము.

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్
చక్షుశ్చైవాంతరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యంతరచారిణౌ॥ ౨౭

యతేంద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ ౨౮

టీక. (యః=ఎవ్వఁడు) బాహ్యాన్=వెలుపటివైన, స్పర్శాన్ = విషయములను, బహిః = వెలుపల, కృత్వా = చేసి, శ్రోత్రాదీంద్రియ ముల ద్వారా బుద్ధియందు ప్రవేశపెట్టఁబడిన శబ్దాదివిషయములను గుణించి ఆలోచింపనివానికి ఆ బాహ్యవిషయములు వెలుపలనే చేయఁబడిన వగుచున్నవి కనుక శ్రోత్రాదీంద్రియముల ద్వారా లోపలప్రవేశించినవిషయ ములను గుణించి ఆలోచింపక వెలపట నుండునట్లు చేసి) చక్షుశ్చైవ= చూపునుగూడ, భ్రువోః=కనుబొమలయొక్క, అంతరే=మధ్యప్రదేశమందు కృత్వా=చేసి, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, నాసాభ్యంతరచారిణౌ =నాసికయొక్క మధ్యప్రదేశమునందు సంచరించువానినిగాను, సమౌ=

సమానము అయినవానినిగాను, కృత్వా=చేసి, యతేంద్రియమనోబుద్ధిః = నిగ్రహింపఁబడిన యింద్రియములు మనస్సు బుద్ధి (అనునవి) కలవాఁడును మునిః=మననశీలుఁడును, మోక్షపరాయణః= మోక్షమేసర్వోత్తమమయినగతి గాఁగలవాఁడును, విగతేచ్ఛా భయక్రోధః=పోయిన, అపేక్ష భయము ద్వేషము(అనునవి) కలవాఁడును, (భవతి=అగుచున్నాఁడో) సః=ఆ పురుషుఁడు, సదా=సర్వకాలములయందును (జీవించియున్న కాలమునందును) ముక్తఏవ=మోక్షమును పొందినవాఁడే, (భవతి = అగుచున్నాఁడు.)

ఓ అర్జునా ! ఏ పురుషుఁడు వెలుపలనున్న విషయములను వెలుప లనేయుండునట్లుచేసి యిటునటు పోకుండునట్లు చూపును కను బొమల యొక్క మధ్యప్రదేశమునందు నిల్పి ప్రాణాపానవాయువులను సమానగతి గలవానినిగాను, నాసికయొక్క మధ్యప్రదేశమునందే సంచరించు దానిని గాను చేసి, (పాపరాహిత్యముకొఱకును, మనస్సు స్థిరముగా నుండుటకొఱ కును, కుంభక ప్రాణాయామముచేత ఉచ్ఛ్వాస నిశ్వాసరూపము అయిన ప్రాణాపానములను నిరోధించి) ఇంద్రియములను, మనస్సును, బుద్ధినిజయిం చినవాఁడును, మోక్షమును కోరుచున్నవాఁడును, మననశీలుఁడును, విష యాపేక్ష, భయము, క్రోధముఅనునవిలేనివాఁడును నైయుండునో అటు వంటివాఁడు సర్వకాలములయందును (జీవించియుండినను) మోక్షమును పొందినవాఁడే అగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం
సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి॥ ౨౯

టీక. యజ్ఞతపసామ్=యజ్ఞములకును తపస్సులకును, భోక్తారమ్= (కర్తృరూపముచేతను దేవతారూపముచేతను) భోక్తను, సర్వలోకమహే

శ్వరమ్=సకలలోకములకును అధికుఁడైన ప్రభుఁడను, సర్వభూతానామ్= సకలభూతములకును, సుహృదమ్=(ప్రత్యుపకారమును కోరకయే) ఉపకారమును చేయువాఁడను (అయిన), మామ్=నన్ను, జ్ఞాత్వా=తెలిసికొని, శాంతిమ్—సర్వసంసారోపరతిని, ఋచ్ఛతి = పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! శ్రౌతములును స్మార్తములును అయిన యజ్ఞములకును, సత్యవ్రతము మొదలుగాఁ గల తపస్సులకును, కర్తృరూపముచేతను దేవతారూపముచేతను సకలలోకములకును సర్వోత్తమప్రభుఁడను, సకలభూతములకును ప్రత్యుపకారమును కోరకయే యుపకారమును చేయువాఁడను (మఱియును, సర్వభూతములయొక్కయును హృదయములయందు నివసించినవాఁడను, సర్వకర్మఫలములకును అధిపతిని, సకల బుద్ధివృత్తులకును సాక్షిభూతుఁడను, నారాయణుఁడను) అయిన నన్ను తెలిసికొనినవాఁడు సకల సంసారోపరతిని (మోక్షమును) పొందుచున్నాఁడని తా.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ
పంచమోఽధ్యాయః.

టీక. వైయాసిక్యామ్=వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యామ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే=సంపత్కరమైన మహాభారతమనుపేరిటి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు=ప్రశస్తజ్ఞానసంపద కల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్=

బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను చెప్పునట్టి గ్రంథమందు) కర్మసన్న్యాసయోగోనామ=కర్మసన్న్యాసయోగ మనియెడు పేరు గల, పంచమః= ఐదవదైన, అధ్యాయః=భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును, శాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు కర్మసన్న్యాసయోగమును దెలుపునట్టి ఐదవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీవాసుదేవార్పణ మస్తు.



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత - షష్ఠాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

## ఆత్మసంయమయోగము

లేక

## ధ్యానయోగము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః॥ ౧

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను. (హే అర్జున=ఓ అర్జునుఁడా! యః = ఎవ్వఁడు, కర్మఫలమ్ = కర్మముల యొక్క—ఫలమును, అనాశ్రితస్సన్=ఆశ్రయింపనివాఁడగుచు, కార్యమ్= చేయఁదగిన (నిత్యమైన) కర్మ—కర్మమును, కరోతి=చేయుచున్నాఁడో, సః—అట్టివాఁడు, సన్న్యాసీచ=కర్మపరిత్యాగముకలవాఁడును, (సన్న్యాసియును) యోగీచ=చిత్తసమాధానము కలవాఁడును (నిశ్చలచిత్తుఁడును), (భవతి=అగుచున్నాఁడు. నిరగ్నిః=అగ్నులులేనివాఁడు, న = (సన్న్యాసి

యును, యోగియును) కాఁడు. అక్రియశ్చ = తపోదానాదిక్రియలులేని వాఁడును, న=(సన్న్యాసియును యోగియును) కాఁడు.

ఓ అర్జునుఁడా! లోకములో నెవ్వఁడు కర్మఫలములను కోరిన వాఁడై ధ్యానయోగమును పొందుటకును చేయఁదగిన (నిత్య మైన) శ్రౌతస్మార్తాది కర్మములను చేయుచున్నాఁడో అట్టివాఁడు కర్మఫలమును వదలినవాఁడు కనుక సన్న్యాసియును (సర్వకర్మములను వదలినవాఁడును) చిత్తవిక్షేపమునకు కారణ మైన కర్మఫలసంకల్పమును విడచినవాఁడును కనుక యోగియును (నిశ్చలచిత్తుఁడును) అగుచున్నాఁడే కాని గార్హపత్యము ఆహవనీయము మొదలుగాఁ గల అగ్నులు లేనివాఁడు సన్న్యాసియును, యోగియును కాఁడనియును; అగ్నులతో పని లేని తపోదానాది క్రియలు లేనివాఁడును, సన్న్యాసియును, యోగియును కాఁ డనియును తా.

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధిపాండవ ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥ ౨

టీక. హేపాండవ=ఓ అర్జునుఁడా! హి = ఏకారణమువలన, అసన్న్యస్త సంకల్పః=సన్న్యసింపఁబడని ఫలవిషయసంకల్పము గల, కశ్చన= ఎవ్వఁడు, యోగీ=కర్మయోగి, నభవతి = కాఁడో; తస్మాత్ = ఆకారణమువలన, (బుధాః - విద్వాంసులు) యమ్ = దేనిని, సన్న్యాసమితి = పరమార్థ సన్న్యాస మని, ప్రాహుః=చెప్పుచున్నారో. తమ్=అపరమార్థ సన్న్యాసమును, యోగమితి=కర్మయోగ మని, విద్ధి= తెలిసికొనుము.

ఓ అర్జునుఁడా! శ్రుతిస్మృతులయొక్క యర్థము తెలిసిన విద్వాంసులు సకలకర్మములను అకర్మఫలములను వదలుట యనియెడు సన్న్యాసమును శాస్త్రప్రమాణసిద్ధమైనసన్న్యాసమని అధికముగాఁ జెప్పుచున్నారు. అటువంటి సన్న్యాసము శాస్త్రప్రమాణసిద్ధ (ఫలాభిలాషలేని) కర్మానుష్ఠాన మనియెడు యోగమే అని తెలిసికొనుము. మఱియును, ఫలవిషయ

మైన సంకల్పమును వదలిన కర్మానుష్ఠానపరుఁడు యెవ్వఁడును యోగి (చిత్త సమాధానము కలవాఁడు) కాఁడు గదా! అని తాత్పర్యము.

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥ ౩

టీక. యోగమ్ = జ్ఞానయోగమును, ఆరురుక్షోః = ఎక్క నిశ్చయించిన, మునేః = మునికి, కర్మ = కర్మము, కారణమ్ = సాధనము, (ఇతి=అని) ఉచ్యతే = చెప్పఁబడు చున్నది. యోగారూఢస్య = జ్ఞానయోగమును యెక్కిన, తస్యైవ = ఆ మునికే, శమః = సర్వకర్మనివృత్తి, కారణమ్ = సాధనము, (ఇతి=ఇట్లని) ఉచ్యతే=చెప్పఁబడు చున్నది.

ధ్యానయోగమును (లేక) జ్ఞానయోగమును పొందవలయు నని యెడు తలంపు కలవాఁడును, కర్మఫలసంకల్పమును వదలినవాఁడును అయినమునికి జ్ఞానయోగమును (లేక) ధ్యానయోగమును పొందుటకు కర్మము సాధనమని చెప్పఁబడు చున్నది. మఱియును, ధ్యానయోగమును పొందిన (లేక) జ్ఞానయోగమును పొందిన యామునికే యోగఫలప్రాప్తియందు సర్వకర్మములనుండి మరలుటయే సాధన మని చెప్పఁబడు చున్నదని తాత్ప.

శ్లో॥ యదా హి చేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ ౪

టీక. యదా = ఎప్పుడు, ఇంద్రియార్థేషు = శబ్దాది విషయముల యందును, కర్మసు న = కర్మములయందును, నానుషజ్జతే = ఆసక్తుఁడు కాఁడో, తదా = అప్పుడు, సర్వసంకల్పసన్న్యాసీ = (ఇహాముత్రార్థ కామహేతువు లయిన) సమస్త కోర్కెలను విడిచినవాఁడు, యోగారూఢః (ఇతి) = యోగాభ్యాససిద్ధిని పొందినవాఁ డని, ఉచ్యతే=చెప్పఁబడు చున్నాఁడు.

ఎప్పుడు శబ్దాదివిషయములయందును, కర్మములయందును, ఆసక్తికల వాఁడుకాఁడో, అప్పుడు ఇహాముత్రార్థకామహేతువు అయిన సమస్త కోర్కెలను విడిచినవాఁ డనియును, యోగారూఢుఁ డనియును చెప్పఁబడుచున్నాఁడు అని తాత్పర్యము.

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాఽత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥ ౫

టీక. హి=ఏ కారణమువలన, ఆత్మనః = తనకు, ఆత్మైవ=(సంగాములు లేని) మనస్సే, (లేక) తానే, బంధుః=బంధువో, ఆత్మనః = తనకు, ఆత్మైవ=(సంగాదులతోఁ గూడుకొనిన) మనస్సే, (లేక) తానే, రిపుః= శత్రువో, తస్మాత్ = అందువలన, ఆత్మనా = (వివేకముతోఁ గూడిన) మనస్సుచేత (లేక) ఆత్మచేత (తనచేత), ఆత్మానమ్=(సంసార సముద్రమునందు మునిఁగిన) తనను, ఉద్ధరేత్ = పైకి లేవఁదీయవలయును, ఆత్మానమ్=తనను, నావసాదయేత్=చెడఁగొట్టుకొనఁగూడదు.

ఓ అర్జునా! సంగాదులతోఁ గూడుకొనిన మనస్సే, (లేక) తానే తనకు విరోధియును, సంగాదులు లేనిమనస్సే, (లేక) తానే తనకు బంధువును అగుచున్నది కనుక సంగాదులను వదలినదియును, వివేకము కలది యయిన అయిన మనస్సుచేత (లేక) తనచేత సంసారసముద్రమునందు మునిఁగిన తనను లేవఁదీసి కొనవలసిన దనియును ముంచివేసికొనఁగూడ దనియును తాత్పర్యము.

శ్లో॥ బంధురాత్మాఽఽత్మన స్తస్య యేనాఽత్మైవాఽత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాఽత్మైవ శత్రువత్॥ ౬

టీక. యేన=ఏ, ఆత్మనైవ = (వివేకయుక్తమైన) ఆత్మచేతనే, (లేక) మనస్సుచేతనే, ఆత్మా=దేహేంద్రియాది సముదాయము, (లేక) తాను, జితః=జయింపఁబడినది, (భవతి=అగుచున్నదో), తస్య = అటు

వంటి, ఆత్మనః=దేహేంద్రియాది సంఘాతమునకు (లేక) తనకు, సః = అట్టి) ఆత్మా = మనస్సు, (లేక) తాను, బంధుః = బంధువు, (భవతి= అగుచున్నది). అనాత్మనస్తు = జయింపఁబడని దేహేంద్రియాది సంఘాత మునకైతే, ఆత్మా = తాను (లేక) మనస్సు. శత్రువత్ = శత్రువువలె, శత్రుత్వే=అపకారమునందు, వర్తేత= ప్రవర్తి=ప్రవర్తించును.

ఓ అర్జునుఁడా! వివేకయుక్తమైన ఆత్మచేత (లేక) మనస్సుచేత దేహేంద్రియాదిసంఘాతము స్వాధీనము చేయఁబడినయెడల అట్టి దేహేంద్రియసంఘాతముల యాత్మకు వివేకయుక్తమైన మనస్సు స్వేచ్ఛాప్రవృత్తి లేనిది కనుక బంధువు (ఉపకారమును చేయునది) అగుచున్నది. జయింపఁబడని దేహేంద్రియాది సంఘాతము కల యాత్మకు వివేకరహితమైన యాత్మయే (లేక మనస్సే స్వేచ్ఛాప్రవృత్తి కలది గనుక శత్రువువలె అపకారమునందు ప్రవర్తించును, అనఁగా ఎవ్వఁడు జితేంద్రియుఁడు అగునో వాఁడు తనను తరింపఁ జేసికొనినవాఁడు అగుచున్నాఁడనియును, ఎవ్వఁడు జితేంద్రియుఁడు కాఁడో వాఁడు శత్రువువలె తనకు అపకారమును చేసికొనునట్టివాఁ డగుచున్నాఁ డనియును తాత్పర్యము.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 2

టీ.. జితాత్మనః=జయింపఁబడిన కార్యకారణసముదాయము కలవాఁడును, ప్రశాన్తస్య=రాగద్వేషాది రహితుఁడును (అయిన) వానికి, పరమాత్మా = పరమాత్మ, సమాహితః = (ప్రత్యక్షముగా) ఆత్మభావముచేత నున్నదై, వర్తతే=ప్రవర్తించు చున్నది. (కించ=ఇంతేఁగాక) శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును, తథా=అప్రకారముగా, మానావమానయోః=మానావమానములయందును, సమః= సమబుద్ధి కలవాఁడు, స్యాత్ = అగును. (లేక) జితాత్మనః = జయింపఁ

బడిన మనస్సు గలవాఁడును, ప్రశాన్తస్య=రాగద్వేషాదులు లేనివాఁడును, (అయిన) వానియొక్క, ఆత్మా = (శుద్ధమైన) మనస్సు, శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును, తథా=అవిధముగానే, మానావమానయోః = మానావమానములయందును. పరమ్ = అధికముగా, సమాహితః = (ధ్యానాభ్యాసరూపమైన) ఆత్మానుభవమందే యున్నది.

జయింపఁబడిన కార్యకారణసంఘాతము కలవాఁడును, రాగద్వేషములు లేనివాఁడును అయినవానికి పరమాత్మ ప్రత్యక్షముగా ఆత్మభావముచేత నున్నదై ప్రవర్తించుచున్న దనియును, ఇంతియుగాక, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును ఆ ప్రకారముగానే మానావమానములయందును సమబుద్ధి గలవాఁడగు ననియును తాత్పర్యము. (లేక) జయింపఁబడిన మనస్సు కలవాఁడును, రాగద్వేషాదులు లేనివాఁడును అయిన వానియొక్క శుద్ధమయిన మనస్సు శీతోష్ణములును, సుఖదుఃఖములును, అటులనే మానావమానములును కలిగియున్నప్పటికిని అధికముగా ధ్యానాభ్యాసరూపమైన యాత్మానుభవమునందే యుండు నని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥ ౮

టీక. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా=శాస్త్రజ్ఞానముచేతను, అనుభవజ్ఞానముచేతను సంతుష్టి పొందిన యంతఃకరణము కలవాఁడును, కూటస్థః = ఇనుపముద్దవలె నున్నవాఁడును, (చలింపనివాఁడును) విజితేంద్రియః=జయింపఁబడిన యింద్రియములు కలవాఁడును, (ఇంద్రియములను జయించినవాఁడును), (అయిన) పురుషుఁడు, యుక్తః=సమాహితుఁడు (చిత్తసమాధానము కలవాఁడు) (లేక) యోగారూఢుఁడు, (లేక) (ఆత్మానుభవముగల యోగి) ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు. (యః = ఎవ్వఁడు,

ఈదృశః = ఇటువంటి, యుక్తః = యోగి, భవతి = అగుచున్నాఁడో; సః = అట్టివాఁడు) సమలోష్టాశ్మకాంచనః=మట్టితునకలు రాళ్ళు బంగారము అనునవి సమానము లయినవిగాఁ గలవాఁడు (మట్టితునకలయందును రాళ్ళయందును, బంగారమునందును సమానమైనబుద్ధికలవాఁడు) ఇతి= అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

ఓ అర్జునా! జ్ఞానవిజ్ఞానములచేత దేనియందును ఆశలేని చిత్తముకలవాఁడును, చలింపనివాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును అయిన పురుషుఁడు యోగి యని చెప్పఁబడుననియును, ఇట్టియోగి మట్టి, గడ్డ, రాయి, బంగారము అనువానిని సమముగా తలఁచుననియును తాత్పర్యము.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥ ౯

టీ॥ సుహృన్మిత్రా...బంధుషు — సుహృత్ = ప్రత్యుపకారమును కోరకయే మేలును చేయువాఁడును, మిత్ర=స్నేహాతిశయముచేత నుపకారమును చేయువాఁడును, అరి=చాటున నపకారము చేయువాఁడు ను (లేక) అపకారము చేయనిదే స్వభావకార్యముచేతనే అపకారముచేయువాఁడును, ఉదాసీన=వివాదమును చేయుచున్నవారిలో నెవ్వనిపక్షమును అవలంబింపకయున్నవాఁడును, మధ్యస్థ = వివాదముచేయుచున్న వారి కిరువురికిని హితమును బోధించువాఁడును, ద్వేష్య ప్రత్యక్షమునందే అప్రియమైనవాఁడును (లేక) అపకారము చేసినందుకు బదులుగా నపకారమును చేయువాఁడును, బంధుషు=సంబంధము కలవాఁడును (అనునట్టి)వారియందును, సాధుష్వపిచ=శాస్త్రోక్త ప్రకారముగ సంచరించువారియందును, పాపేష్వపిచ=శాస్త్రనిషిద్ధమైన యాచారము నవలంభించు వారియందును సమబుద్ధిః=సమానమైన బుద్ధివృత్తి కలవాఁడు, విశిష్యతే=శ్రేష్ఠుఁడగుచున్నాఁడు, (లేక) విముచ్యతే = ముక్తుఁడగు చున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ప్రత్యుపకారమును అపేక్షింపకయే మేలును చేయు నట్టివారియందును, స్నేహవశమునుచేత మేలుచేయువారియందును చాటున నపకారము చేయువారియందును (లేక) అపకారము చేయనిదే స్వభావ క్రౌర్యముచేత నే అపకారమును చేయువారియందును, వివాదమును చేయు చున్న యిరువురిలో నెవ్వనిపక్షమును అవలంబింపక యూరకుండువారి యందును, వివాదమును చేయుచున్న యిరువురికిని హితమును చెప్పువారి యందును, ప్రత్యక్షముగ నపకారమునుచేయువారియందును, (లేక) అపకా రముచేసినందుకు బదులుగ నపకారమును చేయువారియందును సంబంధము కలవారియందును, శాస్త్రోక్తాచారముల ననుష్ఠించునట్టిసాధువులయందును, శాస్త్రనిషిద్ధములగు కార్యముల నాచరించునట్టి పాపాత్ములయందునుసమ మైనబుద్ధి కలవాఁడు సర్వోత్తముఁ డని (లేక) ముక్తుఁడని తాత్పర్యము.

శ్లో॥ యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ ౧౦

టీక. యోగీ=ధ్యానయోగముకలవాఁడు, (లేక) జ్ఞాని, ఏకాకీ= సహాయములేనివాఁడును, యతచిత్తాత్మా=నియమింపఁబడిన అంతఃకరణ మును దేహమును కలవాఁడును, నిరాశః=ఆశలు లేనివాఁడును, అపరి గ్రహః=పరిగ్రహము (తనకు పనికివచ్చునని యెడు తలంపుతో కౌపీనాది వస్తువులనుకూడ చేర్చిపెట్టుట) లేనివాఁడును, రహసి = ఏకాంతమునందు (పర్వతగుహాదులయందు స్థితః=ఉన్నవాఁడును, (సన్ = అగుచు) సతతమ్=సర్వకాలములయందును, ఆత్మానమ్ = అంతఃకరణమును, యుం జీత=(పరమాత్మయందు) చక్కఁగా నుంచవలయును.

ధ్యానయోగము కలవాఁడు (లేక) జ్ఞాని,సహాయమునువదలుకొనిన వాఁడును (సన్న్యాసియును) అంతఃకరణమును, దేహమును స్వాధీనముచేసి కొనినవాఁడును,దేనియందును ఆశ లేనివాఁడును,తనకుపయోగించునని యెడు

తలంపుతో కాపీనాదులనుకూడ సంగ్రహింపనివాఁడును,దుర్జనాదులు లేని (యేకాంతస్థలమునందు) (పర్వతగుహాదులయందు) నివసించిన వాఁడును అగుచు, సర్వకాలములయందును అంతఃకరణమును పరమాత్మయందు స్థిరముగ నుంచవలసినదని తాత్పర్యము.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ ౧౧

టీక. శుచౌ = (మార్జన ప్రోక్షణాది క్రియలచేతను, స్వభావము చేతను), పరిశుద్ధమైన, దేశే = ప్రదేశమునందు, నాత్యుచ్ఛ్రితమ్=మిక్కిలి యెత్తుగా నుండునదియును, నాతినీచమ్ = మిక్కిలి పొట్టిగా నుండునదియును, చేలాజినకుశోత్తరమ్ = వస్త్రము చర్మము దర్భ అనునవిమీఁద మీఁద గలదియును, స్థిరమ్=కదలనిదియును (అయిన)ఆత్మనః=తనయొక్క (లేక) తనకు, ఆసనమ్=ఆస్తరణమును,ప్రతిష్ఠాప్య=వేసికొని, (ఈవాక్యము నకు క్రిందిశ్లోకముతో అన్వయము)

ఓ అర్జునుఁడా! ధ్యానయోగము కలవాఁడు (స్వభావముచేతను, మార్జన ప్రోక్షణాదికముచేతను) పరిశుద్ధమైన దేశమునందు, మిక్కిలి యెత్తుగానుండనిదియును, మిక్కిలిపొట్టిగానుండనిదియును మొదటదర్భలు నిమ్మట వ్యాఘ్రచర్మము(లేక)కృష్ణాజినము దానిమీఁద వస్త్రము ఈక్రమముచేతఁ జేయఁబడినదియును, కదలనిదియును,(లేక) మార్పఁబడనిదియును అయిన తనయొక్క (లేక) తనకు ఆస్తరణమును కల్పించుకొని యని తా.

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మ విశుద్ధయే॥ ౧౨

టీక. తత్ర=ఆయాస్తరణమునందు, ఉపవిశ్య=కూర్చుండి, మనః= మనస్సును, ఏకాగ్రమ్=నిశ్చలమైన దానినిగా, కృత్వా=చేసి, యత

చిత్తేంద్రియః=చిత్తముయొక్కయు ఇంద్రియములయొక్కయు వ్యాపారములను నియమించినవాఁడగుచు, యోగీ=యోగి, ఆత్మవిశుద్ధయే=అంతఃకరణ శుద్ధికొఱకు, యోగమ్ = యోగమును, యుంజ్యాత్ = అభ్యసింపవలయును.

అటువంటి యాస్తరణమునందు (ఆసనమునందు) కూర్చుండి మనస్సును శబ్దాది విషయములనుండి మరల్చి నిశ్చలమైనదానినిగాఁజేసి చిత్తముయొక్కయును ఇంద్రియములయొక్కయును వ్యాపారములనుమాని అంతఃకరణశుద్ధికొఱకు యోగాభ్యాసమును చేయవలసినది అని తాత్పర్యము.

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥౧౩

టీక. కాయశిరోగ్రీవమ్ = శరీరశిరఃకంఠములను, సమమ్=సమముగాను, అచలమ్=నిశ్చలముగాను, ధారయన్=ధరించుచున్న వాఁడగుచు, స్థిరః=దృఢప్రయత్నముకలవాఁడై, స్వమ్=స్వకీయమైన, నాసికాగ్రమ్ = ముక్కుకొనను, సంప్రేక్ష్య=(చూచినట్లు) చూచి,(చూపును విషయములమీఁదికిఁ బోనీయక ముక్కుకొనవఱకే పోనిచ్చి) దిశశ్చ = దిక్కులను గూడ, అనవలోకయన్ = చూడనివాఁడగుచు,

శరీరశిరఃకంఠములను సమముగాను, నిశ్చలముగాను, ధరించుచున్న వాఁడగుచు, దృఢప్రయత్నము కలవాఁడై తన ముక్కుకొనను చూచినట్లు చూచి (చూపును బాహ్యవిషయములమీఁదికిఁ బోనీయక ముక్కుకొనవఱకే పోనిచ్చి) (తన శరీరమునే కాక) దిక్కులనుకూడ చూడనివాఁడగు నని తాత్పర్యము. ఈ శ్లోకమునకు క్రిందిశ్లోకముతో నన్వయము.

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥౧౪

టీక. ప్రశాంతాత్మా=అధికముగా శాంతమైన యంతఃకరణము కలవాఁడును, విగతభీః = భయములేనివాఁడును, బ్రహ్మచారివ్రతే = బ్రహ్మనిష్ఠచర్యమునందు, స్థితః ఉన్నవాఁడును, (భవేత్=కావలయును. కించ= ఇంతియగాక) మనః=మనస్సును, సంయమ్య=నిగ్రహించి, మచ్చిత్తః= నాయందే చిత్తము కలవాఁడును, మత్పరః=నేనే యుత్తముఁడనుగాఁగల వాఁడును, యుక్తః=చిత్తసమాధానము కలవాఁడును, సన్=అయినవాఁడైయుండు, ఆసీత = ఉండవలయును.

ఓ అర్జునుఁడా! పైన చెప్పఁబడినవిధముగ శరీరధారణాదికమును చేయుచున్నవాఁ డగుటయే కాక మఱియును శాంతమైన అంతఃకరణము కలవాఁడును (రాగద్వేషాదులనురాగద్వేషాది కారణములను మనస్సునందు లేకుండునట్లు చేసికొన్నవాఁడును)భయములేనివాఁడును, (సర్వకర్మములను వదలినందువలన దోషములేదని శాస్త్రనిశ్చయమువలనఁ దెలిసికొన్నవాఁడును) బ్రహ్మచర్యమునందున్నవాఁడు (భిక్షాన్నభోజనము, త్రిషవణ స్నానము, శౌచము, ఆచమనము మొదలగునవికలవాఁడును) కావలయును. మఱియును, మనస్సును విషయములమీఁదికిఁ బోనీయక నాయందయుంచఁ డిన చిత్తముకలవాఁడును, నేనే యుత్తముఁడనుగాఁ గలవాఁడును(నన్నే సేవించువాఁడును) కావలసిన దని తాత్పర్యము.

శ్లో॥ యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥ ౧౫

టీక. నియతమానసః=నియమింపఁబడిన మనస్సుగల, యోగీ = యోగాభ్యాసకుఁడు, సదా = ఎల్లప్పుడును, ఏవమ్ = ఈ ప్రకారముగా, ఆత్మానమ్=మనస్సును, యుంజన్=సమాధానమును చేయుచున్నవాఁడై (నిలిపినవాఁడై), నిర్వాణపరమామ్=మోక్షమే సర్వోత్తమమును అయినది గాఁ గల్గినదియును, మత్సంస్థామ్ = నా యధీనమైనదియును,(అయిన)శాంతిమ్ = సంసారోపరతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

సీ. అర్జునుఁడా! మనస్సును నిగ్రహించిన ధ్యానయోగి (సన్న్యాసి) సర్వకాలములయందును, ఇదివఱకుఁ జెప్పఁబడినరీతిచేత మనస్సును నిలిపిన యెడల మోక్షమనియెడు పేరుకలదియును, బ్రహ్మమునగు నారూపముతో నుండుట యనునదియును అయిన సర్వసంసారోపరతిని(బ్రహ్మాకారముతో నుండుట యనియెడు మోక్షమును) బొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥ ౧౬

టీక. హే అర్జున=ఓ అర్జునుఁడా! అత్యశ్నతస్తు=అధికముగా భుజించువానికిని, యోగః=యోగము, నాస్తి=లేదు. ఏకాంతమ్ = అత్యంతమును, (కొంచెముగానైనను) అనశ్నతశ్చ = భుజింపనివానికిని, యోగః=యోగము, నాస్తి=లేదు. అతిస్వప్నశీలస్యచ = అధికముగా నిద్రను పొందువానికిని, యోగః=యోగము, నాస్తి=లేదు. జాగ్రతశ్చ= (అధికముగా) మేలుకొనియుండువానికిని,యోగః=యోగము, నాస్తి=లేదు.

సీ. అర్జునుఁడా! అధికముగా భోజనము చేయువానికిని, బొత్తిగా భుజింపనివానికిని, అధికముగా నిద్రించువానికిని, బొత్తిగా నిద్రింపని వానికిని యోగము సంభవింప దని తాత్పర్యము.

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ ౧౭

టీక. యుక్తాహారవిహారస్య=పరిమితము లయిన ఆహారవిహారములు కలవాఁడును, కర్మసు = పనులయందు, యుక్తచేష్టస్య=మితమైనచేష్టలు, కలవాఁడును, యుక్తస్వప్నావబోధస్య=పరిమితము లయిన నిద్రాజాగరణములు కలవాఁడును (అయిన) (యోగినః=యోగికి) యోగః=యోగము, దుఃఖహా = దుఃఖములను పోఁగొట్టునది, భవతి = అగుచున్నది.

తగినంత యన్నము తినువాఁడును, మితముగ సంచరించువాఁడును మితముగ నిద్రపోవువాఁడును, మితముగ మేలుకొనియుండువాఁడును, ప్రణవమే జపములు గాఁగల సకలవ్యాపారముల నుండును వాగాదీంద్రియముల యొక్క చేష్టలను మితముగఁ జేయువాఁడును అయిన యోగికి యోగము సకల సంసారదుఃఖములను పోఁగొట్టునని తాత్పర్యము.

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మన్యేవాఽవతిష్ఠతే ।
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్తఇత్యుచ్యతేతదా॥ ౧౮

టీక. యదా = ఎప్పుడు, చిత్తమ్ = చిత్తము, వినియతమ్ = నిశ్చలత్వమును పొందింపఁబడిన దగుచు, ఆత్మన్యేవ = ఆత్మయందే, అవతిష్ఠతే = ఉన్నదో, తదా = అప్పుడు, సర్వకామేభ్యః = సమస్తము లగు శబ్దాది విషయములనుండి, నిస్పృహః = ఆశారహితుఁడై, యుక్తః = యోగారూఢుఁడు (యోగమునుపొందినవాఁడు) ఇతి = ఇట్లని, (బుధైః = విద్వాంసులచేత) ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఎప్పుడు చిత్తము నిశ్చలత్వమును పొందినదై సర్వములగు బాహ్యవిషయములను విడిచిపెట్టి అద్వితీయాత్మతత్త్వమునందే నివసించియుండునో అప్పుడు సమస్తము లయిన శబ్దాదివిషయములయందును, ఆశలేనివాఁడై పండితులచేత యోగారూఢుఁడని చెప్పఁబడుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా ।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః॥

టీక. ఆత్మనః = ఆత్మయొక్క, యోగమ్ = యోగమును (ఆత్మధ్యానయోగమును), యుంజతః = అభ్యసించుచున్న, యోగినః = యోగియొక్క, యతచిత్తస్య = నియమితమైన చిత్తమునకు, (లేక) నిశ్చలచిత్తస్య

మనకు, నివాతస్థః=గాలి లేని చోట నున్న, దీపః = దీపము, యథా =
ఏ విధముగా, నేంగతే = చలింపదో, సా=అచలింపని విధము, ఉపమా =
దృష్టాంతము, (ఇతి=ఇట్లని) స్మృతా=చెప్పఁబడినది (లేక) ఆత్మనః -
యోగమ్ = ఆత్మధ్యానమును, యుంజతః = అభ్యసించుచున్నవాఁడును,
(ఆత్మసమాధిని అనుష్ఠించు చున్నవాఁడును) యతచిత్తస్య = స్వాధీనమైన
మనస్సు గలవాఁడును (అయిన), యోగినః = సమాధినిష్ఠునియొక్క,
(చిత్తస్థైర్యస్య=మనోనిశ్చలతకు) నివాతస్థః=గాలిలేనిచోట నున్న, దీపః
=దీపము, యథా=ఏ ప్రకారముగా, నేంగతే=చలింపదో, సా=ఆనిష్ఠ,
(ఆ చలనరాహిత్యము) ఉపమా = దృష్టాంతము,(ఇతి=ఇట్లని) స్మృతా=
చెప్పఁబడినది.

ఆత్మధ్యానమును చేయుచున్నవాఁడును, మనస్సును స్వాధీనముగఁ
జేసికొనినవాఁడును అయిన యోగియొక్క చిత్తము గాలిలేనిచోట నున్న
దీపమువలె కదలనిదై వస్తువులను ప్రత్యక్షముగఁ జేయువిధముగఁ బాహ్య
విషయవ్యాపారము లేనిదై బ్రహ్మమును సాక్షాత్కరించునని తాత్పర్యము.

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాఽఽత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

టీక. యత్ర=ఏకాలమునందు, చిత్తమ్=మనస్సు, యోగసేవయా=
యోగానుష్ఠానముచేత, నిరుద్ధంసత్ = నిగ్రహింపఁబడినదగుచు, ఉపర
మతే=ఉపరతిని పొందుచున్నదో, యత్ర చ=ఏకాలమునందైతే, ఆత్మనా=
(పరిశుద్ధమైన) అంతఃకరణముచేత, ఆత్మానమ్=పరమాత్మను, ఆత్మన్యేవ=
ఆత్మయందే, పశ్యన్=చూచుచు, తుష్యతి = సంతోషించుచున్నాఁడో,
(లేక)ఆత్మని=ఆత్మయందు,తుష్యత్యేవ=సంతోషించుచునేయున్నాఁడో

ఓ అర్జునుఁడా! ఏ కాలమునందు మనస్సు యోగానుష్ఠానముచేత
బాహ్యవిషయములనుండి తొలఁగింపఁబడినదై ఉపరతిని(శాంతిని) పొందు

యున్నదో, ఏ సమయమునందు యోగి యనువాడు పరిశుద్ధమైన యంతఃకరణముచేత సర్వస్థలములయందును ప్రకాశించునట్టి తేజోరూపుఁడగు పరమాత్మను చూచుచు, అనఁగా ప్రత్యగాత్మ యగు తనను పరమాత్మనుగాఁ దెలిసికొనుచు తనయందే సంతుష్టిని పొందుచున్నాఁడో అని తాత్పర్యము.

శ్లో॥ సుఖ మాత్యంతికం య త్తద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి త త్త్వతః॥ 21

టీక. ఆత్యంతికమ్=అంతములేనిదియును, బుద్ధిగ్రాహ్యమ్=(ఇంద్రియాపేక్ష లేని) బుద్ధిచేతనే (స్వానుభవముచేతనే) తెలియఁదగినదియును, అతీంద్రియమ్=ఇంద్రియములకు గోచరము కానిదియును (విషయములవలనఁ బుట్టినదియును) (అయిన) సుఖమ్ = సుఖము, యత్ = ఏది, (అస్తి= కలదో), తత్ =అటువంటి సుఖమును, యత్రచ=ఏ కాలమునందు, వేత్తి= తెలుసుకొను చున్నాఁడో, అయమ్ = ఇట్లు తెలిసికొన్న విద్వాంసుఁడు, ఆత్మస్వరూపే = ఆత్మస్వరూపమునందు) స్థితస్సన్=ఉన్నవాఁ డగుచు, తత్త్వతః=తత్త్వస్వరూపమునుండి, నైవచలతి=చలింపనే చలింపఁడు.

ఓ అర్జునుఁడా! ఆద్యంతములు లేనిదియును, ఇంద్రియాపేక్ష లేని బుద్ధి చేతనే (స్వానుభవముచేతనే) తెలియఁదగినదియును, ఇంద్రియములకు గోచరము కానిదియును (విషయములవలనఁ బుట్టినదియును) అయిన సుఖమును విద్వాంసుఁ డగువాఁడు ఏకాలమునందు తెలిసికొను చున్నాఁడో అటువంటి యీ విద్వాంసుఁడు ఆత్మస్వరూపమునం దున్నవాఁ డగుచు ఆత్మస్వరూపమునుండి యెన్నటికిని చలింపఁ డని తాత్పర్యము.

శ్లో॥ యం లబ్ధ్వాచాఽపరం లాభం మన్యతే నాఽధికంతతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥ 22

టీక. యమ్ = ఏ యాత్మలాభమును, లబ్ధ్వా = పొంది, తతః = ఆ యాత్మలాభమునకంటె, అపరమ్=ఇతర మైన, లాభమ్=లాభమును, అధి

కమ్ = అధికమైనదానినిగా, నమన్యతే = తలంపఁడో; యస్మిన్ = ఏ యాత్మతత్త్వమునందు, స్థితః = ఉన్నవాఁడు, గురుణా=అధికమైన, దుఃఖే నాపి=దుఃఖముచేతఁగూడ, నవిచాల్యతే=చలింపఁబడఁడో.

ఏయాత్మలాభమును పొంది ఆయాత్మలాభముకంటె నధిక మైన లాభము (పురుషార్థము) ఇతర మైనది యేదియును లే దని తలఁచునో, ఏ యాత్మతత్త్వమునం దున్నవాఁడు అత్యధిక మైన దుఃఖముచేతఁ గూడ చలనమును పొందఁడో అని తాత్పర్యము.

శ్లో॥ తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ ౨౩

టీక. తమ్=ఆపూర్వోక్త మైన, (ఇదివఱకుఁ జెప్పఁబడిన) దుఃఖ సంయోగవియోగమ్=దుఃఖములతో సంబంధము లేక యుండుటను, యోగ సంజ్ఞితమ్=యోగ మను పేరుగల దానినిఁగా, విద్యాత్ = తెలియ వల యును, సః = అటువంటి, యోగః = యోగము, నిశ్చయేన = (శాస్త్రా చార్యోక్తప్రకారముగ ఈ జన్మమునందే యైనను, లేక మఱియొక జన్మమునం దైనను సిద్ధిని కలిగించు ననియెడు) నిశ్చయముచేతను, అనిర్విణ్ణ చేతసా= శీఘ్రముగ సిద్ధింప లే దనియెడు పరితాపములేని మనస్సుచేతను, యోక్తవ్యః=కూర్పఁదగినది. (చేయఁదగినది).

ఇదివఱకుఁ జెప్పఁబడిన విశేషణములు కలదియును, దుఃఖసంబం ధము లేనిదియును అగునట్టి అంతఃకరణపరిణామమును యోగ మని తెలిసి కొని అట్టి యోగమును శాస్త్రాచార్యోక్తప్రకారముగ, ఈ జన్మమునం దైనను, మఱియొక జన్మమునం దైనను ఫలించు ననియెడు నిశ్చయము కల వాఁడును, శీఘ్రముగ సిద్ధింపక పోయెనే యను పరితాపము లేనివాఁడును నై అభ్యసింప వలసిన దని తాత్పర్యము.

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ ౨౪

టీక. సంకల్పప్రభవాన్=సంకల్పము కారణముగాఁగల, సర్వాన్= సమస్తము లయిన, కామాన్=విషయాభిలాషలను, అశేషతః = నిశ్శేషముగా, త్యక్త్వా=విడిచి, మనసైవ = మనస్సుచేతనే, ఇంద్రియగ్రామమ్= ఇంద్రియసముదాయమును, సమంతతః=అంతటను, (చక్కఁగ) (లేక) సకల విషయములనుండి, వినియమ్య = నిగ్రహించి, (యోగః = యోగము, యోక్తవ్యః = చేయఁదగినది) (లేక) (శనైశ్శనైః=మెల్ల మెల్లగా, ఉపరమేత్=ఉపరతిని పొందవలయును.) అని కొందఱు క్రిందిశ్లోకముతో నన్వయించుచున్నారు.

ఓ అర్జునుఁడా! సంకల్పమువలన కలుగునట్టి సమస్తవిషయాభిలాషలను నిశ్శేషముగా విడిచిపెట్టి మనస్సుచేతనే ఇంద్రియసముదాయమును చక్కఁగ సర్వకాలములయందును) (లేక) సకలవిషయములనుండి నిగ్రహించి యోగమును అభ్యసింపవలసినది (లేక మెల్ల మెల్లగా ఉపరతిని పొందవలసినది అని తాత్పర్యము.

శ్లో॥ శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్॥ ౨౫

టీక. ధృతిగృహీతయా=ధైర్యముచేత గ్రహింపఁబడిన, బుద్ధ్యా= బుద్ధిచేత, మనః=మనస్సును, ఆత్మసంస్థమ్=మనస్సునందున్న దానినిఁగా, కృత్వా=చేసి, శనైశ్శనైః = మెల్ల మెల్లగా, (విషయేభ్యః = విషయముల నుండి) ఉపరమేత్=ఉపరతిని పొందవలయును. కించిదపి = కొంచెము నైనను, నచింతయేత్=తలంపఁగూడదు; (లేక) ధృతిగృహీతయా=ధైర్యముచే గ్రహింపఁబడిన, బుద్ధ్యా = బుద్ధిచేత, శనైశ్శనైః మెల్లమెల్లగా, (విషయేభ్యః=విషయములనుండి) ఉపరమేత్=శాంతిని పొందవలయును;

మనః = మనస్సును, ఆత్మసంస్థమ్ = (సర్వమును, ఆత్మయే కాని ఆత్మ తత్త్వముకంటె నితర మేదియును లేదను నభిప్రాయముతో), ఆత్మయందున్న దానినిగా, కృత్వా=చేసి, కించి దపి = (ఆత్మతత్త్వముకంటె నితర మును) కొంచెమునుకూడ, నచింతయేత్=ఆలోచింపఁగూడదు.

ఓ అర్జునుఁడా! ధైర్యముతోఁ గూడుకొనిన బుద్ధిచేత మనస్సును, ఆత్మయందున్న దానినిగా జేసి మెల్ల మెల్లగ విషయములనుండి శాంతినిపొంద వలయును. మఱియును, ఆత్మతత్త్వముకంటె నితరమైన దానిని కొంచెముగా నైనను ధ్యానము చేయఁగూడ దని, (లేక) ధైర్యముతోఁ గూడిన బుద్ధిచేత మెల్ల మెల్లగా విషయములనుండి శాంతినిపొందవలయును. మఱియును, సర్వ మును ఆత్మయే కాని ఆత్మతత్త్వముకంటె నితరం మేదియును లే దనియెడు నభిప్రాయముతో మనస్సును ఆత్మయం దున్న దానినిగాఁ జేసి ఆత్మతత్త్వము కంటె నితర మగుదానిని కొంచెముకూడ ధ్యానింపఁగూడ దన తాత్ప.

శ్లో॥ యతో యతో నిస్సరతి మనశ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్॥ ౨౬

టీక. చంచలమ్=అధికముగా చపలమైనది (కనుకనే), అస్థిరమ్ = స్థిరము గాని, మనః = మనస్సు, యతో యతః=ఏయే విషయములయందు, నిస్సరతి = సంచరించుచున్నదో, తత స్తతః = ఆయా విషయములనుండి, ఏతత్=ఈ మనస్సును, నియమ్య=మరల్చి, ఆత్మన్యేవ=తనయందే (స్వస్వ రూపమునందే) వశమ్=అధీనమును, నయేత్=పొందింపవలయును.

అధికముగా చపలమైనదికనుకనే స్థిరముగానుండని మనస్సు యేవిష యములవైఁపునకుఁ బోవుచుండునో ఆయావిషయములనుండి మరల్చి స్వస్వ రూపమునందు నిలిచి యుండు దానినిగాఁ జేయవలసిన దని తాత్పర్యము.

శ్లో॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥ ౨౭

టీక. ప్రశాంతమనసమ్ = శాంతిని పొందిన మనస్సు కలవాఁడును, శాంతరజసమ్=క్షీణమైన రజోగుణము కలవాఁడను, బ్రహ్మభూతమ్= జీవన్ముక్తుఁడును, అకల్మషమ్=పాపరహితుఁడును, (అయిన) ఏనమ్ = ఈ, యోగినమ్=యోగిని, ఉత్తమమ్ = సర్వోత్తమ మైన, సుఖమ్ = సుఖము (మోక్షసుఖము), ఉపైతిహి = పొందుచున్నదిగదా.

విషయములయందు ప్రవర్తింప కుండ స్వాధీనము చేసికొనఁబడిన మనస్సు కలవాఁడును, కామము క్రోధము మొదలుగాఁగల రజోగుణములు లేనివాఁడును, జీవన్ముక్తుఁడును, (దేహము పోయిన పిమ్మట కలుగునట్టి జననమరణ సంసారదుఃఖనివృత్తి యనఁబడు ముక్తిస్థితిని శరీర ముండునపుడే యనుభవించువాఁడును), ధర్మాధర్మాది కల్మషములు లేనివాఁడును అయిన యోగి సర్వోత్తమ మైన మోక్షమును పొందునని తాత్పర్యము.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే॥ ౨౮

టీ. ఏవమ్ = ఈవిధముగా, సదా = సర్వకాలములయందును, ఆత్మానమ్=మనస్సును, యుంజన్ = (ఆత్మయందు) సంధానము చేయుచున్నవాఁడును, (అయిన) యోగీ = ధ్యానయోగి, సుఖేన = అనాయాసముగా, బ్రహ్మసంస్పర్శమ్ = బ్రహ్మముతో అధికముగా స్పర్శము కలదియును, (బ్రహ్మసాక్షాత్కారరూప మయినదియును), అత్యంతమ్=అంతము లేనిదియును, (సర్వోత్తమ మయినదియును) (అయిన) సుఖమ్=సుఖమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

ఓ, అర్జునా! ఇదివఱకుఁ జెప్పఁబడిన విధముగ సర్వకాలములయందును మనస్సును ఆత్మయందు సంధానము చేయుచున్నవాఁడును, పాపరహితుఁ

డును, (యోగవిఘ్నములు లేనివాఁడును) అయిన ధ్యానయోగి అనాయాస
ముగా బ్రహ్మసాక్షాత్కారరూపమును, సర్వోత్తమమును అయిన సుఖ
మును పొందు చున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯

టీక. సర్వత్ర = సకలభూతములయందును, సమదర్శనః = బ్రహ్మ
మును చూచు చున్నవాఁడు, యోగయుక్తాత్మాసన్ = యోగములోఁ
గూడిన యంతఃకరణము గలవాఁ డగుచు, ఆత్మానమ్=తనను, సర్వభూత
స్థమ్=సకలభూతములయందును వున్నవానినిగాను, సర్వభూతానిచ=సకల
భూతములను, ఆత్మని=తనయందు, (గతాని=పొందినవానినిగాను) ఈక్షతే=
చూచు చున్నాఁడు.

ఓ అర్జునా! బ్రహ్మాది స్థావరాంతము లగు సకలభూతములయందును
గల ఆత్మలకును బ్రహ్మమునకును భేదము లేదనియెడు జ్ఞానము గలవాఁడు
(అనఁగా సర్వమును బ్రహ్మమునుగాఁ జూచు చున్నవాఁడు) స్థిరముగాఁ
జేయఁబడిన యంతఃకరణము గలవాఁ డగుచు తనను బ్రహ్మాదిస్తంబపర్యం
తములగు సకలభూతములయందును వున్నవానినిగాను తనయందు బ్రహ్మాది
స్తంబపర్యంతము లగు సకలభూతములను వున్నవానినిగాను (అనఁగా)
తననే బ్రహ్మమునుగాఁ జూచు చున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ ౩౦

టీక. యః = ఎవ్వఁడు, సర్వత్ర = సర్వభూతములయందును,
మామ్=నన్ను, పశ్యతి = చూచు చున్నాఁడో; సర్వంచ = సకలభూత
సముదాయమును, మయి = నాయందు, పశ్యతి = చూచుచున్నాఁడో;

తస్య=అతనికి, అహమ్=నేను, నప్రణశ్యామి = కనఁబడకపోను, సచ = వాఁడును, మే=నాకు, నప్రణశ్యతి=కనఁబడకపోఁడు.

ఓ అర్జునా! ఏపురుషుఁడు సకలభూతములయందును నన్నుఁజూచుచున్నాఁడో సకలభూతసముదాయమును నాయందుఁ జూచుచున్నాఁడో అట్టి వానికిని నాకును భేదములేదు. కనుక వానికి నేను కనఁబడకపోను, నాకు వాఁడు కనఁబడకపోఁడు అని తాత్పర్యము.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ ౩౧

టీక. యః=ఏయోగి, అభేదమ్=అభేదమును, ఆస్థితస్సన్=పొందినవాఁడగుచు, సర్వభూతస్థితమ్=సకలభూతములయందును వున్న, మామ్=నన్ను, భజతి = సేవించుచున్నాఁడో, సః = అట్టి యోగి, సర్వథా = సర్వప్రకారములచేతను, (అనఁగా నిష్టానుసారముగా) వర్తమానోఽపి=ప్రవర్తించుచున్నను, మయి=నాయందు, వర్తతే=ప్రవర్తించుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఏ యోగి అభేదమును పొందినవాఁడగుచు సకలభూతములయందును వున్న నన్ను సేవించుచున్నాఁడో (అనఁగా ఏయోగి సకలభూతములయందును వున్న నాకును తనకును భేదము లేదనియెడు నిశ్చయాభిప్రాయముతో నుండునో) అట్టివాఁడు సకలదురాచారాములను ఆచరించుచున్నను నిత్యముక్తుఁడు కనుక నాయందే యున్నవాఁడగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥

టీక. హేఅర్జున = ఓ అర్జునుఁడా! యః = ఏ, యోగీ = ధ్యానయోగి, సుఖంవా = సుఖమును, దుఃఖంవాయది = దుఃఖమును, ఆత్మౌ

మ్యేన=ఆత్మసామ్యము చేత, సర్వత్ర=సర్వభూతములయందును, సమమ్= సమముగా, పశ్యతి=చూచుచున్నాఁడో; సః=అటువంటి, యోగీ=యోగి, పరమః = సర్వోత్తముఁడు, ఇతి = ఇట్లని, (మమ = నాకు) మతః = సమ్మతుఁడు,

ఓ అర్జునుఁడా! ఏ యోగి సుఖము తనకేవిధముగా అనుకూలమై యుండునో అటులనే సకలభూతములకును అనుకూలమై యుండు నని యును, దుఃఖము తనకు ప్రతికూలమై యున్నవిధముగానే సకలభూత ములకును ప్రతికూలమై యుండు ననియును తలఁచుచున్నాఁడో అట్టి యోగి సర్వోత్తముఁ డనియును, నా కభిమతుఁ డనియును తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన
ఏతస్యాఽహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పుచున్నాఁడు. హే మధు సూదన=ఓ శ్రీకృష్ణా! త్వయా=నీచేత, సామ్యేన=మనస్సమాధానము చేత, యః=ఏ, అయమ్=ఈ, యోగః=యోగమును, ప్రోక్తః=చెప్పఁబడెనో; ఏతస్య=ఈ యోగముయొక్క, స్థిరామ్ = చలింపని, స్థితిమ్=నిలుకడను, (మనసః=మనసు) చచలత్వాత్=చంపల మైన దగుటవలన, అహమ్= నేను, నపశ్యామి=చూడను, (తెలిసికొనఁజాలను).

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ కృష్ణుఁడా! మనస్సు లయవిక్షే పములు లేనిదై కేవలాత్మాకారముతో నుండుటయే యోగ మనియును, అట్టి యోగమును అభ్యసింపవలసిన దనియును చెప్పితివి. మనస్సు మిగుల చపలమైన దగుటవలన మనస్సు లయవిక్షేపములు లేనిదై కేవలాత్మా కారముతో నుండుట యనియెడు యోగము చిరకాలము వుండు నని నాకుఁ గనఁబడదు అనఁగా నేను తలఁచుచుండ లేదని తాత్పర్యము.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాఽహం నిగ్రహంమన్యే వాయోరివ సుదుష్కరమ్॥

టీక. హే కృష్ణ=ఓ కృష్ణుఁడా! హి = ఏకారణమువలన, మనః= మనస్సు, చంచలమ్ = చపలస్వభావము కలదో, (అపిచ = ఇంతియగాక) ప్రమాథి=(దేహేంద్రియములను) అధికముగా క్షోభ పెట్టునట్టిదో, (అపిచ= ఇంతియగాక, బలవత్=ఎవ్వనిచేతను నియమింప శక్యముకానిదో, అపిచ= ఇంతియగాక, దృఢమ్ = ఛేదింప శక్యము కానిదో, (తస్మాత్ = అందువలన) అహమ్ = నేను, తస్య=ఆ మనస్సుయొక్క, నిగ్రహమ్=నిరోధమును, వాయోః=వాయువుయొక్క, నిగ్రహమివ = నిరోధమునువలెనే, సుదుష్కరమ్=మిగుల కఠినమైనదానినిగా, మన్యే=తలఁచుచున్నాను.

ఓ కృష్ణుఁడా! మనస్సు చపలస్వభావము కలదియును, దేహేంద్రియములను బలముగా క్షోభ పెట్టునట్టిదియును, ఎవ్వనిచేతను నియమింప శక్యము కానిదియును, తంతునాగమనియెడు జలచరపదార్థమువలె ఛేదింప నలవికానిదియును నైయున్నది. కావున అట్టి మనస్సు వాయువువలె నిగ్రహింప శక్యము కానిదని నేను తలఁచుచున్నానని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే

టీక. శ్రీభగవానువాచ=సంపద్యుక్తుఁడగు భగవంతుఁడు చెప్పెను. మహాబాహో = అధికమైన భుజబలము గల యో యర్జునుఁడా! మనః= మనస్సు, దుర్నిగ్రహమ్=నిగ్రహింప శక్యము కానిదియును, చంచలమ్= చపలస్వభావము కలదియును, (ఇత్యత్ర = అనునట్టి యీ విషయమునందు) అసంశయమ్=సందేహము లేదు. హే కౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన

యో యర్జునుఁడా! (కింతు=ఇఁక నే మనిన, తత్=ఆ మనస్సు) అభ్యా
సేన=అభ్యాసము చేతను, వైరాగ్యేణచ=వైరాగ్యముచేతను, గృహ్యతే =
నిగ్రహింపఁబడు చున్నది.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—అధిక మైన భుజబలము గల
యో యర్జునుఁడా! మనస్సు నిగ్రహింప శక్యము కానిదియును, మిగుల
చపలమైనదియును అనునట్టి విషయమునందు సందేహ మేమియును లేదు.
అనఁగా మనస్సు నిగ్రహింపశక్యము కానిదియును చపలస్వభావము
కలదియును అగును. అయినప్పటికిని కుంతీపుత్రుఁడ వైన యో యర్జు
నుఁడా! ఆ మనస్సును అభ్యాసముచేతను వైరాగ్యముచేతను నిగ్రహింప
వచ్చు నని తాత్పర్యము.

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥

టీక. అసంయతాత్మనా=(అభ్యాసవైరాగ్యములచేత) నిగ్రహింపఁ
బడని మనస్సు కలవానిచేత, యోగః = యోగము, దుష్ప్రాపః = పొంద
శక్యము కానిది, యతతా = ప్రయత్నించు చున్న, వశ్యాత్మనాతు =
(అభ్యాసవైరాగ్యములచేత) స్వాధీనముగాఁ జేయఁబడిన మనస్సు గలవాని
చేత నైతే, ఉపాయతః=(అభ్యాసవైరాగ్యములతోఁ గూడిన మనోనిగ్రహ
మనియెడు) ఉపాయమువలన, యోగః=యోగము, అవాప్తుమ్ = పొందుట
కొఱకు, శక్యః=శక్య మైనది, ఇతి=ఇట్లని, మే = నాయొక్క, మతిః=
మతము.

ఓ అర్జునా! అభ్యాసవైరాగ్యములచేత నిగ్రహింపఁబడని మనస్సు
గలవాఁడు యోగమును పొందఁజాలఁడు, మాటిమాటికిని యెడతెగక
ప్రయత్నించుచు అభ్యాసవైరాగ్యములతోఁ గూడిన మనోనిగ్రహ మను
నట్టి యుపాయమువలన యోగమును పొందు నని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥ 37

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హే కృష్ణ = ఓ కృష్ణుఁడా! (యోగమార్గే = యోగమార్గమునందు) శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధితో, ఉపేతః = కూడుకొనినవాఁడును, అయతిః = (ఆయుష్కాల మల్పమగుటచేత సంపూర్ణ మైన నియమములేనివాఁడును, యోగాత్ = యోగము నుండి, చలితమానసః = చలింపఁబడిన మనస్సు కలవాఁడును, (అయిన) యోగీః యోగసంసిద్ధిమ్ = యోగఫలమును, అప్రాప్య = పొందక, కామ్ = ఏ, గతిమ్ = స్థానమును, గచ్ఛతి = పొందుచున్నాఁడు.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.— ఓ కృష్ణుఁడా! ఆస్తిక్యబుద్ధితోఁ గూడుకొనినవాఁడును, ఆయుష్కాలము కొంచె మగుటచేత పూర్ణ మైన నియమము (లేక) యత్నము లేనివాఁడును, యోగమునుండి చలింపఁబడిన మనస్సు కలవాఁడును అయిన యోగి యోగఫలమును పొందక యేస్థానమును పొందునని తాత్పర్యము.

శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ 38

టీక. హేమహాబాహో = అధిక మైన భుజబలము గల యో కృష్ణుఁడా! బ్రహ్మణః = బ్రహ్మముయొక్క, పథి = మార్గమునందుఁ విమూఢః = మూఢుఁ డగువాఁడు, అప్రతిష్ఠః = నిరాశ్రయుఁ డైనవాఁ డగుచు, ఉభయవిభ్రష్టః = కర్మజ్ఞానమార్గముల రెంటివల్లను భ్రష్టుఁ డైన, ఛిన్నాభ్ర మివ = చెదరిన మేఘమువలె, న నశ్యతి కచ్చిత్ = చెడిపోఁడా? ఏమి.

అధిక మైన భుజబలము గల యోకృష్ణుఁడా! బ్రహ్మమును పొందుటకుఁ దగినమార్గము తెలియనియోగి నిరాశ్రయుఁడును, కర్మజ్ఞానమార్గ

ముల రెంటివలనను భ్రష్టుడునై, చెదరిన మేఘము వర్షమును గలుగఁ జేయఁజాలనిదై చెడిపోవువిధముగఁ జెడిపోఁడా ? ఏమి? అని తాత్పర్యము.

శ్లో॥ ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్య శేషతః।
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥ 39

టీక. హేకృష్ణ=ఓ కృష్ణుఁడా ! త్వమ్ = నీవు, మే నా యొక్క, ఏతత్=ఈ, సంశయమ్ = సందేహమును, అశేషతః = నిశ్శేషముగా, ఛేత్తుమ్ = ఛేదించుటకొఱకు, అర్హసి = తగుదువు. అస్య = ఈ, సంశయస్య=సంశయమునకు, ఛేత్తా=నాశకుఁడు, త్వదన్యః = నీకంటె నితరుఁడు, నోపపద్యతే హి = దొరకఁడు గదా !

ఓ కృష్ణా ! నీవు నా సందేహము బాగుగాఁ బోఁగొట్టుటకుఁ దగినవాఁడవు, నీకంటె నితరుఁడు మఱెవ్వఁడును లేఁడు అని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40

టీక. శ్రీభగవానువాచ=శ్రీకృష్ణుఁడు చెప్పెను. హేపార్థ=కుంతీపుత్త్రుఁడవైన యో యర్జునుఁడా ! తస్య = ఆ యోగభ్రష్టునకు, ఇహ చ= ఈ లోకమునందును, అముత్ర చ=పరలోకమునందును, వినాశః = నాశము, న విద్యతే=లేదు. హే తాత = ఓ తండ్రీ ! కల్యాణకృత్ = శుభమును చేసినవాఁడు, కశ్చిదపి=ఒకఁడును, దుర్గతిమ్ = కుత్సితమైన స్థానమును, న గచ్ఛత్యేవ హి=పొందఁడు గదా.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—కుంతీపుత్త్రుఁడవైన యో యర్జునుఁడా! ఆ యోగభ్రష్టునకు ఈలోకమునందును, పరలోకమునందును వినాశము లేదు. అనఁగా ఇహపరలోకములయందు నిదివఱకు పొందిన సుఖ

ములకంటె తక్కువసుఖములను పొందఁడు. ఓ తండ్రీ! శుభకరమగు యోగ మును అభ్యసించినవాఁ డెవ్వఁడును దుర్గతిని యెన్నటికిని పొందఁడనితా.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః॥
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥

టీక. యోగభ్రష్ట=యోగమునుండి జారినవాఁడు, పుణ్యకృతామ్= అశ్వమేధము మొదలుగాఁ గల పుణ్యకార్యములను చేసినవారియొక్క, లోకాణ=లోకములను, ప్రాప్య = పొంది, (తత్ర=ఆ లోకములయందు) శాశ్వతీః=అనేకము లయిన, సమాః = సంవత్సరములు, ఉషిత్వా = నివ సించి, (తద్భోగక్షయే = ఆ పుణ్యలోకానుభవముయొక్క నాశమునందు) శుచీనామ్ = సదాచారవంతు లైన, శ్రీమతామ్ = శ్రీమంతులయొక్క, గేహే=గృహమునందు, అభిజాయతే=పుట్టుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! యోగభ్రష్టుఁడు (యోగసిద్ధిని బొందని సన్న్యాసి) అశ్వమేధాదియాగములు చేసినవారు పొందునట్టి పుణ్యలోకములను పొంది, అక్కడ శాశ్వతము లైన (అనేకము లైన) (లేక) తెంపులేని సంవత్సర ముల కాలము నివసించి పుణ్యలోకసుఖముల ననుభవించి యా పుణ్యలోక సుఖము నశించి పోయినపిమ్మట సదాచారము కలవారును శ్రీమంతులును అయిన వారియొక్క గృహమునందు పుట్టుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ ౪౨

టీక. అథవా=అట్లు కాదేని, (శ్రీమ ద్రాజకులమునందుఁ బుట్టక పోయినయెడల) ధీమతామ్=నిశ్చయాత్మక మైన బుద్ధి కలవారును, (దరి ద్రాణామ్ = దరిద్రులును) (అయిన) యోగినామ్ = యోగులయొక్క, కులే+ఏవ=వంశమునందే, భవతి=పుట్టుచున్నాఁడు. లోకే = లోకము

నందు, ఈదృశమ్=ఇటువంటి, జన్మ = జన్మము, యత్ = ఏది, (అస్తి= కలదో) ఏతత్=ఇది, దుర్లభంహి=మిగుల దుర్లభమైనది కదా!

ఓ అర్జునా! శ్రీమంతులును పరిశుద్ధులును అయినవారియొక్క కులమునందు పుట్టకపోయినను జ్ఞానవంతులును దరిద్రులును అయిన యోగులయొక్క వంశమునందుఁ బుట్టును. మఱియును, ఓ అర్జునా! లోకములో శ్రీమంతులును దరిద్రులును అయిన యోగులయొక్క జన్మము మిగుల దుర్లభమైనదని తాత్పర్యము.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన॥ ౪౩

టీక. హే కురునందన = ఓ అర్జునుఁడా! తత్ర=ఆ యోగికులమునందు, పౌర్వదైహికమ్=పూర్వదేహమునందుఁ బుట్టిన, తమ్ = ఆ యాత్మవిషయకమైన, బుద్ధిసంయోగమ్=బుద్ధితో సంబంధమును, లభతే=పొందుచున్నాఁడు. భూయః=మరల, సంసిద్ధౌ=జ్ఞానసిద్ధినిమిత్తమై, యతతే చ= యత్నమునుకూడఁ జేయుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! దరిద్రులును పరిశుద్ధులును జ్ఞానవంతులును అయిన యోగులయొక్క కులమునందుఁ బుట్టిన యోగభ్రష్టుఁడు పూర్వజన్మమునందుఁ గల్గియున్న యాత్మవిషయమైన బుద్ధితో సంబంధమును పొందుచున్నాఁడు. అనంతరమందు జ్ఞానసిద్ధినిమిత్తమై యత్నమునుకూడఁ జేయుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ ౪౪

టీ॥ హి=ఏకారణమువలన, సః=ఆ యోగభ్రష్టుఁడు, అవశోఽపి= (ఏదో యొక విఘ్నమువలన) ఇచ్ఛయింపనివాఁడైనను, తేన=ఆ పూర్వాభ్యాసేనైవ=పూర్వజన్మమునందలి యలవాటుచేతనే, హ్రియతే=(విషయముల

నుండి) ఆకర్షింపఁబడుచున్నాఁడో (తస్మాత్=ఆ కారణమువలన, సిద్ధౌ=జ్ఞానసిద్ధియందు, ఇచ్ఛయా = ఇచ్ఛచేత, ప్రవృత్తిః=ప్రవృత్తి, న=లేదు.) యోగస్య=యోగమునకు, జిజ్ఞాసురపి=తెలిసికొనఁ దలఁచినవాఁడుకూడ, శబ్దబ్రహ్మ = వేదోక్తకర్మానుష్ఠానఫలమును అతివర్తతే = అతిక్రమించుచున్నాఁడు.

ఓ అర్జునా! ఆ యోగభ్రష్టుఁడు ఏదో యొక విఘ్నమువలన బ్రహ్మజ్ఞానమునందు యిచ్ఛ లేనివాఁడైనను, పూర్వజన్మమునందలి యభ్యాసవశము చేతనే బలాత్కారముగ విషయములనుండి యీడ్వఁబడు చున్నాఁడు. గనుక జ్ఞానసిద్ధినిమిత్తము (మోక్షముకొఱకు) ఇచ్ఛలేకయే ప్రయత్నమును చేయుచున్నాఁడు. మఱియు నోయర్జునా! ముముక్షువుకూడ వేదోక్త కర్మఫలమును అతిక్రమించు చున్నాఁడు. (విడిచిపెట్టు చున్నాఁడు) అని తా.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥ ౪౫

టీక. ప్రయత్నాత్ = (పూర్వజన్మమునందలి) ప్రయత్నముకంటె, యతమానస్తు=(అధికముగా) ప్రయత్నమును చేయుచున్న, యోగీ=విద్వాంసుఁడు, సంశుద్ధకిల్బిషః=పరిశుద్ధిని పొందిన పాపము కలవాఁడును, అనేకజన్మసంసిద్ధః=అనేకము లగు జన్మములయందు (కొంచెముగా సంపాదింపఁబడిన సంస్కారవశముచేత) బ్రహ్మజ్ఞానము పొందినవాఁడును, (భూత్వా=అయి) తతః=అట్లు, అనేకజన్మములయందు సంపాదింపఁ బడిన సంస్కారమువలన, పరామ్=సర్వోత్తమ మయిన, గతిమ్=గతిని, (మోక్షమును) యాతి=పొందు చున్నాఁడు.

పూర్వజన్మమునందలి ప్రయత్నముకంటె అధికముగా ప్రయత్నమును చేయు చున్న విద్వాంసుఁడు అట్టి ప్రయత్నముచేతఁ బోఁగొట్టఁబడిన పాపము కలవాఁడును, అదివఱకు పొందఁబడిన యనేకజన్మములయందు

కొంచెకొంచెముగా సంపాదింపఁబడిన సంస్కారముచేత బ్రహ్మజ్ఞానమును పొందినవాఁడును నై అట్లు అనేకజన్మములయందు సంపాదింపఁబడిన సంస్కారమువలన మోక్షమును పొందు చున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భ వార్జున॥ ౪౬

టీక. అర్జున=పరిశుద్ధుఁడ వైన యో యర్జునా! యోగీ = ధ్యానయోగము సన్యాసి, తపస్విభ్యః=కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులు కలవారికంటెను, అధికః=శ్రేష్ఠుఁడు, కర్మిభ్యశ్చ=కర్మఠులకంటెను, అధికః = శ్రేష్ఠుఁడు, (ఇతి = ఇట్లని) మతః = సమ్మతుఁడు, తస్మాత్ = అందువలన, (త్వమ్ = నీవు) యోగీ = ధ్యానయోగము కలవాఁడవు, భవ అగుము.

ఓ అర్జునా! ధ్యానయోగాభ్యాసమును చేయు చున్న సన్యాసి, కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులను చేయువారికంటెను, శాస్త్రార్థపాండిత్యము కలవారికంటెను, అగ్నిహోత్రాదికర్మములను చేయువారికంటెను, శ్రేష్ఠుఁ డని నా యభిప్రాయము. కాఁబట్టి నీవు ధ్యానయోగాభ్యాసి వగుమని తాత్పర్యము.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

టీక. యః = ఎవ్వఁడు, శ్రద్ధావాన్ = విశ్వాసము కలవాఁడై, మామ్=(నారాయణుఁడ నైన నన్ను; మద్గతేన =(వాసుదేవుఁడ నైన) నాయందు ఆసక్త మైన, అంతరాత్మనా = అంతఃకరణముచేత, భజతే = సేవించు చున్నాఁడో; సః = అట్టివాఁడు, సర్వేషామ్ = సకల, యోగినామపి=రుద్రాదిత్యాది ధ్యానపరాయణు లగువారిలోపల, యుక్తతమః = అత్యంతశ్రేష్ఠుఁడు (ఇతి=ఇట్లని) మే = నాకు, మతః = సమ్మతుఁడు.

ఎవ్వఁడు విశ్వాసము కలవాఁడై నారాయణుఁడ నగు నన్ను వాసు దేవుఁడ నగు నాయందు ఆసక్తమైన యంతఃకరణముచేత సేవించు చున్నాఁడో, అట్టివాఁడు రుద్రాదిత్యాదులను ధ్యానము చేయువా రందఱి కంటెను అధిక శ్రేష్ఠుఁ డని నా యభిప్రాయము అని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శాతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే అధ్యాత్మయోగోనామ
(ఆత్మసంయమయోగోనామ)
షష్ఠోఽధ్యాయః.

టీక. వైయ్యాసిక్యామ్ = వ్యాసప్రోక్త మైనదియును, శాతసాహస్ర్యామ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే=సంపత్కర మైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపద కల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్= బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయ కోపాయములను తెలుపునట్టి గ్రంథమందు) అధ్యాత్మయోగోనామ = అధ్యాత్మయోగమను పేరు గల, షష్ఠః=ఆఱవ దైన, అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలది యును, శాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు

ప్రశస్తమైన జ్ఞానసంపదల గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు ఆధ్యాత్మయోగమును లేక ఆత్మసంయమయోగమును తెలుపునట్టి యాఱవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీరామచంద్రార్పణ మస్తు.



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత - సప్తమాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

### విజ్ఞానయోగము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

టీక. శ్రీభగవానువాచ=శ్రీకృష్ణుఁడు చెప్పెను. హేపార్థ=ఓీఅర్జునుఁడా! మయి=నాయందు, ఆసక్తమనాః=తగిలినమనస్సు కలవాఁడవును, యోగమ్=చిత్తసమాధానమును, యుంజన్ = చేయుచున్నవాఁడవును, మదాశ్రయః = నేనే ఆశ్రయముగాఁ గలవాఁడవును, (భూత్వా = అయి, త్వమ్=నీవు) సమగ్రమ్=సంపూర్ణుఁడ వైన, మామ్=నన్ను, అసంశయమ్=నిస్సందేహముగా, యథా=ఎట్లు, జ్ఞాస్యసి = తెలిసికొనఁగలవో, తత్=ఆవిధమును, శృణు=వినుము.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓీ అర్జునా! పరమాత్మ నగు నాయందే సక్త మైన మనస్సు కలవాఁడవును, చిత్తసమాధానము నాచరించుచున్నవాఁడవును, నేనే ఆశ్రయము (సేవింపఁదగినవాఁడనుగాఁ

గలవాఁడవున్నై నన్ను నిస్సందేహముగాఁ దెలిసికొనఁదగినరీతి యేదికలదో దానిని చెప్పెదను వినుము అని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే॥

టీక. యత్=ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసి, ఇహ = ఈ మోక్షమార్గమునందు, జ్ఞాతవ్యమ్=తెలియఁదగినది, అన్యత్=మఱియొకటి, నావశిష్యతే=మిగిలి యుండదో, సవిజ్ఞానమ్=అనుభవజన్యజ్ఞానముతోఁ గూడిన (నావిషయమును అపరోక్షమును అయిన), జ్ఞానమ్ = శాస్త్రీయజ్ఞానమును, అశేషతః=సాకల్యముగా, తే = నీకొఱకు, అహమ్ = నేను, వక్ష్యామి = చెప్పఁగలను.

ఓ యర్జునా! అపరోక్షమైన యే జ్ఞానమును దెలిసికొనిన పిమ్మట మోక్షమును పొందుటకు తెలియఁదగిన యితరజ్ఞాన మేదియును (లేక) పురుషార్థసాధన మేదియును లేకపోవునో, స్వానుభవముతోఁ గూడినది యును నావిషయమును అయిన అట్టి యపరోక్షజ్ఞానమును నిశ్శేషముగా నీకుఁ జెప్పెదను విను మని తాత్పర్యము.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

టీక. మనుష్యాణామ్=(శాస్త్రీయజ్ఞానకర్మయోగ్యు లగు) మనుష్యుల యొక్క, సహస్రేషు=సహస్రములయందు, కశ్చిత్ = (అనేకజన్మార్జిత సుకృతపరిపాకముచేతఁ గలిగిన యాత్మానాత్మవివేకము గల) ఒకానొకఁడు, సిద్ధయే=(చిత్తశుద్ధిద్వారా) జ్ఞానము కలుగుటకొఱకు, యతతి=ప్రయత్నమును చేయుచున్నాఁడు. యతతామ్ = ప్రయత్నమును చేయుచున్న, సిద్ధానామపి=(పూర్వజన్మమునందలి పుణ్యముచేత జ్ఞానముకొఱకు)

సిద్ధులయినవారల లోపలఁ గూడ, కశ్చిత్=(శ్రవణ మనన నిధిధ్యాసలను అధికముగాఁ జేయునట్టి) ఒకానొకఁడు, తత్త్వతః = యథార్థముగా, మామ్=నన్ను, వేత్తి=తెలియుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! శాస్త్రీయ జ్ఞానకర్మయోగ్య అయిన యనేకవేల మంది మానవులలో ఒకానొకఁడుఅనేకజన్మములయందు సంపాదింపఁబడిన సుకృతపరిపాకముచేత నిత్యానిత్యవస్తువివేకము కలవాఁడై చిత్తశుద్ధిద్వారా జ్ఞానము కలుగుటకొఱకు ప్రయత్నించుచున్నాఁడు. అట్లు ప్రయత్నమును చేయుచున్నవారును జ్ఞానార్థులను అయినవారలలోఁగూడ ఒకానొకఁడు పూర్వజన్మమునందలిసుకృతపరిపాకవశముచేతశ్రవణమనననిధిధ్యాసములను యెడతెగక చేయుచు యథార్థముగా నన్నుఁ దెలిసికొనుచున్నాఁడు (బ్రహ్మమే నేననియెడు నిశ్చయజ్ఞానము కలవాఁడగుచున్నాఁడు)అని తా.

శ్లో॥ భూమిరాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నాప్రకృతిరష్టధా॥ ౪

టీక. భూమిః = పృథివీతన్మాత్ర మగు గంధగుణము, ఆపః=ఉదకతన్మాత్ర మగు రసగుణము, అనలః = అగ్నితన్మాత్ర మగు రూపగుణము, వాయుః = వాయుతన్మాత్ర మగు స్పర్శగుణము, ఖమ్ = ఆకాశతన్మాత్ర మగు శబ్దగుణము, మన =మనస్సునకు కారణమైన యహంకారతత్త్వము, బుద్ధిరేవచ=అహంకారతత్త్వమునకు కారణమైన మహత్తత్త్వమును,అహంకారః = అవిద్యతోఁ గూడిన యవ్యక్తతత్త్వము, ఇతి=ఇట్లని, మే=(పరమేశ్వరుఁడ నైన) నాయొక్క, ఇయమ్ = (లోకభ్రాంతి కారణమును ప్రత్యక్షమును అయిన) ఈ, ప్రకృతిః = మాయాశక్తి, అష్టధా=ఎనిమిది విధములయినదై, భిన్నా=భేదమును పొందినది.

ఓ అర్జునుఁడా! పంచతన్మాత్రాత్మకములగు పంచమహాభూతములు, మనస్సునకు కారణమైన యహంకారతత్త్వము, అహంకారతత్త్వ

మునకుఁ గారణమైన మాహత్తత్త్వము, అవిద్యతోఁ గూడిన యవ్యక్త తత్త్వము అని లోకభ్రాంతికారణమై ప్రత్యక్షముగఁ గనఁబడు చున్న నామాయా శక్తి యెనిమిదివిధములుగా భేదమును పొందిన దని తా.

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥

టీక. హేమహాబాహో=అధికమైన భుజబలము గల యోయర్జునుఁడా! ఇయమ్=ఇప్పుడు చెప్పఁబడిన ప్రకృతి, అపరా=నికృష్టమైనది,(లేక) అపర యను పేరు కలది, యయా = ఏ ప్రకృతిచేత, (స్వకర్మద్వారేణ = స్వకర్మమూలకముగా) ఇదమ్ = ఈ, జగత్ = లోకము, ధార్యతే = ధరింపఁబడు చున్నదో, (తామ్=అట్టి) మే = నాయొక్క, ప్రకృతిమ్ = ప్రకృతిని, ఇతస్తు = ఈ యపరప్రకృతికంటె, అన్యామ్ = ఇతర మైన దానినిగాను, పరామ్=సర్వోత్తమ మైన దానినిగాను, (లేక) పర యను నామధేయము కల దానినిగాను, జీవభూతామ్=ప్రాణధారణమునకు కారణమైన దానినిగాను, విద్ధి=తెలిసికొనుము.

ఓఅర్జునా! ఇదివఱకుఁ జెప్పఁబడిన క్షేత్రరూపమైన యపరాప్రకృతి అపరిశుద్ధమును, అనర్థమును కలుగఁజేయునదియును, సంసారరూపమును, బంధనాత్మకమును అయిన దగుటచేతనికృష్టమైనది. అట్టి నీచప్రకృతికంటె నితరమైన నాయొక్క అపరాకృతి క్షేత్రజ్ఞరూప మైనదియును, సర్వోత్తమమైనదియును, ప్రాణధారణమునకు కారణమైనదియును, నాకు ఆత్మభూతమునునై యున్నది. అట్టి నాప్రకృతి లోపల ప్రవేశించి సకర్మమూలకముగా యాకనఁబడు చున్న లోకమును సర్వమును ధరించు చున్నదని తా.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా॥ ౬

టీక. సర్వాణి=సమస్తము అయిన,(స్థావరజంగమాత్మకములయిన), భూతాని=భూతములు, ఏతద్యోనీని=ఈపరాపరప్రకృతులే కారణముగాఁ గలవి. ఇతి=ఇట్లని, ఉపధారయ = నిశ్చయింపుము. తథా = ఆ ప్రకారము (ఆ ప్రకృతిద్వయమూలకముగా), అహమ్ = నేను, కృత్స్నస్య = సమస్తమైన, జగతః=జగత్తునకు, ప్రభవః = కారణుఁడను, ప్రలయః = నాశకుఁడను. ఇతి=ఇట్లని, ఉపధారయ=నిశ్చయింపుము.

ఓ అర్జునుఁడా! చరాచరాత్మకములును, జననము కలవియును అయిన భూతములు అన్నియును క్షేత్రక్షేత్రజ్ఞ అనియెడు పరాపర ప్రకృతులవలనఁ గలుగుచున్నవనియును, సర్వజ్ఞుఁడనగు నేను ఈపరాపరప్రకృతుల మూలకముగా సకలభూతములను పుట్టించువాఁడను నశింపఁజేయు వాఁడను అయితి ననియును తెలిసికొను మని తాత్పర్యము.

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ ౭

టీక. హేధనంజయ = ఓ అర్జునుఁడా! మత్తః = నాకంటె, పరతరమ్=శ్రేష్ఠమైన కారణము, అన్యత్ = ఇతరము, కించిత్ = కొంచెమైనను, నాస్తి=లేదు. సర్వమ్=సమస్తమైన, ఇదమ్=ఈజగత్తు, సూత్రే=దారమునందు, మణిగణా ఇవ = మణిసముదాయమువలె, మయి = నాయందు, ప్రోతమ్=కూర్పఁబడి యున్నది.

ఓ అర్జునా! ఈ ప్రపంచమును పుట్టించువాఁడను, నశింపఁజేయు వాఁడను నేనే కనుక ఈ జగత్తునకు శ్రేష్ఠమైన కారణము నాకంటె ఇతరమైనది మఱియొకటి యేదియును లేదు. కాఁబట్టి పరమేశ్వరుఁడనైన నాయందు సకలభూతములును సూత్రమునందు మణు లన్నియును కూర్పఁబడి యున్నవిధముగ కూర్పఁబడి యున్న వని తాత్పర్యము.

శ్లో॥ రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ ౮

టీక, హే కౌంతేయ=కుంతీపుత్త్రుఁడ వైన యోయర్జునా! అప్సు= ఉదకములయందు, రసః=రుచియును, శశిసూర్యయోః = చంద్రసూర్యుల యందు, ప్రభా = వెలుతురును, సర్వవేదేషు = సకలవేదములయందును, ప్రణవః=ఓంకారమును, ఖే=ఆకాశమునందు, శబ్దః = శబ్దమును, నృషు = మనుష్యులయందు, పౌరుషమ్ = పురుషస్వభావమును, అహమ్ = నేను, అస్మి=అయితిని,

కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! ఉదకములయందు సార మైన రసము (రుచి) అనియెడు పదార్థము నేను కావున, అట్టి రస రూపుఁడ నయిన నాయందు ఉదకములు గ్రుచ్చఁబడి యున్నవి. చంద్ర సూర్యులయందు కాంతి యను పదార్థము నేను కావున కాంతిరూపుఁడనైన నాయందు చంద్రసూర్యులు గ్రుచ్చఁబడి యున్నారు. వేదములయందు ఓంకారము నేను, అట్లు ఓంకారరూపుఁడ నైన నాయందు వేదములు గ్రుచ్చఁబడి యున్నవి. ఆకాశమునందు సారభూత మైన శబ్దము నేను కనుక శబ్దరూపుఁడనైన నాయందు ఆకాశము గ్రుచ్చఁబడి యున్నది. మాన వులయందు పురుషభావము నేను కావున పుంస్త్వస్వరూపుఁడ నైన నాయందు మానవు లందఱును గ్రుచ్చఁబడియున్నారు అని తాత్పర్యము.

శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ ౯

టీక. అహమ్ = నేను, పృథివ్యామ్ = భూమియందు, పుణ్యః = పరిమళించు చున్న (లేక) పావన మైన, గంధశ్చ=గంధమును, విభావసౌ= అగ్నియందు, తేజశ్చ = తేజస్సును, అస్మి = అయితిని. సర్వభూతేషు = సకలభూతములయందును, జీవనమ్ = ప్రాణాధార మైన యన్నరసమును, తపస్విషు=తపోవంతులయందు, తపశ్చ=తపస్సును, అస్మి=అయితిని.

ఓ అర్జునా! భూమియందలి పావనమైన గంధము నేను కావున భూమి నాయందు ప్రోతమై యున్నదనియును, అగ్నియందు పావనమైన

తేజస్సు నేను కాఁబట్టి అగ్ని నాయందు ప్రోతమై యున్న దనియును, సకల భూతములయందును ప్రాణాధార మైన యన్నరసము నేను కావున సకల భూతములును నాయందు ప్రోతములై యున్న వనియును, తపోవంతులయందలి తపస్సు నేను కాఁబట్టి తపోవంతులు నాయందు ప్రోతములై యున్నారనియు తెలిసికొను మని తాత్పర్యము.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥ ౧౦

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! మామ్ = నన్ను, సర్వభూతానామ్=సకలభూతములకును, సనాతనమ్ = శాశ్వత మైన (లేక) అనాదియైన, బీజమ్=ఉత్పత్తికారణ మైనవానినిగా, విద్ధి= తెలిసికొనుము. బుద్ధిమతామ్=ఆత్మానాత్మవివేకము కలవారియొక్క, బుద్ధిః = అంతఃకరణమునందలి యాత్మానాత్మవివేకసామర్థ్యము, అస్మి=అయితిని. తేజస్వినామ్=తేజోవంతులయొక్క, తేజః=ప్రాగల్భ్యము, అస్మి=అయితిని.

ఓ అర్జునుఁడా! చరాచరాత్మకము లగు సకలభూతములకును నేను శాశ్వతకారణుఁడను నై యున్నాఁడను. మఱియును, నేను ఆత్మానాత్మవివేకము కలవారియొక్క అంతఃకరణమునందలి యాత్మానాత్మ వివేకసామర్థ్యరూపుఁడను. మఱియును, తేజోవంతులయొక్క తేజోరూపుఁడను, కావున బుద్ధిమంతులును తేజోవంతులును కూడ నాయందు ప్రోతములై యున్నా రని తాత్పర్యము.

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ ౧౧

టీక. హే భరతర్షభ=ఓ అర్జునుఁడా! బలవతామ్ = బలవంతులయొక్క, కామరాగవివర్జితమ్=కామరాగములచేత విడువఁబడిన, బలంచ=

బలమును, అహమ్ = నేను, అస్మి = అయితిని. భూతేషు = ప్రాణుల యందు, ధర్మావిరుద్ధః = ధర్మశాస్త్రమునకు విరుద్ధము కాని, కామశ్చ = కోర్కెయును, అహమ్ = నేను, అస్మి = అయితిని.

ఓ అర్జునుఁడా! బలవంతులయొక్క యాకానురాగములు లేని బలము నేను కావున బలవంతులు నాయందు ప్రోతములై యున్నారని యును, ప్రాణులయందలి ధర్మశాస్త్రవిరుద్ధము కాని కామము నేనైతిని కనుక ధర్మశాస్త్రవిరుద్ధము కాని కామమును అవలంబించినభూతములు నాయందు ప్రోతములై యున్నవనియును తాత్పర్యము.

శ్లో॥ యేచైవ సాత్త్వికాభావా రాజసా స్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తేమయి॥ ౧౨

టీక. (ప్రాణినామ్ = ప్రాణులకు, స్వకర్మవశాత్ = తమ తమ కర్మాధీనముపలన) సాత్త్వికాః = సత్త్వగుణముచేత నైన, భావాః = శమద మాదులు, యేచైవ = ఏవి, (జాయంతే = పుట్టుచున్నవో) రాజసాః = రజో గుణముచేత నైన, భావాః = హర్షదర్పాదులు, యేచ = ఏవి, (జాయంతే = పుట్టుచున్నవో), తామసాః = తమోగుణముచేత నైన, భావాః = శోక మోహాదులు, యే = ఏవి, (జాయంతే = పుట్టుచున్నవో తాన్ = వాని నన్నిటిని, మత్తఏవ = నావలననే, (జాయంతే = పుట్టుచున్నవి), ఇతి = ఇట్లని, విద్ధి = తెలిసికొనుము. తేషు = ఆ భావములయందు, అహమ్ = నేను, నతు = లేను, తే = ఆభావములు, మయి = నాయందు, (సంతి = ఉన్నవి),

సత్త్వగుణమువలనఁ గలుగు శమదమాదులును, రజోగుణమువలనఁ గలుగు దర్పహర్షాదులును, తమోగుణమువలనఁ గలుగు శోకమోహాదులును ప్రాణులకు స్వకర్మవశమువలనఁ బుట్టుచున్నవి. అవి యన్నియును, మదీయ మైన ప్రకృతిగుణమువలనఁ గలిగినవి కాని నావలననే కలిగిన వని తెలిసి

కొనుము. అయినను సంసారులవలె నేను వానికి వశుఁడను కాను. అవి మాత్రము నా యధీనములై యున్న వని తాత్పర్యము.

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥

టీక. త్రిభిః = మూఁడువిధములును, గుణమయైః = సత్త్వరజస్తమోగుణవికారములును (అయిన), ఏభిః = ఈ, భావైః = శమాది భావములచేత, ఇదమ్ = ఈ కనఁబడు చున్న, జగత్ = ప్రపంచము, సర్వమ్ = సమస్తమును, మోహితం సత్ = అవివేకమును పొందింపఁబడిన దగుచు, ఏభ్యః = ఈ సత్త్వాదిగుణములకంటె, పరమ్ = విలక్షణుఁడను, అవ్యయమ్ = నాశము లేనివాఁడను, (అయిన) మామ్ = నన్ను, నాభిజానాతి = ఎఱుఁగదు.

ఓ అర్జునుఁడా! మూఁడు విధములును సత్త్వరజస్తమోగుణ వికారములును అయిన శమదమహర్ష దర్పశోక మోహాది పదార్థములచేత ఈకనఁబడు చున్న ప్రపంచమంతయును మోహమును పొందింపఁబడిన దగుచు ఈగుణములకంటె విలక్షణుఁడను నాశము లేనివాఁడను అయిన నన్నుఁ దెలిసికొన లేక యున్న దని తాత్పర్యము.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥

టీక. హి = ఏకారణమువలన, దైవీ = దేవుఁడ నగు నా సంబంధమైనదియును (లేక) అత్యద్భుత మైన సామర్థ్యము కలదియును, త్రిగుణాత్మికా = సత్త్వరజస్తమోగుణములే స్వరూపముగాఁ గలదియు నగు, ఏషా = ఈ, మమ = నాయొక్క, మాయా = శక్తి, (లేక) మాయ, దురత్యయా = అతికష్టముచేత దాఁటఁదగినదో, (తత్ = ఆ కారణమువలన) యే = ఎవ్వరు, మామేవ = నన్నే, ప్రపద్యన్తే = (అతిభక్తితో) శరణమును పొందుచున్నారో,

తేఽఅతితరన్తి = దాటుచున్నారు, ఏతామ్ = ఈ, (దాటుట శక్యము కాని) మాయామ్ = మాయను, తరన్తి = దాటుచున్నారు, (అతిక్రమించుచున్నారనుట.)

ఓ అర్జునుఁడా! అతిభక్తితో నన్ను సేవించుచు నన్నే శరణమును గాఁ గోరువారు, దేవుఁడ నగు నా సంబంధమైనదియును (లేక) అత్యద్భుతమైన సామర్థ్యము కలదియును అతికష్టముచేత దాఁటఁదగినదియును నగు నామాయను తరించుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ నమాం దుష్కృతినో మూఢాః

ప్రపద్యంతే నరాధమాః।

మాయయాఽపహృతజ్ఞానాః

అసురం భావమాశ్రితాః॥ ౧౫

టీక. దుష్కృతినః = పాపమును చేయువారును, మూఢాః = అవివేకులును (అయిన), నరాధమాః = మానవాధములు, మాయయా = మాయచేత, అపహృతజ్ఞానాః = అపహరింపఁబడిన జ్ఞానము కలవారై, అసురమ్ = రాక్షససంబంధమైన, భావమ్ = ధర్మమును, ఆశ్రితాః = ఆశ్రయించినవారై, మామ్ = నన్ను, నప్రపద్యంతే = పొందరు, (లేక భజింపరు.

పాపమును చేయువారును మూఢులును నగు మానవాధములు మాయచేత నపహరింపఁబడిన యాత్మజ్ఞానము కలవారును రాక్షసధర్మము అయిన హింసానృతాదుల నాశ్రయించినవారును నై నన్నుఁ బొందఁజాలరని తా॰

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ ౧౬

టీక. భరతర్షభ = భరతవంశపురాజులలో నుత్తముఁడవు (అయిన), హే అర్జున = ఓ అర్జునుఁడా! ఆర్తః = చోరవ్యాఘ్రాదులచేతఁ బీడింపఁబడినవాఁడు, జిజ్ఞాసుః = (భగవత్తత్త్వమును) తెలియఁదలచినవాఁడు,

అర్థార్థీ=ధనకాముఁడు, జ్ఞానీచ=జ్ఞానము కలవాఁడును, (అనఘర్షభ) చతుర్విధాః=నాలుగువిధము లయిన సుకృతినః=పుణ్యవంతు లగు, జనాః = జనులు, మామ్=(భగవంతుఁడ నగు) నన్ను, భజంతే=సేవించుచున్నారు.

భరతకులమునందుఁ బుట్టినవారలలో నుత్తముఁడ వైన యో యర్జునుఁడా! ఘోరవ్యాధులచేతఁ బీడింపఁబడు చున్నవాఁడును, భగవత్తత్త్వమును తెలియఁదలఁచినవాఁడును, ధనమును కోరు చున్నవాఁడును, ఆత్మానాత్మ వివేకము కలవాఁడును అను నలుగురుపుణ్యాత్ములు నన్ను సేవించు చున్నారని తాత్పర్యము.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః॥

టీక. తేషామ్=పైన జెప్పఁబడిన నలుగురిలోపల, నిత్యయుక్తః= సర్వకాలములయందును సమాహిత మైన చిత్తము కలవాఁడును, ఏకభక్తి = ఒక్కఁడ నైన నాయందే భక్తి కలవాఁడును, (అయిన) జ్ఞానీ= ఆత్మవేత్త, విశిష్యతే=అధికుఁ డగు చున్నాఁడు. హి=ఏకారణమువలన, అహమ్= నేను, జ్ఞానినః=ఆత్మవేత్తకు, అత్యంతమ్=మిక్కిలి, ప్రియః=ఇష్టుఁ డనో, (అతః = ఈ కారణమువలన) సచ=ఆ యాత్మవేత్తయును, మమ= నాకు, అత్యర్థమ్=మిక్కిలి, ప్రియః=ఇష్టుఁడు.

ఓ అర్జునుఁడా! పైన చెప్పఁబడిన నలుగురిలోపల సర్వకాలముల యందును సమాహితచిత్తుఁడును ఒక్కఁడ నైన నాయందే భక్తి కలవాఁడును అయిన యాత్మవేత్త అధికుఁ డగు చున్నాఁడు. మఱియు నో యర్జునుఁడా! ఆత్మవేత్త యగువానికి నేను మిక్కిలి యిష్టుఁడను కనుక ఆత్మవేత్తఁగూడ నాకు పరమప్రియుఁ డని తాత్పర్యము.

శ్లో॥ ఉదారా స్సర్వఏవై తే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥

టీక. ఏతే = ఈ, సర్వే = జ్ఞానికంటె నితరు లగు మువ్వురును, ఉదారా + ఏవ = శ్రేష్ఠులే, జ్ఞానీతు = జ్ఞాని యన్ననో, ఆత్మైవ = నేనే (ఇతి = ఇట్లని) మే = నాయొక్క, మతమ్ = అభిప్రాయము; హి = ఏకారణమువలన, సః = ఆ జ్ఞాని, యుక్తాత్మాసన్ = నియమింపఁబడిన చిత్తము గలవాఁ డగుచు, మామేవ = నన్నే, అనుత్తమామ్ = శ్రేష్ఠ మైన, గతిమ్ = ప్రాప్యస్థానమునుగా, ఆస్థితః = పొందినవాఁడో, (ఆకారణము వలన జ్ఞాని నేనే అయి యున్నా ననుట).

ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి అనుమువ్వురును తమ మనోరథపూర్తి కొఱకు నన్ను సేవింతురు; కనుక యీ మువ్వురును నాకిష్టులే జ్ఞాని యన్ననో అతఁడు నాయందే యుంచఁబడినచిత్తము కలవాఁ డగుచు నన్నే సర్వోత్తమ మైన ప్రాప్యస్థానముగా పొందు చున్నాఁడు కనుక జ్ఞాని యగువానికిని నాకును భేదము లేదని నా యభిప్రాయ మని తాత్పర్యము.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ ౧౯

టీక. (యః = ఎవ్వఁడు), బహూనామ్ = అనేకములయిన, జన్మనామ్ = జన్మములయొక్క, అంతే = కడపట, సర్వమ్ = సమస్తమును, వాసుదేవః (ఏవ) = వాసుదేవుఁడే, ఇతి = ఇట్లని, జ్ఞానవాన్ = జ్ఞానము కలవాఁ డగుచు, మామ్ = నన్ను, ప్రపద్యతే = పొందు చున్నాఁడో; సః = అట్టి, మహాత్మా = సర్వోత్తమ మైన చిత్తము కలవాఁడు, (అనఁగా అట్టి వంటి మహానుభావుఁడు) సుదుర్లభః = మిగుల దుర్లభుఁడు.

ఏపురుషుఁడు జ్ఞానము కలిగించుట కుపయుక్త మగు సంస్కారమును (వాసనను) సంపాదించుటకుఁ దగిన యనేకజన్మములకు కడపట సర్వసుకృతపరిపాకరూప మైన కడపటిజన్మమునందు సర్వమును వాసుదేవ స్వరూపమే యని తలఁచి వాసుదేవుఁడ నగు నన్నుఁ బొందు చున్నాఁడో

అనఁగా సర్వాత్ముఁడైన నాకును ఆతనికిని భేదము లేదని తలఁచుచున్నాఁడో అట్టి మహానుభావుఁడు (జీవన్ముక్తుఁడు) అనేకవేలమందిలో నొకానొకఁడే కనుక దుర్లభుఁడని తాత్పర్యము.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యానియతాస్స్వయా॥

టీక. స్వయా = ఆత్మీయమైన, ప్రకృత్యా = స్వభావముచేత, (జన్మాంతరార్జిత సంస్కారవిశేషముచేత) నియతాః = నియమింపఁబడినవారై, తైస్తైః=ఆయ్యా, కామైః=కోర్కెలచేత, హృతజ్ఞానాః (సంతః)= అపహరింపఁబడిన జ్ఞానము కలవారై, తంతమ్ = ఆయ్యా దేవతారాధన యోగ్యమైన, నియమమ్=నియమమును, ఆస్థాయ అధిష్ఠించి, అన్యదేవతాః= ఇతరదేవతలను, ప్రపద్యంతే=భజించుచున్నారు.

ఓ అర్జునా! ఆత్మీయమైన స్వభావముచేత, అనఁగా, జన్మాంతరమునందు సంపాదింపఁబడిన సంస్కారవిశేషముచేత నియమింపఁబడినవారై ఆయ్యాకోర్కెలచేతఁ బోఁగొట్టఁబడిన యాత్మజ్ఞానము కలవారగుచు నయ్యాదేవతలను ఆరాధించుటకుఁ దగిన నియమముల నవలంబించి యితర దేవతలను సేవించుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ యోయోయాంయాంతనుంభక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి। తస్య తస్యాచలాంశ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

టీక. యోయః = ఏయే కామము గలవాఁడు, భక్తస్సన్ = భక్తుఁడైనవాఁడగుచు, యాంయామ్ = ఏయే, తనుమ్ = దేవతావిగ్రహమును శ్రద్ధయా = విశ్వాసముచేత, అర్చితుమ్ = పూజించుటకొఱకు, ఇచ్ఛతి= ఇచ్ఛయించుచున్నాఁడో, తస్యతస్య = ఆయాకామము గలవానికి, అహమ్= నేను, తామ్=ఆ, శ్రద్ధామేవ=శ్రద్ధనే, అచలామ్=స్థిరమైన దానిని గా, విదధామి = చేయుచున్నాను.

ఏదే కోర్కెగల భక్తుఁడు ఏయే దేవతావిగ్రహమును విశ్వాసము చేత (లేక) భక్తిచేత పూజించుటకొఱకు యిచ్ఛయించు చున్నాఁడో, ఆయా కోర్కెగలవానికి ఆయాకోర్కెలను సఫలము అయినవానినిగాఁ జేయునట్టి దేవతలయందు తనభక్తినే స్థిర మైనదానినిగా నేను చేయు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామా న్మయైవ విహితా న్హితాన్॥

టీక. సః=ఆ భక్తుఁడు, తయా=(ఇదివఱకు నాచేత) చెప్పఁబడిన, శ్రద్ధయా = శ్రద్ధతో, యుక్తస్సన్ = కూడుకొనినవాఁ డగుచు, తస్య = ఆ యితరదేవతావిగ్రహముయొక్క, ఆరాధనమ్ = పూజను, ఈహతే = ఇచ్ఛయించు చున్నాఁడు. మయైవ=నాచేతనే, విహితాన్=చేయఁబడిన, హితాన్ = కోర్కెలను, తతః = ఆ దేవతావిగ్రహమువలన, లభతే = పొందుచున్నాఁడు.

ఓ అర్జునా! ఇట్లు ఇతరదేవతలయందు భక్తిగలవాఁడు ఇదివఱకు నాచేతఁ జెప్పఁబడిన భక్తితోఁ గూడుకొని ఆయాదేవతలను ఆరాధించుటకు నిచ్ఛయించు చుండును. అనంతరమందు తన యిచ్ఛానుసారముగ ఇతర దేవతలను భక్తితో బూజించి కర్మఫలవిభాగజ్ఞుఁడను, పరమేశ్వరుఁడను అయిన నాచేతనే కలిగింపఁబడిన తనకోర్కెలను పొందు నని తా.

శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మామపి॥

టీక. దేవయజః = (అన్య) దేవతలను పూజించువారు, దేవాన్= (ఇతర) దేవతలను, యాంతి=పొందు చున్నారు. అల్పమేధసామ్=మంద బుద్ధి గల, తేషామ్=ఆ యన్య దేవతాభక్తులయొక్క, తత్=ఆ యన్యదేవతారాధనమువలనఁ గలుగునట్టి, ఫలమ్ = ఫలము, అంతవత్తు=నాశము కలది

మే, భవతి=అగుచున్నది. మద్భక్తాః = నా భక్తులు, మామపి=నన్నుఁ గూడ, యాంతి=పొందుచున్నారు.

ఓ అర్జునా! నాకంటె నితరు లగు దేవతలను బూజించువారు ఆ యితరదేవతలను పొందుచున్నారు. అట్లు ఇతరదేవతలను ఆరాధించుటవలనఁ గలిగిన ఫలము నాశము కలది యగుచున్నది. కావున ఇతరదేవతారాధనము వలనఁ గలుగు ఫలము శ్రేష్ఠమైనది కాదు. నాభక్తు లగువారు తమ కోర్కెలను పొందుటయేగాక శాశ్వతుఁడ నగు నన్నుఁగూడ (నాశము లేని ముక్తినిఁగూడ) పొందుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః।
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్॥

టీక. అవ్యయమ్ = నాశము లేనిదియును, అనుత్తమమ్ = నిరతిశయమైనదియును, పరమ్ = ప్రపంచవిలక్షణమైనదియును, (అయిన) మమ=నాయొక్క, భావమ్=స్వరూపమును, అజానంతః=ఎఱుఁగని, అబుద్ధయః = అవివేకులు, (శరీరగ్రహణాత్=శరీరమును గ్రహించుటకంటె, పూర్వమ్=పూర్వము) అవ్యక్తమ్ = ప్రకాశుఁడ నైన, మామ్ = నన్ను, (ఇదానీమ్ = ఇప్పుడు) వ్యక్తిమ్ = శరీరమును, ఆపన్నమ్ = పొందినవానినిగా, మన్యంతే=తలఁచుచున్నారు.

ఓ అర్జునుఁడా! నాశరహితమైనదియును, నిరతిశయమైనదియును, సర్వోత్తమమును (లేక) ప్రపంచవిలక్షణమును అయిన నా స్వరూపమును తెలియని మూఢులు శరీరమును ధరించుటకంటె పూర్వము అప్రకాశుఁడనైన నన్ను ఇప్పుడు శరీరమును పొందినవానినిగాఁ దలఁచుచున్నారు. అనఁగా సర్వకర్మములచేతను సేవింపఁ దగినవాఁడను, సర్వేశ్వరుఁడను మనోవాక్కులకుఁ గోచరము గాని స్వభావము కలవాఁడను అయిన నేను ఆశ్రితవాత్సల్యము వలన స్వభావమువలననే వసుదేవునకుఁ

పుత్త్రుఁడ నైతినని తలఁపక మందమతు లగువారు పూర్వకర్మవశముచేత బుట్టిన రాజపుత్త్రునిగాఁ దలఁచుచున్నారు అని తాత్పర్యము.

శ్లో॥ నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥

టీక. అహమ్ = నేను, సర్వస్య = సమస్తజనములకు, ప్రకాశః = ప్రత్యక్షమైనవాఁడను, న = కాను, యోగమాయయా = యోగమాయచేత, సమావృతః = కప్పఁబడినది. (అతఏవ = కనుక నే) మూఢః = వివేకరహితమైన, అయమ్ = ఈ, లోకః = జనము, మామ్ = నన్ను, అజమ్ = జన్మరహితునిఁగాను, అవ్యయమ్ = నాశరహితునిఁ గాను, నాభిజానాతి = ఎఱుఁగదు.

ఓ అర్జునుఁడా! నాభక్తు లయిన కొందఱికి దప్పఁ దక్కినవారి కందఱికిని నేను ప్రత్యక్షమైనవాఁడను గాను; మఱియు, నో యర్జునా! ఈలోకము యోగమాయచేత గప్పఁబడినది యగుటచేత వివేకరహితమైనదై నన్ను జన్మము లేనివానిఁగాను నాశము లేనివానినిగాను, దెలియఁజాలకున్న దని తాత్పర్యము.

శ్లో॥ వేదాఽహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥ ౨౬

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! సమతీతాని = గతించినవియును, వర్తమానాని = (ప్రస్తుతకాలమునందు) జరుగుచున్నవియును, భవిష్యాణి చ = కలుగఁబోవునట్టివియును, (అగు) భూతాని = ప్రపంచమును (లేక) ప్రాణులను, అహమ్ = నేను, వేద = ఎఱుఁగుదును. మాం తు = నన్ను, కశ్చన = ఒక్కఁడును, న వేద = ఎఱుఁగఁడు.

ఓ అర్జునుఁడా! ఇదివఱకు గతించినవియును, అప్పుడు జరుగుచున్నవియును, ఇఁకమీఁద జరుగఁబోవునట్టివియును అయిన ప్రపంచము

అను (లేక) ప్రాణులను నేను రక్షించుచున్నాను. ఆ ప్రాణులలో నాభక్తుఁడు తప్పఁ దక్కిన వాఁడెవ్వఁడును నన్నెఱుఁగఁడని తాత్పర్యము.

శ్లో॥ ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప॥ 27

టీక. భారత = భరతకులమునందుఁ బుట్టినవాఁడవును, పరంతప = శత్రువులను తపింపఁజేయువాఁడవును, (అయిన) ఓ యర్జునుఁడా! సర్గే = ఉత్పత్తికాలమునందు, ఇచ్ఛాద్వేషసముత్థేన = కామక్రోధములవలనఁ బుట్టిన, ద్వంద్వమోహేన = ఆ కామక్రోధములే నిమిత్తముగాఁగల యవివేకముచేత, సర్వభూతాని = సమస్తప్రాణులను, సమ్మోహమ్ = అధికమైన వివేకమును (లేక) విషయాభిమానమును, యాన్తి = పొందుచున్నవి.

భరతకులమునందుఁ బుట్టినవాఁడవును, శత్రువులను తపింపఁజేయువాఁడవును అయిన యో యర్జునుఁడా! స్థూలదేహోత్పత్తికాలమునందు కామక్రోధములవలనం బుట్టినదియును, ఆ కామక్రోధములే నిమిత్తముగాఁ గలదియును అయిన యవివేకముచేత సమస్తప్రాణులును మిగుల నవివేకమును (లేక) విషయాభిమానమును పొందుచున్నవని తాత్పర్యము.

శ్లో॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥

టీక. పుణ్యకర్మణామ = (చిత్తశుద్ధికి కారణము అయిన) సత్కర్మముల నాచరించిన, యేషామ్ = ఏ, జనానామ్ = జనులయొక్క, పాపంతు = పాపమైతే, అంతగతమ్ = నాశమును పొందినదో, తే = అట్టివారు, ద్వంద్వమోహనిర్ముక్తాః = రాగద్వేషములేనిమిత్తముగాఁగల యవివేకముచేతఁ విడువఁబడినవారై, దృఢవ్రతాః = నిశ్చయమైన నియమము గలవారై, (లేక) పరమాత్మతత్త్వనిశ్చయము కలవారై, మామ్ = నన్ను, భజన్తే = పొందుచున్నారు.

ఓ అర్జునుఁడా! చిత్తశుద్ధికి కారణ మైన సత్కర్మానుష్ఠానమును చేసి సకలపాపములను నశింపఁజేసికొనిన మహానుభావులు రాగద్వేషముల వలనఁ గలిగిన యవివేకముచేత విడువఁబడినవారును, నిశ్చయ మైన నియమము కలవారును నై నన్ను పొందు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్॥

టీక. యే=ఎవరు, మామ్ = నన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, జరామరణమోక్షాయ=ముసలితనము చావుఅనువానిని పోఁగొట్టుకొనుటకొఱకు, యతంతి=ప్రయత్నమును చేయు చున్నారో; తే=అట్టివారు, తత్=సర్వోత్తమ మైన, బ్రహ్మ = బ్రహ్మమును, అఖిలమ్= సమస్త మైన, కర్మ చ= కర్మస్వరూపమును గాను, కృత్స్నమ్ = సకలవిధ మైన, అధ్యాత్మమ్ = ప్రత్యగాత్మస్వరూపమును గాను, విదుః = తెలిసికొను చున్నారు.

ఓ అర్జునుఁడా! ఏపురుషులు పరమేశ్వరుఁడ నగు న న్నాశ్రయించి అనఁగా నాయందే యుంచఁబడినచిత్తము కలవారై జరామరణములను (సంసారమును) లేకుండునట్లు చేసికొనుటకు యత్నించు చున్నారో అట్టివారు పరబ్రహ్మమును సమస్త మైన కర్మస్వరూపమును గాను, సమస్త మైన యధ్యాత్మ స్వరూపముగాను తెలిసికొను చున్నా రని (లేక) అట్టివారు, పరబ్రహ్మమును, పరబ్రహ్మమును పొందునట్టిదియును దేహాదివ్యతిరిక్తమును అయిన శుద్ధాత్మను, బ్రహ్మప్రాప్తికి సాధనమును సాంగమును అగు సకల కర్మసముదాయమును తెలిసికొను చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః॥ 30

టీక. యే = ఎవ్వరు, సాధిభూతాదిదైవమ్ = అదిభూతాదిదైవములతో (నశించునట్టి దగు ప్రాణసముదాయము, సకలప్రాణులయొక్క

యింద్రియములకు అనుగ్రాహకుఁడగు హిరణ్యగర్భుఁడు అనువారితో) కూడుకొనినవాఁడను, సాధియజ్ఞంచ=అధియజ్ఞముతో (సర్వయజ్ఞాభిమాని దేవతతో) కూడుకొనినవాఁడను, (అయిన) మామ్=నన్ను, విదుః=తెలిసికొను చున్నారో; తే = అట్టివారు, ప్రయాణకాలేపిచ = మరణకాలమునందుఁ గూడ, యుక్తచేతసః=సమాహితచిత్తులై, మామ్=నన్ను, విదుః=తెలిసికొను చున్నారు.

ఓ అర్జునా! అధిభూతాదిదైవాధియజ్ఞములతోఁ గూడ ప్రవర్తించుచున్న నన్ను దెలిసినవారు ఇంద్రియవ్యాకులత గల మరణకాలమందుఁ గూడ నన్ను దెలిసికొనఁ గల రని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శాతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః

టీ. వైయాసిక్యామ్=వ్యాసప్రోక్తమైనదియును, శాతసాహస్ర్యమ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే=సంపత్కరమైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు=ప్రశస్తసంపద కలభగవంతునిచేతఁ జెప్పఁబడిన. ఉపనిషత్సు=వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే=శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయ కోపాయములను తెలుపునట్టి గ్రంథమందు) విజ్ఞాన యోగో

నామ=విజ్ఞానయోగ మనియెడు పేరుగల, సప్తమః = ఏడవదైన, అధ్యాయః=భాగము, ఇతి=ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును, శాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు విజ్ఞానయోగమును తెలుపునట్టి ఏడవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.



శ్రీ రాం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత - అష్టమాధ్యాయము,

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

అక్షరపరబ్రహ్మయోగము.

(లేక)

తారకబ్రహ్మయోగము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ కింతద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే॥ ౧
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః॥ ౨

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హే పురుషోత్తమ= పురుషశ్రేష్ఠుఁడవైన యోకృష్ణా! తత్=ఇదివఱకుఁ జెప్పఁబడిన యధ్యాయములయొక్క తుదయందుఁ జెప్పఁబడిన, బ్రహ్మ = బ్రహ్మము, కిమ్= ఏది? అధ్యాత్మమ్ = అధ్యాత్మము, కిమ్ = ఎట్టిది ? కర్మ = కర్మము, కిమ్=ఎట్టిది? అధిభూతంచ=అధిభూతమును, కిమ్ = ఎట్టిదిగా, ప్రోక్తమ్= చెప్పఁబడి యున్నది. అధిదైవమ్=అధిదైవము, కిమ్=ఏదిగా, ఉచ్యతే=

చెప్పఁబడు చున్నది. హే మధుసూదన=ఓ కృష్ణుఁడా! అస్మిన్ = ఈ, దేహే = దేహమునందు, అధియజ్ఞః = అధియజ్ఞుఁడు ఉండువాఁడును, (లేక) ప్రేరేపించువాఁడును, (లేక) ఫలము నిచ్చువాఁడును, కః=ఎవ్వఁడు? అత్ర=ఈ అధియజ్ఞునివిషయములో, కథమ్ = ఎట్లు, (జ్ఞేయః = తెలియఁదగినవాఁడు) లేక అధియజ్ఞుఁడు, అత్ర = ఈ దేహమునందు, కథమ్ = ఏవిధముగా, తిష్ఠతి=ఉన్నాఁడు. ప్రయాణకాలేచ=మరణకాలమునందును, నియతాత్మభిః=నియమింపఁబడిన చిత్తము కల వారిచేత, (లేక) స్వాధీన మైన మనస్సు కలవారిచేత, కథమ్=ఎట్లు, జ్ఞేయః=తెలియఁదగినవాఁడవు, అసి=అయితివి.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—పురుషోత్తముఁడ వైన యోకృష్ణుఁడా! ఇదివఱకు చెప్పఁబడిన బ్రహ్మ మన నేది? అధ్యాత్మ మేది? కర్మ మన నెట్టిది? అధిభూత మనునది యేది? అధిదైవ మేది? ఓ మధుసూదనుఁడా! ఈ దేహమునందు అధియజ్ఞుఁడు (ఉండువాఁడును, ప్రేరేపించు వాఁడును, ఫలముల నిచ్చువాఁడును) ఎవ్వఁడు? అధియజ్ఞుని యెట్లు తెలిసికొనవలెను? (లేక) అధియజ్ఞుఁడు ఈదేహమునం దెట్లున్నాఁడు? మరణకాలమునందు ఇంద్రియము లన్నియును వ్యాకులము లై యుండును కదా! అట్టి సమయమునందు స్వాధీన మైన మనస్సు కలవారిచేత నీ వెట్లు తెలియఁబడుదు వని (లేక) స్వాధీన మైన మనస్సు కలవారై ని న్నేవిధముగఁ దెలిసికొందు రని తాత్పర్యము,

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను. పరమమ్ = నిరతిశయ మైన, అక్షరమ్ = నాశరహిత మైనది, బ్రహ్మ =

బ్రహ్మము, (ఇతి=ఇట్లని), ఉచ్యతే = చెప్పఁబడు చున్నది. స్వభావః= జీవసంజ్ఞ గల ప్రత్యగాత్మభావము, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, (ఇతి= ఇట్లని) ఉచ్యతే=చెప్పఁబడు చున్నది. భూతభావోద్భవకరః = ప్రాణి వస్తువులకు ఉత్పత్తిని కలుఁగఁజేయునట్టి, విసర్గః = (దేవతల నుద్దేశించి మంత్రపూర్వకముగ నగ్నియందు చరు పురోడాశాదికమును హోమమును చేయుట యనునట్టి) యజ్ఞము, కర్మసంజ్ఞికః = కర్మ మను పేరు కలది, ఇతి=ఇట్లని, ఉచ్యతే=చెప్పఁబడు చున్నది.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.— ఓ అర్జునా! నిరతిశయమైన నాశము లేనిది బ్రహ్మ మనఁబడును. ఆ పరబ్రహ్మముయొక్క యేజీవసంజ్ఞ కల్గ ప్రత్యగాత్మభావము అధ్యాత్మము అనఁబడును. ప్రాణివస్తువులయొక్క యుత్పత్తిని కలుగఁజేయునట్టిదియును, దేవతోద్దేశముచేతఁ జేయఁబడినది యును అగుచరుపురోడాశాది ద్రవ్యపరిత్యాగము కర్మమనఁబడును అని తా.

శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతామ్।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర॥

టీక. దేహభృతామ్=దేహధారులలో, వర=శ్రేష్ఠుఁడవు (అయిన) ఓ అర్జునుఁడా! క్షరః = నశించునట్టిదియును, భావః = పుట్టునదియును, (అయిన) భూతసముదాయము, (అనఁగా, జననమరణములు గల సకల వస్తువులును) అధిభూతమ్=అధిభూతము, ఇతి=ఇట్లని, ఉచ్యతే = చెప్ప బడు చున్నది) పురుషశ్చ = సూర్యాద్యంతర్గతుఁడును, సకలప్రాణుల యింద్రియములకును (గ్రాహకుఁడును అయిన) హిరణ్యగర్భుఁడే, అధిదైవ తమ్=అధిదైవము, (ఇతి=ఇట్లని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నది) అహ మేవ=నేనే. అత్ర = ఈ శాస్త్రమునందు, (లేక) ఈ, దేహే = దేహము నందు, అధియజ్ఞః = అధియజ్ఞుఁడు, (యజ్ఞాధిదేవత యగు విష్ణువు) ఇతి= ఇట్లని, (ఉచ్యతే=చెప్పఁబడు చున్నాఁడను).

దేహధారులలో నుత్తముఁడవైన యో యర్జునుఁడా! నశించు నట్టిదియును ఉత్పత్తి కలదియును నగు సమస్తవస్తుసముదాయమును అధిభూతమనియును, సూర్యాదిమండలాంతర్గతుఁడును సర్వేంద్రియానుగ్రాహకుఁడును నగు హిరణ్యగర్భుని అధిదైవమనియును తెలిసికొనుము. మఱియు నో యర్జునుఁడా! ఈ దేహమునందు అంతర్యామినై యున్న విష్ణు వను పేరుగల నన్నే అధియజ్ఞునిఁగా (యజ్ఞాభిమాని యగు దేవతనుగా) తెలిసికొనుము అని తాత్పర్యము.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

టీక. యః = ఎవ్వఁడు, అంతకాలేచ=మరణకాలమునందుఁగూడ, మామేవ=(అంతర్యామినైన) నన్నే, స్మరన్=స్మరించుచు, కళేబరమ్=శరీరమును, ముక్త్వా = విడిచిపెట్టి, ప్రయాతి=పోవుచున్నాఁడో, సః=అట్టివాఁడు, మద్భావమ్=నాస్వరూపమును, (స్వస్వరూపానుభవమును లేక, మోక్షమును అనఁగా జననమరణరాహిత్యమును) యాతి=పొందుచున్నాఁడు. అత్ర=ఈ విషయమునందు, సంశయః=సందేహము, నాస్తి=లేదు.

ఓ అర్జునుఁడా! ఏపురుషుఁడు మరణకాలమునందుఁ గూడ నన్నే స్మరించుచున్నవాఁ డగుచు, శరీరమును విడిచిపెట్టి అర్చిరాదిమార్గము చేత ననఁగా నుత్తరాయణమార్గముచేత పోవుచున్నాఁడో, అట్టివాఁడు నా స్వరూపమును స్వస్వరూపానుభవమును (లేక) మోక్షమును (అనఁగా జనన మరణ రాహిత్యమును) పొందుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్।
తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥ ౬

టీక. హే కౌంతేయ = ఓ అర్జునుఁడా! (యః=ఎవ్వఁడు) అంతే= మరణకాలమునందు, యం + యం + వాపిభావమ్ = ఏయే దేవతా రూపము నైనను, స్మరన్ = తలంచు చున్నవాఁడై, కళేబరమ్ = శరీరమును, త్యజతి=విడుచు చున్నాఁడో, (సః=అట్టివాఁడు) తద్భావభావితః (సన్) ఆయా రూపముయొక్క స్మరణముచేతఁ గలిగిన సంస్కారము కలవాఁడై, తం + తం + ఏవ + (భావమ్) = ఆయా స్వరూపమునే, ఏతి=పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా ! మరణకాలమునందు ఏయే దేవతారూపములను స్మరించుచు దేహమును విడిచిపెట్టునో అట్టి సంస్కారము గలవాఁడై ఆయా దేవతాస్వరూపములను పొందు నవి; అనఁగా మరణకాలమునం దెట్టి తలంపు గలవాఁ డగునో, దానికిఁ దగినన జన్మమును పొందునని తాత్ప.

శ్లో ॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయమ్॥ 8

టీక. తస్మాత్ = ఆ కారణమువలన, సర్వేషు=సమస్తము అయిన, కాలేషు = కాలములయందు, మామ్ = నన్ను, అనుస్మర= చింతింపుము. యుధ్య చ=యుద్ధమునుకూడ జేయుము. మయి=నాయందు, అర్పిత మనోబుద్ధిః (సన్)=ఉంచఁబడిన మనోబుద్ధులు కలవాఁడ వగుచు, మామేవ= నన్నే, ఏష్యసి=పొందఁగలవు; అత్ర = ఈ విషయమునందు, సంశయః= సందేహము, నాస్తి=లేదు.

ఓ అర్జునుఁడా! దేహత్యాగ కాలమునందలి భావన దేహాంతరప్రాప్తికి కారణము గనుక సర్వకాలములయందును నన్ను స్మరింపుము. శాస్త్రోక్త ప్రకారముగ యుద్ధమును చేయుము. ఇంతియ గాక, మనోబుద్ధులును నాయందే

యుంచుము. ఇట్లు చేసినయెడల నీవు నన్నే పొందఁగలవు. ఈ విషయము నందు సందేహ మేమియును లేదని తాత్పర్యము.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాఽన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్॥ ౮

టీక. హే పార్థ = ఓ యర్జునుఁడా! అభ్యాసయోగయుక్తేన = అభ్యాస మనియెడు యోగముతోఁ గూడుకొనినదియును, నాన్యగామినా= ఇతరవిషయములయందుఁ బ్రవర్తింపనిదియును (అను) చేతసా=మనస్సుచేత, దివ్యమ్=సూర్యమండలమునందు అయినవాఁడును, పరమమ్=ఉత్కృష్టుఁడును, (అయిన) పురుషమ్ = పురుషుని, అనుచింతయన్ = ధ్యానము చేయుచు, తమేవ=ఆ పురుషునే, యాతి=పొందుచున్నాఁడు.

ఓ అర్జునా! అభ్యాస మనియెడు యోగముతోఁ గూడుకొనినది అన్యాయత్తము కానిదియును అయిన చిత్తముచేత సూర్యమండలమందు అయిన పరమపురుషుని ధ్యానము చేయుచు పరమపురుషునే పొందు చున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ కవిం పురాణమనుశాసితార
మణోరణీయాంసమనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచింత్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ ౯

టీక. యః = ఏ పురుషుఁడు; కవిమ్ = అతీతానాగత వర్తమాన విషయములను తెలిసినవాఁడును (సర్వజ్ఞుఁడును), పురాణమ్ = ఎల్లప్పుడు నుండువాఁడును, అనుశాసితారమ్ = (సకలజగత్తునకును) శిక్షకుఁడును, అణోః=సూక్ష్మముకంటె, అణీయాంసమ్=మిగుల సూక్ష్మమైనవాఁడును, సర్వస్య = సకలకర్మఫలజాతమునకును, ధాతారమ్ = చేయువాఁడును,

అచింత్యమ్ = విచారింప నలవికానివాఁడును, ఆదిత్యవర్ణమ్ = సూర్యుని యొక్క ప్రకాశమువంటి ప్రకాశము కలవాఁడును, తమసః = అజ్ఞానాంధకారముకంటె, పరస్తాత్ = అతీతుఁడును, (అయిన) (పురుషమ్ = పురుషుని) అనుస్మరేత్ = స్మరించునో, సః = వాఁడు, (తమేవ = ఆ పురుషునే, యాతి = పొందు చున్నాఁడు).

అతీతానాగత వర్తమానవిషయముల నన్నింటిని దెలిసినవాఁడును, అనఁగా సర్వజ్ఞుఁడును, సర్వకాలములయందుండువాఁడును, సకలలోకముల కును నియామకుఁడును, సూక్ష్మముల కంటె మిగుల సూక్ష్మమైనవాఁడును, సమస్తకర్మములకును, ఆకర్మఫలములకును విచిత్రముగ ప్రాణులకు విభజనకర్తయైనవాఁడును, సూర్యునిప్రకాశమువంటి నిత్యచైతన్యప్రకాశముకల వాఁడును, అజ్ఞానమనియెడు మోహాంధకారమున కతీతుఁడును అయిన పరమపురుషుని ధ్యానము చేయువాఁడు ఆపరమపురుషునే పొందునని తా.

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యాయుక్తో యోగబలేనచైవ ।
భ్రువో ర్మధ్యే ప్రాణమావేశ్య సమ్య
క్సతం పరం పురుష ముపైతి దివ్యమ్॥　　౧౦

టీక. యః = ఎవ్వఁడు, ప్రయాణకాలే = మరణకాలమునందు, అచలేన = నిశ్చలమైన, మనసా = మనస్సుతోడను, భక్త్యా = భక్తితోడను, యోగబలేనచైవ = (సమాధిసంస్కారమువలనఁగలిగిన చిత్తస్థైర్యమే స్వరూపముగాఁ గల) యోగబలముతోడను, (యుక్తస్సన్ = కూడుకొనినవాఁడగుచు) భ్రువోః = కనుబొమలయొక్క, మధ్యే = మధ్యయందు, ప్రాణమ్ = ప్రాణ వాయువును, ఆవేశ్య = స్థాపించి, సమ్యక్ = అప్రమత్తుఁడగుచు, (తమ్ = ఆ పరమపురుషుని, అనుస్మరేత్ = స్మరించునో) సః = ఆ పురు

షుఁడు, దివ్యమ్=ప్రకాశాత్మకుఁడును, పరమ్=సర్వోత్తముఁడును,(అయిన) పురుషమ్=పురుషుని, ఉపైతి=పొందు చున్నాఁడు.

ఏపురుషుఁడు మరణకాలమునందు నిశ్చలమైన మనస్సుకలవాఁడును, సమాధిసంస్కారమువలనఁ గల్గిన చిత్తస్థైర్యమే స్వరూపముగాఁ గలయోగ బలము కలవాఁడును, భక్తి గలవాఁడును అగుచు ముందుగ చిత్తమును హృదయపుండరీకమునందు నిలిపి పిమ్మట ఆ హృదయపుండరీకమునుండి పైకిఁబోయిన నాడీమార్గముగ భూమ్యాదితత్త్వములను జయించి ప్రాణవాయువును కనుబొమలనడుమ స్థాపించి ప్రమాదమేమియును లేనివాఁడై పరమపురుషుని స్మరించునో అట్టి పురుషుఁడు ప్రకాశాత్మకుఁడైన యీ పరమపురుషునే పొందు చున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ ౧౧

టీక. వేదవిదః = వేదార్థము తెలిసినవారు, యత్=ఏస్థానమును, అక్షరమ్=నాశము లేనిదానినిగా, వదంతి=చెప్పుచున్నారో; వీతరాగాః= పోయినకోర్కెలు గల (కామ క్రోధములను జయించిన) యతయః= ప్రయత్నమును చేయునట్టి స్వభావము కలవారు (సన్న్యాసులు), యత్= (నాశరహితమైన) యేస్థానమును, విశంతి=ప్రవేశించు చున్నారో; యత్= ఏ యక్షరపదమును, (నాశరహితమైన యేస్థానమును) (జ్ఞాతుమ్ = తెలిసికొనుట కొఱకు) ఇచ్ఛన్తస్సంతః = కోరు చున్నవా రగుచు, బ్రహ్మచర్యమ్=బ్రహ్మచారివ్రతమును స్త్రీలను భోగేచ్ఛతోఁ దలంపకుండుట, భిక్షాన్నమును భుజించుట, గురుశుశ్రూషను జేయుట, వేదముల నధ్యయనము చేయుట అను (నియమములను) చరంతి=అనుష్ఠించు చున్నారో,

తత్=ఆ యక్షరాఖ్యమైన, పదమ్=స్థానమును, (ప్రాప్యవస్తువును) సంగ్రహేణ=సంక్షేపముగా, తే=నీ కొఱకు, ప్రవక్ష్యే=లెస్సగాఁజెప్పఁగలను.

తాత్పర్యము|| వేదార్థము తెలిసికొనినవారిచేత నాశరహితమైన దని చెప్పఁబడుచున్నదియును, కామక్రోధములను జయించిన యతులచేతఁ బ్రవేశింపఁబడుచున్నదియును, బ్రహ్మచారులచేత భిక్షాన్నాదివ్రతముల నవలంబించి తెలియఁగోరఁబడుచున్నదియును అయిన మోక్షపదమును నీకు సంగ్రహముగా వివరించి చెప్పెద నని తాత్పర్యము.

శ్లో|| సర్వద్వారాణి సంయమ్య
మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాఽఽత్మనః ప్రాణ
మాస్థితో యోగధారణామ్|| ౧౨

టీక. సర్వద్వారాణి=సకలేంద్రియ ద్వారములను(నవద్వారములను), సంయమ్య=చక్కఁగా నియమించి, మనః=మనస్సును, హృది=హృదయమునందు, నిరుధ్య చ=నిరోధించియును, ఆత్మనః=తనయొక్క, ప్రాణమ్=ప్రాణవాయువును, మూర్ధ్ని=శిరస్సునందు, (శిరస్సునకు సమీపమునను్న కనుబొమలనడుమ) ఆధాయ=ఉంచి, యోగధారణామ్=యోగస్థైర్యమును, ఆస్థితస్సన్=ఆశ్రయించినవాఁడగుచు, (పరమామ్=సర్వోత్తమమైన, గతిమ్=గతిని, యాతి=పొందుచున్నాఁడు).

సకలేంద్రియద్వారములను (నవద్వారములను) చక్కఁగా బంధించి మనస్సును హృత్పుండరీకమునందు నిలిపి ప్రాణవాయువును శిరస్సునకు సమీపమునను్న కనుబొమలనడుమనుంచి యోగస్థైర్యమును ఆశ్రయించినవాఁడగుచు సర్వోత్తమమైన గతిని పొందుచున్నాఁడని; (అనఁగా విషయములయందలి దోషములను తెలిసికొనుట యనియెడు నభ్యాసమువలన

శ్రోత్రాదీంద్రియములను శబ్దాదివిషయములమీదికిఁ బోనీయక, అట్లు ఇం ద్రియద్వారములను నియమించినను మనస్సునకు ప్రచారము కలుగును కనుక అభ్యాసవైరాగ్యములచేత మనస్సును వృత్తిరహితమైనదానినిగాఁ జేసి అనఁగా, హృదయమునందు గూడ విషయములను దలఁపక అట్టి సమయము నందు స్వాధీనమైన మనస్సుచేత హృదయముకంటె మీఁదికి బ్రసరించిన నాడిచేత పైభాగము నెక్కించి శిరస్సునకు సమీపమున నున్న కనుబొమల నడుమ తనయొక్క ప్రాణవాయువు నుంచి యోగధారణ మవలంబించన వాఁడగుచు సర్వోత్తమ మయినగతిని పొందుచున్నాఁ డని తాత్ప.

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥

టీక. బ్రహ్మ = బ్రహ్మవాచకమైన, ఓమ + ఇతి=ఓమ్ అనునట్టి, ఏకాక్షరమ్=ముఖ్యమైన వర్ణమును, వ్యాహరన్ = ఉచ్చరించు చున్న వాఁడై, మామ్=(ఆ యోంకారవాచ్యుఁడ నైన) నన్ను, అనుస్మరన్ = చింతించు చున్నవాఁడై, దేహమ్=శరీరమును, త్యజన్ = విడుచు చున్న వాఁడై, యః = ఎవ్వఁడు, ప్రయాతి=పోవు చున్నాఁడో, సః=వాఁడు, పరమామ్=సర్వోత్తమ మైన, గతిమ్=ప్రాప్యస్థానమును, యాతి=పొందు చున్నాఁడు.

బ్రహ్మము ప్రతిపాదించునట్టి "ఓమ్" అనునట్టి ముఖ్యమైన (ఏక) ఒక్కటియైన యక్షరమును ఉచ్చరించు చున్నవాఁడును ఆ యోంకారమున కర్థమైననన్ను స్మరించుచున్నవాఁడును, శరీరమును విడుచుచున్నవాఁడును నై యెవ్వఁడు పోవు చున్నాఁడో; అట్టివాఁడు సర్వోత్తమ మైన గతిని (మోక్షమును) అర్చిరాదిమార్గముచేత పొందు చున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥ ౧౪

టీక. హేపార్థ=ఓ అర్జునుఁడా! యః=ఎవ్వఁడు, అనన్యచేతాః= అన్యవిషయము గాని చిత్తముగలవాఁడై, సతతమ్=బ్రదికి యున్నంతకాలము, నిత్యశః = ప్రతిదినమందును, మామ్ = నన్ను, స్మరతి = స్మరించు చున్నాఁడో, నిత్యయుక్తస్య = సర్వకాలములయందును సమాహితచిత్తుఁడైన, తస్య=అట్టి, యోగినః = యోగికి, అహమ్ = పరమాత్మ నగు నేను, సులభః=సులభుఁడను, భవామి=అగుచున్నాను.

ఓ అర్జునా! ఏ యోగి యితరవిషయ మైన చింత లేనివాఁడై బ్రదికి యున్నంతకాలమును యెడతెగక నన్ను స్మరించు చుండునో సర్వకాలముల యందును సమాహితచిత్తుఁడైన అట్టియోగికి నేను సులభుఁడనై యుందు నని తాత్పర్యము.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాంగతాః॥ ౧౫

టీక. మహాత్మానః=శ్రేష్ఠ మైన బుద్ధిగలవారు, (యతులు) మామ్= నన్ను, ఉపేత్య = పొంది, పరమామ్ = సర్వోత్తమ మైన, సంసిద్ధిమ్ = మోక్షసిద్ధిని, గతాః (సంతః)=పొందినవారై, దుఃఖాలయమ్ = ఆధ్యాత్మికాది దుఃఖములకు నెలవైనట్టియదియును, అశాశ్వతమ్ = శాశ్వతము కానిదియును, (అయిన) పునర్జన్మ = రెండవజన్మమును నాప్నువంతి = పొందరు.

ఓ అర్జునుఁడా! శ్రేష్ఠ మైన బుద్ధిగలవారు అనఁగా ఈశ్వరునియందే యుంచఁబడిన చిత్తము గలవారగు యతులు నాభావమును పొంది మోక్షసిద్ధి గలవారగుచు ఆధ్యాత్మికాది సకలదుఃఖములను కలిగించునట్టిదియును, శాశ్వతము కానిదియును అయిన జన్మమును మరలఁ బొందరని తాత్ప.

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥ ౧౬

టీక. హే అర్జున=ఓ అర్జునుఁడా! ఆబ్రహ్మభువనాత్ = బ్రహ్మ లోకముతోఁ గూడ, లోకాః=(సమస్త) లోకములును, పునః + ఆవర్తినః=తిరిగివచ్చెడు స్వభావము కలవి, హే కౌంతేయ=కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! మామ్=నన్ను, ఉపేత్య తు=పొందినయెడల, పునః=మరలః జన్మ=పుట్టువు, నవిద్యతే=లేదు.

ఓ అర్జునా! బ్రహ్మలోకముతోఁ గూడ సకల లోకములును తిరిగి వచ్చెడు స్వభావము కలవి. అనఁగా బ్రహ్మలోకముతోఁ గూడ సకల లోకములలో నేలోకమునకుఁ బోయినను అక్కడనుండి మఱల వచ్చి పుట్టవలసినదే యనుట; కుంతీపుత్రుఁడ వైన యో యర్జునా! నా భావమును పొందిన వానికిమాత్రము మఱల జన్మము కలుగ దని తాత్పర్యము.

శ్లో॥ సహస్రయుగపర్యంత
మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం
తేఽహోరాత్రవిదో జనాః॥ ౧౭

టీక. (ఏ=జనులు) అహోరాత్రవిదః=(వేద వేదాంగముల యందుఁ జెప్పఁబడినవిధముగ బ్రహ్మయొక్క) రాత్రింబగళ్ళపరిమాణమును దెలిసిన వారు, (భవంతి = అగుచున్నారో) తే = అట్టి కాలసంఖ్యా వేత్తలు, బ్రహ్మణః = చతుర్ముఖబ్రహ్మకు, యత్=ఏది, అహః = పగలో, (తత్= దానిని) సహస్రయుగపర్యంతమ్=వేయియుగముల పరిమితిగలదానిని గాను, రాత్రిమ్=రాత్రిని, యుగసహస్రాంతామ్ = వేయియుగములపరిమితి కల దానిని గాను, విదుః=తెలిసికొనుచున్నారు,

వేదవేదాంగములయందుఁ జెప్పఁబడినవిధముగ బ్రహ్మదేవుని యొక్క రాత్రింబగళ్ళపరిమాణమును దెలిసినవారు వేయియుగము లయ్యే

కనుక బ్రహ్మలోకపు పగలును, బ్రహ్మయొక్క రాత్రికాలము కూడ వేయియుగముల పరిమితి కలదనియును చెప్పుచున్నారని తా.

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవాఽవ్యక్తసంజ్ఞకే॥

టీక. అహరాగమే=(బ్రహ్మదేవునియొక్క) పగలువచ్చినసమయమునందు, అవ్యక్తాత్ =(బ్రహ్మముయొక్క) నిద్రావస్థనుండి, వ్యక్తయః= స్థావరజంగమస్వరూపు లయిన, సర్వాః=సర్వప్రజలును, ప్రభవంతి=స్పష్టముగఁ గనఁబడుచున్నారు; రాత్ర్యాగమే=(ఆబ్రహ్మకు) రాత్రి వచ్చిన కాలమునందు, అవ్యక్తసంజ్ఞకే=అవ్యక్తమనియెడు పేరుగల, తత్రైవ=(ఆ బ్రహ్మముయొక్క) నిద్రావస్థయందే, ప్రలీయంతే=అణఁగిపోవుచున్నారు.

బ్రహ్మదేవునియొక్క పగలు వచ్చినకాలమునందు స్థావరజంగమస్వరూపులగు సకలప్రజలను స్పష్టముగఁ గనఁబడుచున్నారనియును, ఆ బ్రహ్మదేవునకు రాత్రి వచ్చినకాలమునందు స్థావరజంగమలక్షణప్రజలు ఆబ్రహ్మదేవునియొక్క నిద్రావస్థయందే అణఁగిపోవుచున్నారనియును తా.

శ్లో॥ భూతగ్రామ స్స ఏవాయం
భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ
ప్రభవ త్యహరాగమే॥

టీక. హేపార్థ=ఓ అర్జునుఁడా! (యః = ఏభూతసముదాయము పూర్వకల్పే=పూర్వకల్పమునందు, (ప్రాదుర్బభూవ = పుట్టెనో) సః=ఆ, అయమేవ=ఈభూతసముదాయమే, అవశస్సన్=అస్వతంత్రమైన దగుచు, అహరాగమే=(బ్రహ్మయొక్క) పగలు వచ్చినకాలమునందు, ప్రభవతి= పుట్టుచున్నది. రాత్ర్యాగమే=రాత్రి వచ్చినకాలమునందు, ప్రలీయతే=

లీనమగుచున్నది; (ఏవమ్ = ఈవిధముగా) భూత్వాభూత్వా = పుట్టిపుట్టి, ప్రలీయతే = లీనమయి పోవుచున్నది.

ఓ అర్జునుఁడా! పూర్వకల్పమునందుఁ బుట్టిన ప్రాణసమూహమే బ్రహ్మకు పగలు వచ్చినకాలమునందుబుట్టి లీనమై పోవుచున్నది. ఈవిధముగ సకల ప్రాణిసమూహమును పుట్టి పుట్టి లీనమగుచున్నదని తా.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ ౨౦

టీక. యః = ఏ, భావః = భావము, (ఏ యక్షరపరబ్రహ్మ స్వరూపము,) తస్మాత్ = పూర్వోక్త మైనదియును, అవ్యక్తాత్ = (భూతసముదాయమునకుఁ గారణమును అవిద్యాస్వరూపమును అయిన) అవ్యక్తముకంటె (చతుర్ముఖునికంటె) అన్యః = ఇతర మైనదియును, పరః = శ్రేష్ఠ మైనదియును, అవ్యక్తః = ఇంద్రియములకు) కనఁబడనిదియును, సనాతనః = ప్రాచీనము (అనాదిసిద్ధమైనదో) సః = ఆ యక్షరపరబ్రహ్మము, సర్వేషు = సమస్తము లైన, భూతేషు = బ్రహ్మ మొదలగు భూతములు, నశ్యత్సు (సత్సు) = నశించుచున్నప్పటికిని, నవినశ్యతి = నశింపదు.

ఓ అర్జునుఁడా! ఇదివఱకుఁ జెప్పఁబడినదియును, భూతసముదాయమునకుఁ గారణభూతమును, అవిద్యాస్వరూపమును అయిన యవ్యక్తముకంటె (చతుర్ముఖునికంటె) ఇతరమును శ్రేష్ఠమును ఇంద్రియములకు గోచరము కానిదియును సనాతనమును అయిన యక్షరపరబ్రహ్మము హిరణ్యగర్భాది సకల భూతములును నశించినప్పటికిని నశింప దని తాత్పర్యము.

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ ౨౧

టీక. (యః = ఏ పరమాత్మ) అవ్యక్తః = ఇంద్రియములకు గోచరము కానివాఁడు, అక్షరః = నాశరహితుఁడు, ఇతి = ఇట్లని, ఉక్తః = చెప్పఁ

బడినవాఁడో, తమ్=అట్టి పరమాత్మను, పరమామ్ = సర్వోత్తమ మైనః గతిమ్=ప్రాప్యస్థానముగా, ఆహుః = చెప్పుచున్నారు. యమ్=ఏభావమును, ప్రాప్య=పొంది, నివర్తంతే = (జన్మాదులను పొందుటకు) తిరిగి రారో, తత్=అది, మమ = నాయొక్క, పరమమ్ = సర్వోత్తమ మైన, ధామ=స్థానము.

ఇంద్రియములకు గోచరము కానివాఁడును, నాశరహితుఁడును అయిన పరమాత్మయే ప్రాప్యస్థానమనియును, పునరావృత్తిని కలుగఁజేయనిదియును, సర్వోత్తమమును నగు నా యా పరమాత్మభావమే భగవంతుఁడ నగు నాయొక్కస్థాన మనియును తాత్పర్యము.

శ్లో॥ పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా।
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ ౨౨

టీక. హేపార్థ=ఓ అర్జునుఁడా! భూతాని=ప్రాణులు, యస్య=ఏ పరమపురుషునియొక్క, అంతస్థాని = మధ్యయం దున్నవో, యేన=ఏ పరమపురుషుని చేత, ఇదమ్=ఈ, సర్వమ్ = సకలప్రపంచమును, తతమ్=వ్యాప్త మైనదో, సః=అటువంటి, పరః=సర్వోత్తముఁ డగు, పురుషః = పురుషుఁడు, అనన్యయా=ఆత్మవిషయమునకంటె నితరవిషయము కాని, (ఆత్మవిషయ మైన) భక్త్యా=జ్ఞానరూప మగు భక్తిచేత, లభ్యః + తు = నిశ్చయముగఁ బొందఁదగినవాఁడు.

ఓ అర్జునుఁడా! చరాచరాత్మకము అగు సకలప్రాణులును ఏపరమపురుషునియొక్క మధ్యమునం దున్నవో, ఏ పరమపురుషునిచేతచరాచరాత్మక మైన యీప్రపంచ మంతయును వ్యాపింపఁబడినదో అట్టి పరమపురుషుఁడు ఆత్మవిషయజ్ఞానరూప మగు భక్తిచేత నిశ్చయముగఁ బొందఁదగిన వాఁ డని తాత్పర్యము.

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ 23

టీక. హే భరతర్షభ = ఓ అర్జునుడా! యత్ర=ఏ, కాలేతు= కాలమునందు, ప్రయాతాః=మరణమును పొందిన, యోగినః=కర్మయోగులు, ఆవృత్తించ + ఏవ=పునర్జన్మమును, యాంతి=పొందు చున్నారో; యత్ర= ఏ, కాలే=కాలమునందు, ప్రయాతాః=మరణమును పొందిన, యోగినః= యోగాభ్యాసకులు ధ్యానము జేయువారు) అనావృత్తిమ్=జన్మరాహిత్య మును, యాంతి=పొందు చున్నారో, తమ్ = అటువంటి, కాలమ్=కాల మును, వక్ష్యామి=చెప్పెదను.

ఓ అర్జునుడా! ఏకాలమునందు మరణమును పొందిన కర్మయోగులు మరల పుట్టుదురో, ఏకాలమునందు మరణమును పొందిన యోగాభ్యాస కులు (ధ్యానము చేయువారు) పునర్జన్మమును పొందరో అట్టికాలమును చెప్పెదనని తాత్పర్యము.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ 24

టీక. అగ్నిః=కాలాభిమానిదేవతయును. జ్యోతిః=ప్రకాశాభిమాని దేవతయును, అహః = దివసాభిమానిదేవతయును, శుక్ల = శుక్లపక్షమున కభిమానిదేవతయును, షణ్మాసాః = ఆఱునెలలు కల, ఉత్తరాయణమ్= ఉత్తరాయణాభిమానిని యగు దేవతయును, యత్ర=ఏ మార్గమున, సన్తి= కలరో) తత్ర=ఆ మార్గమును, ప్రయాతాః = పోవునట్టి, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలు, (అయిన) జనాః=జనులు, (క్రమేణ=క్రమముగా) బ్రహ్మ= పరబ్రహ్మమును, గచ్ఛన్తి=పొందు చున్నారు.

ఓ అర్జునుడా! కాలాభిమానిదేవతయును, ప్రకాశాభిమానిదేవత యును, దివసాభిమానిదేవతయును, శుక్లపక్షాభిమానిదేవతయును, ఆఱు

నెలలుకల యుత్తరాయణాభిమానిదేవతయును గల మార్గమునఁ బోయిన బ్రహ్మవేత్తలు క్రమముగా పరబ్రహ్మమును పొందుచున్నారని తాత్ప.

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥౨౫॥

టీక. ధూమః = ధూమాభిమానిదేవతను, రాత్రిః = రాత్ర్యభిమానిదేవతయును, తథా=ఆ ప్రకారముగా, కృష్ణ = కృష్ణపక్షాభిమాని దేవతయును, షణ్మాసాః=ఆఱునెలలు కల, దక్షిణాయనమ్ = దక్షిణాయనాభిమానిదేవతయును, యత్ర=ఏ మార్గమునందు, (సంతి = కలరో) తత్ర=ఆ మార్గమునందు, (ప్రయాతః = బోయిన) యోగీ = కర్మయోగి, చాంద్రమసమ్=చంద్రసంబంధమైన, జ్యోతిః = తేజస్సును, ప్రాప్య = పొంది, నివర్తతే=మఱలు చున్నాఁడు.

ధూమాభిమానిదేవతయును రాత్ర్యభిమానిదేవతయును, ఆ విధముగానే కృష్ణపక్షాభిమానిదేవతయును, షణ్మాసాత్మకమైన దక్షిణాయనమున కభిమాని యగు దేవతయును, కలమార్గమునఁ బోయిన కర్మయోగి చంద్ర సంబంధమైన తేజస్సును పొంది, అనఁగా స్వర్గాదిలోకములను పొంది ఆట్టి పుణ్యము ముగిసినపిమ్మట మఱల మానవలోకమునకు వచ్చుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥

టీక. శుక్లకృష్ణే=జ్ఞానాజ్ఞానప్రకాశకము లయినవియును, శాశ్వతే= నిత్యములును, (అయిన) ఏతే=ఈ, గతీ = మార్గములు, జగతః = (జ్ఞాన కర్మాధికారము గల) లోకమునకు, మతే=సమ్మతము లయినవి, (భవతః + హి=అగుచున్నవిగదా! తత్ర = ఆ రెండుమార్గములలో) ఏకయా =ఒక మార్గముచేత, అనావృత్తిమ్ = రాకపోవుటను (మోక్షమును), యాతి =

పొందుచున్నాఁడు. అన్యయా=రెండవదగుమార్గముచేత, పునః=మరల, ఆవర్తతే=తిరిగి వచ్చుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఆ రెండుమార్గములలో నుత్తరాయణమార్గము జ్ఞాన ప్రకాశక మగుటచేత శుక్లమార్గమనియును, దక్షిణాయనమార్గము అట్టిది కాదు గనుక అనఁగా జ్ఞానప్రకాశకము గాక తమోమయ మైన దగుట వలన కృష్ణమార్గ మనియును, చెప్పఁబడును. ఇట్లు ప్రసిద్ధము అయిన రెండుమార్గములలో మొదటిది యగు శుక్లమార్గము జ్ఞానాధికారుల కని యును రెండవదియగు కృష్ణమార్గము కర్మాధికారుల కనియును సమ్మతమై యున్నది. మఱియును, సంసారము నిత్య మగుటవలన ఈ మార్గములును నిత్యములేయని యంగీకరింపబడినవి. ఈ రెండుమార్గములలో మొదటి దగు శుక్లమార్గముచేతఁ బోయినవాఁడు మోక్షమును పొందును, రెండవదగు కృష్ణ మార్గముచేతఁ బోయినవాఁడు మరల తిరిగివచ్చుచున్నాఁడు అని తా.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ 27

టీ. హేపార్థ=ఓ అర్జునుఁడా! ఏతే=ఈ, సృతీ=మార్గములను, జానన్=తెలిసిన, యోగి=ధ్యానయోగి (లేక) సమాహితచిత్తుఁడు, కశ్చన=ఒకఁడును, నముహ్యతి=మోహమును పొందఁడు. తస్మాత్=అందువలన, హే అర్జున=ఓ అర్జునుఁడా సర్వేషు=సమస్తము లైన, కాలేషు=కాలములయందును, యోగయుక్తః=సమాహితచిత్తుఁడవు (లేక) ధ్యానయోగముతోఁ గూడుకొనినవాఁడవు, భవ=కమ్ము.

ఓ అర్జునుఁడా! ఈ మార్గములను రెంటిని దెలిసిన ధ్యానయోగి (అనఁగా నీరెంటిలో అర్చిరాదిమార్గము క్రమముక్తిని కలిగించు ననియును, ధూమాదిమార్గము పునరావృత్తిని కలిగించు ననియును తెలిసిన సమాహిత చిత్తుఁడు) యెవ్వఁడును మోహమును పొందఁడు. (అనఁగా ధూమాదిమార్గ

ప్రాపక మగు కర్మమే ముఖ్యముగాఁ జేయఁదగిన దని తలఁపఁడు). కావున నో యర్జునా! సర్వకాలములయందును నీవు ధ్యానయోగపరుఁడ వగు మని తాత్పర్యము.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతిచాద్యమ్॥ ౨౮

టీక. యోగీ = ధ్యానయోగి, ఇదం = ఈ అర్థమును, విదిత్వా = తెలిసికొని, వేదేషు = వేదములయందును, యజ్ఞేషు=యజ్ఞములయందును, తపస్సుచైవ = తపస్సులయందును, దానేషుచైవ = దానములయందును, యత్ =ఏ. పుణ్యఫలమ్ = పుణ్యముయొక్క ఫలము, (స్వర్గాదికము) ప్రదిష్టమ్=నిర్దేశింపఁబడినదో, తత్ = ఆ పుణ్యఫలమును, సర్వమ్ = సమస్తమును, అత్యేతి=అతిక్రమించుచున్నాఁడు. (కించ = ఇంతియగాక)' ఆద్యమ్=మొదటికారణమును, పరమ్=సర్వోత్తమును, (అయిన) స్థానమ్=స్థానమును, (బ్రహ్మమును) ఉపైతి=పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఈ యధ్యాయమందలి ప్రథమ ద్వితీయశ్లోకముల చేత నీ వడిగిన ప్రశ్నముల కేడింటిని నాచేతఁ జెప్పఁబడిన ప్రత్యుత్తరమును తెలిసి యనుష్ఠించిన ధ్యానయోగి యగువాఁడు నియమపూర్వకముగ వేద వేదాంగములను జదువుటవలనను, అంగోపాంగసహితముగ యజ్ఞముల నాచరించుటవలనను, కాయశోషణాదులచేత కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సుల నాచరించుటవలనను, దేశకాలపాత్రానుసారముగ దానముల నాచరించుటవలనను కలిగెడు పుణ్యఫలమును అతిక్రమించుచున్నాఁడు. (అనఁగా నా పుణ్యఫలముల నన్నిటిని నికృష్టము లయిన వానినిగాఁ దలఁచి విడిచిపెట్టుటయే గాక మొదటికారణమును, అనఁగా

సర్వకారణమును సర్వోత్తమమును అయిన స్థానమును (బ్రహ్మమును (లేక) మోక్షమును) పొందుచున్నాఁడని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ
అష్టమోఽధ్యాయః.

టీక. వైయ్యాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యమ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే=సంపత్కరమైన మహాభారతమనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు=ప్రశస్తజ్ఞానసంపద కల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు= వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్= బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయ కోపాయములను తెలుపునట్టి గ్రంథమందు) అక్షరపరబ్రహ్మయోగోనామ = అక్షరపరబ్రహ్మయోగమనియెడు పేరు గల, అష్టమః=ఎనిమిదవదైన, అధ్యాయః=భాగము, ఇతి ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును, శాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంత

ములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు అక్షరపరబ్రహ్మయోగమను తెలుపునట్టి యెనిమిదవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీరామచంద్రార్పణమస్తు.



ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత - నవమాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

---

## రాజవిద్యా రాజగుహ్య యోగము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను, యత్ = ఏ జ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్ = సంసారము నుండి, మోక్ష్యసే=ముక్తుఁడవు కాఁగలవో, తత్=అట్టిదియును, గుహ్యతమమ్=మిగుల గోప్యమైనదియును, విజ్ఞానసహితమ్ = అనుభవజన్య జ్ఞానముతోఁ గూడినదియును, (అయిన) ఇదమ్ = ఈ, జ్ఞానమ్ = జ్ఞానమును. అనసూయవే=అసూయ లేని, తే = నీకొఱకు, ప్రవక్ష్యామి = లెస్సగాఁ జెప్పెదను,

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ అర్జునుఁడా! ఏస్వానుభవ జ్ఞానమును తెలిసికొని, అనఁగా చక్కగా నవలంబించి జననమరణాద్యనంగళ సంసారమునుండి విడువఁబడఁగలవో అట్టి యతిరహస్య మైనది

చేయును, అనుభవజ్ఞానముతోఁ గూడుకొన్నదియును, పూర్వోత్తరాధ్యాయములయందుఁ జెప్పఁబడినదియును అయిన యీ స్వానుభవజ్ఞానమునే(బ్రహ్మజ్ఞానమునే) అతిగుహ్యమగునట్టి దానిని చెప్పుకొనుచున్నాఁడని నావిషయమై అసూయ లేనివాఁడవగు నీకొఱకు చక్కఁగాఁ జెప్పెదనని తాత్పర్యము.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ 2

టీక. ఇదమ్ = ఈ బ్రహ్మజ్ఞానము, రాజవిద్యా = విద్యలలో శ్రేష్ఠమైనదియును, రాజగుహ్యమ్ = రహస్యములలో శ్రేష్ఠమైనదియును, ఉత్తమమ్ = ఉత్కృష్టమైనదియును, పవిత్రమ్ = పావనమైనదియును, ప్రత్యక్షావగమమ్ = ప్రత్యక్షప్రమాణము కలదియును, (లేక) ప్రత్యక్షమైనఫలము కలదియును, (లేక) స్పష్టమైన అవబోధ కలదియును, ధర్మ్యమ్ = ధర్మయుక్తమైనదియును, కర్తుమ్ = అనుష్ఠించుటకు, సుసుఖమ్ = మిగుల సులభమైనదియును, అవ్యయమ్ = నాశము లేనిదియును, (భవేత్ = అగును).

ఈ బ్రహ్మజ్ఞానము సకలవిద్యలలో ఉత్తమమైనదియును, రహస్యములలో శ్రేష్ఠమైనదియును, అత్యంతపావనమైనదియును, ప్రత్యక్షమైన ఫలము కలదియును, అనగా ప్రత్యక్షసుఖమును తెలుపునదియును, ధర్మయుక్తమైనదియును, అనుష్ఠించుటకు మిగుల సులభమైనదియును, నాశము లేనిదియును అగు నని తాత్పర్యము.

శ్లో॥ అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని॥ 3

టీక.- హే పరంతప = శత్రువులను తపింపఁజేయునట్టి యోయర్జునా! అస్య = ఈ, ధర్మస్య = ఆత్మజ్ఞానధర్మమును, అశ్రద్దధానాః = నమ్మని, పురుషాః = పురుషులు, మామ్ = నన్ను, అప్రాప్య = పొందక, మృత్యు

సంసారవర్త్మని = మృత్యువుతోఁ గూడిన సంసారముయొక్క మార్గము నందు, నివర్తంతే = నిశ్చయముగఁ దిరుగుచున్నారు.

శత్రువులను తపింపఁజేయునట్టి యో యర్జునా! ఆ యాత్మజ్ఞాన మనియెడు ధర్మముయొక్క స్వరూపమునందును, ఆ జ్ఞానఫల మగు మోక్షము నందును, నమ్మకము లేని మానవులు నన్నుఁ బొందఁజాలక మృత్యువుతోఁ గూడుకొనిన సంసారముయొక్క మార్గమునందు నిశ్చయముగా తిరుగుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ ౪

టీక. అవ్యక్తమూర్తినా = ఇంద్రియములకు గోచరము గాని స్వరూపము గల, మయా = నాచేత, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, జగత్ = ప్రపంచము, తతమ్ = వ్యాపింపఁబడెను. సర్వభూతాని = సకలజీవులును, మత్ స్థాని = నాయందుండునట్టివి, అహంచ = నేనైతే, తేషు = ఆ భూతములయందు, నావస్థితః = ఉన్నవాఁడను కాను.

ఇంద్రియములకు గోచరము కాని నాచేత చరాచరాత్మకమగు ప్రపంచమంతయును వ్యాపింపఁబడెను, సకలజీవులును నాయందుండునట్టివి, నేనైతే ఆ భూతములయం దుండునట్టివాఁడను గా నని తాత్పర్యము.

శ్లో॥ న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ ౫

టీక. భూతాని = బ్రహ్మాదిస్థావరాంతములగుభూతములు, మత్ స్థాని = నాయందున్నవి, నచ = కావు; ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధమైన, మే = నా యొక్క, యోగమ్ = చాతుర్యమును, పశ్య = చూడుము. మమ = నా యొక్క, ఆత్మా = స్వరూపము, భూతభృత్ = ప్రాణులను భరించు

చున్నదియును, భూతభావనః=ప్రాణులనువృద్ధి పొందించుచున్నదియును. (సన్=అగుచు) భూతస్థ = భూతములయందున్నది, నచ = కాదు.

బ్రహ్మాదిస్థావరాంతము అగు సకలభూతములును నాయందున్నవి కానేకావు; ఈశ్వరసంబంధ మగు నా చాతుర్యమును చూడుము. నాయాత్మ ప్రాణులను భరించు చున్నదియును, ప్రాణులను వృద్ధిని పొందించు చున్నదియును అగుచు (లేక) అయినను భూతములయం దున్నది కానేకా దని తాత్పర్యము.

శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్ స్థానీత్యుపధారయ॥ ౬

టీక. సర్వత్రగః=అంతట సంచరించువదియును, మహాన్ = (పరిమాణమునుపట్టి) పెద్దదైనదియును (అగు), వాయుః=వాయువు, నిత్యమ్= ఎల్లప్పుడును, యథా=ఏవిధముగా, ఆకాశస్థితః=ఆకాశమునం దున్నదో, (అట్లుండియు నాకాశము నంటక యున్నదో) తథా=అప్రకారముగానే సర్వాణి=సమస్తము అయిన, భూతాని, ఉపధారయ = తెలిసికొనుము, (నిశ్చయించుకొనుము).

ఓ అర్జునా! అంతటను సంచరించు నట్టిదియును, పరిమాణమును పట్టి పెద్దదియును అగు వాయువు సర్వకాలములయందును ఏవిధముగా ఆకాశము నంటకయే యాకాశమునం దున్నదో అవిధముగానే సమస్త భూతములును నాయం దున్న వని తెలిసికొను మని తాత్పర్యము.

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ ౭

టీక. హేకౌంతేయ = ఓ అర్జునుడా! కల్పక్షయే = (బ్రహ్మ ప్రళయకాలమునందు, సర్వభూతాని = సకలభూతములును, మామికామ్=

నా సంబంధమైన, (నా వలనం బడియున్న) ప్రకృతిమ్ = మాయను, యాంతి=పొందుచున్నవి. కల్పాదౌ=సృష్టికాలమునందు, తాని=ఆ సమస్త భూతములను, పునః = మరల, అహమ్ = నేను, విసృజామి = సృష్టించు చున్నాను.

ఓ అర్జునా! బ్రహ్మ ప్రళయకాలమునందు సకలభూతములును నాసంబంధమైన మాయను పొందుచున్నవి. సృష్టికాలమునందు ఆభూతములను మరల నేను సృజించు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్॥

టీక. స్వామ్=స్వకీయమైన, ప్రకృతిమ్=మాయను, అవష్టభ్య= అవలంబించి, ప్రకృతేః=స్వభావము యొక్క, వశాత్ = అధీనమువలన, (ప్రాచీనకర్మమే నిమిత్తముగాఁ గల ఆయాభూతములయొక్క స్వభావమువలన) అవశమ్=అస్వతంత్రమైనదియును, (అవిద్యాది దోషములచే పరవశమై చేయఁబడినదియును), కృత్స్నమ్ = సమస్తమును, (అయిన) ఇమమ్=ఈ, భూతగ్రామమ్=భూత సముదాయమును, పునఃపునః = మాటి మాటికిని, విసృజామి=సృజించు చున్నాను.

ఓ అర్జునా! స్వకీయ మగు మాయ నవలంబించి, ప్రాచీనకర్మమే నిమిత్తముగాఁ గల యయ్యేభూతములయొక్క స్వభావమువలన అవిద్యాది దోషములచే పరవశమైన సమస్తభూత సముదాయమును, మాటిమాటికిని సృజించు చున్నాను. అనఁగా అయ్యేభూతములను వానివానికర్మ స్వభావ మునకుఁ దగినట్లు నామాయచేతఁ బ్రతికల్పమునందును సృజించు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ।
ఉదాసీన వదాసీన మసక్తం తేషుకర్మసు॥

టీక. హేధనంజయ = ఓ అర్జునుఁడా! తాని = (భూతసముదాయముయొక్క విషయసృష్టికి నిమిత్తము లయిన) ఆ, కర్మాణి = కర్మములు, తేషు = ఆ, కర్మను = కర్మములయందు, అసక్తమ్ = అభిమానము లేనివాఁడను, ఉదాసీనవత్ = ఉపేక్షకునివలె, ఆసీనమ్ = ఉన్నవాఁడను, (అయిన) మామ్ = నన్ను, నని బధ్నంతి = బంధింపవు.

ఓ అర్జునుఁడా! భూతసముదాయముయొక్క విషమసృష్టికి నిమిత్తము లయిన కర్మములు ఆ కర్మములయందు సంబంధము లేనివాఁడను ఉపేక్షకునివలె నూరక యున్నవాఁడను అయిన నన్ను బద్ధునిగాఁ జేయఁజాల వని తాత్పర్యము.

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే॥ ౧౦

టీక. హేకౌంతేయ = ఓ అర్జునుఁడా! అధ్యక్షేణ = సాక్షియైన, మయా = నాచేత, (నాయొక్క సన్నిధానవిశేషముచేత) ప్రకృతిః = మాయ, సచరాచరమ్ = జంగమస్థావరములతోఁ గూడిన, (ప్రపంచమ్ = ప్రపంచమును) సూయతే = కనుచున్నది. పుట్టించుచున్నది.) అనేన = ఈ, హేతునా = కారణముచేత, (ఇట్లు నేను సాక్షియై యుండు నిమిత్తము చేతనే) జగత్ = ప్రపంచము, విపరివర్తతే = నానావిధములుగాఁ బ్రవర్తించు చున్నది.

ఓ అర్జునుఁడా! సాక్షిమాత్రుఁడ నగు నాచేత మాయ జంగమస్థావరములతోఁ గూడిన ప్రపంచమును కనుచున్నది. కావున ఈ హేతువు చేతనే (అనఁగా నేను సాక్షినై యుండు కారణముచేతనే) ప్రపంచము నానావిధములుగాఁ బ్రవర్తించు చున్న దని తాత్పర్యము.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో మమ భూత మహేశ్వరమ్॥ ౧౧

టీక. భూతమహేశ్వరమ్ = సర్వజంతువులకును అధిక మైన యీశ్వర స్వరూపమును సర్వజంతువులను నియమించునట్టిదియును) పరమ్= సర్వోత్తమ మైనదియును (అయిన) మమ = నాయొక్క, భావమ్ = తత్త్వమును, అజానన్తః = తెలియనట్టి, మూఢాః = అవివేకులు, మామ్= నన్ను, మానుషీమ్ = మనుష్యసంబంధము గల, తనుమ్ = శరీరమును, ఆశ్రితమ్ = ఆశ్రయించినవానినిగా, (మత్వా = తలఁచి) అవజానన్తి = అవమానించుచున్నారు.

ఓ అర్జునా! సర్వజంతువులను నియమించునట్టిదియును, సర్వోత్తమ మైనదియును అయిన నా తత్త్వమును దెలియని మూఢులు నన్ను మనుష్య సంబంధ మైన దేహమును ధరించినవానినిగాఁ దలఁచి (తమతోపాటు కర్మకృతశరీరము కలవాఁడ నని తలఁచి) యవమానించుచున్నారని తా.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥

టీక. మోఘాశాః = వ్యర్థము అయిన యాశలు కలవారును, మోఘకర్మాణః=వ్యర్థము అయిన యగ్నిహోత్రాది కర్మములు గలవారును, మోఘజ్ఞానాః=వ్యర్థ మైన జ్ఞానము కలవారును, విచేతసః=మూఢులును, మోహినీమ్=మోహమును కలుగఁజేయునట్టి, రాక్షసీమ్=హింసారూప మైనదియును, ఆసురీమ్=కామదర్పాది బహుళ మైనదియును, (అగు) ప్రకృతిమ్=స్వభావమును, శ్రితాః=ఆశ్రయించినవారును. (భవంతి=అగుచున్నారు).

భగవంతుఁడ నగు నన్ను పరిభవించుటవలన నిష్ఫలము లైన యాశలు కలవారును, వ్యర్థము అయిన యగ్నిహోత్రాదికర్మములు కలవారును, వ్యర్థ మైన జ్ఞానము కలవారును, మూఢులును, మోహమును కలుగఁజేయునట్టిదియును, హింసారూప మైనదియును, కామదర్పాది బహుళ మైనదియును అగు స్వభావమును ఆశ్రయించినవారును అగుచున్నారని తాత్పర్యము. అన్యదేవతల

నారాధించినయెడల శీఘ్రముగా ఫలమును పొందవచ్చు ననియెడు వ్యర్థము లయిన యాశలు కలవారును, అట్లు అన్యదేవతారాధనబుద్ధి కలవారగుట చేతనుద్విముఖు లగుటవలన నిష్ఫలము లయిన కర్మములు కలవారును, వ్యర్థమైన జ్ఞానము కలవారును (నానావిధకుతర్కముల నాశ్రయించిన శాస్త్రజ్ఞానము కలవారును) విక్షేపమును పొందిన చిత్తము కలవారును అగుమూఢులు, హింసాదిప్రచురమును కామదర్పాదిబహుళమును అయిన స్వభావమును ఆశ్రయించినవా రగుచు నన్నవమానించుచున్నా రని మఱికొందఱు ఈ శ్లోకమునకు పూర్వశ్లోకముతో సంబంధమును కల్పించి తాత్పర్యమును చెప్పుచున్నారు.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।
భజంత్యనన్య మనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥ ౧౩

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! మహాత్మనస్తు = మహానుభావులే, దైవీమ్ = దేవసంబంధమైన, ప్రకృతిమ్=స్వభావమును ఆశ్రితాః(సంతః)= ఆశ్రయించినవా రగుచు, భూతాదిమ్ = భూతములకును ప్రాణాదులకును ఆదికారణుఁడను, అవ్యయమ్ = నాశరహితుఁడను (అయిన) మామ్ = నన్ను, జ్ఞాత్వా = తెలిసికొని, అనన్యమనసః (సంతః) = ఇతరచింత లేనివారై, భజంతి = సేవించు చున్నారు.

ఓ అర్జునుఁడా ! మహానుభావులే, శమదమదయాదులే స్వరూపముగాఁ గల దైవసంపదను ఆశ్రయించినవా రగుచు ఇతరచింత లేనివారై భూతములకును ప్రాణాదులకును ఆదికారణుఁడను నాశము లేనివాఁడను అయిన నన్ను దెలిసికొని సేవించు చున్నారని తాత్పర్యము.

శ్లో॥ సతతం కీర్తయంతో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪

టీక. సతతమ్ = సర్వకాలములయందును, మామ్=నన్ను, బ్రహ్మస్వరూపుఁడ నగు నన్ను గుఱించి, కీర్తయంతః= వేదాంతశ్రవణము ప్రణవ

జపము అనువానిని చేయుచున్న వారును, యతన్తశ్చ=(ఇంద్రియనిగ్రహము శమము, దమము, దయ, అహింస మొదలగునవియే లక్షణములుగాఁ గల ధర్మములచేత ప్రయత్నించు చున్నవారును, దృఢవ్రతాః = స్థిరమైన బ్రహ్మచర్యాదివ్రతము కలవారై, నమస్యన్తశ్చ = నమస్కారమును చేయుచున్నవారును, భక్త్యా = భక్తిచేత, నిత్యయుక్తాశ్చ = ఎల్లప్పుడును యేకాగ్రచిత్తము కలవారును, (సన్తః=ఔగుచు) మామ్ = హృదయేశుఁడ నగు నన్ను, ఉపాసతే = సేవించు చున్నారు.

సర్వకాలములయందును బ్రహ్మస్వరూపుఁడ నగు నన్ను గురించి వేదాంతశ్రవణము ప్రణవజపము అనువానిని చేయుచున్నవారును, ఇంద్రియ నిగ్రహము, శమము, దమము, దయ, అహింస మొదలగునవియే లక్షణములుగాఁ గల ధర్మములచేత ప్రయత్నించు చున్నవారును, స్థిరమైన బ్రహ్మచర్యాది వ్రతము కలవారై నమస్కారమును చేయుచున్నవారును, భక్తిచేత నెల్లప్పుడును యేకాగ్రచిత్తము కలవారును అగుచు హృదయేశుఁడ నగు నన్ను సేవించు చున్నారని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥ ౧౫॥

టీక. అన్యే = కొందఱు, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత నే, మామపిచ = (ఇతరదేవతారాధనను వదలి) నన్నే, యజన్తః=పూజించు చున్నవారై, ఉపాసతే = సేవించు చున్నారు, (కేచిత్=మఱికొందఱు) ఏకత్వేన = పరబ్రహ్మము ఒక్కఁడే యను జ్ఞానముచేత, (బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచేత), ఉపాసతే=సేవించు చున్నారు. (కేచిత్ = కొందఱు) బహుధా = బహుప్రకారములుగా, సర్వతో ముఖమ్ = విశ్వరూపునిగా, ఉపాసతే = సేవించు చున్నారు.

కొందఱు ఇతరదేవతోపాసనను విడిచిపెట్టి భగవద్విషయజ్ఞాన మని యెడు యజ్ఞముచేత ఈశ్వరుఁడ నగు నన్నే పూజించుచు ఉపాసించు

చున్నారు. ఎట్లనిన:— కొందఱు బ్రహ్మము ఒక్కటే యనియెడు పరమార్థ జ్ఞానముచేత (బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచేత) నన్నే యుపాసించుచున్నారు. మఱికొందఱు ఆ భగవంతుఁడే విష్ణువు ఆదిత్యుఁడు మొదలగువారిరూపములతో నున్నాఁడని తలఁచి విష్ణు సూర్య చంద్రాది భేదములచేత నుపాసించుచున్నారు. మఱికొందఱు ఆ భగవంతుఁడే బహువిధములుగా నున్నాఁడని తలఁచి విశ్వరూపుఁడనగు నన్నే బహువిధములుగా నుపాసించుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ అహంక్రతురహం యజ్ఞస్స్వధాఽహమహమౌషధమ్।
మన్త్రోఽహమహమేవాఽజ్యమహమగ్నిరహంహుతమ్॥

టీక. అహమ్ + ఏవ= నేనే, క్రతుః = (వేదోక్తమయిన) యగ్నిష్టోమాది క్రతుస్వరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, యజ్ఞః=(స్మృతులచే నియమింపఁబడిన) వైశ్వదేవాది పంచమహాయజ్ఞస్వరూపుఁడను, అహమ్ + ఏవ = నేనే, స్వధా = (పితృదేవతల నుద్దేశించి యీయఁబడు) శ్రాద్ధాద్యన్న స్వరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, ఔషధమ్ = (ప్రాణులచేత భుజింపఁబడుచున్న) అన్నస్వరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, మంత్రః = (దేవతలకును పితృదేవతలకును హవ్యకవ్యముల నిచ్చునపుడు చెప్పెడు) మంత్రరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, ఆజ్యమ్= (హోమమునకుఁ గావలసిన) నేయి మొదలగు హోమద్రవ్యస్వరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, అగ్నిః= ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనునట్టి) అగ్నిస్వరూపుఁడను, అహమ్ + ఏవ= నేనే, హుతమ్=హోమాది కర్మస్వరూపుఁడను, (అస్మి=అయితిని).

(ఓ అర్జునా!) వేదచోదితకర్మ మగు నగ్నిష్టోమాదికము స్మృతిచోదితమగు వైశ్వదేవాది పంచమహాయజ్ఞములు, పితృదేవతలకు నీయఁబడు శ్రాద్ధాద్యన్నము సకలప్రాణులచేతను భుజింపఁబడుచున్న యన్నము(లేక) వ్యాధులను పోఁగొట్టెడు నౌషధము, దేవతలకును పితృదేవతలకును హవ్య

కవ్యాదుల నిచ్చునపుడు చెప్పెడు మంత్రము హోమమునకుఁ గావలసిన నేయి మొదలుగాఁగల హోమద్రవ్యము, గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులు, హోమాదికర్మము అనునవియును నేనే (నాస్వరూపములే) అనితా॰

శ్లో॥ పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవ చ॥ ౧౭

టీక. అస్య = ఈ, జగతః = జగత్తునకు, పితా = (జనింపఁజేయునట్టి) తండ్రి, అహమ్ = నేను, మాతా = (జననకారణ మగు) తల్లి, అహమ్ = నేను, ధాతా = (సకలకర్మములకును) ఫలప్రదుఁడను, అహమ్ = నేను, పితామహః = తండ్రికిఁదండ్రి (అక్షరసంజ్ఞకలవాఁడను మాయోపాధికుఁడను అయిన యీశ్వరుఁడు), అహమ్ = నేను, వేద్యమ్ = తెలియఁదగిన వస్తువు, (బ్రహ్మము) అహమ్ = నేను, పవిత్రమ్ = (పరిశుద్ధకారణ మగు) కర్మాదికము, అహమ్ = నేను, ఓంకారః = (వేద్య మగు) బ్రహ్మను దెలిసికొనుటకు (సాధన మగు) ప్రణవము, అహమ్ = నేను, ఋక్ = ఋగ్వేదము, అహమ్ = నేను, సామ = సామవేదము, అహమ్ = నేను, యజురేవచ = యజుర్వేదమును, అహ మేవ = నేనే.

ఈ జగత్తునకు వుత్పత్తిని కలుగఁజేయు తండ్రి, ఉత్పత్తిని కలిగించునట్టి తల్లి, పుణ్యాపుణ్యకర్మఫలప్రదాత, మాయోపాధికేశ్వరుఁడు, వేద్య మగు బ్రహ్మము, పరిశుద్ధకారణ మగు కర్మాదికము, తెలియఁదగిన బ్రహ్మమును దెలిసికొనుటకు సాధనమగు ప్రణవము, ఋగ్యజుస్సామ థర్వాంగిరస్సులు మొదలగునవి యన్నియును నే నేయనఁగా నాస్వరూపములే యని తాత్ప.

శ్లో॥ గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజ మవ్యయమ్॥ ౧౮

టీక. గతిః = కర్మఫలమును, భర్తా = పోషకుఁడును, ప్రభుః = స్వామియును, (నియామకుఁడును) సాక్షీ = (ప్రాణుల పుణ్యాపుణ్యము

అను చూచు చుండువాఁడును, నివాసః = (సకలప్రాణులకును) ఉనికి పట్టును, శరణమ్ = (ఇష్టమును ఇచ్చువాఁడును అనిష్టమును దొలఁగించు వాఁడును అగుటచేత) ఆశ్రయింపఁ దగినవాఁడును, (లేక) ఆర్తులును ప్రపన్నులును (అగువారియొక్క) దుఃఖమును పోఁగొట్టువాఁడును, సుహృత్ =(ప్రత్యుపకారమును కోరకయే) ఉపకారము చేయువాఁడును, ప్రభవః=(లోకములకు) ఉత్పత్తిస్థానమును, ప్రలయః = లయస్థానమును, స్థానమ్ = స్థితిస్థానమును, నిధానమ్ = (కాలాంతరమందు ఉపయోగించునట్టి) నిక్షేపమును, అవ్యయమ్ = నాశములేని, బీజమ్ = కారణమును, (అహమ్ + ఏవ = నేనే, అస్మి = అయితిని.)

కర్మఫలమును, కర్మఫలప్రదాతయును, స్వామియును, ప్రాణుల పుణ్యాపుణ్యములను చూచువాఁడును, కార్యకారణప్రపంచమునకు సర్వమునకు అధిష్ఠానమును, ఆర్తులును, ప్రపన్నులును అగువారియొక్క దుఃఖమును పోఁగొట్టి కాపాడువాఁడును, ప్రత్యుపకారమును కోరకయే యుపకారమును చేయువాఁడును, లోకములకు ఉత్పత్తిస్థానమును, లయస్థానమును స్థితిస్థానమును, (అనఁగా ఉత్పత్తిస్థితిలయములకు మూఁటికిని స్థానమైనవాఁడును,) కాలాంతరమం దుపయోగించునట్టి నిక్షేపమును, నాశములేని కారణమును నేనే యని తాత్పర్యము.

శ్లో॥ తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున॥ ౧౯

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! అహమ్ = నేను, తపామి= (సూర్యుఁడనై గ్రీష్మర్తువునందు కొన్నికిరణములచేత) తపింపఁజేయు చున్నాను. అహమ్= నేను, వర్షమ్=(సూర్యుఁడనై వర్షాకాలమునందు కొన్ని కిరణములచేత) వర్షమును, ఉత్సృజామి = విడిచిపెట్టు చున్నాను. అహమ్ నేను, వర్షమ్=(సూర్యుఁడనై యుండి కార్తికాదిగ ఎనిమిది మాసముల యందు కొన్నికిరణములచేత) వర్షమును, నిగృహ్ణామి=నిగ్రహించు చు

న్నాను, అమృతంచ=(దేవతలయొక్క) అమృతమును(లేక) సకలప్రాణుల యొక్క జీవనమును, మృత్యుశ్చ=(మానవులయొక్క) నాశమును, సత్= స్థూలమును, అసచ్చ=సూక్ష్మమును, అహమేవ=నేనే, (అస్మి=అయితిని.)

ఓ అర్జునుఁడా! నేను సూర్యుఁడనై యుండి కొన్నికిరణములచేతఁ దపింపఁజేయుచున్నాను, వర్షాకాలమునందు కొన్ని కిరణములచేత వర్షమును విడిచిపెట్టుచున్నాను, కార్తికాదిగ నెనిమిదిమాసములు కొన్నికిరణములచేత వర్షమును నిగ్రహించుచున్నాను, మఱియును, దేవతలయొక్క అమృతమును, (లేక) సకలప్రాణులయొక్క జీవనమును, సకలప్రాణులకును నాశమును కలిగించునట్టి మృత్యువును, స్థూలసూక్ష్మములును నేనే యైతి నని తాత్పర్యము.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతింప్రార్థయన్తే।
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్॥ ౨౦

టీక. యే=ఎవ్వరు; త్రైవిద్యాః=ఋగ్యజుస్సామవేదములను తెలిసినవారై, యజ్ఞైః = జ్యోతిష్టోమాది క్రతువులచేత, మామ్ = (వస్వాదిరూపుఁడ నగు) నన్ను, ఇష్ట్వా =చక్కఁగఁ బూజించి, సోమపాః=(యజ్ఞశిష్ట మగు) సోమమును పానము చేసినవారు. (కనుక నే) పూతపాపాః=పరిశుద్ధము అగు కిల్బిషములు కలవారై (పాపరహితులై) స్వర్గతిమ్=స్వర్గమనియెడు ప్రాప్యస్థానమును,(లేక)స్వర్గలోకగమనమును, ప్రార్థయంతే=కోరుచున్నారో, తే=అట్టి వేదవేత్తలు, పుణ్యమ్=పుణ్యఫలము (అయిన)సురేంద్రలోకమ్ =దేవేంద్రునిస్థానమును, ఆసాద్య=పొంది, దివి=స్వర్గమునందు దివ్యాన్ = సర్వోత్తమములు (అయిన), దేవభోగాన్ = దేవతాభోగములను, అశ్నంతి = అనుభవించుచున్నారు.

ఎవ్వరు ఋగ్యజుస్సామములను తెలిసినవారై జ్యోతిష్టోమాదిక్రతువులచేత వస్వాదిరూపుఁడ నగు నన్నుఁ జక్కఁగఁ బూజించి యజ్ఞశిష్ట మగు సోమమును పానము చేసినవారు కనుకనే పరిశుద్ధము అగు కిల్బిషములు కలవారై (అనఁగా పాపరహితులై) స్వర్గ మనియెడు ప్రాప్యస్థానమును (లేక) స్వర్గలోకగమనమును కోరుచున్నారో, అట్టి వేదవేత్తలు పుణ్యఫలమైన దేవేంద్రునిస్థానమును పొంది స్వర్గమునందు సర్వోత్తమములైన దేవతల భోగములను అనుభవించు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే॥ ౨౧

టీక. తే=ఆ స్వర్గమును కోరువారు, విశాలమ్ = (పుణ్యానుసారముగా) విస్తారమైన, తమ్=ఆ, స్వర్గలోకమ్=స్వర్గలోకసుఖమును, భుక్త్వా=అనుభవించి, పుణ్యే=(స్వర్గఫలభోగమును కలిగించునట్టి) పుణ్యము, క్షీణే (సతి) = నశించిన దగుచు నుండఁగా, మర్త్యలోకమ్=మానవలోకమును, విశన్తి=ప్రవేశించు చున్నారు, (లేక) పొందు చున్నారు. ఏవమ్=ఈవిధముగా, (మునుపటి జన్మమునందువలె మఱల) త్రయీధర్మమ్=మూఁడు వేదములచేతను ప్రతిపాదింపఁబడిన కర్మమును, అనుప్రపన్నాః = ఆశ్రయించినవారై, కామకామాః=విషయములను కోరువారు, గతాగతమ్=రాకపోకలను, (జననమరణములను) లభంతే = పొందు చున్నారు.

స్వర్గమును కోరువారు తమ పుణ్యానుసారముగా విస్తారమైన స్వర్గలోకసుఖమును అనుభవించి స్వర్గఫలభోగమును కలిగించునట్టి పుణ్యము నశించినతోడనే మానవలోకమును పొందుచున్నారు. ఈవిధముగా మునుపటి జన్మమునందువలె మరల వేదత్రయముచేతను ప్రతిపాదింపఁబడిన జ్యోతిష్టో

మాది పుణ్యకర్మమును ఆశ్రయించినవారు విషయములను కోరు చున్న వారై రాకపోకలను జననమరణములను పొందు చున్నారని తాత్ప.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥ ౨౨

టీక, యే=ఏ, జనాః = జనులు, (సన్న్యాసులు) అనన్యాః = ఇతరము కానివారై (పరదైవమగు నారాయణునే ఆత్మనుగా పొందినవారై) మామ్ = నన్ను, చింతయంతః (సంతః = స్మరించు చున్నవా రగుచు, పర్యుపాసతే = సేవించు చున్నారో, నిత్యాభియుక్తానామ్ = సర్వకాలముల యందును సమాహితచిత్తులైన, తేషామ్ = వారియొక్క, యోగక్షేమమ్ = లేనిదానిని కలిగించుట, కలిగినదానిని కాపాడుట అనుదానిని, అహమ్ = నేను, వహామి = వహించు చున్నాను.

ఏ సన్న్యాసులు ఇతరులు కానివారై, అనఁగా పరదైవ మగు నారాయణునే తమనుగాఁ దలఁచినవారై నన్ను స్మరించుచు పూజించు చున్నారో అట్లు సర్వకాలములయందును సమాహితచిత్తు అయిన వారి యొక్క యోగక్షేమములను నేను వహించు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్॥

టీక, హేకౌంతేయ = ఓ అర్జునుఁడా! యేపి = ఏజనులు, అన్యదేవతా భక్తాః (సంతః) = ఇతరదేవతలయందు భక్తి కలవారగుచు, శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధితో, అన్వితాః = కూడినవారై, యజంతే = పూజించు చున్నారో, తేపి = ఆ జనులు కూడ, మామేవ=నన్నే, అవిధిపూర్వకమ్ = అజ్ఞానపూర్వకముగా, యజంతి = పూజించు చున్నారు.

ఓ అర్జునా ! ఏ జనులు ఇతరదేవతలయం దాసక్తి కలవారగుచు ఆస్తిక్యబుద్ధితోఁ గూడుకొనినవారై యా యితరదేవతలనే పూజించుచున్నారో అట్టి జనులు మోక్షమును కలిగించునట్టిరీతిని తెలియక (అవివేకపూర్వకముగా) నన్నే సేవించు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవంతి తే॥ ౨౪

టీక. సర్వయజ్ఞానామ్ = సమస్తము లగు శ్రౌతస్మార్తకర్మములకు, భోక్తాచ = అనుభవించువాఁడును, ప్రభుశ్చ=ప్రభుఁడును, అహమేవహి= నేనేకదా ! (ఇతి = ఇట్లని) మామ్ = నన్ను, తత్త్వేన = వాస్తవముగా, (యే=ఎవరు) నత్వభిజానన్తి = ఎఱుఁగరో, అతః = ఇట్లు తెలిసికొనకపోవుటవలన, తే=వారు, (యాగఫలాత్ = యాగఫలమువలన) చ్యవంతి= భ్రష్ఠు లగు చున్నారు.

సమస్త మగు శ్రౌతస్మార్తకర్మములయందలి హవ్యకవ్యాదులను భుజించు వాఁడను, ఆకర్మములకు ప్రభుఁడను (అనఁగా) ఫలదాతను నేనే యను ప్రసిద్ధివిషయమును వాస్తవముగఁ దెలిసికొనని వారు ఆ కర్మఫలమునుండి భ్రష్ఠులగు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్
పితౄన్యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా
యాంతి మద్యాజినోఽపి మామ్॥ ౨౫

టీక. దేవవ్రతాః = దేవతలయందు నియమము (భక్తి) కలవారు, దేవాన్ = దేవతలను, యాంతి = పొందు చున్నారు. పితృవ్రతాః=పితృదేవతలయందు నియమము (భక్తి) కలవారు, పితౄన్ = పితృదేవతలను,

టీక. కౌంతేయ = ఓ అర్జునుఁడా! యత్=ఏకర్మమును, కరోషి= చేయు చున్నావో, యత్ = ఏవస్తువును, అశ్నాసి = తిను చున్నావో, యత్=దేనిని, జుహోషి=హోమమును చేయు చున్నావో, యత్=దేనిని, తపస్యసి = తపస్సు చేయు చున్నావో, తత్ = దానిని, మదర్పణమ్ = నాయందు దర్పింపఁబడినదానినిగా, కురుష్వ = చేసికొనుము.

ఓ అర్జునుఁడా! శాస్త్రీయ మగు కర్మమును గాని, శాస్త్రచోదితము కాకపోయినను చేసియే తీరఁదగిన గమనాదికర్మమును గాని, చేయు చున్నను, దేనిని (ఎట్టి భోగమును) అనుభవించు చున్నను, శ్రౌతహోమమును గాని స్మార్తహోమమును గాని చేయు చున్నను, బ్రాహ్మణాదులకొఱకు హిరణ్మయ పాత్రరత్నాదుల నిచ్చు చున్నను, కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుల నాచరించు చున్నను, ఈ సర్వమును భగవంతుఁడ నగు నాయందు సమర్పించుకొను మని తాత్పర్యము.

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥

టీక. ఏవమ్=ఈప్రకారముగా, (కుర్వన్=చేయుచు) శుభాశుభఫలైః = ఇష్టానిష్టఫలములు కల, కర్మబంధనైః=కర్మబంధముల చేత, మోక్ష్యసే=విడువఁబడఁగలవు సన్న్యాసయోగయుక్తాత్మా (సన్) = (కర్మములను భగవంతుఁడ నగు నాయందు) అర్పించుట యనియెడు యోగముతోఁ గూడుకొనిన చిత్తము కలవాఁడ వగుచు, కర్మబంధనైః=కర్మబంధముల చేత, విముక్తః=విడువఁబడినవాఁడవై, మామ్=నన్ను, ఉపైష్యసి= పొందఁగలవు.

ఓ అర్జునుఁడా! సకలకర్మములను నాయందు అర్పించు చున్న యెడల యిష్టానిష్టఫలములు గల కర్మము అనియెడు బంధములనుండి విడువఁబడిన వాఁడ వగుదువు. మఱియును, కర్మములను నాయందు సమర్పిం

ఓ అర్జునుఁడా! మిగుల నిందితము అగు దురాచారములు కలవాఁడైనను, ఇతరదేవతారాధనములు (లేక) విషయాంతరాసక్తిని విడిచిపెట్టి యాత్మరూపుఁడ నగు నన్ను సేవించినయెడల అట్టివాఁడు చక్కని నిశ్చయము కలవాఁడు కనుక (సర్వమును వాసుదేవుఁడే యను నిశ్చయము కలవాఁడు కనుక) సదాచారము కలవాఁడే యని తలఁపఁదగినవాఁ డని తా.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ 31.

టీక. (సః=ఇతరారాధనమును విడిచిపెట్టి నన్నే భజించువాఁడు) క్షిప్రమ్ = శీఘ్రముగ, ధర్మాత్మా = ధర్మమునందు మనస్సు కలవాఁడు, భవతి=అగు చున్నాఁడు. శశ్వత్ = సర్వకాలములయందును, శాంతిమ్ = విషయభోగాశారాహిత్యమును (లేక) దురాచారమునుండి నివృత్తిని, నిగచ్ఛతి = ముఖ్యముగా పొందు చున్నాఁడు. కౌంతేయ = ఓ అర్జునుఁడా! మే = నాయొక్క, భక్తః = భక్తుఁడు, నప్రణశ్యతి = నశింపఁడు. (ఇతి = ఇట్లని) ప్రతిజానీహి = ప్రతిజ్ఞను చేయుము.

ఇతరారాధనాదికమును వదలి నన్నే స్వాత్మనుగా భజించువాఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁ డగు చున్నాఁడు. సర్వకాలములయందును విషయభోగాశారాహిత్యమును పొందు చున్నాఁడు. ఓ అర్జునా! వాసుదేవుఁడ నగు నాయొక్క భక్తుఁడు నశింపఁ డని కుతర్కవాదులసభలయందు ప్రతిజ్ఞను చేయుము మని తాత్పర్యము.

శ్లో॥ మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథాశూద్రాఽపియాంతి పరాంగతిమ్॥

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! హి=ఏకారణమువలన, యే = ఎవ్వరు, పాపయోనయః = పాపజన్మము కలవారు, స్యుః = అగుదురో, తేపి = అట్టివారు (అగు, స్త్రియః = స్త్రీలును, వైశ్యాః = వైశ్యులును,

చేయుము. ఏవమ్ = ఈ ప్రకారముగా, మత్పరాయణస్సన్ = నాయందుఁ బ్రీతికలవాఁడ వగుచు, ఆత్మానమ్ = మనస్సును, (మయి = నాయందు) యుక్త్వా = చేర్చి, మామేవ = నన్నే, ఏష్యసి = పొందఁగలవు.

ఓ అర్జునుఁడా! నాయందు మనస్సు కలవాఁడవును, నాయందు భక్తి కలవాఁడవును, నన్నుఁ బూజించువాఁడవును అగుము. నన్ను గుఱించి నమస్కారమును చేయుము. ఈ విధముగ నాయందుఁ బ్రీతి కలవాఁడ వగుచు మనస్సును నాయందుఁ జేర్చి నన్నే పొందఁగల వని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్య
యోగో నామ నవమోఽధ్యాయః.

టీక. వైయ్యాసిక్యామ్ = వ్యాసప్రోక్త మైనదియును, శతసాహస్ర్యామ్ = నూఱువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కర మైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపద కలభగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్త మైన కృష్ణార్జునుల యొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను తెలుపునట్టి గ్రంథమందు) రాజవిద్యా రాజగుహ్యయోగో నామ = రాజవిద్యా రాజగుహ్యయోగ మనియెడు పేరు గల, నవమః = తొమ్మిదవది, (అగు) అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# శ్రీభగవద్గీత - దశమాధ్యాయము,

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

### విభూతియోగము.

శ్రీ భగవానువాచ—

శ్లో॥ భూయ ఏవ మహాబాహో శ్రుణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥

టీక. శ్రీ భగవాన్ ఉవాచ = శ్రీ భగవంతుఁడగు శ్రీ కృష్ణమూర్తి చెప్పెను. హే మహాబాహో = గొప్పబాహువులు గల యో యర్జునుఁడా! ప్రీయమాణాయ = సంతోషమును జెందెడు, తే = నీకొఱకు, హితకామ్యయా = హితమును (ఇష్టమును) కలుగఁజేయవలయును నను తలంపుతో, అహమ్ = నేను, భూయఏవ = మఱల, యత్ = దేనిని, (ఏవాక్యమును) వక్ష్యామి = చెప్పెదనో, పరమమ్ = సర్వోత్కృష్టము (శ్రేష్ఠము) అయిన, మే = నాయొక్క, తత్ = ఆ, వచః = వాక్యమును, శృణు = వినుము.

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నారు — గొప్పబాహువులు గలయో యర్జునుఁడా! అమృతపానమువలన సంతసించువానివలె నావాక్యామృతము వలన సంతోషమును జెందెడు నీకు హితము కలుగఁజేయవలయును ననుతలం

లోకములకు గొప్ప ప్రభువుగను, మామ్=నన్ను, యః = ఎవఁడు, వేత్తి= తెలిసికొనుచున్నాఁడో, సః=అట్టివాఁడు, మర్త్యేషు=మనుష్యుల లోపల, అసమ్మూఢస్సన్=సమ్మోహము (అజ్ఞానము) లేనివాఁడై, సర్వపాపైః = సమస్తమైన పాపములచేతను, ప్రముచ్యతే = విడువఁబడుచున్నాఁడు.

నన్ను కారణము లేనివానినిగాను కనుకనే పుట్టుక లేనివానినిగాను, సమస్తలోకములకు మహేశ్వరునిగాను యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు మనుష్యులలో మోహము లేనివాఁడై (అనఁగా జ్ఞానియై సకల పాపములచేతను, అనఁగా బుద్ధిపూర్వకముగాఁ జేసిన పాపములచేతఁ గూడ) విడువఁబడుచున్నాఁడు (అనఁగా) మోక్షమును బొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయంచాఽభయమేవచ॥

టీక. బుద్ధిః = (అంతఃకరణముయొక్క మిక్కిలి సూక్ష్మము లగు అర్థములను (వస్తువులను) తెలిసికొనెడి శక్తియును) బుద్ధియును, జ్ఞానమ్= (ఆత్మానాత్మ పదార్థములను తెలిసికొనుటయును) జ్ఞానమును, అసమ్మోహః= ప్రత్యుపపన్నములను (పొందఁబడినవియును) బోద్ధవ్యములను (తెలియఁదగినవియును, అగు వస్తువులయందు వ్యాకులత లేక యుండుటయును, అనఁగా తెలివిగలిగి ప్రవర్తించుటయును) క్షమా = ఓర్పును, సత్యమ్ = [విన్నది విన్నట్లును చూచినది చూచినట్లును ఇతరునిబుద్ధియందు పడునట్లు (అనఁగా నితరునికిఁ దెలియునట్లు) చెప్పుటయును] సత్యమును, దమః = బాహ్యేంద్రియనిగ్రహమును శమః=అంతరింద్రియనిగ్రహమును, సుఖమ్= ఆహ్లాదమును, దుఃఖమ్=విచారమును, (వ్యసనమును, భవః=పుట్టుకయును, అభావః=నాశమును (చావును) భయంచ=భయమును, అభయమేవచ = భయము లేకుండుటయును, మత్తఏవ = (ఈశ్వరుఁడనగు) నావలననే, భవన్తి = కలుగుచున్నవి.

మఱియును ప్రాణులను హింసింపకుండుటయును, రాగద్వేషాదులు లేక శత్రుమిత్రులయందు సమానాభిప్రాయము కలిగియుండుటయును, దొరకినదాని ననుభవించి యంతటితోఁ దృప్తినొందియుండుటయును, శాస్త్రోక్త ప్రకారము దేహేంద్రియములను విషయములనుండి త్రిప్పి కుశిక్షింపఁజేయుటయును, న్యాయార్జిత మగు ద్రవ్యమును దేశకాలములయందు సత్పాత్రుల కిచ్చుటయును, ధర్మకార్యములు చేయుటచేఁ గలిగిన కీర్తియును, అధర్మకార్యములు చేయుటచేఁ గలిగిన యపకీర్తియును అను వారు వారు చేసియున్న కర్మమునకుఁ దగినట్లు నానావిధము లయిన సమస్త స్వభావములును పరమేశ్వరుఁడ నగు నావలననే కలుగుచున్న వని తాత్పర్యము.

శ్లో॥ మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

టీక. (కించ = మఱియును) లోకే = లోకమునందు, యేషామ్ = ఎవరికి, ఇమాః = ఈ బ్రాహ్మణాదులు, ప్రజాః = సంతతి (అయిరో), తే = ఆ, మద్భావాః = నాదుశక్తి గలవారును, మానసాః = సంకల్పసంభవులును, అనఁగా అయోనిజులును, (అయిన) సప్త = ఏడుగురు, మహర్షయః = (భృగువు మొదలుగాఁ గల) మహర్షులును, పూర్వే = (వారికంటె) పెద్దవారు అయిన, చత్వారః = నలుగురు, (సనక సనందన సనత్కుమార సనత్సుజాతులును) తథా = అట్లే, మనవః = (చతుర్దశ) మనువులును, మత్త ఏవ = (పరమేశ్వరుఁడ నగు) నావలననే, జాతాః = పుట్టిరి,

(మఱియును) ఓ అర్జునుఁడా! లోకమునందు యెవరికి ఈ బ్రాహ్మణులు మొదలుగాఁగల సకలజనులును పుత్రపౌత్రులుగాను శిష్యప్రశిష్యులుగాను అయిరో; అట్టి నాదుప్రభావము గలవారును, అయోనిజులును అయిన భృగువు మొదలుగాఁగల సప్తమహర్షులును, వారికి పూర్వులగు సనక సనందన సనత్కుమార సనత్సుజాతులును, స్వాయంభువు మొదలుగాఁ గల చతుర్దశ మనువులును, పరమేశ్వరుఁడ నగు నావలననే కలిగి రని తాత్పర్యము.

(లేక) చేష్టలు గలది యగుచున్నది అనియును తలంచి(లేక) తెలిసికొని వివేక
వంతులు (అనఁగా తత్త్వమును) యథార్థమును గుర్తెఱింగిన బుద్ధిమంతులు
పరమార్థ తత్త్వము గ్రహింపవలె నను ప్రేమతోఁ గూడినవారై పరబ్రహ్మ
మైన నన్ను సేవించుచున్నారు. (లేక) ధ్యానించుచున్నారని తా.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ ౯

టీక. మచ్చిత్తాః=(భగవంతుఁడ నగు) నాయందు చిత్తము కలవా
రును, మద్గతప్రాణాః=నన్ను పొందిన చక్షురాదీంద్రియములు గలవారును
(లేక) నన్ను సేవించుటయే కారణముగాఁ గల చక్షురాదీంద్రియ వ్యాపార
ములు గలవారును (లేక) నాయందు ఉపసంహరింపఁబడిన సకలసాధన
ములు గలవారును, (లేక) నన్ను సేవించుటయే జీవనముగాఁ గలవారును,
పరస్పరమ్=ఒకరికొకరు, మామ్ = నన్ను, బోధయంతః = శ్రుతులచేతను
యుక్తియుక్తములగు వాక్యములచేతను, తత్త్వమును తెలిసికొనవలె ననునట్టి
యభిప్రాయముతో) ప్రసంగించువారును, మామ్=నన్ను, కథయంతశ్చ =
(తమ శిష్యులకొఱకు) ఉపదేశించుచున్నవారును, (అయి) నిత్యమ్=ఎల్ల
ప్పుడును, తుష్యన్తిచ=సంతోషించుచున్నారు, రమన్తిచ=(పరమాత్మ
ధ్యానము నొందదగునది మనకు కలిగెను కనుక ఇంతకు మించిన క్షేమము
నక్కఱ లేదని సంతుష్టిచేత సుఖమనుభవించుచున్నారు.

నేనే పరమాత్మ యను తత్త్వమును గుర్తెఱింగిన బుద్ధిమంతులు భగ
వంతుఁడ నయిన నాయందు చిత్తము కలవారును, తదేక ధ్యానముగా
నన్నుఁ జెందిన సకలేంద్రియములు కలవారును, (లేక) నన్ను సేవించుటయే
ప్రధానముగాఁ గల సకలేంద్రియవ్యాపారములు గలవారును, (లేక) నా
యందు లయమొనర్చిన సకలసాధనములు గలవారును,(లేక)నన్ను సేవిం
చుటయే జీవనముగాఁ గలవారును, ఒకరికొకరు శ్రుతులచేతను యుక్తి
యుక్తము లగు వాక్యములచేతను నన్ను (పరమాత్మను) తెలిసికొనవలె
ననెడు తలంపుతో ప్రసంగించువారును అనఁగా చర్చించువారును, నన్ను

చున్న, జ్ఞానదీపేన = జ్ఞాన మనెడి దీపముచేత, నాశయామి=పోఁగొట్టు చున్నాను.

ఎల్లప్పుడును ధ్యానము చేయు భక్తులను అనుగ్రహించుటకొఱకు వారి యంతఃకరణమందున్నవాఁడనై వారియొక్క అజ్ఞానజన్య మైన మోహాంధకారమును వెలుఁగుచున్న జ్ఞాన మనెడు దీపముచేత పోఁగొట్టు చున్నాను, అనఁగా దీప మెట్లు చీఁకటిని పోఁగొట్టి వస్తువులను కనఁబఱచునో యట్లే జ్ఞానము మోహమును (భ్రాంతిని) పోఁగొట్టి పరమాత్మను కనఁబఱచును గాన, అట్టి జ్ఞానమును నాభక్తులకు కలిగించు చున్నాను అని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥౧౨
ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥౧౩

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. పరంబ్రహ్మ = పరమాత్మయును, పరంధామ = ఉత్తమ మగు ఆశ్రయమును, (లేక) ఉత్తమ మయిన తేజస్సును, పరమమ్ = మిక్కిలి, పవిత్రమ్=పావనమూర్తియును, భవాన్ (ఏవ) = నీవే, (యతః=ఎందువలన ననఁగా) త్వామ్=నిన్ను పురుషమ్=పరమాత్మునిగాను, శాశ్వతమ్=నిత్యుని (నాశము లేనివానిని) గాను, దివ్యమ్ = సర్వప్రపంచాతీతునిగాను, ఆదిదేవమ్=ప్రకాశాత్ముఁడును స్వయంప్రకాశుఁడును అయిన) ఆదిదేవునిగాను, అజమ్ = జన్మరహితుని (పుట్టుక లేనివానిని) గాను, విభుమ్=సర్వవ్యాపకుని (అంతట వ్యాపించినవానిని) గాను, ఋషయః=తత్త్వజ్ఞాననిష్ఠులగు భృగువు వసిష్ఠుఁడు మొదలుగాఁ గల మహర్షులు, సర్వే=అందఱును, తథా = అప్రకారము, దేవర్షిః = దేవర్షియగు, నారదః=నారదుఁడును, అసితః = అసితుఁడును,

శ్లో॥ స్వయమేవాఽత్మనాఽఽత్మానం
వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ
దేవదేవ జగత్పతే॥ ౧౫

టీక. హే భూతభావన = సకలభూతములను పుట్టించువాఁడా! హే భూతేశ=సకలభూతములకును ప్రభు వగువాఁడా! హే దేవదేవ = సకలజనులచేఁ బూజింపఁబడు దేవతలచేతఁ బూజింపఁబడువాఁడా! హే జగత్పతే=సకలజగములకు పాలకుఁడ వైనవాఁడా! (అతఏవ=కనుకనే) హే పురుషోత్తమ = ఓ పురుషశ్రేష్ఠుఁడా! త్వమ్ = నీవు, ఆత్మనా = స్వస్వరూపముచేత, ఆత్మానమ్=స్వస్వరూపమును, స్వయమేవ=(ఇతరుల యుపదేశము లేకయే) స్వయముగానే, వేత్థ = తెలిసికొనుచున్నావు.

సకలభూతములను పుట్టించువాఁడవును, సకలభూతములకుఁ బ్రభువవును, సకలజనులచే బూజింపఁబడు దేవతలచేతఁ బూజింపఁబడువాఁడవును, సకలజగన్నియంతవును అయిన ఓ పురుషోత్తమా! నీవు గురూపదేశము నొందలగునవి లేకయే, అనఁగా స్వయముగానే స్వస్వరూపమును స్వస్వరూపముచేఁ దెలిసికొనుచున్నావు అని తాత్పర్యము.

శ్లో॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి॥

టీక. యాభిః = ఏ, విభూతిభిః = అవతారములచేత, ఇమాన్ = (సమస్తము నగు) ఈ, లోకాన్ = లోకములను, వ్యాప్య = వ్యాపించి, త్వమ్ = నీవు, తిష్ఠసి = ఉన్నావో; (తాః = ఆ) ఆత్మవిభూతయః = (పరమాత్మ వయిన) నీయొక్క యవతారములు, దివ్యాహి = దివ్యములు (అవి తెకులకు తెలియనివి) కదా! (తస్మాత్ = అందువలన) త్వమ్=నీవు, తాః = ఆ విభూతులను) అశేషేణ = శేషము లేకుండునట్లు, (సర్వ

యాచింపఁబడునట్టి యోకృష్ణా! ఆత్మనః=నీ యొక్క, యోగమ్=సర్వ
జ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలగునవి లక్షణములుగాఁ గల మహాత్మ్య
మును, విభూతించ = [ధ్యేయ] (కొనియాడఁదగిన పదార్థములయొక్క)
స్వరూపమును, విస్తరేణ=వివరముగా (స్పష్టమగునట్లు) భూయః=(7, 9,
అధ్యాయములయందు సంక్షేపముగాఁ జెప్పినప్పటికిని) మఱల, కథయ =
చెప్పుము. అమృతమ్ = నీ నోటనుండి బయలు వెడలు వాక్యామృతమును,
శృణ్వతః = విను చున్న, మే = నాకు తృప్తిః = ఇచ్ఛావిచ్ఛిత్తి (చాలు
నను తలంపు), నాస్తి హి = లేదు గదా.

దుష్టులను నరకమును పొందించునట్టి (లేక) అభ్యుదయనిశ్శ్రేయస
పురుషార్థములకొఱకు, అనఁగా నభివృద్ధి మోక్షము మొదలగువానికొఱకు
జనులచే యాచింపఁబడునట్టి యో కృష్ణుఁడా! అమృతమును త్రాగినవాఁడు
అంతటితో తృప్తి నొందియుండక యింకను కావలె నని కోరును గదా!
నీవు పూర్వము సంక్షేపముగా (7, 9 అధ్యాయములయందు) చెప్పి
యున్నను నీ వాక్యామృతమును పుచ్చుకొన్నది, (విన్నది) మొదలు తృప్తి
నొందని నాకు సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము మొదలగు లక్షణములు
గల నీదుమాహాత్మ్యమును ధ్యానింపఁదగిన పదార్థముల యొక్క స్వరూప
మును మఱల స్పష్టముగాఁ జెప్పు మని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే॥ ౧౯

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను.
హేకురుశ్రేష్ఠ = (కురువంశపురాజులలో శ్రేష్ఠుఁడ వగు) ఓ అర్జునుఁడా!
హన్త=ఇప్పుడు, (యాః=ఏవి) దివ్యాః=దివ్యము అయినవో, (తాః=ఆ)
ఆత్మవిభూతయః=నాయొక్క మాహాత్మ్యములను, ప్రాధాన్యతః = ముఖ్య

త్వష్ట, విష్ణువు అను నీ పండ్రెండుగురు) ఆదిత్యులలోపల, విష్ణుః=విష్ణువను నాదిత్యుఁడను, అహమ్ = నేను, జ్యోతిషామ్ = ప్రకాశింపఁజేయు వానిలో, అంశుమాన్ = కిరణములు గల రవిః=సూర్యుఁడును, అహమ్ = నేను, మరుతామ్ = (సప్త) వాయువులలోపల, మరీచిః = మరీచి యను వాయువను, (లేక) మరుతామ్ = (దేవతలతెగలోఁ గొంద అగు) మరుద్గణములలో, మరీచిః = మరీచి యను దేవతను, అహమ్ = నేను, నక్షత్రాణామ్ = నక్షత్రములలోపల, శశీ = చంద్రుఁడను, అహమ్ = నేను, అస్మి = అగు చున్నాను.

పైనఁ జెప్పిన ధాత మొదలుగాఁగల ద్వాదశాదిత్యులలోపల విష్ణువును, ప్రకాశింపఁజేయువానిలోపల కిరణములు గల సూర్యుఁడును, సప్త వాయువులలోపల మరీచి యను వాయువును, (లేక) దేవతలతెగలోఁ గొంద అగు మరుద్గణములలో మరీచి యను దేవతయును, నక్షత్రములలో చంద్రుఁడును నేనే అగు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా॥

టీక. వేదానామ్ = (మంత్రబ్రాహ్మణ సముదాయాత్మకము అగు ఋగ్యజుస్సామాథర్వణము లనెడు నాలుగు) వేదములలోపల, సామవేదః = (గానమాధుర్యముచేత మిగుల రమణీయ మైన) సామవేదము, అస్మి = అగు చున్నాను; దేవానామ్ = (రుద్రాదిత్యాది) దేవతలలోపల, వాసవ = ఇంద్రుఁడను, అస్మి = అగుచున్నాను; ఇంద్రియాణామ్ = జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు, (అనునట్టి పదునొకండగు) ఇంద్రియముల లోపల, మనః = (సంకల్పవికల్పాత్మక మైన) మనస్సు, అస్మి = అగుచున్నాను; భూతానామ్ = భూతములయొక్క, చేతనా = (కార్యకారణ సంఘాతమును స్పష్టముగాఁ దెలుపునట్టి) బుద్ధివృత్తి, అస్మి = అగుచున్నాను.

మంత్రబ్రాహ్మణసముదాయాత్మకము అగు ఋగ్యజుస్సామాథర్వణము

నేను, సేనానీనామ్=సేనాపతులలోపల, స్కందః=(దేవసేనాపతియగు) కుమారస్వామియును, అస్మి = అగుచున్నాను. సరసామ్ = (దేవతలచేతఁ త్రవ్వఁబడిన) సరస్సులలోపల, సాగరః = (సగరపుత్త్రులచేతఁ త్రవ్వఁబడిన) సముద్రమును, అస్మి = అగుచున్నాను.

ఓ అర్జునుఁడా! రాజపురోహితులలోపల సకలరాజశ్రేష్ఠుఁడును, దేవోత్తముఁడును అయిన యింద్రునకు ప్రధానపురోహితుఁ డగు బృహస్పతియును, సేనాపతులలో దేవసేనాపతి యగు కుమారస్వామియును, దేవతలు మొదలుగాఁ గలవారిచేఁ త్రవ్వఁబడిన సరస్సులలోపల సగరపుత్త్రులచేఁ త్రవ్వఁబడిన సముద్రమును నేనే అగుచున్నా నని తాత్ప.

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥

టీక. అహమ్=నేను, మహర్షీణామ్ = మహర్షులలోపల, భృగుః = భృగు వను మహర్షిని, అస్మి = అగుచున్నాను, గిరామ్ = (అర్థయుక్తము లయిన లేక, పదిలక్షణములు గల) వాక్కులలోపల, ఏకమ్ = ఒకటియైన, అక్షరమ్ = అక్షరము (ఏకాక్షరపద మగు నోంకారము) అస్మి = అగుచున్నాను. యజ్ఞానామ్ = యజ్ఞములలోపల, జపయజ్ఞః = జపయజ్ఞము (మానసిక యజ్ఞము) అస్మి = అగుచున్నాను. స్థావరాణామ్ = స్థిరమైన వానిలో (కదల కుండువానిలో) హిమాలయః = హిమవత్పర్వతము, అస్మి = అగుచున్నాను.

మహర్షులలోపల నధికతేజోవంతుఁ డగు భృగుమహర్షియును, అర్థయుక్తము లైన (లేక) పదిలక్షణములు గల వాక్కులలోపల ఏకాక్షరపరమైన యోంకారమును (ప్రణవమును), యజ్ఞములలోపల జపయజ్ఞమును, (మానసయజ్ఞమును) స్థిరమైనవానిలోపల (కదలకుండువానిలోపల) హిమవత్పర్వతమును నేనే యని తాత్పర్యము.

మఱియును, అమృతముకొఱకు దేవాసురులు సముద్రమథనము చేసి నపుడు ఆ సముద్రమునందుఁ బుట్టినదియును, ఉచ్చైశ్శ్రవస్సను పేరు కలదియును, ఏడుముఖములు కలదియును అయిన యింద్రాశ్వముగాను, గజశ్రేష్ఠములలోపల నాలుగుదంతములు గల యింద్రగజమునుగాను, మానవులలోపల నరపతి యను రాజునుగాను నన్ను దెలిసికొను మని తాత్ప.

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః॥ ౨౮

టీక. ఆయుధానామ్ = ఆయుధములలోపల, వజ్రమ్ = (దధీచి యొక్క వెన్నెముకచేతఁ జేయఁబడిన) వజ్రాయుధము, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను. ధేనూనామ్ = ధేనువులలోపల, కామధుక్ = (కోర్కెలను పిదుకునట్టి వసిష్ఠుని) కామధేనువు, (అహమ్ = నేను) అస్మి = అగుచున్నాను. ప్రజనః = పుత్రోత్పత్తిని చేయునట్టి, కందర్పః = కాముఁడు, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను. సర్పాణామ్ = (విషవంతము లగు) సర్పములలోపల, వాసుకిః = (సర్పరాజ మగు వాసుకి, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను.

ఆయుధములలోపల దధీచియొక్క వెన్నెముకచేతఁ జేయఁబడిన వజ్రాయుధమును నేను, ధేనువులలోపల కోర్కెలను పిదుకునట్టి కామధేనువను (శేక) సామాన్య మగు కామధేనువను నేను, పుత్రోత్పత్తిని కలుగఁ జేయునట్టి కామమును నేను, విషవంతము లగు సర్పములలోపల, అనఁగా సర్పభేదములలోపల వాసుకి యను సర్పరాజమును నేను; అని తాత్ప.

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమాచాస్మి యమస్సంయమతామహమ్॥

టీక. నాగానామ్ = (విషరహితము లయిన) సర్పములలోపల, అనంతః = (నాగరాజగు) అనంతుఁడను, అహమ్ = నేను; అస్మి = అగు

మఱియును, అమృతముకొఱకు దేవాసురులు సముద్రమథనము చేసినపుడు ఆ సముద్రమునందుఁ బుట్టినదియును, ఉచ్చైశ్శ్రవస్సను పేరుకలదియును, ఏడుముఖములు కలదియును అయిన యింద్రాశ్వముగాను, గజశ్రేష్ఠములలోపల నాలుగుదంతములు గల యింద్రగజముగాను, మానవులలోపల నరపతి యను రాజునుగాను నన్ను దెలిసికొను మని తాత్ప.

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః॥ ౨౮

టీక. ఆయుధానామ్ = ఆయుధములలోపల, వజ్రమ్ = (దధీచియొక్క వెన్నెముకచేతఁ జేయఁబడిన) వజ్రాయుధము, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను, ధేనూనామ్ = ధేనువులలోపల, కామధుక్ = (కోర్కెలను పిదుకునట్టి వసిష్ఠుని) కామధేనువు, (అహమ్ = నేను) అస్మి = అగుచున్నాను. (ప్రజనః = పుత్త్రోత్పత్తిని చేయునట్టి, కందర్పః = కాముఁడు, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను. సర్పాణామ్ = (విషవంతము లగు) సర్పములలోపల, వాసుకిః = (సర్పరాజ మగు వాసుకి, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను.

ఆయుధములలోపల దధీచియొక్క వెన్నెముకచేతఁ జేయఁబడిన వజ్రాయుధమును నేను, ధేనువులలోపల కోర్కెలను పిదుకునట్టి కామధేనువను (లేక) సామాన్య మగు కామధేనువను నేను, పుత్త్రోత్పత్తిని కలుగఁజేయునట్టి కాముఁడను నేను, విషవంతము లగు సర్పములలోపల, అనఁగా సర్పభేదములలోపల వాసుకి యను సర్పరాజమును నేను; అని తాత్ప.

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమాచాస్మి యమస్సంయమతామహమ్॥

టీక. నాగానామ్ = (విషరహితము లయిన) సర్పములలోపల, అనంతః = (నాగరాజగు) అనంతుఁడను, అహమ్ = నేను, అస్మి=అగు

వారిలోపల కాలము (లెక్క) కాలస్వరూపుఁడను (చిత్రగుప్తుఁడను) నేను, మృగములలోపల సింహము నేను, పక్షులలోపల వినతాపుత్రుఁ డగు గరుత్మంతుఁడను నేను అగు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతా మహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥ 31

టీక. పవతామ్ = పవిత్రతను గలుగఁజేయువానిలోపల, పవనః = వాయువు, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను. శస్త్రభృతామ్ = ఆయుధమును ధరించినవారిలోపల, రామః = (దశరథపుత్రుఁ డగు శ్రీరాముఁడు, అహమ్ = నేను, అస్మి = అగు చున్నాను. ఝషాణామ్ = మత్స్యములలోపల, మకరశ్చ = మొసలి యను జలజంతువును, అహమ్ = నేను, అస్మి = అగు చున్నాను, స్రోతసామ్ = నదులలోపల, జాహ్నవీ = గంగానది, అహమ్ = నేను, అస్మి = అగు చున్నాను.

తా. పరిశుద్ధతను కలుగఁజేయువానిలోపల వాయుదేవుఁడును, ఆయుధమును ధరించువారిలోపల దశరథరాజనందనుఁ డగు శ్రీరాముఁడును, మత్స్యములలోపల మొసలియును, నదులలోపల సర్వనదీశ్రేష్ఠ యగు గంగానదియును నేనే యగు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ సర్గాణామాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ।

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! సర్గాణామ్ = (సమస్త ప్రపంచములయొక్క) సృష్టులకు, ఆదిః = మొదలును, (ఉత్పత్తిని చేయువాఁడును) మధ్యంచ = స్థితియును, (సంరక్షించువాఁడును) అంతశ్చ = తుదయును, (నాశమును కలుగఁజేయువాఁడును, అహమ్ + ఏవ = నేనే, అస్మి = అగు చున్నాను. విద్యానామ్ = విద్యలలోపల, అధ్యాత్మవిద్యా = మోక్షవిద్య, (ఆత్మస్వరూపానుభవమును కలుగఁజేయు బ్రహ్మవిద్య) అహమ్ =

శ్లో॥ మృత్యు స్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥

టీక. సర్వహరః=ప్రళయకాలమున సమస్తమైన వారిప్రాణములను బోఁగొట్టునట్టి, మృత్యుః=మృత్యుదేవతయును, భవిష్యతామ్=రాఁబోవు కల్యాణములలోపల, (ఉత్కృష్టప్రాప్తియోగ్యము లగువానిలోపల) ఉద్భవశ్చ=పుట్టుకయును, (సుఖప్రాప్తికి హేతువును లేక, అభ్యుదయ ప్రాప్తికి హేతువును) నారీణామ్=స్త్రీలలోపల. కీర్తిః=ధర్మగుణమునుబట్టి కలుగు ఖ్యాతియును, (కీర్త్యభిమానిదేవతయును) శ్రీః = (ఐశ్వర్యాభిమానిదేవత యగు) లక్ష్మియును, వాక్చ=సర్వప్రకాశిక యగువాక్కును, (వాగభిమాని యగు సరస్వతియును) స్మృతిః=చిరకాలముక్రిందట జరిగినసంగతి మరల జ్ఞాపకము వచ్చుటకుఁ దగినశక్తియును (జ్ఞాపకశక్త్యభిమానిదేవతయును) మేధా=శాస్త్రాంశములను జ్ఞాపకమునునుంచుకొనుటకుఁ దగినశక్తియును, (బుద్ధి కభిమానిదేవతయును) ధృతిః=ధైర్యమును, (ధైర్యమున కభిమాని యగు దేవతయును) క్షమా=మానావమానములయందు నేకవిధముగా నుండుట యనునట్టి యోర్పును, (క్షమాభిమానిదేవతయు) అహమ్=నేను, (అస్మి=అగు చున్నాను.)

ప్రళయకాలమున సమస్తమైన వారిప్రాణములను పోఁగొట్టు మృత్యుదేవతయును, ఉత్పత్తి కాఁగలవారిలోపల (లేక) ఉత్కృష్టప్రాప్తి యోగ్యములగువానిలోపల పుట్టుకయును (లేక) ఉత్కృష్టప్రాప్తికి హేతువును (లేక) అభ్యుదయప్రాప్తికి హేతువును, స్త్రీలలోపల ధర్మగుణమును బట్టి కలుగు ఖ్యాతియును, కీర్త్యభిమానిదేవతయును, ఐశ్వర్యాభిమాని దేవతయగు లక్ష్మియును, సర్వప్రకాశికయగు వాక్కును, (వాగభిమానిదేవత యగు సరస్వతియును) చిరకాలముక్రిందట జరిగినసంగతి మరల జ్ఞాపకము వచ్చుటకుఁ దగిన శక్తియును, (జ్ఞాపకశక్త్యభిమానిదేవతయును) శాస్త్రాంశములను జ్ఞాపకమున నుంచుకొనుటకుఁ దగిన శక్తియును, (బుద్ధి కభిమానియగు దేవతయును) ధైర్యమును, (ధైర్యమున కభిమాని యగు

జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్త్వం సత్త్వవతామహమ్॥ 36

టీ. అహమ్ = నేను, ఛలయతామ్ = కపటమును చేయువారియొక్క, ద్యూతమ్=పాచిక లాడుటయే స్వరూపముగాఁ గల జూదము, అస్మి = అగుచున్నాను. తేజస్వినామ్ = తేజోవంతులయొక్క, తేజః = అప్రతిహత మైన యాజ్ఞ, అహమ్=నేను, అస్మి=అగుచున్నాను. (జేతౄణామ్ = జయించువారలయొక్క) జయః = జయము, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను. (వ్యవసాయినామ్ = ఫలమునకుఁ గారణ మైన ప్రయత్నమును చేయువారియొక్క) వ్యవసాయః=ప్రయత్నమును, అహమ్= నేను, అస్మి=అగుచున్నాను. సత్త్వవతామ్ = (జ్ఞానవైరాగ్యములు గల) సాత్త్వికులయొక్క, సత్త్వమ్=ధర్మము జ్ఞానము వైరాగ్యము మొదలు గాఁ గల సత్త్వకార్యము, అహమ్ = నేను, అస్మి = అగుచున్నాను.

పరవంచనను (లేక) అన్యోన్యవంచనను చేయువారియొక్క పాచిక లాడుటయే స్వరూపముగాఁ గలదియును, సర్వధనములను హరించుటకుఁ గారణ మైనదియును అయిన జూదమును, అత్యుగ్రప్రభావము కలవారియొక్క యప్రతిహత మైన యాజ్ఞయును, జయించువారియొక్క పరాజితు నపేక్షచేత నుత్కృష్టలక్షణ మగు జయమును, తప్పక ఫలమును కలిగించునట్టి [illegible] కలవారియొక్క యుద్యమమును, జ్ఞానవైరాగ్యములు గల సాత్త్వికులయొక్క ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యములే లక్షణముగాఁ గల సత్త్వకార్యమును నే నగుచున్నా నని తాత్పర్యము.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః॥ 37

టీక. వృష్ణీనామ్=యాదవులలోపల, వాసుదేవః=వసుదేవ పుత్త్రుఁడును నీకు స్నేహితుఁడును (అయిన) శ్రీకృష్ణుఁడు, అహమ్=నేను, అస్మి=

గోప్యము లగువానిలోపల, మౌనమ్=(చక్కని సన్న్యాసశ్రవణ మననములు మొదట గలదియును, ఆత్మయొక్క నిధిధ్యాసనమే స్వరూపముగాఁ గలదియును అయిన) మౌనము (ఏమియును చెప్పఁజాలక నోరు మూసికొని యుండువాని యొక్క మౌనము కాదు) అహమ్ = నేను, అస్మి=అగుచున్నాను. జ్ఞానవతామ్ = తత్త్వజ్ఞానవంతులయొక్క, జ్ఞానమ్=(శ్రవణ మనన నిదిధ్యాసన పరిపాకముకలన పుట్టినదియును, అద్వితీయాత్మ సాక్షాత్కార రూపమును, సర్వాజ్ఞానవిరోధియును అయిన) జ్ఞానము, అహమ్= నేను, అస్మి = అగు చున్నాను.

దుర్మార్గులను సన్మార్గమునందు ప్రవర్తించునట్లు శిక్షించువారియొక్క సన్మార్గమునందు ప్రవర్తించునిమిత్తము చేయఁబడు శిక్ష నే నగు చున్నాను, జయింప నిచ్ఛ కలవారియొక్క జయోపాయమును ప్రకాశింపఁ జేయునట్టి న్యాయము (లేక) సామదానభేదదండములే స్వరూపముగాఁ గల న్యాయము నే నగు చున్నాను, గోప్యములలోపల దాఁచుటకు కారణ మైన వాచంయమత్వము (లేక) సన్న్యాసాశ్రమము నవలంబించుట (లేక) చక్కని సన్న్యాస శ్రవణ మననములు మొదట గలదియును, ఆత్మయొక్క నిదిధ్యాసమే స్వరూపముగా గలదియును అయిన మౌనము (ఏమియును చెప్పఁజాలక నోరు మూసికొని యూరక యుండువానియొక్క మౌనము కాదు) నే నగు చున్నాను. తత్త్వజ్ఞానులయొక్క శ్రవణ మనన నిదిధ్యాస పరిపాకము వలన పుట్టినదియును, అద్వితీయాత్మ సాక్షాత్కార రూపమును, సర్వాజ్ఞాన విరోధియును అయిన జ్ఞానము నే నగుచున్నానని తా.

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్॥

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! సర్వభూతానామ్ = సమస్త భూతములకును, యత్=ఏది, బీజమ్=ప్రరోహకారణ మైనదో, తదపిచ= అదియును, అహమ్=నేను, అస్మి=అగుచున్నాను. చరాచరమ్ = జంగమ

ముతోఁ గూడినదియును, (అయిన) యత్ + యత్ = ఏయే, సత్త్వమ్ = వస్తువు, (అస్తి=కలదో) తత్ + తత్ = ఆయా వస్తువును, మమ = నాయొక్క, తేజోంశసంభవమ్ + ఏవ = శక్తియొక్క యంశమువలనఁ బుట్టిన దానినిగానే, (లేక) చైతన్యముయొక్క యంశమువలఁ బుట్టిన దానినిగానే, (లేక) ప్రభావముయొక్క యంశముచేతఁ బుట్టినదానిని గానే, త్వమ్ = నీవు, అవగచ్ఛ = తెలిసికొనుము.

ఓ అర్జునుఁడా! ఐశ్వర్యయుక్తమైనదియును, కాంతియుక్తమైనదియు, దృఢమైన యుత్సాహముతోఁ గూడినదియును అయినవస్తువేదేది కలదో ఆయావస్తువును చైతన్యముయొక్క (లేక) ఈశ్వరశక్తియొక్క (లేక) ప్రభావముయొక్క అంశమువలనఁ బుట్టినదానినిగానే నీవు తెలిసికొనుమని తాత్పర్యము.

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥

టీక. హే అర్జున = ఓ అర్జునుఁడా! అథవా = ఇట్లు కాదేని, బహునా=విస్తారమైన, ఏతేన=ఈ, జ్ఞాతేన=జ్ఞానముచేత, తవ = నీకు, కిమ్=ఏమి, అహమ్=నేను, ఇదమ్=ఈ, కృత్స్నమ్=సమస్తమైన, జగత్=జగత్తును, ఏకాంశేన=ఏకభాగముచేత, విష్టభ్య = అవలంబించి, స్థితః = ఉన్నవాఁడను, అస్మి = అగుచున్నాను.

ఓ యర్జునుఁడా! ఇట్లు కాదేని విస్తారమైన యీ జ్ఞానముచేత, అనఁగా సావశేషిత మగు జ్ఞానముచేత నీకు లాభ మేమియును లేదు, కావున సంపూర్ణముగ నిప్పుడు చెప్పఁబడునట్టి యర్థమును వినుము. ఎట్లనిన:—ఈ కనఁబడుచున్న ప్రపంచమును సర్వమును యేకపాదముచేత నేను విశేషముగ నవలంబించి యున్నా నని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శాతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి

•

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# శ్రీభగవద్గీత - ఏకాదశాధ్యాయము,

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

---

## విశ్వరూపసందర్శనయోగము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తంవచస్తేనమోహోఽయంవిగతోమమ॥

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు పలికెను. మదనుగ్రహాయ = నన్ననుగ్రహించుటకొఱకు, పరమమ్ = పరమపురుషార్థ సాధనమును, గుహ్యమ్=దాఁచఁదగినదియును, అధ్యాత్మసంజ్ఞితమ్=ఆత్మానాత్మవివేక విషయమైనదియును, (అయిన) యత్=ఏ, వచః=వాక్యము, త్వయా = నీచేత, ఉక్తమ్ = చెప్పఁబడినదో, తేన = ఆ వాక్యముచేత, మమ=నా యొక్క, అయమ్=ఈ (అనుభవసిద్ధమైన) మోహః = అవివేకము, విగతః = పోఁగొట్టఁబడెను.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ కృష్ణుఁడా! నన్ను అనుగ్రహించుటకొఱకు, అనఁగా నా దుఃఖమును పోఁగొట్టుటకొఱకు పరమ పురుషార్థ మగు మోక్షమునకు సాధనమును, దాఁచఁదగినదియును, ఆత్మా

శక్తి బల వీర్య తేజస్సులతోఁ గూడినదియును విష్ణుసంబంధ మైనదియును అయిన నీ యొక్క రూపమును చూచుటకొఱకు నిచ్ఛయించు చున్నానని తాత్పర్యము.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్॥

టీక. హే ప్రభో = (సృష్టిస్థితి సంహారప్రవేశన ప్రశాసనములయందు) సమర్థుఁడ వైనవాఁడా! తత్ = (నీయొక్క) ఐశ్వర్య మైన యారూపము, మయా = నాచేత, ద్రష్టుమ్ = చూచుటకొఱకు, శక్యమ్ = తగినది; ఇతి = ఇట్లని, మన్యసే యది = తలఁచితి వేని, తతః = (నేను నీ యిష్టప్రకారము నడచు కొనువాఁడను), కావున యోగేశ్వర = (అణిమాదిసిద్ధశాలు రగు) యోగుల కధిపతి వైన యోకృష్ణుఁడా! అవ్యయమ్ = నాశరహిత మైన, ఆత్మానమ్ = (ఐశ్వర మైన నీయొక్క) రూపమును (అనఁగా విశ్వరూపమును), మే = నాకు త్వమ్ = నీవు, దర్శయ = చూపుము.

సృష్టి స్థితి సంహార ప్రవేశన ప్రశాసనములయందు సమర్థుఁడ వైన యో కృష్ణుఁడా! నీయొక్క యైశ్వర మగు రూపము నాచేఁ జూడఁదగిన దని తలఁచితి వేని నేను జూచుటకు అపేక్షించు చున్నాను. కావున అణిమాదిసిద్ధశాలు రైన యోగులకధిపతి వైన యో కృష్ణుఁడా! నాశరహిత మైన నీ యొక్క విశ్వరూపమును నాకుఁ జూపు మని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ: —

శ్లో॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ ౫

టీక. శ్రీభగవానువాచ = సంపత్కరుఁ డగు భగవంతుఁడు చెప్పెను. హేపార్థ = ఓ అర్జునుఁడా! నానావిధాని = అనేకప్రకారములు గలవియును, దివ్యాని = అప్రాకృతము అయినవియును, నానావర్ణాకృతీనిచ = అనేకము లగు వర్ణములను అవయవస్థితివిశేషములను

టీక. హే గుడాకేశ = ఓ అర్జునుఁడా! సచరాచరమ్=స్థావరజంగమములతోఁ గూడినదియును, కృత్స్నమ్ = సమస్తమును (అయిన), జగత్ = జగత్తును, ఏకస్థమ్ = (ఒక్కప్రదేశమునందే) (అవయవరూపములతో) ఉన్నదానిని గా, ద్రష్టుమ్ = చూచుటకొఱకు, ఇచ్ఛసి (యది) = ఇచ్ఛయించితి వేని, మమ = నాయొక్క, ఇహ = ఈ, దేహే = దేహమునందు, పశ్య = చూడుము. అన్యత్ = ఇతర మైన, యత్ = దేనిని ద్రష్టుమ్ = చూచుట కొఱకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, (తత్) = దానినికూడ, పశ్య = చూడుము.

నిద్రను జయించిన ఓ యర్జునుఁడా! స్థావరజంగమములతోఁ గూడినదియును, సమస్తమును అగు జగత్తును ఒక్కప్రదేశమునందే అవయవరూపములో నున్నదానినిగాఁ జూచుటకొఱకు యిచ్ఛయించితివేని నాయొక్క యీ దేహమునందు జూడుము, మఱియును, ఇతర మైనదేనిని జూడఁదలఁచుచున్నావో దానినికూడఁ జూడు మని తాత్పర్యము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ ౮

టీక. అనేన = ఈ, స్వచక్షుషా + ఏవ + తు నీయొక్క, (ప్రాకృత మగు చర్మచక్షువు)చేతనే, మామ్ = (విశ్వరూపధరుఁడ నగు) నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, నశక్యసే = శక్తిలేదు. (శక్యసే అను పాఠాంతరమునందు) నశక్యసే = శక్తుఁడవు కావు. (అతః = అందువలన) తే = నీకొఱకు, దివ్యమ్ = అప్రాకృత మైన (నాయొక్క విశ్వరూపమును జూచుటకుఁ దగిన) చక్షుః = నేత్రమును, దదామి = ఇచ్చుచున్నాను. ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధ మైన, యోగమ్ = సామర్థ్యమును (ఈశ్వరుఁడ నైన నాయొక్క అసాధారణ మైన అఘటన ఘటనా సామర్థ్యమును), పశ్య = చూడుము.

టీక. అనేకవక్త్రనయనమ్=అనేకము అయిన ముఖములును నేత్రములును కలదియును, అనేకాద్భుతదర్శనమ్ = అనేకములును ఆశ్చర్యకరములును అయిన దర్శనములు కలదియును (లేక) అనేకములగు విస్మయకారణములను చూపునట్టిదియును (లేక) అనేకములగు ఆశ్చర్యకారణములను ఊర్ధ్వాధస్తిర్యగ్భాగములను జూచుచున్నదియును వికృతములును సౌమ్యములును సాధారణములును భయంకరములును చిత్రములును అయిన చూపులు కలదియును, అనేకదివ్యాభరణమ్=అనేకములును దివ్యములును అయిన హారకేయూరాద్యాభరణములు కలదియును, దివ్యానేకోద్యతాయుధమ్=శ్రేష్ఠములును (లేక) ప్రచండములును (అనేకములును) ఎత్తఁబడినవియును (అయిన) ఆయుధములు కలదియును, (అయిన) ఐశ్వరంరూపమ్= ఈశ్వరసంబంధమగు విశ్వరూపమును) దర్శయామాస=చూపెను.

అనేకము అయిన వక్త్రములును నేత్రములును కలదియును, అనేకములును ఆశ్చర్యకరములును అయిన దర్శనములు కలదియును, (లేక) అనేకములగు విస్మయకారణములు చూపునట్టిదియును, (లేక) అనేకములును ఆశ్చర్యకారణములును ఊర్ధ్వాధస్తిర్యగ్భాగములను చూచుచున్నదియును వికృతములును సౌమ్యములును సాధారణములును భయంకరములును చిత్రములును అయిన చూపులు కలదియును, అనేకములును శ్రేష్ఠములును అయిన హారకేయూరాద్యాభరణములు కలదియును, అనేకములును శ్రేష్ఠములును (లేక) ప్రచండములును అయిన ఆయుధములు కలదియును అయిన విశ్వరూపమును జూపెనని తాత్పర్యము.

శ్లో॥ దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్॥ ౧౧

టీక. దివ్యమాల్యాంబరధరమ్=శ్రేష్ఠము అయిన పుష్పమాలికలను (లేక) రత్నహారములను ధరించినదియును, దివ్యగంధానులేపనమ్ = శ్రేష్ఠమైన వాసనద్రవ్యముల మైపూత కలదియును, సర్వాశ్చర్యమయమ్ = సక

టీక. అనేకధా = (దేవపితృమనుష్యాది భేదములచేత) బహువిధములుగా, ప్రవిభక్తమ్=విభజింపఁబడినదియును, కృత్స్నమ్=సమస్తమును, (అయిన) జగత్ = జగత్తును, దేవదేవస్య = దేవతలకుఁగూడ దేవుఁడైన యా శ్రీకృష్ణునియొక్క, తత్ర = ఆ, శరీరే = శరీరమందు, పాండవః = అర్జునుఁడు, ఏకస్థమ్ = ఒక్కచోట నున్నదానినిగా, తదా = అప్పుడు, అపశ్యత్ = చూచెను.

దేవపితృ మనుష్యాది భేదములచేత బహువిధములుగా విభజింపఁబడినదియును సమస్తజగత్తును దేవతలకు దేవుఁడైన శ్రీకృష్ణునియొక్క దేహమునందే అర్జునుఁడు ఒక్కచోటనే యున్నదానినిగా అప్పుడు చూచెనని తా.

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత॥ ౧౪

టీక. తతః = (అట్టి విశ్వరూపమును జూచిన) పిమ్మట, సః = ఆ, ధనంజయః = అర్జునుఁడు, విస్మయావిష్టః = ఆశ్చర్యముతోఁ గూడినవాఁడును, హృష్టరోమా=గగురుపాడిచిన దేహము కలవాఁడును (రోమాంచము కలవాఁడును) అయి, దేవమ్ = విశ్వరూపమును ధరించి వెలుఁగుచున్న శ్రీకృష్ణుని, శిరసా=శిరస్సుచేత, ప్రణమ్య=నమస్కరించి, కృతాంజలిః = చేయఁబడిన చేమోడ్పు కలవాఁడై, అభాషత=సంభాషించెను.

అట్టి విశ్వరూపమును జూచిన పిమ్మట ఆ యర్జునుఁడు మిగుల నాశ్చర్యము కలవాఁడును, రోమాంచము కలవాఁడునునై విశ్వరూపమును ధరించి వెలుఁగుచున్న శ్రీకృష్ణునకు శిరస్సును వంచి నమస్కరించి దోసిలియొగ్గి సంభాషించె నని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ పశ్యామి దేవాంస్తవ దేవదేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।

నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥ ౧౬

టీక. విశ్వేశ్వర = సకలప్రపంచనియామకుఁడా! విశ్వరూప = ప్రపంచ స్వరూపుఁడా! అనేకబాహూదరవక్త్రనేత్రమ్=అనేకములయిన బాహువులు ఉదరములు వక్త్రములు నేత్రములు (అనునవి) కల, త్వామ్= నిన్ను, సర్వతః=అంతటను, అనంతరూపమ్=అనేకము లయిన రూపములు కల వానినిగా, పశ్యామి=చూచు చున్నాను; పునః=మఱియును, తవ = నీయొక్క, ఆదిమ్=మొదలును, నపశ్యామి = చూచు చుండ లేదు; మధ్యమ్= మధ్యమును, నపశ్యామి = చూచుచుండలేదు; అంతమ్=అంత మును, నపశ్యామి = చూచు చుండ లేదు.

సకల ప్రపంచనియామకుఁడవును, సకల ప్రపంచస్వరూపుఁడవును అయిన యో కృష్ణుఁడా! అనేకము లయిన బాహువులు కడుపులు వక్త్రములు నేత్రములు అనునవి కల నిన్ను అంతటను అనేకము లయిన రూపము లను చూచు చున్నాను. మఱియును, ఓ కృష్ణుఁడా! ఇట్లు చూచు చుండి యుఁను నీయొక్క యాదిమధ్యాంతములను చూడ లే కున్నాను. అనఁగా, నీయొక్క యాదిమధ్యాంతములు కనఁబడు చుండ లే దని తాత్పర్యము.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్॥ ౧౭

టీక. కిరీటినమ్ = (శిరోభూషణవిశేష మగు) కిరీటము గలవాఁడ వును, గదినమ్ = గద యను నాయుధము కలవాఁడవును, చక్రిణంచ = చక్రాయుధముగలవాఁడవును, తేజోరాశిమ్=తేజఃపుంజస్వరూపుఁడవును, సర్వతః = అంతటను, దీప్తిమంతమ్ = ప్రకాశము గలవాఁడవును, దుర్ని

ఓ కృష్ణుఁడా! నీవు ముముక్షువులచేతఁ దెలియఁదగిన పరబ్రహ్మమని యును, ఈ సకలప్రపంచమునకును సర్వోత్తమ మైన యాధారమనియును నాశము లేనివాఁడ వనియును, శాశ్వతధర్మమును (వేదోక్తధర్మమును) పాలించువాఁడ వనియును, సనాతనపురుషుఁడ వనియును నేను దలఁచు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ అనాదిమధ్యాంత మనంత వీర్య
　　మనంత బాహుం శశిసూర్యనేత్రమ్ ।
　　పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
　　స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥　　౧౯

టీక॥ అనాదిమధ్యాన్తమ్=ఉత్పత్తి స్థితి నాశములు లేనివాఁడవును, అనంతవీర్యం = అపరిమిత మైన సామర్థ్యము కలవాఁడవును, అనంత బాహుమ్=అపరిమితములైన భుజములు కలవాఁడవును, శశిసూర్యనేత్రమ్= చంద్రుఁడును సూర్యుఁడును నేత్రములుగాఁ గలవాఁడవును, దీప్తహుతాశ వక్త్రమ్=ప్రజ్వలించు చున్న యగ్నిహోత్రునివంటి ముఖము కలవాఁడ వును (లేక) ప్రజ్వలించు చున్న యగ్ని ముఖములయందుఁ గలవాఁడవును, స్వతేజసా=స్వకీయ మగు తేజస్సుచేత, ఇదమ్=ఈ, విశ్వమ్=సమస్తమును, తపన్తమ్=తపింపఁజేయు చున్నవాఁడవును, (అయిన) త్వామ్ = నిన్ను, పశ్యామి = చూచు చున్నాను.

ఓ కృష్ణుఁడా! ఉత్పత్తి స్థితి నాశములు లేనివాఁడవును, అపరిమిత మైన సామర్థ్యము కలవాఁడవును, అపరిమితము లయిన భుజములు కలవాఁ డవును, చంద్రుఁడును సూర్యుఁడును నేత్రములుగాఁ గలవాఁడవును (లేక) ప్రజ్వలించు చున్న యగ్ని ముఖములయందుఁ గలవాఁడవును, (లేక) ప్రజ్వ లించుచున్న యగ్నిహోత్రునివంటి ముఖము కలవాఁడవును, స్వకీయ మగు తేజస్సుచేత నీ సమస్తప్రపంచమును తపింపజేయు చున్నవాఁడవును, అయిన నిన్నుఁ జూచు చున్నా నని తాత్పర్యము.

టీక. అమీ హి=ఈ, (యుద్ధభూమిని పొందియున్న) సురసంఘాః=(భూభారహరణముకొఱకు మర్త్యులై పుట్టియున్న) వస్వాది దేవతాసముదాయములు, అమీ హి = ఈ, (యుద్ధభూమిని పొంది యున్న) అసుర సంఘాః=భూభారభూతులై పుట్టియున్న దుర్యోధనాదులు, త్వాం = నిన్ను, విశన్తి = ప్రవేశించు చున్నారు; కేచిత్=(ఆ రెండువిధము లయిన వారలలో) కొందఱు, భీతాః=భయమును పొందినవారును, ప్రాఞ్జలయః= చేతులను జోడించినవారును, (అయి) గృణన్తి=స్తోత్రము చేయుచున్నారు; మహర్షి సిద్ధసంఘాః=నారదాది మహర్షులయొక్కయును కపిలాది సిద్ధుల యొక్కయును సముదాయములు, స్వస్తి=(జగత్తునకు) క్షేమము, (అస్తు= అగుగాత) ఇతి=ఇట్లని, పుష్కలాభిః = సంపూర్ణార్థము గల, స్తుతిభిః= స్తోత్రములచేత, త్వాం=నిన్ను, స్తువన్తి=స్తోత్రము చేయుచున్నారు.

ఈ యుద్ధభూమిని పొంది యున్నవారును, భూభారహరణము కొఱకు మనుష్యులై పుట్టినవారును నగు వస్వాదిదేవతాసముదాయములును, భూభార భూతులై పుట్టి యీ యుద్ధరంగమునం దున్న దుర్యోధనాదులును నిన్ను ప్రవేశించు చున్నారు. ఆ రెండువిధము అయినవారును, ఈ యుభయసేనలయందు నున్నవారును అగువారిలోఁ గొందఱు పరుగెత్తి పోవుటయందుఁ గూడ శక్తిలేనివారై దోసిళు లొగ్గి నిన్ను స్తోత్రము చేయు చున్నారు. ఈ యుద్ధ భూమిలోనికి వచ్చి యుద్ధమును చూడఁదలఁచిన నారదాదిమహర్షులును కపిలాదిసిద్ధులును యుద్ధము సంప్రాప్తము కాఁగానే లోకవినాశకరములై కగిలిన యుత్పాతాదినిమిత్తములను చూచి జగత్తునకు మేలు గలుగుఁ గాక అని చెప్పి సంపూర్ణార్థములు గల స్తోత్రములచేత నిన్ను స్తోత్రము చేయుచున్నారు; అని తాత్పర్యము,

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వే ఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।

ముఖములును నేత్రములును గలదియును, బహుబాహూరుపాదమ్ = అనేకము అయిన బాహువులును తొడలును పాదములును కలదియును, బహూదరమ్=అనేకము అయిన కడుపులు కలదియును, బహుదంష్ట్రాకరాలమ్= అనేకము లగు కోరపల్లుచేత భయంకర మైనదియును, మహత్=పరిమితి లేనిదియును, (అయిన) తే=నీయొక్క, రూపమ్=రూపమును, దృష్ట్వా= చూచి, లోకాః = (లోకములయందలి) సకలప్రాణులును, ప్రవ్యథితాః = (భయముచేత) వణఁకు చున్నారు; తథా=అలాగుననే, అహంచ=నేనును, (ప్రవ్యథితః = భయముచేత వణఁకు చున్నాను).

పరాక్రమవ్యోతకములును గొప్పవియును అయిన భుజములు గల యో కృష్ణుఁడా! అనేకము లయిన ముఖములును నేత్రములును గలదియును, అనేకము లైన బాహువులును తొడలును కలదియును, అనేకము అయిన కడుపులు గలదియును, అనేకము అగు కోరపల్లులచేత భయంకర మైనదియును, పరిమితి లేనిదియును అయిన నీయొక్క రూపమును చూచి లోకములయందలి సకలప్రాణులును భయముచేత వణఁకు చున్నారు. అటులనే నేనుగూడ భయముచేత వణఁకు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో॥ ౨౪

టీక. హే విష్ణో = సర్వవ్యాపకుఁడ వైన యో కృష్ణుఁడా! నభస్స్పృశమ్ = ఆకాశము నంటియున్న వాఁడవును, (లేక) ఆకాశమువరకు సర్వమును వ్యాపించి యున్నవాఁడవును, దీప్తమ్ = ప్రకాశించు చున్న వాఁడవును, అనేకవర్ణమ్ = అనేకము లయిన రంగులు కలవాఁడవును, (లేక) భయంకరము అయిన యనేకావయవములు గలవాఁడవును, (లేక) బ్రహ్మాది నానావిధ విచిత్రరూపవిశ్వముతోఁ గూడుకొన్నవాఁడవును,

నట్టి యగ్నితో సమాన మయినవియును, (అయిన) తే = నీయొక్క, ముఖాని=ముఖములను, దృష్ట్వైవ=చూచియే, దిశః=(తూర్పు మొదలుగాఁ గల) దిక్కులను, నజానే=ఎఱుఁగ కున్నాను; శర్మ చ=సుఖమును, నలభే= పొందలేక యున్నాను, హే దేవేశ=ఓదేవాధిపతీ! హే జగన్నివాస = ఓ లోకాధారుఁడా! ప్రసీద = ప్రసన్నుఁడ వగుము.

కోరపల్లులచేత భయంకరము లయినవియును, ప్రళయకాలమునందు లోకములను దహించునట్టి యగ్నితో సమాన మైనవియును అయిన నీ యొక్క ముఖములను చూచియే (నీయందుఁ బ్రవేశింపకయే) తూర్పు మొదలుగాఁ గల దిక్కులను యెఱుఁగ కున్నాను, సుఖమునుగూడ పొంద లేక యున్నాను. ఓ దేవాధిపతీ! ఓ లోకాధారుఁడా! అనుగ్రహింపుమని తాత్పర్యము.

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్యపుత్రాః
సర్వే సహైవాఽవనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥ ౨౬

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని ।
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాంగైః॥ ౨౭

టీక. సర్వే=సమస్త మైన, అమీ = ఈ, ధృతరాష్ట్రస్య = ధృతరాష్ట్రుని యొక్క, పుత్రాః=కొడుకు లైన దుర్యోధనాదులును, భీష్మశ్చ= భీష్మాచార్యుఁడును, ద్రోణశ్చ = ద్రోణాచార్యుఁడును, అసౌ=ఈ, సూత పుత్రశ్చ = సూతునికొడు కగు కర్ణుఁడును, అవనిపాలసంఘై స్సహ =

నరలోకవీరాః = మానవలోకమునందలి వీరులు, అభితః = అంతటను, జ్వలన్తి = ప్రజ్వలించుచున్న (లేక) అభివిజ్వలన్తి = అధికముగాఁ బ్రకాశించుచున్న, తవ = నీయొక్క, వక్త్రాణి = ముఖములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

ఓ కృష్ణుఁడా! నదులయొక్క యనేకము అయిన జలప్రవాహములు సముద్రమునే అభిముఖము లైనవై ప్రవేశించుచున్నవిధముగ ఈమానవలోకవీరు లందఱును మిక్కిలిగాఁ బ్రజ్వలించుచున్న నీ ముఖముల యందుఁ బ్రవేశించుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ ౨౯

టీక. పతంగాః = మిడుతలు, నాశాయ = (తమ) నాశముకొఱకు, సమృద్ధవేగాః = అతివేగము కలవై, ప్రదీప్తమ్ = అధికముగా మండుచున్న, జ్వలనమ్ = అగ్నిని, యథా = ఏలాగున, విశన్తి = ప్రవేశించుచున్నవో, తథా + ఏవ = ఆప్రకారముగానే, లోకాః + అపి = దుర్యోధనుఁడు మొదలుగాఁ గల జనులును, (లేక) లోకాః = దుర్యోధనుఁడు మొదలుగాఁ గల జనులు, తవ = నీయొక్క, (లేక) తవాపి = నీయొక్కయును, వక్త్రాణి = ముఖములను, సమృద్ధవేగాః = అతివేగము గలవారైన, నాశాయ = (తమ) నాశముకొఱకు, విశన్తి = ప్రవేశించుచున్నారు.

ఓ కృష్ణా! మిడుతలు తమనాశముకొఱకు అధికవేగము కలవై మండుచున్న యగ్నియందు బ్రవేశించువిధముగ దుర్యోధనుఁడు మొదలుగాఁ గల జనులుగూడ నీ ముఖములయందు మిగుల వేగము కలవారై తమ నాశము కొఱకుఁ బ్రవేశించుచున్నా రని తాత్పర్యము.

వాఁడ వగు, భవన్తమ్=నిన్ను, విజ్ఞాతుమ్=వివరముగాఁ దెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరు చున్నాను. తవ = నీయొక్క, ప్రవృత్తిమ్ = వ్యాపారమును, (ఏల యిట్టి భయంకరాకారముఁ ధరించితివో అసంగతిని) న + హి + ప్రజానామి = తెలిసికొన లేక యున్నాను.

దేవతలలో ప్రధానుఁడ వైన యో కృష్ణుఁడా! భయంకర మైన యాకృతి గల నీ వెవ్వండవో నాకుఁ దెలుపుము. సర్వగురుఁడ వగు నీకు నమస్కారమును చేయుచున్నాను. భయంకర మైన యీ రూపమును విడిచి నా కోర్కెల నిచ్చి యనుగ్రహింపుము. సర్వకారణుఁడ వగు నిన్ను వివరముగాఁ దెలిసికొనఁ గోరు చున్నాను. నీ వేమినిమిత్తముగ నిట్టి భయంకర మైన యాకారమును ధరించితివో యా సంగతి నీకు స్నేహితుఁడనై యుండియును నేను తెలిసికొనఁజాల కున్నా నని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకా స్సమాహర్తు మిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥  32

టీక. శ్రీ భగవానువాచ=సంపత్కరుఁ డగు భగవంతుఁడు చెప్పెను. లోకక్షయకృత్=జననాశమును చేయునట్టిదియును, ప్రవృద్ధః = వృద్ధినిఁ బొందినదియును, (అయిన) కాలః=కాలమే స్వరూపముగాఁ గలవాఁడను, అస్మి=అగుచున్నాను, ఇహ = ఈ కాలమునందు, లోకాన్ = జనులను, సమాహర్తుమ్=సంహరించుటకు (లేక) భక్షించుటకొఱకు, ప్రవృత్తః = ప్రవర్తించినవాఁడను, అస్మి = అగు చున్నాను. ప్రత్యనీకేషు=శత్రుసైన్యములయందు, యోధాః = యుద్ధమును జేయువారై, యే = ఎవ్వరు, (ఏ దుర్యోధనాదులు) అవస్థితాః=ఉండిరో, (తే=వారు) సర్వే=అందఱును,

జయించి కీర్తిని పొందుము. సమస్తభోగములతోఁ గూడినదియును, నిష్కంటకమును అయిన రాజ్యమును అన్నదమ్ములతోఁ గూడ అనుభవింపుము. ఈ దుర్యోధనాదులు ఇదివఱకే నాచేతఁ జంపఁబడిరి. కాఁబట్టి సవ్యాపసవ్యములుగ బాణప్రయోగము చేయ శక్తి గల యో యర్జునుఁడా! నీవు కారణమాత్రము అగుము; అని తాత్పర్యము.

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్॥ ౩౪

టీక. మయా = నాచేత, హతాన్ = (ఇదివఱకే) చంపఁబడిన, ద్రోణంచ = ద్రోణాచార్యుని, భీష్మంచ=భీష్మాచార్యుని, జయద్రథంచ= సైంధవుని, కర్ణమ్ = కర్ణుని, తథా = అలాగుననే, అన్యాన్=ఇతరులు, (అయిన) యోధవీరానపి = యుద్ధవీరులనుగూడ, త్వమ్ = నీవు, జహి = జయింపుము. మా వ్యథిష్ఠాః = (ఆ శత్రువులవలన) భయమును పొందకుము, రణే = యుద్ధమునందు, సపత్నాన్ = (దుర్యోధనాది) శత్రువులను, జేతాసి=జయింపఁ గలవు.

ఓ అర్జునుఁడా! నాచేత నిదివఱకే చంపఁబడిన ద్రోణాచార్యుని, భీష్ముని, సైంధవుని, కర్ణుని, అలాగుననే మిగిలిన యుద్ధవీరులను నీవు జయింపుము. ఆ శత్రులవలన భయమును పొందకుము. యుద్ధమునందు దుర్యోధనాది శత్రువులను జయింపఁగల వని తాత్పర్యము.

సంజయ ఉవాచ.—

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ ।

రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః॥ ౩౬

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హే హృషీకేశ = ఇంద్రియప్రేరకుఁడ వైన యో కృష్ణుఁడా! తవ=నీయొక్క, ప్రకీర్త్యా= మాహాత్మ్యమును కొనియాడుటచేత, జగత్ = జగత్తు, ప్రహృష్యతి + ఇతియత్=అధికముగా సంతోషించుచున్న దనుట యేది కలదో, తత్=అదియును, అనురజ్యతే ఇతియత్ = (నీయొక్క మాహాత్మ్యమును కొనియాడుటచేత) అనురాగము పొందుచున్నదనుట యేది కలదో, తత్ = అదియును, రక్షాంసి = రాక్షసులు, భీతాని = (నీయొక్క మాహాత్మ్యమును గొనియాడుటచేత) భయమును పొందినవారై, దిశః=దిక్కులనుగుఱించి, ద్రవన్తీతియత్=పరుగిడుచున్నా రనుట యేది కలదో, తత్=అదియును, సర్వే = సమస్తమైన, సిద్ధసంఘాః = సిద్ధులయొక్కసముదాయములు, (నీయొక్కమాహాత్మ్యమును పొగడుటచేత నీకు) నమస్యన్తీతి యత్=నమస్కరించుచున్నా రనుట యేది కలదో, తత్=అదియును, స్థానే=తగినది.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.— సర్వేంద్రియప్రేరకుఁడవైన యో కృష్ణుఁడా! నీయొక్కమాహాత్మ్యమును గొనియాడుటచేత ప్రపంచము అధికముగా సంతోషించుచున్న దనుటయును, నీదుమాహాత్మ్యమును గొనియాడుట చేత అనురాగము పొందుచున్న దనుటయును, నీమాహాత్మ్యమును గొని యాడుటచేత రాక్షసులు భయమును పొందినవారై దిగంతములకుఁ బరుగిడుచున్నా రనుటయును, సకలసిద్ధులసముదాయములును నీదుమాహాత్మ్యమును వినుటచేత నమస్కరించుచున్నా రనుటయును తగియే యున్నవని తాత్పర్యము.

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ ౩౭

సర్వోత్తమ మైన, నిధానమ్=(మహాప్రళయమునందు జగత్తు అన్నియును అణఁగియుండు) స్థానము, అసి=అగుచున్నావు; త్వమ్=నీవు, వేత్తా = (తెలియఁదగిన సర్వమును) తెలిసికొనువాఁడవు, అసి=అగుచున్నావు; త్వమ్= నీవు, వేద్యంచ = తెలియఁదగినదియును, అసి=అగుచున్నావు; త్వమ్= నీవు, పరమ్ = సర్వోత్తమ మైన, ధామచ = (పొందఁదగిన) స్థానమును (విష్ణుపదము), అసి = అగుచున్నావు; త్వయా = నీచేత, విశ్వమ్ = సమస్త ప్రపంచమును, తతమ్ = వ్యాపింపఁబడెను.

అనంతము లయిన రూపములు గల ఓ కృష్ణుఁడా! సకలలోకములను సృజించువాఁడ వగుటచేత నీవే యాదిదేవుఁడవై యున్నావు. నీవే పురాణ పురుషుఁడవై యున్నావు. నీవే యీ ప్రపంచమునకు సర్వమునకును, (మహాప్రళయాదికమందు) నివసింపఁదగిన స్థానమై యున్నావు. నీవే సర్వమును తెలిసికొనువాఁడవై యున్నావు. నీవే తెలియఁదగినదై యున్నావు. నీవే సర్వోత్తమమును, పొందదగినదియును అయిన స్థానమై యున్నావు. నీ చేత నే యీ ప్రపంచమంతయును వ్యాపింపఁబడి యున్నదని తాత్పర్యము.

శ్లో॥ వాయుర్యమోఽగ్ని ర్వరుణశ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమ స్తేఽ స్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమోనమ స్తే॥ ౩౯

టీక. వాయుః = వాయువును, యమః = యముఁడును, అగ్నిః = అగ్నిదేవుఁడును, వరుణః = వరుణదేవుఁడును, శశాంకః = చంద్రుఁడును, ప్రజాపతిః = చతుర్ముఖబ్రహ్మయును, ప్రపితామహశ్చ = చతుర్ముఖ బ్రహ్మకుఁ దండ్రియును, త్వమ్ = నీవు, అసి = అగుచున్నావు; తే = నీ కొఱకు, సహస్రకృత్వః=వేయిపర్యాయములు, నమోనమః = నమస్కా-

లెస్సగా వ్యాపించు చున్నావు. కావున నీవు సర్వస్వరూపుఁడ వగు చున్నా వని తాత్పర్యము.

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ హేయాదవ హేసఖేతి ।
అజానతా మహిమానం త వేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి ౪౧

టీక. తవ=నీయొక్క, ఇదమ్=ఈ విశ్వరూపాత్మక మైన, మహిమానమ్ = మాహాత్మ్యమును, అజానతా = తెలియని, మయా= నాచేత, ప్రమాదాత్ = పొరపాటువలన, (పొరబాటువలన లేక, అవివేకమువలన) ప్రణయేనవా + అపి = చిరపరిచయముచేత నైనను, సఖా + ఇతి = సమాన వయస్కుఁడ వని, మత్వా=తలఁచి, హే కృష్ణ=ఓ నల్లవాఁడా! (లేక) ఓ కృష్ణుఁడా! హే యాదవ=ఓ యదునందనుఁడా! (లేక) ఓ గొల్లవాఁడా! హేసఖే=ఓ స్నేహితుఁడా! ఇతి = ఇట్లని, ప్రసభమ్ = బలాత్కారముగ, (ఆలోచింపక) యత్=ఏవాక్యము, ఉక్తమ్=చెప్పఁబడెనో, (తత్= అట్టి యపరాధమును, క్షమయే=క్షమింపవలయు నని కోరుచున్నాను).

నీయొక్క విశ్వరూపాత్మక మైన మాహాత్మ్యమును తెలిసికొన లేని నేను పొరబాటుచేతను, చిరకాలపరిచయముచేతను, సమానవయస్కుఁడ వని తలఁచి, ఓ నల్లవాఁడా! (కృష్ణుఁడా!) గొల్లవాఁడా! (యదునందనుఁడా!) స్నేహితుఁడా! అని బలాత్కారముగ ఆలోచింపక యవమానముగ (తిరస్కారముగ) పలికినపలుకులను సహింపు మని కోరు చున్నా నని తాత్పర్యము.

శ్లో॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।

అస్య=ఈ, లోకస్య = లోకమునకు, పితా=తండ్రివి, అసి = అగు చున్నావు; పూజ్యశ్చ = పూజ్యుఁడవును, గురుః=గురుఁడవును, అసి = అగుచున్నావు; గరీయాన్ = గురువులకుఁగూడ గురుఁడవు, అసి = అగు చున్నావు; లోకత్రయేపి = ముల్లోకములయందును, త్వత్సమః = నీతో సమానుఁడు, నాస్తి=లేఁడు; అన్యః=ఇతరుఁడు, అభ్యధికః = అధికుఁడు, కుతః = ఎట్లు, (స్యాత్ = అగును).

నిరుపమానమైన మహిమ గల ఓ కృష్ణుఁడా! నీవు స్థావర జంగమాత్మకమైన సకలప్రపంచమునకును జనకుఁడవు అగుచున్నావు, నీవు తండ్రివి మాత్రమగుటయే కాక పూజ్యుఁడవును గురుఁడవును అగు చున్నావు; ఇంతియ గాక గురువులకుఁగూడ గురుఁడవు అగుచున్నావు, ముల్లోకములయందును నీకు సమానుఁడు లేఁడు, సమానుఁడే లేకపోవు చుండఁగా అధికుఁడు ఎట్లు కలుగునని తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ ౪౪

టీక. తస్మాత్=అందువలన, ఈశమ్=ఈశ్వరుఁడవును, ఈడ్యమ్ = స్తోత్రము చేయఁదగినవాఁడవును, (అగు), త్వామ్=నిన్ను, అహమ్=నేను, కాయమ్ = శరీరమును, ప్రణిధాయ = లెస్సగా (భూమిమీఁద) పడవైచి, (సాష్టాంగముగా) ప్రణమ్య=నమస్కరించి, త్వామ్=నిన్ను, ప్రసాదయే = ప్రసన్నునిఁగాఁజేసికొను చున్నాను (క్షమింపుమని ప్రార్థించు చున్నాను); హేదేవ = స్వయంప్రకాశుఁడవైన యో కృష్ణా! పుత్రస్య = పుత్త్రుని యొక్క, (అపరాధమ్ = తప్పును) పితేవ = తండ్రివలెను, సఖ్యుః = చెలి కానియొక్క, (అపరాధమ్=తప్పును) సఖాఇవ = చెలికానివలెను, ప్రియా

కెన్నఁడును చూడఁబడిన నీ రూపమును జూచి సంతోషించినవాఁడ నైతిని, నాయొక్క మనస్సు భయముచేత వణఁకుచున్నది; కావున ప్రసన్న మగు మనుష్యరూపమునే చూపుము, ప్రసన్నుఁడ వగుమని తాత్పర్యము.

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే॥ ౪౬

టీక. తథా—ఏవ = మనుష్యునివలెనే, కిరీటినమ్=కిరీటము కలవాఁడవును, గదినమ్=గద యను ఆయుధము కలవాఁడవును, చక్రహస్తమ్ = చక్రాయుధము చేతియందుఁ గలవాఁడవును అయిన, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, అహమ్ = నేను, ఇచ్ఛామి = కోరుచున్నాను; హే సహస్రబాహో = వేయి (అనేక) భుజములు కలవాఁడా! హే విశ్వమూర్తే = ఓ సమస్తప్రపంచస్వరూపుఁడా! చతుర్భుజేన = నాలుగు భుజములు గల, తేన = ఆ, రూపేణ + ఏవ రూపముచేతనే, భవ=అగుము.

వేయి (అనేకము అయిన) భుజములు కలవాఁడవును, ప్రపంచస్వరూపుఁడవును అయిన యో కృష్ణుఁడా! మనుష్యునివలెనే కిరీటము కలవాఁడవును, గదాయుధము కలవాఁడవును, చక్రాయుధము కలవాఁడవును అయిన నిన్నుఁ జూచుటకు గోరుచున్నాను. కావున నాలుగు భుజములు గల మనుష్యరూపము కలవాఁడవు, అనఁగా వసుదేవపుత్త్రరూపుఁడవు అగుము; అని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।

త్వదన్యేన=నీకంటె నితరునిచేత, వేదయజ్ఞాధ్యయనైః = ఋగాది వేదముల యొక్కయును యజ్ఞవిధానములను తెలుపునట్టి కల్పసూత్రాములయొక్కయును చదువుటచేత, ద్రష్టుమ్ = చూచుటకు, శక్యః = తగినవాఁడను, న=కాను; దానైః=దానములచేత, ద్రష్టుమ్ = చూచుటకొఱకు, శక్యః= తగినవాఁడను, న = కాను; క్రియాభిః = శ్రౌతస్మార్తకర్మములచేత, ద్రష్టుమ్ = చూచుటకు, శక్యః=తగినవాఁడను, న = కాను; ఉగ్రైః= భయంకరము అయిన, తపోభిః = తపస్సులచేత, ద్రష్టుమ్ = చూచుటకు శక్యః=తగినవాఁడను, న = కాను.

కురువంశప్రభుజులలో నధికపరాక్రమశాలివైన హో అర్జునుఁడా! ఇటువంటి విశ్వరూపము గల నన్ను నీకంటె నితరు లెవ్వరును జూడఁజాలరు, మఱియును, ఋగాదివేదములను యజ్ఞవిధానములను తెలుపునట్టి కల్పసూత్రాములను అధ్యయనము చేయుటచేతఁగాని, తులాపురుషాది దానములచేతఁగాని, శ్రౌతస్మార్తాగ్నిహోత్రాదికర్మములచేతఁగాని, భయంకరము అయిన కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులచేతఁగాని, నన్నుఁ జూచుటకు శక్యము కాదని తాత్పర్యము.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥　　49

టీక, ఈదృక్=ఇటువంటిదియును (నీకంటె నితరులకుఁ! జూడ శక్యము కానిదియును, ఘోరమ్=భయంకరమైనదియును, (అగు) మమ= నాయొక్క, ఇదమ్=ఈ, (నీ వింతకుఁ జూచిన) రూపమ్=విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, తే = నీకు, వ్యథా = భయము, మా = వద్దు; విమూఢభావః+చ=చిత్తవ్యామోహమును (తెలివి లేకయుండుటయును),

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:—వసుదేవపుత్త్రుఁ డగు కృష్ణుఁడు అర్జునునితో "అ-11, శ్లో-47. మయా ప్రసన్నేన" అను శ్లోకము మొదలు గాఁగల శ్లోకములచేతఁ జెప్పఁదగిన మాటలను చెప్పి, వసుదేవుని గృహమునందు పుట్టిన రూపమును, అనఁగా చతుర్భుజరూపమును మరలఁ జూపెను. మఱియును, మహానుభావుఁ డగు కృష్ణుఁడు మరల సౌమ్య మైన (చూడఁదగిన) యాకారము కలవాఁడై భయమును పొంది యున్న యర్జునుని నూరార్చె నని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః॥ ౫౧

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హే జనార్దన = ఓ కృష్ణుఁడా! తవ=నీయొక్క, సౌమ్యమ్ = ప్రసన్న మైనదియును, మానుషమ్=మనుష్యసంబంధము కలదియును, (అయిన) ఇదమ్=ఈ, రూపమ్ = స్వరూపమును, దృష్ట్వా=చూచి, ఇదానీమ్ = ఇప్పుడు, సచేతాః=ప్రసన్నచిత్తుఁడను, ప్రకృతిమ్ = స్వభావమును, గతః + చ = పొందినవాఁడను, సంవృత్తః = అయినవాఁడను, అస్మి = అగుచున్నాను.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ కృష్ణుఁడా! ప్రసన్న మైనదియును, మానవసంబంధ మైనదియును అయిన నీదు మునుపటిరూపమును జూచి యిప్పుడు ప్రసన్నచిత్తుఁడను, స్వభావమును పొందినవాఁడను అగుచున్నాను; అని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥ ౫౨

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ ౫౪

టీక. హే పరంతప = శత్రువులను తపింపఁజేయునట్టి, హే అర్జున = ఓ యర్జునుఁడా! ఏవంవిధః = ఇట్లు విశ్వరూపియైన, అహమ్ = నేను, అనన్యయా = భగవదేకనిష్ఠమైన, భక్త్యాతు = భక్తిచేతనే, తత్త్వేన = యథార్థముగా, జ్ఞాతుమ్ = (శాస్త్రములనుబట్టి) తెలిసికొనుటకును, ద్రష్టుంచ = చూచుటకును, ప్రవేష్టుంచ = ప్రవేశించుటకును, (మోక్షమును పొందుటకొఱకును), శక్యః = సాధ్యమైనవాఁడను, (అస్మి = అగుచున్నాను).

శత్రువులను తపింపఁజేయునట్టి యో యర్జునుఁడా! ఇట్లు విశ్వరూపమును ధరించిన నేను మదేకనిష్ఠమైన భక్తిచేతనే యథార్థముగా శాస్త్రములనుబట్టి తెలిసికొనుటకొఱకును, చూచుటకొఱకును, ప్రవేశించుటకొఱకును (మోక్షమును పొందుటకొఱకును) సాధ్యమైనవాఁడ నగుచున్నాను.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥ ౫౫

టీక. హే పాండవ = ఓ యర్జునుఁడా! మత్కర్మకృత్ = నా నిమిత్తముగఁ గర్మములను జేయువాఁడును, మత్పరమః = నేనే సర్వోత్తమగతిగాఁ గలవాఁడును, మద్భక్తః = నాయందే భక్తిగలవాఁడును, సంగవర్జితః = (ధనపుత్త్రమిత్త్రాదులయందలి) స్నేహాసక్తులచే విడువఁబడినవాఁడును, సర్వభూతేషు = సకలభూతములయందును, నిర్వైరః = ద్వేషము లేనివాఁడును, యః = ఎవ్వఁడో, మామ్ = నన్ను, ఏతి = పొందుచున్నాఁడు.

ఓ అర్జునుఁడా! శ్రౌతస్మార్తాది సకలకర్మములును నా నిమిత్తముగఁ జేయువాఁడును, నేనే సర్వోత్తమమైనగతిగాఁ గలవాఁడును, నాయందే భక్తి గలవాఁడును, ధనపుత్త్రమిత్త్రాదులయందు ప్రీతి స్నేహములను విడి

రూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగ శాస్త్రమునందు విశ్వరూపసందర్శనయోగమును (భగవన్మాహాత్మ్యము అను) తెలుపునట్టి పదునొకండవ భాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీరామచంద్రార్పణమస్తు.



అర్జునుఁడు చెప్పుచున్నాడు:—ఓ కృష్ణుఁడా! పదునొకండవ యధ్యాయమునందలి కడపటిశ్లోకమునందు, జెప్పినవిధముగ భగవంతుఁడవగు నీ భక్త్యాదులయం దెల్లప్పుడును నిలుపఁబడినచిత్తము కలవారై నీకంటె నితరమును రక్షకుఁడు లేనివారగుచు విశ్వరూపుఁడ వగు నిన్ను సేవించుచున్న వారి లోపలను సర్వాభిలాషలనువిడిచి, సకలకర్మములను పరిత్యజించి యింద్రియాగోచరుఁడవును, నిర్విశేషపరబ్రహ్మ రూపుఁడవును అగు నిన్ను సేవించు వారలలోపలను యెవ్వరు యోగమును దెలిసినవారిలో మిగుల శ్రేష్ఠులో జెప్పుమని యర్జునుఁడు అడిగె నని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥

టీక శ్రీభగవానువాచ = సంపత్కరుఁడైన కృష్ణుఁడు చెప్పెను. మయి=(విశ్వరూపుఁడనైన) నాయందు, మనః=మనస్సును, ఆవేశ్య=నిలిపి (నిశ్చలము చేసి), నిత్యయుక్తాః = (అ-11, శ్లో-55 లో, చెప్పఁబడినవిధముగా) సమస్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయువారును, పరయా= సర్వోత్తమమైన, శ్రద్ధయా=శ్రద్ధతో, ఉపేతాః=కూడినవారును, (అయి) యే=ఎవ్వరు, మామ్ = (సర్వేశ్వరుఁడ నగు) నన్ను, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తే=వారు, యుక్తతమాః=శ్రేష్ఠులు, (ఇతి = ఇట్లని) మే = నాకు, మతాః = సమ్మతులు.

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు:—విశ్వరూపుఁడను (లేక) సర్వేశ్వరుఁడను అయిన నాయందు మనస్సును నిల్పి "అ-11, శ్లో-55 లో, చెప్పఁబడిన విధముగ సమస్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయువారును, సర్వోత్తమమైన శ్రద్ధతోఁ గూడినవారును నై యేభక్తులు నన్ను సేవించుచున్నారో అట్టివారు మిగుల శ్రేష్ఠు లని నా యభిప్రాయ మని తాత్ప.

ఇంద్రియములను విషయములమీఁదికిఁ బోనీయక తెస్సగా నిగ్రహించి అన్నికాలములయందును, అనగా ఇష్టానిష్టప్రాప్తియందు సమానమైన బుద్ధికలవారును, సకలభూతములయొక్క యోగక్షేమమునందు ఆసక్తి గలవారును అగు మానవులు నన్నే పొందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ ౫

టీక. హి = ఏ కారణమువలన, అవ్యక్తా = అక్షరస్వరూప మైన, గతిః = మార్గము (లేక) నిష్ఠ, దేహవద్భిః = దేహాభిమానము గలవారి చేత, దుఃఖమ్ = అతికష్టముగా, అవాప్యతే = పొందఁబడు చున్నదో, (అతః = ఈ కారణమువలన) తేషామ్ = ఆ, అవ్యక్తాసక్తచేతసామ్ = అక్షరపరబ్రహ్మమునం దాసక్త మైనచిత్తము కలవారికి, క్లేశః = కష్టము, అధికతరః = మిగుల నధిక మైనది.

అక్షరస్వరూప మైన (లేక) నిర్గుణవిషయ మైన మార్గము (లేక) నిష్ఠ, దేహాభిమానము గలవారిచే నతికష్టముగాఁ బొందఁబడు చున్నది. కనుక, అక్షరపరబ్రహ్మమునం దాసక్త మైనచిత్తము కలవారికిఁ గష్టము మిగుల నధిక మైన దని తాత్పర్యము.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ ౬

టీక. యేతు = ఏసగుణోపాసకులు, సర్వాణి = సమస్తము లయిన కర్మాణి = కర్మములను, మయి = నాయందు, సన్న్యస్య = సమర్పించి, మత్పరాః = నేనే పరమగతిగాఁ గలవారై, అనన్యేన = (విశ్వరూపుఁడను) ఆత్మను అయిన నాకంటె నితర మైన యాలంబనము లేని, యోగేనైవ = యోగముచేతనే (సమాధిచేతనే), మామ్ = నన్ను, ధ్యాయన్తః = ధ్యానము చేయుచున్నవారై, ఉపాసతే = సేవించుచున్నారో,

సాయమును చేయుచున్న బుద్ధిని ప్రవేశపెట్టుము. ఇట్లు చేసితివేని నిశ్చయముగా దేహపాతానంతరమందు (అనఁగా శరీరమును వదలిన పిమ్మట) నా స్వరూపముతో నాయందే నివసింపఁగలవు. ఈ విషయమునం దేమియును సందేహములే దని తాత్పర్యము.

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ ౯

టీక. హే ధనంజయ = ఓ అర్జునుఁడా! అథ = పిమ్మట, (నేను చెప్పిన ప్రకార మొకవేళ) చిత్తమ్ = చిత్తమును, మయి = నాయందు, స్థిరమ్ = స్థిర మైన దానినిగా, సమాధాతుమ్ = నిలుపుటకొఱకు, నశక్నోషి (చేత్) = సమర్థుఁడవు కాకపోతివేని, తతః = పిమ్మట, అభ్యాసయోగేన = (చలించెడు మనస్సును ఇతరవిషయములనుండి మరల్చి యొక్కటి యగు ధ్యానలక్ష్యమందు మాటిమాటికిని నిలుపుట యనునట్టి) అభ్యాసయోగముచేత, మామ్ = (విశ్వరూపుఁడ నగు) నన్ను, ఆప్తుమ్ = పొందుటకొఱకు, (ఇచ్ఛ = కోరుము) ప్రయత్నమును చేయుము.

ఓ అర్జునుఁడా! నేను చెప్పినవిధముగ నొకవేళ చిత్తమును విశ్వరూపుఁడ నగు నాయందు స్థిర మైనదానినిగా నిలుపుటకొఱకు సమర్థుఁడవు కాకపోతివేని, పిమ్మట అభ్యాసయోగముచేత చలించెడు మనస్సును ఇతర విషయములనుండి మరల్చి యొక్కటి యగు ధ్యానలక్ష్యమునందు మాటిమాటికిని నిలుపుట యనునట్టి యలవాటుచేత నన్ను పొందుటకుఁ బ్రయత్నమును జేయు మని తాత్పర్యము.

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి॥ ౧౦

టీక. అభ్యాసేపి = అభ్యాసయోగమందుఁగూడ, అసమర్థః = శక్తి లేనివాఁడవు, అసి (యది) = అయితివేని, మత్కర్మపరమః = నా నిమి-

మింపఁబడిన యింద్రియములు గలవాఁడవును, వివేకము గలవాఁడవును ఆగుచు సమస్తము అగు కర్మఫలములను విడిచిపెట్టుటను చేయుము అని తా.

శ్లో॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్॥౧౨

టీక. అభ్యాసాత్ = (అవివేకపూర్వక మైన) అభ్యాసముకంటె, జ్ఞానమ్ = (యుక్తిసహితోపదేశముచలనఁ గలిగిన) జ్ఞానము. శ్రేయోహి = ప్రశస్యతర మైనది కదా! జ్ఞానాత్ = జ్ఞానముకంటె, ధ్యానమ్ = (జ్ఞానపూర్వక మైన) ధ్యానము, విశిష్యతే = శ్రేష్ఠ మైన దగుచున్నది; ధ్యానాత్ = (జ్ఞానసహిత మైన) ధ్యానముకంటె, కర్మఫలత్యాగః=కర్మఫలములను విడుచుట, విశిష్యతే=అధిక మైన దగుచున్నది; త్యాగాత్ = (అట్టి కర్మఫల) త్యాగమువలన, అనన్తరమ్ = వ్యవధి లేకుండ, శాన్తిః = బంధనివృత్తి, (మోక్షము) భవతి = ఆగుచున్నది.

అవివేకపూర్వక మైన యభ్యాసముకంటె యుక్తిసహితోపదేశము వలనఁ గలిగిన జ్ఞానమును, అట్టి తత్త్వజ్ఞానముకంటెఁ దత్త్వజ్ఞానసహిత మయిన ధ్యానమును, అట్టి జ్ఞానసహితధ్యానముకంటెఁ గర్మఫలమును విడుచుట శ్రేష్ఠమైన దగుచున్నది, కర్మఫలత్యాగమువలన వ్యవధి లేకయే శీఘ్రముగా బంధనివృత్తి (మోక్షము) కలుగుచున్న దని తాత్పర్యము.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥౧౩

టీక. సర్వభూతానామ్=సకలభూతములకును, అద్వేష్టా = ద్వేషిగానివాఁడును, మైత్రః=మిత్రధర్మము గలవాఁడును, కరుణః + ఏవ + చ=దయ కలవాఁడును, నిర్మమః = మమత్వము లేనివాఁడును, నిరహంకారః = అహంకారము లేనివాఁడును, సమదుఃఖసుఖః = సుఖదుఃఖము లయందు సమబుద్ధి కలవాఁడును, క్షమీ=ఓర్పు కలవాఁడును, (మేనాకు, ప్రియః = ప్రియుఁడు).

ఆత్మతత్త్వవిషయమై దృఢమైన నిశ్చయము కలవాఁడును సర్వకాలములయందును వాసుదేవుఁడనగు నాయందు అర్పింపఁబడిన సంకల్పాత్మకమగు మనస్సును అధ్యవసాయలక్షణమగు బుద్ధియును కలవాఁడును, ఎల్లప్పుడును వాసుదేవుఁడనగు నన్ను సేవించుటయందాసక్తి కలవాఁడును, (లేక) స్వానుభవజ్ఞానము కలవాఁడును అగుచున్నాఁడో ఆ పురుషుఁడు నాకు ప్రియుఁడగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః॥ ౧౫

టీక. యస్మాత్ = ఏ సన్న్యాసివలన, లోకః = లోకము, నోద్విజతే = ఉద్వేగమును పొందదో, (భయాదినిమిత్తమగు చిత్తక్షోభమును పొందదో) యః = ఏ సన్న్యాసి, లోకాత్ = లోకమువలన, నోద్విజతే చ = ఉద్వేగమును పొందఁడో, యః = ఏ సన్న్యాసి, హర్షామర్షభయోద్వేగైః = ప్రీతిచేతను అసహిష్ణుత్వముచేతను భయముచేతను ఉద్వేగముచేతను, ముక్తః = విడువఁబడెనో, సచ = ఆ సన్న్యాసి, మే = నాకు, ప్రియః = ఇష్టుఁడు, (భవతి = అగుచున్నాఁడు).

ఏ సన్న్యాసివలన లోకము ఉద్వేగమును (భయాదినిమిత్త చిత్తక్షోభమును) పొందదో, ఏ సన్న్యాసి లోకమువలన నుద్వేగమును పొందఁడో, (సంతాపక్షోభమును పొందఁడో) ఏ సన్న్యాసి ప్రీతి, అసహిష్ణుత, భయము, ఉద్వేగము అనువానిచేత విడువఁబడునో, అట్టి సన్న్యాసి నాకు ప్రియుఁడని తాత్పర్యము.

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥ ౧౬

టీక. అనపేక్షః = అపేక్ష లేనివాఁడును, శుచిః = పరిశుద్ధుఁడును, దక్షః = సమర్థుఁడును, ఉదాసీనః = పక్షపాతము లేనివాఁడును, గతవ్యథః =

టీక. శత్రౌచ=శత్రునియందును, మిత్రేచ = స్నేహితునియందును, సమః = సమానుఁడును, తథా=అటులనే, మానాపమానయోః = పూజాపరిభవములయందును, సమః = సమానుఁడును, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతము ఉష్ణము సుఖము దుఃఖము అనువానియందు, సమః = సమానుఁడును, (సర్వత్ర=అంతటను చేతన మగు స్త్ర్యాదికమందును, అచేతన మగు చందనాదికమునందును) సంగవివర్జితః = అసక్తుఁడు గానివాఁడును (మే=నాకు ప్రియః = ఇష్టుఁడు.)

శత్రునియందును, మిత్రునియందును; అటులనే మానావమానములయందును సమానుఁడును; శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము అనువానియందు సముఁడును; అంతటను (అనఁగా చేతనము అగు స్త్రీలు మొదలగువారియందును, అచేతనము అగు చందనాదికములయందును అసక్తిలేనివాఁడును నాకు ప్రియుఁడని తాత్పర్యము.

శ్లో॥ తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః॥ ౧౯

టీక. తుల్యనిందాస్తుతిః=నిందయందును స్తుతియందును సమానుఁడును, మౌనీ=మౌనము కలవాఁడును, యేనకేనచిత్=శరీరము నిలుచుటకుఁ దగిన యేయాహారపదార్థముచేతనైనను, సంతుష్టః=సంతోషించువాఁడును అనికేతః = నియతమైన నివాసము లేనివాఁడును, స్థిరమతిః = (పరమార్థవస్తువిషయమై) నిశ్చయబుద్ధి కలవాఁడును, (అయిన) నరః = నరుఁడు, మే = నాకు, ప్రియః = ప్రియుఁడు.

నిందయందును (దోషోద్ఘాటనమునందును) స్తోత్రమునందును (గుణోద్ఘాటనమునందును) సమానుఁడును, మౌనము కలవాఁడును, శరీరము నిలుచుటకుఁ దగిన యేయాహారపదార్థముచేతనైనను సంతోషించువాఁడును, పరమార్థవస్తువిషయమై నిశ్చయమైన బుద్ధి కలవాఁడును, భగవంతుఁడ

టీక. వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యామ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపద కల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునుల యొక్క సంవాదరూపము, (అయిన) బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను తెలుపునట్టి గ్రంథమునందు) యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, భక్తియోగోనామ = భక్తియోగ మనియెడు పేరుగల, ద్వాదశః = పదిరెండవదైన, (అగు) అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ = జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును, ఛందోబద్ధశాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మపర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగశాస్త్రమునందు భక్తియోగమును తెలుపునట్టి పదిరెండవభాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీరామచంద్రార్పణమస్తు.

అర్జునుఁడు చెప్పుచున్నాడు.—ఓ కృష్ణమూర్తీ! ప్రకృతియొక్క స్వరూపము యెట్టిది? పురుషుఁ డెవ్వఁడు? క్షేత్ర మనఁగా నేమి? క్షేత్రజ్ఞుఁడనఁబడువాఁ డెవ్వఁడు? జ్ఞాన మెట్టిది? జ్ఞేయ మన నెద్ది? ఏని యొక్క స్వరూపము లన్నియుఁ జక్కఁగా దెలుపు మని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ౨

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁ డైన భగవంతుఁడు చెప్పెను. హే కౌంతేయ=కుంతీపుత్రుఁడ వైన యో యర్జునుఁడా! ఇదమ్=వాక్కు మొదలగు కర్మేంద్రియములతోను, చర్మము మొదలగు జ్ఞానేంద్రియములతోను, అంతఃకరణముతోను కూడినదియును భోగములకుఁ గారణ మైనదియును అగు ఈ, శరీరమ్=శరీరము, క్షేత్రమ్=(భూమియందు పైరు మొదలగువానివలె శరీరమునందు కర్మరూప మగు ఫలము సిద్ధించుట వలన) క్షేత్రము, ఇతి=అని, అభిధీయతే=చెప్పఁబడు చున్నది; యః=ఎవఁడు, ఏతత్=ఈ క్షేత్రమును, వేత్తి=పాదాదిశిరఃపర్యంతమును జ్ఞానముచేత (లేక) స్వభావసిద్ధ మైన (లేక) ఉపదేశమువలనఁ గలిగిన జ్ఞానముచేత) తెలుసుకొను చున్నాఁడో, తమ్=వానిని, క్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞుఁడు, ఇతి=అని, తద్విదః=క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క యాథార్థ్యమును దెలుసుకొన్నవారు, ప్రాహుః=చెప్పు చున్నారు.

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! వాక్కు మొదలగు కర్మేంద్రియములతోను చర్మము మొదలగు జ్ఞానేంద్రియములతోను అంతఃకరణముతోడను కూడినదియును, భోగములకుఁ గారణ మైనదియును అయిన యీ శరీరము (భూమియందు పైరు) మొదలుగాఁగల ఫలములవలె శరీరమునందు కర్మరూపఫలము సిద్ధించుట వలన) క్షేత్ర మని చెప్పఁబడు చున్నది. ఎవ్వఁడు స్వభావజన్య మగు

శ్లో॥-1 చేఁ జెప్పఁబడిన, ఆ క్షేత్రజ్ఞుఁడును, యః=ఎట్టి స్వరూపము కలవాఁడో, యత్ప్రభావశ్చ=ఎటువంటి ప్రభావములు, (ఉపాధులవలనఁ గలిగిన సామర్థ్యములు) కలవాఁడో, తత్ = (క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క) సర్వవిశేషణవిశిష్టమగు నిజస్వరూపమును, సమాసేన = సంగ్రహముగా, మే = నాయొక్క, (వచనాత్ = మాటవలన) శృణు = వినుము.

ఓ అర్జునుఁడా! పదుమూఁడవ అధ్యాయమునందలి మొదటిశ్లోకముచేఁ జెప్పఁబడిన శరీరము యెట్టిరూపము గలదో, ఎటువంటి ధర్మములు గలదో, ఎటువంటి వికారములు కలదో, ఏకారణమువలన నేకార్యము పుట్టుచున్నదో, దానియొక్కయు (శరీరముయొక్కయు), పైనఁ జెప్పిన శ్లోకమునందే జెప్పఁబడిన క్షేత్రజ్ఞుఁడు యెట్టిస్వరూపము కలవాఁడో, ఎటువంటి ప్రభావములు, అనఁగా ఉపాధులవలనఁ గలిగిన సామర్థ్యములు కలవాఁడో వానియొక్కయు, సర్వవిశేషణవిశిష్టమగు నిజస్వరూపమును సంగ్రహముగా నామాటవలన విని గ్రహింపుము; అనఁగా నేను చెప్పిన దానిని విని గ్రహింపుమని తాత్పర్యము.

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ ౫

టీక. (తత్=ఆక్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క స్వరూపము) ఋషిభిః=(వసిష్ఠుఁడు మొదలుగాఁ గల) ఋషులచేత, బహుధా=అనేకవిధములుగా, గీతమ్ = చెప్పఁబడినది; ఛన్దోభిః = ఋక్కు మొదలగు వేదములచేత, వివిధైః=నానాప్రకారములుగా, పృథక్=వేఱుగా (విశదముగా), గీతమ్= చెప్పఁబడినది; (కించ = ఇంతియగాక) హేతుమద్భిః = యుక్తియుక్తములును, వినిశ్చితైః = (సంశయరహితముగా) నిశ్చయింపఁబడినవియును, (అగు) బ్రహ్మసూత్రపదైశ్చైవ = బ్రహ్మను (పరమాత్మను) తెలియఁజేయునట్టి బ్రహ్మసూత్రపదములచేతను (ఉపనిషద్వాక్యములచేతను), గీతమ్ = చెప్పఁబడినది.

యును, ధృతిః = ధైర్యమును, సవికారమ్ = ఇంద్రియవికారములతోఁ బుట్టుక మొదలు మరణమువఱకుఁ (గల మార్పులతోఁ) (గూడినదియును), (అగు) ఏతత్ = (మహాభూతాది ధృతిపర్యంతము గల) ఈ క్షేత్రమ్ = దేహము (దేహలక్షణము), (తుభ్యమ్ = నీకొఱకు) సమాసేన = సంక్షేపముగా, ఉదాహృతమ్ = చెప్పఁబడినది.

(ఓ అర్జునుఁడా!) (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను) పంచమహాభూతములును; మహాభూతములకుఁ గారణమైనదియును, నేను అను అభిమానము లక్షణముగాఁ గలదియును అయిన అహంకారమును; అహంకారమునకుఁ గారణమును, ప్రకృతిస్వరూపమును అయిన మహత్తత్త్వమును; మహత్తత్త్వము అను పేరు గల బుద్ధికిఁ గారణమైనదియును, సత్త్వరజస్తమోగుణాత్మకమైనదియును, సమస్తమునకుఁ గారణమును అయిన మాయయును; త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియములు ఐదును, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అనియెడు కర్మేంద్రియములు ఐదును, సంకల్పవికల్పాత్మకమైన మనస్సును, జ్ఞానేంద్రియములకుఁ గోచరము లగు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునవి యైదును, (పూర్వ మొక వస్తువు ననుభవించుటవలనఁ గలిగిన సుఖమునకు గారణమైన యావస్తువును గోరుటయును) ఇచ్ఛయును, ద్వేషమును, సుఖదుఃఖములును, పంచమహాభూతములయొక్క పరిణామమైన శరీరేంద్రియ సముదాయమును, జ్ఞానస్వరూప మగు మనోవృత్తియును, ధైర్యమును, ఇంద్రియ వికారములతో (అనఁగా, పుట్టుక మొదలు మరణమువఱకుఁ గల మార్పులతో) గూడినదియును, మహాభూతాది ధృతిపర్యంతము గల సముదాయము నగు క్షేత్రమనఁగా క్షేత్రలక్షణము నీకు సంక్షేపముగాఁ జెప్పఁబడె నని తాత్పర్యము.

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥ ౮

దేహేంద్రియాదులను మోక్షసాధనము లగు కార్యములయందే ప్రవేశ, పెట్టుటయును జ్ఞానమని చెప్పఁబడినదని అని తాత్పర్యము.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 8

టీక. (కించ = మఱియును) ఇంద్రియార్థేషు = శబ్దస్పర్శరూపరస గంధములయందు, వైరాగ్యమ్ = నిరాశయును, అనహంకార ఏవచ = దేహేంద్రియాదులే నేను అనునట్టి గర్వము (అహంభావము) లేకుండుట యును, జన్మ.........దోషానుదర్శనమ్—జన్మ = గర్భమునందు వసిం చుట, యోనిద్వారమునుండి బయలు వెడలుట అనెడు) జన్మముయొక్కయు, మృత్యు=(సమస్తమర్మచ్ఛేదనరూప మగు) మృత్యువుయొక్కయు, జరా= (ప్రజ్ఞాశక్తితేజోనిరోధపరిభవాదిరూప మగు) ముసిమి యొక్కయు (ముదిమితనము యొక్కయు), వ్యాధి=(జ్వరము అతిసారము మొదలగు గాఁగల) రోగముల యొక్కయు, దుఃఖ = (ఇష్టవస్తువియోగమువలనను అనిష్ట వస్తుసంప్రాప్తివలనను గలిగిన ఆధ్యాత్మికాధిభూతాధిదైవనిమిత్తము లగు) దుఃఖములయొక్కయు, దోష = దోషములయొక్కయు, అను దర్శనమ్ = మాటిమాటికి ఆలోచించుచుటయును, లేక జన్మాదులయందు దుఃఖరూప మగు దోషమును తలంచుటయును, (జ్ఞానమ్ = జ్ఞానము, ఇతి = అని, ప్రోక్తమ్ = చెప్పఁబడినది).

(మఱియును) శబ్దస్పర్శరూపరస గంధములయందు నిరాశయును ; దేహేంద్రియాదులే నేననుకొనునట్టి గర్వము (అహంభావము) లేకుండుట యును ; గర్భమునందు వసించుట, యోనిద్వారమునుండి బయలువెడలుట అనెడు జన్మముయొక్కయు; సమస్తమర్మచ్ఛేదనరూపము (మరణకాల మందలి, ముసిమికింకరదండనరూప మగు) మరణము యొక్కయు ; తెలివి, బలము, కాంతియు తగ్గుట, ఇతరులు అవమానము చేయుట పోవుటయు నను

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది॥ ౧౧

టీక. (కించ = మఱియును) మయి = భగవంతుఁడ నగు నాయందు, అనన్యయోగేన = భగవంతుఁ డగు వాసుదేవునికంటె మఱి యొకఁడు లేఁడు కనుక భగవంతుఁడు అగు వాసుదేవుఁడే నాకు గతి (దిక్కు) యను నిశ్చయముచేత, అవ్యభిచారిణీ = వ్యభిచరించని (ఎటువంటి విఘ్నము చేతను; తప్పిపోని, భక్తిశ్చ = (సర్వోత్కృష్టుఁ డను జ్ఞానపూర్వక మగు) ప్రీతియును, వివిక్తదేశసేవిత్వమ్ = స్వభావముగా గాని (లేక) సంస్కారము వలనఁ గాని) పరిశుద్ధ మగు దేశములను సేవించుట కపేక్షించుటయు, (పుణ్యక్షేత్రముల చూడవలయును, పుణ్యతీర్థములందు స్నానము చేయవలయును, పుణ్యదేశములయం దుండవలయు ననుతలంపును; జనసంసది = (మూఢులును ఆత్మజ్ఞానము లేనివారును, గురూపదేశము లేనివారును, కలహమునకు కాలుద్రవ్వువారును అగు) జనులయొక్క సముదాయము నందు, అరతిః = ప్రేమలేక యుండుటయును, (జ్ఞానమ్ = జ్ఞానము, ఇతి = అని, ప్రోక్తమ్ = చెప్పఁబడినది.

మఱియును, భగవంతుఁడ నగు నాయందు! భగవంతునికంటె యొకఁడు రక్షకుఁడు లేఁడను జ్ఞానము కలిగి యెన్ని విఘ్నములు గలిగినను ఈ జ్ఞానమును (భగవంతుఁ డగు వాసుదేవునికంటె నాకు దిక్కు మఱెవ్వఁడును లేఁడను జ్ఞానమును); విడువక ప్రేమ యుంచుటయును; స్వభావముగాఁ గాని (లేక) సంస్కారమువలనఁ గాని పరిశుద్ధము అగు పుణ్యక్షేత్రములను పుణ్య తీర్థములను, పుణ్యదేశములను సేవించుటయును; పండితులును, సద్గురూపదేశము నొందినవారును, బ్రహ్మజ్ఞానులును అయిన జనులయొక్క సముదాయము నందు ప్రేమ యుండుటయును జ్ఞాన మని చెప్పఁబడెనని తా.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥ ౧౨

తత్ = (తెలియఁదగినదియును, తెలుపఁబోవునదియు నగు) అది, సత్ = సత్తు, (ఇతి = అని) నోచ్యతే = చెప్పఁబడదు; న అసత్ = అసత్తు, (ఇతి = అని) నోచ్యతే = చెప్పఁబడదు.

ఏది తెలియఁదగినదో, దేనిని తెలిసికొని మోక్షమును పొందునో అట్టిదానిని స్పష్టముగాఁ జెప్పెదను వినుము; దేనిని చెప్పఁబోవుచున్నానో అది ఆది లేనిదియును నిరతిశయమును అగు బ్రహ్మము సదసత్తులకంటె భిన్నమైనదని చెప్పఁబడుచున్నది; అని తాత్పర్యము.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ ౧౩

టీక. తత్ = (తెలియఁదగిన) ఆ బ్రహ్మము, సర్వతః పాణిపాదమ్ = సమస్త దేహములయందును చేతులు కాళ్లు గలదియును, సర్వతోఽక్షిశిరోముఖమ్ = సమస్తదేహములయందును కన్నులు శిరస్సులు ముఖములు కలదియును, సర్వతశ్శ్రుతిమత్ = సమస్తదేహములయందును చెవులుగలదియునై, లోకే = సకలప్రాణిసముదాయమునందు, సర్వమ్ = అచేతన వర్గమునంతను, ఆవృత్య = వ్యాపించి, తిష్ఠతి = (నిర్వికారమగు స్థితిని పొంది) ఉన్నది.

తెలియఁదగిన యా బ్రహ్మము సమస్తదేహములయందును చేతులు కాళ్లు కన్నులు శిరస్సులు ముఖములు చెవులు గలదియై సకల ప్రాణిసముదాయమునందు అచేతనవర్గమునంతను వ్యాపించి నిర్వికారస్థితిని పొందియున్నదని తాత్పర్యము.

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ ౧౪

టీక. తత్ = ఆ తెలియఁదగిన బ్రహ్మము, సర్వేన్ద్రియగుణాభాసమ్ = సర్వము నగు నింద్రియములయొక్క గుణములయందు ప్రకాశించు

తెలియనిదియును), అన్తికేచ = (ఆత్మజ్ఞానసాధనములు గలవారికి) సమీపమునం దుండునదియును.

ఆ బ్రహ్మము కంకణము మొదలగు నగలయందు బంగారమువలెను, అలలయొక్క లోపలను బయటను నీళ్ళవలెను, చరాచరము లగు భూతముల యొక్క లోపలను బయటను వుండునదియును, ఆ బ్రహ్మము సూక్ష్మ మగుటవలన ఇటువంటిది అని తెలియ శక్యము కానిదియును, ఆత్మజ్ఞాన సాధనములు లేనివారికి దూరమం దుండునదియును, ఆత్మజ్ఞానసాధనములు గలవారికి సమీపమునం దుండునదియును; అని తాత్పర్యము.

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥ ౧౭

టీక. (కించ = మఱియును) తత్ = ఆ బ్రహ్మము, భూతేషు = సకలప్రాణులయందును, అవిభక్తంచ = వేఱు కానిదియును, (తథాపి = అట్లు వేఱుకాని దైనను) విభక్త మివ = (ఉపాధిభేదముచేత) విభజింపఁ బడినదానివలె, (స్థితంచ=ఉండినదియును) (స్థితికాలే=స్థితికాలమునందు) భూతభర్తృచ=సకలభూతములను ధరించునదియును పోషించునదియును, గ్రసిష్ణుచ = (ప్రళయకాలమునందు) మ్రింగుస్వభావము కలదియును, ప్రభవిష్ణుచ = (జగదుత్పత్తికాలమునందు) పుట్టించుస్వభావము గలది యును, (అని) జ్ఞేయమ్ = తెలియఁదగినది.

మఱియును, ఆ బ్రహ్మము సకలప్రాణులయందును తానే యై యున్నను ఉపాధిభేదముచేత అజ్ఞానులకు వేఱువేఱుగా విభజింపఁబడిన దానివలె నుండునదియును, సృష్టిస్థితిలయములకుఁ గారణ మైనదియును; అని తాత్పర్యము.

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥౧౮

జ్ఞానార్థదర్శనము వఱకుఁ జెప్పఁబడిన లక్షణరూప మగు, జ్ఞానస్వరూప
మును, జ్ఞేయంచ=అ-13, శ్లో-13, 18 ల యందు "అనాదిమత్" అను
నది మొదలుకొని "విష్ఠితమ్" అనువఱకుఁ జెప్పఁబడిన లక్షణరూప మగు
తెలియఁ దగిన బ్రహ్మ స్వరూపమును, (మయా=నాచేత) సమాసతః=సం
క్షేపముగా, ఉక్తమ్=చెప్పఁబడినది; మద్భక్తః = (పండ్రెండవ యధ్యా
యమునందుఁ జెప్పఁబడిన లక్షణములు గల) నాభక్తుఁడు, ఏతత్=సమస్త
వేదముల యొక్కయు, ఉపనిషత్తులయొక్కయు, గీతయొక్కయు అర్థ
మగు) క్షేత్ర జ్ఞానజ్ఞేయములను, విజ్ఞాయ=చక్కగా తెలిసికొని, మద్భా
వాయ = సాక్షాన్మదీయ [బ్రహ్మత్వమును (లేక) మోక్షమును] పొందుట
కొఱకు, ఉపపద్యతే = యోగ్యుఁ డగు చున్నాఁడు.

(ఓ అర్జునుఁడా!) అ-13, శ్లో-6 మొదలు 18-శ్లోకము వఱకు
క్షేత్రముయొక్కయు జ్ఞానముయొక్కయు జ్ఞేయము (తెలియఁదగిన క్షేత్ర
జ్ఞుని) యొక్కయు, లక్షణమును నేను నీకు సంక్షేపముగాఁ జెప్పితిని;
దీనినే పూర్వము ఋషీశ్వరులు విస్తరించి చెప్పియుండిరి. పండ్రెండవ
యధ్యాయమునందుఁ జెప్పఁబడిన భక్తిలక్షణములు గల నాభక్తుఁడు
సమస్త వేదముల యొక్కయు నుపనిషత్తులయొక్కయు గీతలయొక్కయు
ముఖ్యార్థము లగు క్షేత్రజ్ఞానజ్ఞేయములను చక్కగాఁ దెలిసికొని నాభావ
మును మోక్షమును పొందుటకుఁ దగు చున్నాఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ ౨౦

టీక. (హే అర్జున = ఓ అర్జునుఁడా!) ప్రకృతిం = క్షేత్రమును
(మాయను), పురుషంచ = క్షేత్రజ్ఞుని (జీవుని), ఉభావపి=ప్రకృతి పురు
షుల నిద్దఱిని, అనాదీఏవ=కారణరహితులనుగానే, విద్ధి=తెలిసికొనుము;
వికారాంశ్చ = (పంచమహాభూతములు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు,
బుద్ధి అను) పదునాఱువికారములను, గుణాంశ్చ=(సత్త్వరజస్తమోరూపము

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు॥ ౨౧

టీక. హి=ఏకారణమువలన, పురుషః=జీవరూపుఁ డగు పరమపురుషుఁడు, ప్రకృతిస్థః=(కార్యకారణరూప మైనదియును, అవిద్యారూప మయినదియును అగు) ప్రకృతియందు (దేహమునందు) ఉన్నాఁడో, (తస్మాత్ = ఆకారణమువలన) ప్రకృతిజాన్ = ప్రకృతివలనఁ బుట్టిన, గుణాన్ =(సుఖదుఃఖమోహాకారములుగా నభివ్యక్తము లగు) గుణములను, భుఙ్క్తే = అనుభవించు చున్నాఁడు (పొందు చున్నాఁడు), గుణసంగః = సుఖదుఃఖమోహాత్మకము లయిన విషయములయందలి యభిలాష, అస్య= జీవునకు, సదసద్యోని జన్మసు=సద్యోనులయందును అసద్యోనులయందును సదసద్యోనులయందును జన్మములవిషయమై, కారణమ్ = కారణము, భవతి = అగు చున్నది.

జీవరూపుఁ డయిన పరమపురుషుఁడు కార్యకారణరూప మయినదియును అవిద్యారూప మయినదియును అగు ప్రకృతియందు (దేహమునం దున్న) కారణమువలన ప్రకృతిజన్యము లగు సుఖదుఃఖాదులను పొందు చున్నాఁడు; సుఖదుఃఖమోహాదుల ననుభవించునది యవిద్య యయినను దివ్యములును రాక్షసములును మానుషములు నగు యోనులయందు సంసారము చేయుటకు జీవునకు సుఖదుఃఖమోహాత్మకము లయిన విషయములయందలి యభిలాషయే కారణమగు చున్నది, అనఁగా విషయాభిలాష లేనివారికి సాంసారికము లైన సుఖదుఃఖమోహములు లే వని తాత్పర్యము.

శ్లో॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మి న్పురుషః పరః॥

టీక, ఉపద్రష్టా=ఉపద్రష్టయును (తాను కార్యములయందుఁ బ్రవేశించక సమీపమునందుండి చూచు చుండువాఁడును), అనుమన్తా చ=అను

పొంది స్వరూపచైతన్యముచేత ప్రకాశింపఁజేయువాఁడును, సర్వాత్ముఁ
డును స్వతంత్రుఁడును అగుటవలన మహేశ్వరుఁడును, అవిద్యచే ప్రత్య
గాత్మగా కల్పితము లయిన దేహేంద్రియాదులకంటెను త్కృష్టమైన
వాఁ డయ్యును, అనఁగా పరమాత్మయును అని శ్రుతులచేఁ జెప్పఁబడుపురు
షుఁడు (జీవుఁడు) ఈ శరీరమునందున్న వాఁడయినను దేహేంద్రియాదుల
కంటె వేఱైనవాఁడు, అని తాత్పర్యము అనఁగా నవిద్యా సంసర్గముచే
పురుషుఁడు సంసారియైనను వాస్తవముగా నిస్సంసారి, అనఁగా సంసార
రహితుఁ డని తాత్పర్యము.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపిన స భూయోఽభిజాయతే॥

టీక. యః=ఎవఁడు, ఏవమ్=పైన చెప్పినప్రకారము, పురుషమ్=
పురుషుని, (అనఁగా జీవునకును, పరమపురుషునకును భేదము లేదని)గుణై
స్సహ=(మాయావికారము లయిన) సుఖదుఃఖమోహాదులతోఁ గూడ,
ప్రకృతించ=అవిద్యయును (మాయను), వేత్తి=తెలిసికొనుచున్నాఁడో,
సః=వాఁడు, సర్వథా=సర్వప్రకారముగా (శాస్త్రోక్త ప్రకారముగాను
శాస్త్రనిషిద్ధముగాను) వర్తమానోఽపి=ఉండినను, భూయః=మరల,
నాభిజాయతే=పుట్టఁడు,

ప్రకృతి నేనే, ప్రకృతిజన్యము లగు సుఖదుఃఖ మోహాదులను నేనే,
అనుభవించువాఁడను నేనే అనునట్టి యజ్ఞానము తొలఁగి పరమాత్మజ్ఞాన
ముచే జీవాత్మపరమాత్మలకు భేదము లేక తానే పరమాత్మ యనియును,
పరమాత్మయే తానని యును, మాయావికారము లయిన సుఖదుఃఖమోహా
దులతోఁ గూడినది ప్రకృతి యనియును ఎవఁడు తెలుసుకొను చున్నాఁడో
వాఁడు శాస్త్రోక్త ప్రకారముగా నడచుకొన్నను, నడచుకొనకపోయి
నను, అనఁగా ఇట్టి జ్ఞానము గలవాఁడు ఎట్లు ప్రవర్తించినను, మరల

పరిశుద్ధాంతః కరణులై జ్ఞానము పొందుటచేతను (కర్మయోగముచేత) బుద్ధియందు ప్రత్యగాత్మను, అనఁగా స్వస్వరూపమును ధ్యానసంస్కృతమైన అంతఃకరణము గలవారై చూచు చున్నా రని తాత్పర్యము.

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౬

టీక. అన్యే=మతికొందఱు (మందతరులు అయిన, యే=ఎవరు, ఏవమ్ = ఈప్రకారము (పైనఁ జెప్పఁబడిన ధ్యాన సాంఖ్య కర్మయోగములలో దేనిచేతను), అజానన్తః = ఎఱుఁగనివారై, అన్యేభ్యః = (కారుణికు లగు ఆచార్యులవలన) ఇతరులవలన, శ్రుత్వా=(పరమాత్మ నిట్లు ఉపాసన చేయుఁడు అని చెప్పఁబడినవారై) విని, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తేఽపిచ=వారును, శ్రుతిపరాయణాః=స్వయముగా వేదాంత విచారమునందసమర్థు లయినను గురూపదేశమువలన విన్నదానియందు మాత్ర మాసక్తి గలవారై (శ్రుతిపరాయణులై), మృత్యుమ్=చావును (సంసారమును), అతితరంత్యేవ=దాఁటనేదాఁటు చున్నారు.

మందతరు లయిన మతికొందఱు పైన జెప్పఁబడిన ధ్యానయోగము, సాంఖ్యయోగము, కర్మయోగము అనువానిలో దేనిచేతను పరమాత్మ నెఱుంగలేనివారైనను పరమదయాళు రగు ఆచార్యులవలన పరమాత్మ నిట్లు ఉపాసన చేయుఁడు అని ఉపదేశింపఁబడినవారై స్వయముగా వేదాంత విచారమునం దసమర్థు లయినను సద్గురూపదేశమువలన విన్నదానియందు మాత్ర మాసక్తి గలవారై సంసారరూప మగు చావునుండి తప్పించుకొనుచున్నారు, అనఁగా జన్మరహితు లయి మోక్షమును చెందుచున్నా రని తా.

శ్లో॥ యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ॥ ౨౭

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్॥

టీ॥ హి=ఏ కారణమువలన, సర్వత్ర=సకలప్రాణులయందు, సమవస్థితమ్ = ఉండినట్టి, ఈశ్వరమ్=(పూర్వకటీశ్లోకముచేఁ జెప్పఁబడిన లక్షణములు గల) పరమేశ్వరుని, సమమ్ = సర్వసమునిగా, పశ్యన్=చూచుచున్నవాఁడై (తెలిసికొనుచున్నవాఁడై), ఆత్మనా=తనచేత, ఆత్మానమ్=తనను, నహినస్తి = హింసించుకొనఁడో, తతః=అందువలన (తనను హింసించుకొనక పోవుటవలన), పరామ్ = ఉత్తమమగు, గతిమ్ = గతిని మోక్షమును, యాతి = పొందుచున్నాఁడు.

(ఓ యర్జునుఁడా!) సకలప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని గురూపదేశమువలనఁ గలిగిన స్వానుభవముచేత సర్వసమునిఁగా తెలిసికొని తనచేతఁ దన్ను హింసించికొననివాఁడు, అనఁగా సర్వము తాను గనుక సర్వమును హింసింపనివాఁడు మోక్షమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి॥ ౩౦

టీక. కర్మాణి = (కాయికములును వాచికములును మానసికములు నగు) కర్మములను, సర్వశః=అన్నివిధములచేత, ప్రకృత్యైవ=(దేహేంద్రియసంఘాతాకారముగా పరిణమించినదియును, సకలవికారములకు కారణమైనదియును, సత్త్వరజస్తమోగుణాత్మకము నగు) భగవన్మాయచేతనే, క్రియమాణాని=చేయఁబడుచుండువానినిగాను, యః=ఎవఁడు, పశ్యతి = చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో), తథా=అట్లు, ఆత్మానమ్=తనను, అకర్తారమ్=(సర్వకర్మములకు) కర్త కానివానినిగాను, యః = ఎవఁడు, పశ్యతి=చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో), సః= వాఁడు, పశ్యతి = చూచుచున్నాఁడు (తెలిసికొనుచున్నాఁడు),

చేత నెప్పుడు తెలిసికొనుచున్నాఁడో, అప్పుడు బ్రహ్మమగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ 3౧

టీక, హే కౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన ఓ యర్జునుఁడా! అనాదిత్వాత్ = కారణరహితుఁ డగుటవలనను, నిర్గుణత్వాత్ = త్రిగుణ వికారములు లేనివాఁ డగుటవలనను, అవ్యయః = నాశరహితుఁ డయిన, అయమ్ = ఈ, పరమాత్మా = పరమేశ్వరునికంటె వేఱు కాని ప్రత్యగాత్మ, శరీరస్థోఽపి = అధ్యాసిక సంబంధముచేత శరీరమునం దున్నను, న కరోతి = (కర్మములను) చేయఁడు, న లిప్యతే = (కర్మఫలముచేత) పూయఁబడఁడు.

కుంతీపుత్త్రుఁడ వైన ఓ యర్జునుఁడా! కారణరహితుఁ డైనను, సత్త్వరజస్తమోగుణవికారములు లేనివాఁడును అగుటవలన నాశరహితుఁ డయిన యీ పరమాత్మ శరీరమునం దున్నప్పటికి అధ్యాసిక సంబంధముచేత జలమునం దున్న సూర్యుఁడు జలము కదలినను తాను కదలనియట్లు శరీరేంద్రియాదులు చేయు కర్మములను తాను చేయఁడు; ఆ కర్మఫలములు పరమాత్మను అంటనుగూడ నంటఁ డని తాత్పర్యము.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ 33

టీక, యథా = ఏప్రకారము, సర్వగతమ్ = సకలవస్తువులయందు వ్యాపించి యున్నను, సౌక్ష్మ్యాత్ = సూక్ష్మ మగుటవలన (కలియని దగుట వలన) ఆకాశమ్ = ఆకాశము, నోపలిప్యతే = (పంకాదులచేత) అంటఁ బడదో, తథా = ఆ ప్రకారము, సర్వత్ర దేహే = సకలదేహములయందును, అవస్థితః = ఉండిన, ఆత్మా = పరమాత్మ, నోపలిప్యతే = (కర్మములచేత) పూయఁబడఁడు.

మాయనుండి తొలఁగునట్టి యుపాయమును, యే = ఎవరు, విదుః = తెలిసికొనుచున్నారో, తే = వారు, పరమ్ = కైవల్యమును (మోక్షమును), యాన్తి = పొందుచున్నారు.

శాస్త్రాచార్యోపదేశమువలనఁ గలిగిన పరమాత్మజ్ఞాన మనెడి నేత్రముచేత నీయధ్యాయమునందుఁ జెప్పఁబడినప్రకారముగా క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క (శరీరాత్మలయొక్క) పరస్పరభేదమును, సకలభూతకారణమైన మాయనుండి తొలఁగునట్టి యుపాయము నెవరు తెలిసికొనుచున్నారో వారు కైవల్యమును, అనఁగా మోక్షమును పొందుచున్నారని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే ప్రకృతిపురుషవిభాగయోగో నామ
త్రయోదశోఽధ్యాయః.

టీక. వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమైనదియును, శతసాహస్ర్యామ్ = నూరువేలశ్లోకములు గలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారతమనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపదగలభగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము (అయిన), బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను దెలుపునట్టి గ్రంథమునందు), యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, ప్రకృతిపురుషవిభాగయోగో నామ = ప్రకృతిపురుషవిభాగయోగ మనియెడు పేరు

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత - చతుర్దశాధ్యాయము.

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



## గుణత్రయవిభాగయోగము.

శ్రీభగవానువాచ.—

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః॥౧

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను. (హే అర్జున = యర్జునుఁడా!) యత్ = దేనిని, జ్ఞాత్వా=తెలిసికొని, సర్వే = సకలమైన, మునయః=మునులు, ఇతః= ఈ దేహబంధమునుండి, పరామ్=ఉత్తమ మయిన, సిద్ధిమ్=సిద్ధిని (మోక్షమును) గతాః = పొందిరో, పరమ్ = (పరమాత్మవిషయక మగుటవలన) శ్రేష్ఠమును, జ్ఞానానామ్=జ్ఞానసాధనములలోపల (యజ్ఞదానాదులలోపల), ఉత్తమమ్ = (ఉత్తమ ఫలప్రద మగుటవలన) ఉత్తమమును అగు, (తత్ =ఆ) జ్ఞానమ్= పరమాత్మజ్ఞానసాధనమును, భూయః = (పూర్వాధ్యాయములయందు సంక్షేపముగాఁ జెప్పఁబడినను) మఱల (వివరముగా), ప్రవక్ష్యామి = చెప్పెదను.

ములకు వృద్ధిహేతు వగుటవలన, లేక భరించున దగుటవలన, బ్రహ్మమని చెప్పఁబడునట్టిదియు నగు త్రిగుణాత్మక మయిన మాయ, మమ = (ఈశ్వరుఁడనగు) నాయొక్క, యోనిః = గర్భస్థానము, (భవతి = అగుచున్నది)। తస్మిన్ = దానియందు, అహమ్ = నేను, గర్భమ్ = (హిరణ్యగర్భునియొక్క జన్మమునకు కారణ మగు బీజమును) గర్భమును, దధామి = ఉంచు చున్నాను. తతః = ఆ గర్భాధానమునుండి, సర్వభూతానామ్ = హిరణ్యగర్భుఁడు మొదలగు సకలభూతములయొక్క, సంభవః = పుట్టుక, భవతి = కలుగు చున్నది.

ఓ యర్జునుఁడా! సకలకార్యములకంటె నధిక మయిన దగుటవలన మహత్తనియును, సకలమును వృద్ధి బొందించుటవలన (లేక) భరించుట వలన బ్రహ్మ మనియును, చెప్పఁబడు త్రిగుణాత్మక మయిన మాయ ఈశ్వరుఁడ నయిన నాయొక్క గర్భస్థాన మగు చున్నది. అట్టి గర్భస్థానమునందు, అనఁగా మహత్తనియు, బ్రహ్మ మనియు చెప్పఁబడు త్రిగుణాత్మక మయిన మాయయందు హిరణ్యగర్భుఁడు మొదలగు సకల ప్రాణులయొక్క జన్మమునకు కారణ మగు బీజమును (గర్భమును) క్షేత్ర క్షేత్రజ్ఞు లనెడి ప్రకృతి ద్వయము యొక్క శక్తిమంతుఁ డగు నీశ్వరుఁడ నయి నేను ఉంచు చున్నాను. ఆగర్భమునుండి హిరణ్యగర్భుఁడును తద్వారా సకలభూతములును కలుగు చున్నవని తాత్పర్యము.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ ౪

టీక. హే కౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునా! సర్వయోనిషు = (దేవ పితృ మనుష్య పశు మృగాదు లయిన) సకలయోనుల యందు, యాః = ఏవి, మూర్తయః = శరీరములు, సంభవన్తి = పుట్టుచున్నవో, తాసామ్ = ఆ శరీరములకు, మహత్ = మహత్తనియును, బ్రహ్మ = బ్రహ్మ మనియును చెప్పఁబడు (మాయ), యోనిః = కారణము (మాతృస్థానము)।

మలినము లేని దగుటవలన, ప్రకాశకమ్ = ప్రకాశింపఁజేయునట్టిదియును, అనామయమ్ = ఉపద్రవరహితమును అయిన, సత్త్వమ్=సత్త్వగుణము, సుఖసంగేన=సంగముచేతను (సుఖము కలవాఁడను అని మాయాధర్మమైన సుఖమును ఆత్మయం దారోపించుటచేతను), జ్ఞానసంగేనచ=జ్ఞానసంగము చేతను, (ప్రపంచవిషయ మయిన అంతఃకరణవృత్తిని యాత్మయం దారోపించుటచేతను), (దేహినమ్=క్షేత్రజ్ఞుని) బధ్నాతి=బంధించు చున్నది.

పాపరహితుఁడవు గనుక తెలిసికొనుసామర్థ్యము గల యో యర్జునుఁడా! స్ఫటికమువలె స్వచ్ఛమైనది గనుక ప్రకాశింపఁజేయునదియును; సుఖము నిచ్చునదియును నగు సత్త్వగుణమును, నేను సుఖము కలవాఁడ నని ప్రకృతిధర్మమైన సుఖమును ఆత్మయందు ఆరోపించుట యనెడి సుఖసంగము చేతను; అంతఃకరణధర్మమైన జ్ఞానము నాత్మయం దారోపించుట, అనఁగా నేను జ్ఞానిననునట్టి యభిమానము గలిగి యుండుట యనెడి జ్ఞానసంగము చేతను క్షేత్రజ్ఞుని బంధయుక్తునిగాఁ జేయు చున్న దని తా.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥ 7

టీక. హేకౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! రజః = రజోగుణమును, రాగాత్మకమ్ = గైరికాదిధాతువులవలె పదార్థములతోఁ జేరిక గలవానినిగాఁ జేయునట్టి రాగస్వరూపము గలదానిగాను, తృష్ణాసంగసముద్భవమ్ = తృష్ణకును సంగమునకును కారణ మైన దానినిగాను, (విద్ధి = తెలిసికొనుము) తత్ = ఆ రజోగుణము, దేహినమ్ = ఆత్మను, కర్మసంగేన = ఐహికాముష్మికసుఖములయం దాసక్తి యనెడి కర్మసంగముచేత, నిబధ్నాతి = బంధించు చున్నది.

ఓ అర్జునుఁడా! గైరికాది రంజకద్రవ్యములు స్వచ్ఛమైన వస్తువులకు తమవర్ణములతో సంబంధమును కలిగించునట్లు నిర్మలుఁ డగు పురుషునికి మాయాత్మకములును నశ్వరములు నగు దృశ్యపదార్థములతో సంబం

రజః=రజోగుణము, (దేహినమ్ = ఆత్మను) కర్మణి = కర్మమునందు, (సంజయతి=చేర్చుచున్నది; తమస్తు=తమోగుణమన్ననో, జ్ఞానమ్=సత్త్వకార్యమైన వివేకమును, ఆవృత్య = ఆవరించి (కప్పి), (దేహినమ్ = ఆత్మను) ప్రమాదే+ఉత = ప్రమాదమునందు (చేయఁదగినదానిని చేయకపోవుటయందును), సంజయతి = చేర్చుచున్నది.

ఓ అర్జునుఁడా! మఱల త్రిగుణముల వ్యాపారమును సంక్షేపముగాఁ జెప్పెదను వినుము. దుఃఖశోకాదికారణముల నణఁచి సత్త్వగుణము బలవత్తరమై సుఖసాధనము అయిన విషయములయందు ఆత్మను ప్రవర్తింపఁ జేయును. సుఖకారణముల నణఁచి రజోగుణము బలవత్తరమై భోగముల ననుభవించుటకు సాధనము అయిన కర్మములయం దాత్మను ప్రవర్తింపఁ జేయును. తమోగుణము ఆత్మ చేయఁదగిన కార్యములకు విఘ్నము అయిన ప్రమాదాదులయందు ప్రవేశమును కలిగించును; అని తాత్పర్యము.

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥ ౧౦

టీక. హే భారత=ఓ అర్జునుఁడా! (యదా=ఎప్పుడు) సత్త్వమ్ = సత్త్వగుణము, రజః = రజోగుణమును, తమశ్చ = తమోగుణమును, అభిభూయ = తిరస్కరించి, భవతి=వృద్ధిఁ జెందుచున్నదో, (తదా=అప్పుడు, స్వకార్యమ్=తనకార్యము అగు జ్ఞానసుఖాదులను, కరోతి=కలుగఁజేయుచున్నది). (యదా = ఎప్పుడు) రజః = రజోగుణము, సత్త్వమ్ = సత్త్వగుణమును, తమశ్చైవ = తమోగుణమును, (అభిభూయ = తిరస్కరించి) భవతి = వృద్ధిఁ జెందుచున్నదో, (తదా = అప్పుడు, స్వకార్యమ్=తన కార్యములను, కరోతి=చేయుచున్నది). (యదా = ఎప్పుడు) తమః = తమోగుణము, తథా = అప్రకారముగానే, సత్త్వమ్ = సత్త్వగుణమును, రజః = రజోగుణమును, (అభిభూయ = తిరస్కరించి, భవతి = వృద్ధిఁ

చుండఁగా, లోభః = పరద్రవ్యము మనకు రావలెను వచ్చినద్రవ్యము నెప్పటికి నభివృద్ధియం దుండవలెనే కాని తఱుఁగఁగూడదు అనునట్టి యాశయు, ప్రవృత్తిః = ప్రవృత్తియు (ద్రవ్యవృద్ధికిఁ దగినకార్యములయం దెడ తెగని ప్రయత్నమును) కర్మణామ్ = కర్మములయొక్క, ఆరంభః = ఉద్యమమును, అశమః = అసమము (ఇంద్రియనిగ్రహము లేమియు), స్పృహా = చూచినవాని నన్నిటిని కోరుటయు, (అను) ఏతాని = ఇవి, జాయన్తే = పుట్టుచున్నవి.

ఓ అర్జునుఁడా! పరద్రవ్యాదులయం దిచ్ఛయు, అనఁగా లోభమును, ద్రవ్యవృద్ధికిఁ దగినకార్యములయం దెడ తెగని ప్రయత్నమును, అనఁగా ప్రవృత్తియును, కామ్యములును నిషిద్ధములు నగు లౌకికకర్మము అను చేయఁబూనుటయును, అనఁగా కర్మోద్యమమును, ఇంద్రియనిగ్రహము లేమియు, చూచిన వస్తువుల నన్నిటిని కోరుటయును, అనఁగా స్పృహయును అను యివన్నియు రజోగుణలక్షణములు; ఈ లక్షణములు రజోగుణమభివృద్ధిఁ బొందినపు డుండునని తాత్పర్యము.

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునన్దన॥ ౧౩

టీక. హే కురునన్దన = ఓ యర్జునుఁడా! తమసి = తమోగుణము, వివృద్ధే (సతి = వృద్ధిఁ బొందినదగుచుండఁగా, అప్రకాశః = అవివేకమును, (తెలిసికొనుటకు హేతువు అగు ఉపదేశాదు లున్నను యేమాత్రము తెలిసికొనుయోగ్యత లేమియు), అప్రవృత్తిశ్చ = జ్ఞానాప్రవృత్తియును (కర్మములయందు యెంతమాత్రము ప్రవృత్తి లేకుండుటయు), ప్రమాదః = (అవివేకపు ప్రవృత్తులవలనఁ గలిగిన) పొరపాటును, మోహ ఏవ చ = మిథ్యాభినివేశమును (ఒకవస్తువును చూచి మఱియొకవస్తువుగా నెంచుటయును), (అను) ఏతాని = ఇవి, జాయన్తే = పుట్టుచున్నవి.

పుట్టుచున్నాఁడు; తథా = ఆ ప్రకారముగా, తమసి = తమోగుణము, ప్రవృద్ధే (సతి) = వృద్ధి పొందిన దగుచుండఁగా, ప్రలీనః = శరీరత్యాగము చేసిన వాఁడు, మూఢయోనిషు = పశ్వాదితిర్యగ్యోనులయందు, జాయతే = పుట్టుచున్నాఁడు.

(ఓ యర్జునుఁడా!) రజోగుణ మభివృద్ధి జెంది యున్నపుడు జీవుఁడు శరీరమును విడిచినయెడల కర్మఫలాభిలాషి యగు మనుష్యుఁడుగా పుట్టుచున్నాఁడు, అనఁగా మనుష్యశరీరమును పొందుచున్నాఁడు. తమోగుణ మభివృద్ధి జెంది యున్నపుడు మృతిఁ జెందినవాఁడు పశుపక్ష్యాది రూపములఁ జెందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్। ౧౬

టీక. సుకృతస్య=సత్త్వగుణసంబంధ మైన, కర్మణః=కర్మమునకు, సాత్త్వికమ్ = సత్త్వగుణసంబంధ మైనదియును, నిర్మలమ్ = రజోగుణ తమోగుణములవలన గలుగు దోషములు లేనిదియును, (నగు) ఫలమ్=ఫలమును, ఆహుః=(కపిలుఁడు మొదలగు మహర్షులు) చెప్పుచున్నారు; రజసస్తు=రజోగుణసంబంధ మైన కర్మమున కన్ననో, దుఃఖమ్ = దుఃఖరూపమయిన (లోక జనన మరణరూప మయిన), ఫలమ్ = ఫలమును, ఆహుః = (కపిలాదులు) చెప్పుచున్నారు; తమసః=తమోగుణసంబంధ మైన కర్మమునకు, అజ్ఞానమ్ = అవివేకమును, ఫలమ్ = ఫలమునుగాను, ఆహుః = (తత్త్వవేత్త లయిన కపిలాదులు) చెప్పుచున్నారు.

సాత్త్వికము లయిన కర్మములఁ జేయుటవలన పుణ్యరూప మయిన సుఖము ననుభవించు ననియును, రాజసము లయిన కర్మములను చేయుట వలన సంసారికదుఃఖముల ననుభవించు ననియును, తామసికకర్మములఁ జేయుట వలన నవివేకరూప మయిన, అనఁగా నేమియు తెలియక

ఈ యధ్యాయమునందలి 14, 15 వ శ్లోకములయందుఁ జెప్పిన ప్రకారము శాస్త్రీకజ్ఞానకర్మలయం దాసక్తి అయినవారు, అనఁగా సత్త్వగుణ ప్రధానులు స్వర్గాద్యుత్తమలోకములను పొందుచున్నారు; అనఁగా దేవాది జన్మములను పొందుచున్నారు; లోభాదులు గలవారు, అనఁగా రజోగుణ ప్రధానులు మనుష్యలోకమును పొందుచున్నారు; అనఁగా కర్మఫలాసక్తులయిన మనుష్యులుగా పుట్టుచున్నారు; తమోగుణ కార్యము అయిన నిద్రాలస్యాదులు గలవారు, అనఁగా తమోగుణ ప్రధాను లయిన మూఢులు పశుపక్ష్యాది శరీరములను పొందుచున్నా రని తాత్పర్యము.

శ్లో॥ నాఽన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ ౧౯

టీక. (యః = ఎవఁడు) ద్రష్టా సన్ = విద్వాంసుఁడై, గుణేభ్యః = (కార్య కారణ విషయాకారముగా పరిణమించిన) సత్త్వాదిగుణములకంటెను, అన్యమ్ = ఇతరుఁడైన, కర్తారమ్ = కర్తను, యదా = ఎప్పుడు, నాఽనుపశ్యతి = చూడఁడో, (ఆత్మానామ్ = తన్ను) గుణేభ్యః = కార్యకారణాత్మకము లగు గుణములకంటె, పరంచ = ఇతరునిగాను (గుణవ్యాపారములకు సాక్షిభూతునిగాను), వేత్తి = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, మద్భావమ్ = నాభావమును (వాసుదేవత్వమును), అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

సుఖదుఃఖములకు కారణము అయిన కర్మములను చేయుటకును, కర్మఫలముల ననుభవించుటకును కార్యకారణరూపములను పొందినవై గుణములే కర్తలుగా నున్నవి గాని మఱియొకఁడు వీనిని చేయువాఁడును, అనుభవించువాఁడును లేఁడనియును; కార్యకారణవిషయాకారముగా పరిణమించిన సత్త్వాదిగుణములకంటె నితరుఁడై గుణములు చేయు వ్యాపారములకు సాక్షిభూతుఁడుగ నున్నవాఁడు తానే యనియు నెఱింగినవాఁడు వాసుదేవుఁడ

త్రీన్ = మూఁడు అయిన, గుణాన్ = గుణములను, అతివర్తతే = అతిక్రమించుచున్నాఁడు.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—భృత్యుని దుఃఖముల దొలఁగించు భారము ప్రభువునం దుండుటవలన సంసారరూపమైన నాదుఃఖమును పోఁగొట్టవలసిన ప్రభువగు నో కృష్ణుఁడా! సత్త్వాదిగుణముల నతిక్రమించిన వాఁడు యేయే లక్షణములు కలిగి యుండును? ఎట్టి యాచారములు కలిగి యుండును? ఈ త్రిగుణముల నెట్లు జయించును? వీనిని నాకుఁ దెలియఁ జేయుము; అని అర్జునుఁ డడిగె నని తాత్పర్యము.

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥ ౨౨

టీక. శ్రీ భగవానువాచ = సర్వోత్కృష్టుఁడైన భగవంతుఁడు చెప్పెను. హే పాండవ = ఓ యర్జునుఁడా! యః = ఎవఁడు, సంప్రవృత్తాని = స్వభావముగా కలిగిన, ప్రకాశంచ = (సత్త్వగుణకార్యమైన) ప్రకాశమును, ప్రవృత్తించ = (రజోగుణకార్యమైన) కర్మప్రవృత్తియును, మోహమేవచ = (తమోగుణకార్యమైన) మోహమును, నద్వేష్టి = ద్వేషింపఁడో (అనఁగా నివి ప్రత్యక్షముగా ప్రతికూలములు గాన నాకుఁ గూడ దని తలంపఁడో), నివృత్తాని = విడిచిన ప్రకాశాదికార్యములను, న కాంక్షతి = కోరఁడో, (సః = వాఁడు, గుణాతీతః = సత్త్వాదిగుణముల నతిక్రమించిన వాఁడు, ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ యర్జునుఁడా! స్వభావ సంప్రాప్తము లయిన సత్త్వాదిగుణములను, వానికార్యము లయిన (ఈ యధ్యాయమునందే 11, 12, 13, శ్లోకములయందుఁ జెప్పియున్న) ప్రకాశాదులను, అనిత్యము లయిన సుఖాదులను కలిగించునవి కనుక నాకుఁ

మంతుఁడును (లేక) ధైర్యవంతుఁడును, తుల్యనిన్దాత్మసంస్తుతిః = తనను ఇతరులు దూషించినను భూషించినను చిత్తవికారము లేనివాఁడును. యః = ఎవఁడో, సః = వాఁడు, గుణాతీతః = గుణాతీతుఁడు, ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నాఁడు.

మఱియును, సుఖము కలిగినను దుఃఖము కలిగినను సంతోషవ్యసనములను జెందక, వికారములు లేక బంగారు, రత్నములు, మంటిగడ్డలు అను భేదము లేక, అనఁగా సకలమునందును ఏకాభిప్రాయము కలిగి, ఇష్టానిష్ట వస్తుప్రాప్తియందు సమచిత్తము కలిగి, స్తుతినిందలయందు సముఁడైన వాఁడు గుణాతీతుఁ డని చెప్పఁబడు చున్నాఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥ ౨౫

టీక. (కించ = మఱియును) మానావమానయోః = గౌరవాగౌరవములయందు, తుల్యః = సముఁడును, మిత్రారిపక్షయోః = మిత్రపక్షమునందును శత్రుపక్షమునందును, తుల్యః = సమబుద్ధి గలవాఁడును, సర్వారంభపరిత్యాగీ = (దేహమును ధరించుటకు మాత్ర ముపయోగించు కర్మములను చేయుచు మిగిలిన) సకలకర్మములను పరిత్యజించినవాఁడును, (యః = ఎవఁడో) సః = వాఁడు గుణాతీతః = గుణాతీతుఁడు, (ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నాఁడు).

మఱియు; తనను యితరులు గౌరవించినను, అమర్యాదచేసినను సమచిత్తతగలవాఁడును; తనకు స్వభావముచే మిత్రు లనియు, శత్రు లనియు లేకున్నను యితరులచే శత్రులనియు మిత్రులనియు పాడఁబడునట్టి యుభయులయందును సమబుద్ధి గలవాఁడును; దేహధారణమునకు మాత్ర ముపయోగము లగు కర్మములే జేయుచు మిగిలినకర్మముల నన్నిఁటిని విడుచువాఁడును గుణాతీతుఁడని చెప్పఁబడు చున్నాఁడు; అనఁగా సుఖదుఃఖములు, లాభాలాభ

స్వభావము గలవాఁడును), (అయిన) బ్రహ్మణః = పరమాత్మయొక్క, ప్రతిష్ఠాహి = ప్రతిమగదా ! (ఘనీభూత మయిన బ్రహ్మముకదా !) (లేక) అహంహి = (నిర్వికల్పకుఁడ నగు) నేనే, అమృతస్య = చావు లేనివాఁడును, అవ్యయస్యచ = నిర్వికారుఁడును, శాశ్వతస్యచ = నిత్యుఁడును, ధర్మస్య = జ్ఞానయోగ మనెడు ధర్మము నాచరించుటచేఁ బొందఁదగినవాఁడును, సుఖస్యచ = ఆనందరూపుఁడును, ఏకాన్తికస్యచ = అఖండరూపముగా నున్నవాఁడును, (అయిన) బ్రహ్మణః = సవికల్పక బ్రహ్మకు, ప్రతిష్ఠా = ఆశ్రయుఁడను.

నాశరహితుఁడును అవ్యయుఁడును, నిత్యుఁడును, జ్ఞానయోగమను ధర్మము నాచరించుటచేఁ బొందఁదగినవాఁడును, ఆనందస్వరూపుఁడును, అఖండస్వరూపుఁడును (అయిన) పరమాత్మయొక్క ఘనీభూత బ్రహ్మము (లేక) ప్రతిమ నేను (లేక) సవికల్పక బ్రహ్మమునకు నిర్వికల్పుఁడ నగు నేనే యాశ్రయము కనుక చలించని భక్తియోగముచే నన్నె సేవించువాఁడు త్రిగుణములను, వాని కార్యములను నతిక్రమించి బ్రహ్మత్వమును (లేక) మోక్షమును (లేక) జీవన్ముక్తిని పొందఁగలఁడని తా.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయ్యాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ
చతుర్దశోఽధ్యాయః.

టీక. వైయ్యాసిక్యామ్ = వ్యాసప్రోక్త మైనదియును, శతసాహస్ర్యామ్ = నూఱువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కర మైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వము

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః



# శ్రీభగవద్గీత - పంచదశాధ్యాయము,

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



## పురుషోత్తమప్రాప్తియోగము.

శ్రీ భగవానువాచ.—

శ్లో. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్॥ ౧

టీక. శ్రీభగవానువాచ=సంపత్కరుఁడైన భగవంతుఁడు చెప్పెను ఊర్ధ్వమూలమ్=ఉత్తముఁడైన బ్రహ్మము మూలముగాఁ గలదియును, అధశ్శాఖమ్ = మహత్, అహంకారము, పంచతన్మాత్రలు మొదలగునవి శాఖలుగాఁ గలిగినదియును, (అగు) అశ్వత్థమ్ = (క్షణప్రధ్వంసి యయిన సంసారమనెడి) అశ్వత్థవృక్షమును (రావిచెట్టును), అవ్యయమ్=(ఆద్యంత ప్రవాహములు లేక దేహాదిసంతానముల కాశ్రయ మయినదియు, నగుట వలనను, ప్రవాహరూపముగా నెడతెగని దగుటవలనను) నిత్యమైనదానినిగా, ప్రాహుః=(శ్రుతిస్మృతులు) చెప్పుచున్నవి. ఛందాంసి=(ఋగాది) వేదములు, యస్య = మాయామయ మైన యే సంసారవృక్షమునకు, పర్ణాని = ఆకులో, తమ్ = (సమూల మగు) ఆ సంసారవృక్షమును, యః= ఎవఁడు, వేద= తెలిసికొను చున్నాఁడో, సః=వాఁడు, వేదవిత్ = (వేదార్థమును) తెలిసికొనిన వాఁడు, (భవతి = అగు చున్నాఁడు).

నీరు మొదలగువానిచే పెంపఁబడి చిగిర్చియున్నకొమ్మలు చుట్టును పైకిని వ్యాపించునట్లు, సత్త్వరజస్తమోగుణము లను నీళ్ళు మొదలగు వానిచే పెంపఁబడి శబ్దాదివిషయము లను చిగురుటాకులు గలిగి కర్మఫలములు అను సంసారవృక్షముయొక్క కొమ్మలు, మనుష్యులు మొదలుకొని స్థావరముల వఱకు అను క్రిందికియును; జ్ఞానఫలము అను కొమ్మలు, హిరణ్యగర్భుని వఱకు అను పైకిని వ్యాపించినవి. కర్మఫలమువలనఁ గలిగిన రాగద్వేషవాసనలను పిల్లవేర్లు మనుష్యలోకమునందు స్థావరాది బ్రహ్మపర్యంతము ధర్మాధర్మ ప్రవృద్ధిహేతువు లయి క్రిందికిని చుట్టు ప్రక్కలకును వ్యాపించు చుండు నని తాత్పర్యము.

శ్లో॥ నరూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తోన చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా॥ 3

టీక. ఇహ = సంసారమునందు, (స్థితైః=ఉన్నవారిచేత) అస్య = ఈ సంసారవృక్షముయొక్క, రూపమ్=ఆకారము, (యథా=ఎట్లు, వర్ణితమ్=వర్ణింపఁబడినదో, చెప్పఁబడినదో), తథా=అట్లు, నోపలభ్యతే = పొందఁబడదు. (చూడ శక్యము కాదు); (అస్య=ఈ సంసారవృక్షమునకు) అన్తః=అంతము, నోపలభ్యతే = తెలియఁబడ కున్నది. ఆదిశ్చ = మొదలును, నోపలభ్యతే=తెలియ శక్యము కా కున్నది. సంప్రతిష్ఠాచ = స్థితియును (పెంపును), నోపలభ్యతే=తెలియఁబడ కున్నది. సువిరూఢమూలమ్=దక్కఁగాఁ బ్రాకిన వేర్లు గల, ఏనమ్=ఈ, అశ్వత్థమ్ = సంసారము అను రావిచెట్టును, దృఢేన=బలిష్ఠ మగున (అడ్డులేని, వివేకాభ్యాసమను పదును పెట్టఁబడిన), అసంగశస్త్రేణ=అసంగము (పుత్త్రమిత్రాదులనుండి తొలఁగుట) యను బాణముచేత, ఛిత్త్వా = నఱికి (రాగద్వేషాదు లను వేళ్ళతోఁ గూడిన సంసారవృక్షమును పెల్లగించి).

స్వస్వరూపమును) పొందు చున్నానని తలంచి, యేపదమును పొందినం బొదల మరల నీ సంసారకూపమునం బడరో యట్టి తత్త్వార్థ మయిన పరమాత్మ స్వరూపమును (స్వస్వరూపమును) వెదుకవలయును, అనంగా తెలిసికొన వలయు నని తాత్పర్యము.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్॥    ౫

టీక. నిర్మానమోహాః=మానమోహమును లేనివారును (అహంకార అవివేకములు లేనివారును), జితసఙ్గదోషాః = జయింపఁబడిన సంగ మను దోషము గలవారును (పుత్త్రైషణ మొదలగు సంగ మను దోషము లేని వారును), అధ్యాత్మనిత్యాః=పరమాత్మస్వరూపమును ఆలోచించుటయం దాసక్తిగల వారును (ఆత్మజ్ఞాననిష్ఠులును), వినివృత్తకామాః = చక్కఁగా విడువఁబడిన కోరికలు గలవారును(నిష్కాములును) అనఁగా సన్న్యాసులును, సుఖదుఃఖసంజ్ఞైః=సుఖము దుఃఖము అను సంజ్ఞలు గల, ద్వంద్వైః=ద్వంద్వ ములచేత (ప్రియాప్రియ ములు మొదలగు వానిచేత), విముక్తాః=విడువఁబడిన వారును (సుఖదుఃఖాది ద్వంద్వరహితులును) అగు, అమూఢాః = మోహ వర్జితులు (అజ్ఞానరహితులు), అనఁగా పరమాత్మజ్ఞానము గల పండితులు, అవ్యయమ్=నాశరహిత మైనదియును, తత్=పూర్వోక్త మైనదియు నగు పదమ్ = స్థానమును, గచ్ఛంతి = పొందు చున్నారు.

నేను నాది యను అహంకారమమకారములు లేనివారును, దృశ్య ప్రపంచమును జూచి యిదియంతయు నిత్యము అని మోహమును జెందని వారును, ఈషణాదిసంగము లను దోషములు లేనివారును, పరమాత్మస్వరూప ధ్యానపరాయణులును, నిష్కాములును, సుఖదుఃఖాదిద్వంద్వముల విడిచిన

లను జీవలోకే = జీవలోకమునందు (సంసారమునందు), కర్షతి = ఆకర్షించు చున్నాఁడు.

ఓ యర్జునుఁడా! నారాయణుఁడ నగు నాయొక్క యంశమును, పురాతనుఁడును; కర్తయనియును భోక్తయనియును ప్రసిద్ధిఁ జెందినవాఁడగు జీవాత్మ; ప్రళయమునందు మాయయం దున్న మనస్సు, త్వక్కు మొదలగు నింద్రియములను, సంసారమున భోగాదులను అనుభవించుట కాకర్షించు చున్నాఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥

టీక. ఈశ్వరః = (దేహాదిసముదాయమునకు ప్రభు వగు) జీవుఁడు, యత్ = ఎప్పుడు, శరీరమ్ = (మఱొక) దేహమును, అవాప్నోతి = (కర్మవశమువలన) పొందు చున్నాఁడో, యచ్చాపి = ఎప్పుడు, ఉత్క్రామతి = (పూర్వదేహమునుండి) బయలు వెడలు చున్నాఁడో, (తదా = అప్పుడు) వాయుః = వాయువు, ఆశయాత్ = (స్వస్థానము అగు) పుష్పాదులనుండి, గంధానివ = వాసన గల పుష్పాది మొదలగువానివలె, (శరీరాత్ = పూర్వశరీరమునుండి) ఏతాని = (పై శ్లోకమునందుఁ జెప్పి యున్న మనస్సును) శ్రోత్రము మొదలగు నింద్రియములను, గృహీత్వా = తీసికొని, సంయాతి = చక్కఁగాఁ బోవు చున్నాఁడు.

ఓ యర్జునుఁడా! వాయువు పుష్పములు మొదలగు వాసనగల వస్తువులనుండి బయలు వెడలునపుడు పుష్పముల నచ్చటనే విడిచి అందలి పరిమళములు గల పరమాణువుల నెట్లు తీసికొనిపోవు చున్నదో యట్లే దేహేంద్రియాది సముదాయమునకు ప్రభు వగు జీవుఁడు కొంతకాల మొక దేహమునందుండి కర్మవశమువలన నా దేహమును వదలి మఱియొక శరీరమును పొందునపుడు శరీరము నచట విడిచినను దానియం దుండు మనస్సు

ఓ అర్జునుఁడా! పూర్వ మున్నశరీరమును విడుచువాఁడును, శరీరమునం దుండువాఁడును, శబ్దాదివిషయముల ననుభవించువాఁడును, సుఖదుఃఖమోహాత్మకము లగు గుణములతోఁ గూడియున్నవాఁడును అగు జీవుఁడు దర్శనయోగ్యుఁడయినను; చూడఁబడినవియు చూడఁబడనివియు నగు భోగముల ననుభవింపవలయునను వాసనచే నాకర్షింపఁబడినచిత్తము గలవారు, అనఁగా యిహపరభోగముల కోరువారు అగుటచే ఆత్మానాత్మవివేకము లేని మూఢులు జీవుని (పరమాత్మను) చూడరు. ఇహపరభోగాపేక్ష లేక ఆత్మానాత్మవివేకము గలజ్ఞానులు జీవుని (పరమాత్మను) జూచుచున్నారు (తెలిసికొనుచున్నారు); అని తాత్పర్యము.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥ ౧౧

టీక. ఆత్మని=స్వబుద్ధియందు, అవస్థితమ్ = ఉండిన, ఏనమ్ = ఈ యాత్మను (పరమాత్మను) యతన్తః = (ధ్యానాదులచేత స్వస్వరూపముగా దెలిసికొన) ప్రయత్నమును చేయుచున్న, యోగినశ్చ=(సమాహిత చిత్తు లగు) యోగులే, పశ్యన్తి = చూచుచున్నారు; యతన్తోఽపి = శాస్త్రాది ప్రమాణములచే దెలిసికొన ప్రయత్నము చేయుచున్నను, అకృతాత్మానః= (తపస్సుచేతను, ఇంద్రియనిగ్రహముచేతను దుర్వ్యాపారమునుండి) తొలఁగని చిత్తముగలవా రగు, అచేతసః=అవివేకులు (మూఢులు), ఏనమ్= ఈ జీవుని, నపశ్యన్తి=చూడరు (తెలిసికొనరు),

సద్గురూపదేశమును పొంది తద్ద్వారా ధ్యానాదులఁ జేయుచు స్వస్వరూపమును (తన్ను తాను) తెలిసికొనవలయునను ప్రయత్నము చేయుచున్నవారును, చిత్తశుద్ధిగలవారును, అనఁగా నింద్రియముల జయించి చిత్తమును దోషరహితమునుగాఁ జేసికొన్నవారును అగు యోగులు స్వబుద్ధియందు(లేక) శరీరమునందు నుండిన పరమాత్మను చూచుచున్నారు కాని శాస్త్రప్రమాణములచే పరమాత్మ యిట్టివాఁ డని తెలిసికొనియున్నను, తపస్సు

అనఁగా నేనే సకలప్రాణులకును కర్మానుగుణ్యముగా జ్ఞానమును, జ్ఞాపకశక్తిని, జ్ఞానస్మృత్యపోహాయమును కలుగఁ జేయుచున్నాను. సకలవేదములచే తెలిసికొనఁదగిన పరబ్రహ్మము నేనే; వేదాంతార్థములయొక్క సంప్రదాయకర్తయు నేనే! వేదార్థవేత్తయు నేనే; యని తాత్పర్యము.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ ౧౬

టీక. లోకే=లోకమునందు (సంసారమునందు), క్షరశ్చ=క్షరమును (నశించునదియును), అక్షర ఏవచ=అక్షరుఁడును (నాశరహితుఁడును) అను, ఇమౌ = ఈ, ద్వౌ = ఇద్దఱు, పురుషౌ = పురుషులు, (స్తః = కలరు); సర్వాణి=సకలము లగు, భూతాని=నశ్వరము లగు బ్రహ్మాదిస్థావరాంతము లగు శరీరములు, క్షరః=క్షరము, (ఇతి = అని), ఉచ్యంతే = చెప్పఁబడు చున్నవి; కూటస్థః = రాశివలె నుండువాఁడు, (లేక) మాయావంచనాది ప్రకారముగా నుండువాఁడు (జీవుఁడు), అక్షరః=అక్షరుఁడు, (ఇతి=అని) ఉచ్యతే = (జ్ఞానులచే) చెప్పఁబడుచున్నాఁడు.

ఈ పదునెనిమిదధ్యాయముల యర్థసమూహమును మూడురాసులఁగాఁజేసి వానిలో క్షరుఁడు అక్షరుఁడు అని యిద్దఱు పురుషులు గలరు. బ్రహ్మాది స్థావరాంత మగు శరీరములసముదాయ క్షరము (నశించునది) యనియును, పర్వతము నశించినను శిలాసముదాయము నశించనట్లు శరీరములు నశించినను నిర్వికారముగా నుండువాఁడు (కూటస్థుఁడు) అక్షరుఁడు, అనఁగా సంసారాశ్రయ మగు మాయాశక్తిప్రవాహరూపమున నశించనిది అని చెప్పఁబడుచున్నాఁడు. ఇచ్చట క్షరాక్షరులును పైన "ఉత్తమః పురుషస్త్వన్యః" అని మఱియొకఁడును చెప్పియున్నాఁడని భ్రమఁ జెందనక్కఱలేదు. అవివేకులు, శరీరాత్మలే పురుషు లను భ్రాంతిఁ జెంది చెప్పుట వాడుక గనుక అట్లు చెప్పి రెండవసగము శ్లోకముచే పురుషులు కాదని తెలియఁజేసినాఁడు; అని తాత్పర్యము.

అశ్వత్థ మను పేరుగల సంసారమాయావృక్షమునకు, అనఁగా దేహమునకుఁ గారణ మయినదియును, మాయయు నగు చేతనముకంటె నుత్కృష్టతముఁడ నగు నన్ను పరమాత్మను లోకులును వేదములును పురుషోత్తముఁ డని పొగడు చున్న వని, అనఁగా పరమాత్మ నగు నేనే పురుషోత్తముఁడ నని తాత్పర్యము.

శ్లో॥ యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥ ౧౯

టీక. హే భారత—భరతవంశసంభూతుఁడ వగు ఓ యర్జునుఁడా! యః = ఎవఁడు, అసమ్మూఢస్సన్ = మోహరహితుఁడై, మామ్ = పైన చెప్పఁబడిన లక్షణములు గల నన్ను, ఏవమ్ = పైన చెప్పియున్న ప్రకారము, పురుషోత్తమమ్ = పురుషోత్తమునిగా, జానాతి = నేనే తా నని తెలిసికొను చున్నాఁడో, సర్వభావేన = సర్వము తానె (పరమాత్మయే) యను నభిప్రాయముతో, మామ్ = నన్ను (పరమాత్మను), భజతి = సేవించుచున్నాఁడో (ధ్యానము చేయుచున్నాఁడో), సః = వాఁడు, సర్వవిత్ = సర్వజ్ఞుఁడు, భవతి = అగు చున్నాఁడు.

ఓ అర్జునుఁడా! ఎవఁడు మోహరహితుఁడై, అనఁగా నిశ్చయజ్ఞానము గలిగినవాఁడై పైన చెప్పినప్రకారము నన్ను పురుషోత్తమునిఁగా తెలిసికొనుచున్నవాఁడై సర్వము తానే, అనఁగా పరమాత్మయే యను నభిప్రాయముతో, అనఁగా సర్వాత్మత్వేన నన్ను ధ్యానము చేయుచున్నాఁడో వాఁడు సర్వజ్ఞుఁడు అగు చున్నాఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత॥ ౨౦

టీక. హే అనఘ = ఓ పాపరహితుఁడా! ఇతి = ఈప్రకారముగా, మయా = నాచేత, ఇదమ్ = ఈ, గుహ్యతమమ్ = అతిరహస్య మగు,

తెలుపునట్టి గ్రంథమునందు; యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, పురుషోత్తమయోగో నామ = పురుషోత్తమయోగ మనియెడు పేరు గల, పంచదశః = పదునైదవ దైన, (అగు) అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.

వేదవ్యాసునిచేతఁ జెప్పఁబడినదియును, నూరువేలశ్లోకములు గలదియును, ఛందోబద్ధశాస్త్రమును అయిన మహాభారతమునందలి భీష్మ పర్వమునందు ప్రశస్తమైన జ్ఞానసంపద గల భగవంతునిచేతఁ జెప్పఁబడిన వేదాంతములయందు శోభాయుక్తమైన కృష్ణార్జునులయొక్క సంవాద రూపమైనదియును, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టిదియును అయిన యోగ శాస్త్రమునందు పురుషోత్తమ యోగమును తెలుపునట్టి పదునైదవ భాగము ముగిసెను.

ఓం తత్సత్.

శ్రీరామచంద్రార్పణ మస్తు.



అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదులును స్మృతిచోదితము లగు దేవాదిచతుర్విధయజ్ఞములును, స్వాధ్యాయః = ఋగ్వేదాధ్యయనరూప మగు బ్రహ్మయజ్ఞమును, తపః = ముందు జెప్పఁబోవు కాయిక వాచిక మానసికతపస్సును, ఆర్జవమ్ = (ఎల్లప్రకారము) ఋజుగతియును, అహింసా = ప్రాణులను హింసఁ జేయ కుండుటయును, సత్యమ్ = సత్యమును, అక్రోధః = క్రోధము లే కుండుటయును, త్యాగః = సన్న్యాసమును (కామక్రోధాదుల త్యజించుటయును), శాన్తిః = అంతఃకరణోపశమనమును (అంతరింద్రియనిగ్రహమును), అపైశునమ్ = పరదోషములను ప్రకటన జేయ కుండుటయును (పిశునత్వము లే కుండుటయును), భూతేషు = (దుఃఖిత లగు) ప్రాణులయందు దయా = దయయును, అలోలత్వమ్ = విషయసన్నిధానమందుఁగూడ నింద్రియచలనము లే కుండుటయును, మార్దవమ్ = క్రౌర్యాభావమును, హ్రీః = లజ్జయును, అచాపలమ్ = చపలత లే కుండుటయును, తేజః = ప్రాగల్భ్యమును, క్షమా = ఓర్పును, ధృతిః = ధైర్యమును, శౌచమ్ = ద్వివిధ మగు శౌచము బాహ్యశుద్ధియును చిత్తశుద్ధియును, అద్రోహః = పరులహింసింపవలె నను తలంపు లేమియును, నాతిమానితా = అభిమానరాహిత్యమును, (అనునివి) దైవీమ్ = దేవయోగ్య మగు, సంపదమ్ = విభూతిని, అభిజాతస్య = అనుభవించుటకుఁ దగినట్లు జన్మించినవానికి, భవన్తి = కలుగుచున్నవి

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ అర్జునుఁడా! భయరాహిత్యము మొదలగు నిరువదియాఱులక్షణములు దేవత లనుభవించఁదగిన సంపద ననుభవింప జన్మించినవానికి, అనఁగా సత్త్వగుణప్రధానుఁడై జన్మించినవానికి కలుగుచున్నవి; అని తాత్పర్యము.

శ్లో॥ దంభో దర్పో౽భిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।

అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్॥ ౪

టీక. హే పార్థ = ఓ అర్జునుఁడా! దంభః = దంభమును (నేను ధర్మాత్ముఁ డని ప్రకటన చేయుటయును), దర్పః = గర్వమును, అభిమా

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥ 6

టీక. హే పార్థ = ఓ అర్జునుఁడా! అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు (సంసారమునందు), దైవః = (దేవతాయోగ్యలక్షణములు గలదియును) దైవమును, ఆసురఏవచ = ఆసురయోగ్యలక్షణములు గలదియును) ఆసురమును, (అను) ద్వౌ = రెండు, భూతసర్గౌ = భూతసృష్టులు, (స్తః = కలవు; దైవః = దేవతాయోగ్యలక్షణములు గల భూతసృష్టి, విస్తరశః = వివరముగా ప్రోక్తః = (నాచే) చెప్పఁబడినది; మే = నావలన (చెప్పఁబడు), ఆసురమ్ = ఆసురయోగ్యభూతసృష్టిని, శృణు = వినుము.

ఓ అర్జునుఁడా! లోకమునందు, అనఁగా సంసారమునందు భూతసృష్టిదైవము ఆసురము అని రెండువిధములుగా నున్నవి. అందు సాత్త్వికభూతసృష్టిని యీ యధ్యాయమునందలి మొదటి మూఁడుశ్లోకములచేత విస్తారముగాఁ జెప్పియున్నాను. ఇప్పుడు రాజసిక తామసికభూతసృష్టిని విస్తరించి చెప్పెదను, వినుమని తాత్పర్యము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
నశౌచం నాపి చాఽచారో న సత్యం తేషు విద్యతే॥ 7

టీక. ఆసురాః = ఆసురస్వభావము గల, జనాః = జనులు, ప్రవృత్తించ = (చేయఁదగిన ధర్మములయందు) ప్రవృత్తిని, నివృత్తించ = చేయఁదగని యధర్మములయందు, నివృత్తిని (తిరుగుదలను), నవిదుః = ఎఱుంగరు, తేషు = ఆసురస్వభావము గల జనులయందు, శౌచమ్ = ద్వివిధమగు శౌచశుద్ధియు చిత్తశుద్ధియును, న = లేదు; ఆచారోఽపిరు = ఆచారమును, న = లేదు; సత్యంచ = సత్యమును, నవిద్యతే = లేదు.

ఓ యర్జునుఁడా! ఆసురస్వభావము గలవారు; ఇవి పురుషార్థసాధకము అగు ధర్మములు కనుక వీనిని మన మవలంబించవలెను, ఇవి పురుషార్థ

గలవారును, అల్పబుద్ధయః = అల్పబుద్ధి గలవారును, ఉగ్రకర్మాణః = హింసమొదలగు క్రూరకర్మములను చేయువారును, అహితాః=సర్వశత్రువులును, (భూత్వా=అయి), జగతః=జగత్తుయొక్క, క్షయాయ = నాశము కొఱకు, ప్రభవన్తి = ఉద్భవించు చున్నారు.

ఓ యర్జునా! అసురస్వభావము గలవారు పూర్వశ్లోకమునందు చెప్పఁబడిన నాస్తికజ్ఞానము నాశ్రయించి జ్ఞానభ్రష్టులును, దృష్టము అగు విషయములయందు ప్రవేశించు బుద్ధి గలవారును, హింసాది క్రూరకృత్యములను చేయువారును, సర్వప్రాణ్యహితులును అయి జగన్నాశముకొఱకు జన్మించు చున్నారు; అనఁగా మహాక్రూరస్వభావు లగు చున్నారని తా.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం
దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్
ప్రవర్తంతేఽశుచివ్రతాః॥ ౧౦

టీక. దుష్పూరమ్=పూరింప శక్యము కాని, కామమ్=కామమును, ఆశ్రిత్య=ఆశ్రయించి (పొంది), దంభమానమదాన్వితాః = దంభము అభిమానము గర్వము అనువానితోఁ గూడుకొన్నవారును, అశుచివ్రతాః = మద్యపానము మాంసభక్షణము మొదలగు వామమార్గమో క్తదురాచారములు గలవారును నై, మోహాత్=అవివేకమువలన, అసద్గ్రాహాన్=కీడు మూడు కార్యములను (దురాగ్రహములను), గృహీత్వా=స్వీకరించి (అవలంబించి), (లోకే=లోకమునందు), ప్రవర్తంతే=సంచరించు చున్నారు.

ఓ యర్జునుఁడా! అసురసంపన్నులు అగువారు నెఱవేరని కామమును పొంది నేనే ధర్మాత్ముఁడను, నేనే పూజ్యుఁడను అని చెప్పుకొనుచు గర్వము చెంది మద్యపానాది దురాచారములు గలిగి అవివేకమువలన క్షుద్ర దేవతల నారాధించి సిద్ధ్యాములపొందఁ దలఁచి దురాగ్రహము గలవారై లోకమునందు సంచరించు చున్నారు; అని తాత్పర్యము.

అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥
అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ ౧౬

టీక. ఇదమ్=ఈ ద్రవ్యము, అద్య = ఇప్పుడు, మయా = నాచేత, లబ్ధమ్ = పొందఁబడినది; ఇమమ్ = ఈ, మనోరథమ్ = అభిలాషను, (అహమ్=నేను), ప్రాప్స్యే=పొందెదను; ఇదమ్=ఇది (ముందు సంపాదింపనది), మే=నాకు, అస్తి=ఉన్నది; ఇదమ్ = ఈ, ధనమపి = ద్రవ్యమును, పునః=మఱల, (మే = నాకు) భవిష్యతి = (ముందు సంవత్సరమునకు) కలుగఁగలదు; అసౌ = (దుర్జయుఁడగు) ఈ, శత్రుః = శత్రువు (పగతుఁడు), మయా = నాచేత, హతః=చంపఁబడినవాఁడు, (అభవత్=అయెను) అపరాన్=ఇతరులను, (మిగిలిన) శత్రూనపిచ = (పరాక్రమవంతులగు) పగతురనుగూడ, (అహమ్ = నేను) హనిష్యే=చంపఁగలను; అహమ్ = నేను, ఈశ్వరః = ప్రభువను, (అస్మి = అగుచున్నాను) అహమ్ = నేను, భోగీ=(సకలవిధములగు) భోగములు కలవాఁడను, (అస్మి=అగుచున్నాను) అహమ్=నేను, సిద్ధః=(పుత్త్రపౌత్త్రులతో సంపన్నుఁడను కాన) కార్యసిద్ధి కలవాఁడను, (అస్మి=అగుచున్నాను) అహమ్ = నేను, బలవాన్ = బలము గలవాఁడను, సుఖీ=సుఖము గలవాఁడను, (అస్మి= అగుచున్నాను) (అహమ్ = నేను) ఆఢ్యః = ధనికుఁడను, (అస్మి = అగుచున్నాను) (అహమ్ = నేను) అభిజనవాన్ = సప్తపురుషాంతరములుగ శ్రోత్రియుఁడను (తాతముత్తాత మొదలగు యేడ్గురు పురుషులనుండి శిష్టాచారసంపత్తుగల వాఁడను), అస్మి = అగుచున్నాను; అన్యః = (నాకంటె) నితరుఁడు, కః = ఎవఁడు, మయా = నాతో, సదృశః = సమానుఁడు, అస్తి =

లచే నిండిన నరకమునందు పడుచున్నారు, అనఁగా మోక్షరహితులై జననమరణ రూపనరకమును పొందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనాఽవిధిపూర్వకమ్॥ ౧౭

టీక. ఆత్మసంభావితాః = తమ్ము తామే సర్వగుణవిశిష్టులనుగా భావించుకొనువారును, స్తబ్ధాః = నమ్రత లేనివారును, ధనమానమదాన్వితాః (సన్తః) = ద్రవ్యముచేతఁ గలిగిన అభిమానమదములతోఁ గూడినవారును అయి, తే = ఆ యసురసంపద గలవారు, నామయజ్ఞైః = నామమాత్రము అయిన యాగములచేత (లేక) దీక్షితుఁడు, సోమయాజి యను పేరు గలుగఁగలందులకుఁగా నగు యజ్ఞములచేత, అవిధిపూర్వకమ్ = శాస్త్రవిరుద్ధముగానే యగునట్లుగా, దంభేన = గర్వముతో, యజన్తే = యజ్ఞములఁ జేయుచున్నారు (అగ్నుల వేల్చుచున్నారు).

ఆ యసురసంపద గలవారు; తమ్ము తామే సర్వగుణవిశిష్టులనుగా భావించుకొనుచున్నవారును, నమ్రత, అనఁగా పెద్దలయందు వినయము లేని వారును, మనకుఁగదా ద్రవ్యమున్న దని యభిమానమును గర్వమును బొందు వారును అయి నామమాత్రము అయిన యాగములచేత (లేక) దీక్షితుఁడు సోమయాజి యను పేరు గలుగఁగలందులకుఁగా నగు యజ్ఞములచేత శాస్త్రవిరుద్ధముగానే యగునట్లుగా గర్వముతో యజ్ఞముల చేయుచున్నారు, అనఁగా నగ్నుల వేల్చుచున్నారు; అట్టివారు యజ్ఞము లోకక్షయమును నివృత్తిప్రయోజనము గాన, నరకమునందు పడుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥ ౧౯

ఆగు నరాధములను జనన మరణరూప నరకమార్గములయందు అందులోను అతిక్రూరములయిన వ్యాఘ్రసర్పాది నీచయోనులయందే యెల్లప్పుడును పుట్టునట్లుచేయుచున్నాను; అని తాత్పర్యము.

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని।
మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్॥

టీక. హే కౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! ఆసురీమ్ = అసురసంబంధ మగు, యోనిమ్ = జన్మమును, ఆపన్నాః = పొందినవారు, జన్మనిజన్మని=ప్రతిజన్మమునందును, మూఢాః=అవివేకులయి, మామ్=నన్ను. అప్రాప్యైవ=పొందకయే, తతః = వ్యాఘ్రసర్పాదిజన్మములకంటె, అధమామ్=నీచ మయిన, గతిమ్=గతిని (క్రిమికీటాదిగతిని), యాన్తి = పొందుచున్నారు.

కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! అసురసంపద గలవారు ప్రతిజన్మమునందును మూఢు లయి నన్ను పొందకయే, అనఁగా నన్ను పొందఁదగిన దైవసంపదనుకూడ పొందకయే వ్యాఘ్రాదినీచజన్మముల కంటె నీచతమము లగు క్రిమికీటకాదిజన్మములను పొందుచున్నారని తా.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥

టీక. కామః = కామమును, క్రోధః = క్రోధమును, తథా = ఆ ప్రకారముగానే, లోభః = లోభమును, ఇతి = అని, త్రివిధమ్=మూఁడు విధము లగు, ఇదమ్ = ఈ యసురసంపద, నరకస్య = నరక ప్రాప్తికి, ద్వారమ్=సాధనము, ఆత్మనః=తనకు (కామాదుల నాశ్రయించినవానికి), నాశనమ్=(సకలపురుషార్థయోగ్యతను పోఁగొట్టునది యగుటచేత) నీచజన్మములను కలుగఁజేయునది, (భవతి=అగుచున్నది), తస్మాత్=అందువలన (తనకు నీచజన్మదాయక మగుటవలన), ఏతత్త్రయమ్ = ఈ కామక్రోధ లోభములను మూఁటిని, త్యజేత్ = వదలవలెను.

దండు; పరామ్=ఉత్కృష్టమైన, గతిమ్=గతిని (స్వర్గమును, లేక మోక్షమును), న అవాప్నోతి = పొందఁడు.

ఓ యర్జునుఁడా! నీవు దీనిని చేయుము, అని చెప్పునట్టి విధివాక్యములున్ను నీవు దీనిని చేయకుము, అని చెప్పునట్టి ప్రతిషేధవాక్యమును, అనఁగా వేదోక్తము లగు విధిప్రతిషేధవాక్యములను అనాదరణ చేసి విడిచిపెట్టి స్వేచ్ఛాప్రకార మెవ్వఁడు నడచుకొనుచున్నాఁడో వానికి పురుషార్థప్రాప్తియోగ్య మగు తత్త్వజ్ఞానము కాని, ఇహలోకసౌఖ్యము కాని, స్వర్గము కాని (లేక) మోక్షము కాని యేదియును లేదని తాత్పర్యము.

శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ.
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ 24

టీక. తస్మాత్=అందువలన, తే=నీకు, కార్యాకార్యవ్యవస్థితౌ=ఏది చేయవచ్చును, ఏది చేయరాదు అను విషయమునందు. శాస్త్రమ్ = వేదములు స్మృతులును. ప్రమాణమ్ = ప్రమాణము, శాస్త్రవిధానోక్తమ్ = శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడిన, కర్మ=క్షత్రియకర్మమును, జ్ఞాత్వా=తెలిసికొని, ఇహ=కర్మాధికార మగు భూమియందు, కర్తుమ్=చేయుటకు, త్వమ్=నీవు, అర్హసి=తగుదువు.

ఓ యర్జునుఁడా! వేదశాస్త్రప్రమాణము లేనివానికి ఇహలోకసౌఖ్యము గాని, మోక్షప్రాప్తియోగ్య మగు తత్త్వజ్ఞానము గాని, మోక్షము గాని కలుగదు గాన యేది చేయవచ్చును? ఏది చేయఁగూడదు? అను విషయములోనికి వేదశాస్త్రములే ప్రమాణములు గాన వేదశాస్త్రములయందుఁ జెప్పియున్న ప్రకారము కర్మాధికారము గల భూమియందు క్షత్రియధర్మ మగు యుద్ధకర్మమును చేయుటకు నీవు తగియున్నావని తా.

ఇతి శ్రీమహాభారతే శాతసాహస్ర్యాం
సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి

ఓం.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః



# శ్రీభగవద్గీత - సప్తదశాధ్యాయము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



## శ్రద్ధాత్రయ విభాగయోగము.

అర్జున ఉవాచ:—

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః॥౧

టీక. అర్జునఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హే కృష్ణ = ఓ కృష్ణుఁడా! యే = ఎవరు, శాస్త్రవిధిమ్ = శ్రుతిస్మృతిచోదిత మగు ధర్మమును, ఉత్సృజ్య = వదలి, శ్రద్ధయా = (వృద్ధవ్యవహారానుసారముగా) ఆస్తిక్యబుద్ధితో, అన్వితాః = కూడుకొన్నవారై, యజన్తే = (దేవాదలను) పూజించుచున్నారో, తేషామ్ = వారలకు, నిష్ఠాతు = ఆశ్రయము (స్థితి), సత్త్వమ్ (కిమ్) = సత్త్వమా? ఆహో = లేక, రజః (కిమ్) = రజోగుణమా? (ఆహో = లేక) తమః = తమస్సా? కా = ఏది?

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.— ఓ కృష్ణుఁడా! శ్రుతిస్మృతి చోదితములగు ధర్మములను విడిచిపెట్టి, అనఁగా శాస్త్రధర్మముల నెఱుం

సంస్కారముతోఁ గూడిన యంతఃకరణానురూప మగు), శ్రద్ధా = శ్రద్ధ; భవతి = కలుగు చున్నది; అయమ్ = ఈ, పురుషః = (సంసారి యగు) జీవుఁడు, శ్రద్ధామయః = శ్రద్ధాస్వరూపుఁడు, (భవతి=అగు చున్నాఁడు;) యః = ఎవఁడు, యచ్ఛ్రద్ధః = ఎటువంటిశ్రద్ధ గలవాఁడో, సః=వాఁడు, సఏవ=అట్టి శ్రద్ధ గలవాఁడు, (భవతి=అగు చున్నాఁడు).

ఓ యర్జునుఁడా! వివేకులు గాని, అవివేకులు గాని యగు సకల ప్రాణులకును అంతఃకరణానురూప మగు శ్రద్ధ కలుగు చున్నది; సంసారి యగు జీవుఁడు శ్రద్ధాస్వరూపుఁ డగుచు యెవ్వఁ డేయేగుణోత్కర్షతో నున్నాఁడో యా యా గుణానుగుణ్య మగు శ్రద్ధ గలవాఁడు అగు చున్నాఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥

టీ. సాత్త్వికాః = సత్త్వగుణప్రధాను లగు, జనాః = జనులు, దేవాన్=(వస్వాది) దేవతలను, యజన్తే=పూజించు చున్నారు; రాజసాః= రజోగుణప్రధాను లగు (జనాః=జనులు) వారు, యక్షరక్షాంసి=కుబేరాది యక్షులను నైరృతాది రాక్షసులను, (యజన్తే = పూజించు చున్నారు;) అన్యే = (సాత్త్వికరాజసులకంటె) నితరు లగు, తామసాః = తమోగుణ ప్రధాను లగు, జనాః = జనులు, ప్రేతాన్ = (స్వధర్మత్యాగమువలన భ్రష్టులై శరీరత్యాగానంతరము వాయుశరీరమును పొందిన బ్రాహ్మణాదులను) ప్రేతములను, భూతగణాంశ్చ = భూతగణములను, యజన్తే = పూజించు చున్నారు.

సత్త్వప్రకృతి గల జనులు సాత్త్వికులగువస్వాదిదేవతలను పూజించు చున్నారు, రజఃప్రకృతిగల జనులు రాజసు లగు కుబేరాదియక్షులను నైరృత్యాది రాక్షసులను పూజించు చున్నారు, తామసప్రకృతి గల జనులు తామసికు లగు ప్రేతములను, అనఁగా వారివారికులధర్మముల విడుచుట వలన భ్రష్టులయిన బ్రాహ్మణాదులు మరణానంతరము వాయుశరీరమును

చేయుచున్నవారును, దేహమునందు అంతర్యామిగా నున్న నాకు సమ్మ
తముకానికార్యములను చేయుటచే నన్ను కృశింపఁజేయుట, కనుక నా
కనిష్టకార్యములను చేసి నన్ను కృశింపఁజేయువారును, శాస్త్రనిషిద్ధమును
ప్రాణులకును తనకును పీడను కలిగించునదియు నగు, అనఁగా నతిభయం
కర మగు తపస్సును చేయువారు నగు అట్టి యవివేకులందఱు అసుర
స్వభావము గలవారు, అనఁగా నతిక్రూర మగు కృత్యములు గలవా రని
తెలిసికొనుము; అని తాత్పర్యము.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ 7

టీక. సర్వస్యఅపి = జనులకందఱికిని, ఆహారస్తు = అన్నము
మొదలగు ఆహారమును, త్రివిధః=మూఁడువిధములుగా, ప్రియః = ప్రియ
మైనది, భవతి=అగు చున్నది; తథా=అప్రకారముగా, యజ్ఞః=యజ్ఞము,
త్రివిధః=మూఁడువిధము అయినది, భవతి=అగు చున్నది; దానమ్=దానము,
త్రివిధమ్ = మూఁడువిధము అయినది, భవతి = అగు చున్నది; తపః =
తపస్సును, త్రివిధమ్=మూఁడువిధము అయినది, భవతి = అగు చున్నది;
తేషామ్=ఆ యాహారాదుల యొక్క, ఇమమ్=ఈ, (చెప్పఁబోవు) భేదమ్=
(సాత్త్విక రాజస తామసరూప మగు) భేదమును, శృణు = వినుము.

తా. యర్జునుఁడా! జనులకందఱికి శ్రద్ధ యెట్లు మూఁడువిధములుగా
నున్నదని చెప్పితివో యట్లే, ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము అను
నవియును సాత్త్వికములు, రాజసములు, తామసము అను భేదములం గలిగి
యున్నవి; వానియొక్క భేదములను చెప్పెద వినుము; అని తాత్పర్యము.

శ్లో॥ ఆయు స్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః॥

టీక. ఆయుః......వివర్ధనాః-ఆయుః = ఆయుష్యము, సత్త్వ =
చిత్తస్థైర్యము (లేక) వీర్యము, బల =(తనకుఁ దగిన పనివిషయమై శ్రమ

మిగుల చేఁదు గల నింబ (వేఁప) మొదలగునవియును, మిగుల పుల్లనివియును, మిక్కిలి యుప్పయినవియును, మిగుల యుష్ణమును కలిగించునవియును, మిగుల కారములు అయిన మిరపకాయలు మొదలగునవియును, మిక్కిలి చమురు లేక రూక్షము లగు కొఱ్ఱలు ఆర్లు మొదలగునవియును, అధిక దాహమును కలుగఁజేయు ఆవాలు మొదలగునవియును, తాత్కాలిక హృదయతాపము మొదలగు దుఃఖములను, అటుపిమ్మట కలుగు చెడుతలంపు మొదలగువానివలన కలుగు శోకములను, రోగములను కలిగించునవియు నగు నట్టి యాహారముల నపేక్షించువారు రజోగుణ స్వభావము గలవా రని తెలిసి కొనవలసిన దని తాత్పర్యము.

శ్లో॥ యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ ౧౦

టీక. యాతయామమ్ = చక్కఁగా పక్వము కానిదియును (లేక) వండిన పిమ్మట జామునకు పైనాఁటినదియును (చల్లారినదియును), గతరసమ్ = సారము చచ్చినదియును, పూతి = దుర్గంధము (గవులు) కలదియును, పర్యుషితంచ=వండిన మఱునాటిదియును (చద్ది దియును), ఉచ్ఛిష్టమపి=ఎంగిలిదియును (ఇతరులు తినఁగా మిగిలినదియును), అమేధ్యంచ = భుజింపఁదగ దని నిషేధింపఁబడిన గంజాయి మొదలగునదియును, (అగు) భోజనమ్=ఆహారము (అన్నాదికము), యత్=ఏదో, (తత్=అది) తామసప్రియమ్=తమోగుణ స్వభావుల కిష్టమైనది, (భవతి=అగుచున్నది).

చక్కఁగా పక్వము కానిదియును (లేక) ఒకజామునకు గ్రిందట వండఁబడినదియును, సారము లేనిదియును, గవులు కొట్టునదియును, ఒక రోజు క్రిందట వండఁబడినదియును, అనఁగా చద్దిదియును, ఇతరులు తినఁగా మిగిలినదియును, అనఁగా ఎంగిలిదియును, శాస్త్రనిషిద్ధము లగు గంజాయి మొదలగునవియును అగు ఆహారము తమోగుణస్వభావు లగువారి కిష్టమైనది, అనఁగా తామసు లిట్టి యాహారములను భుజింతు రని తా.

టీక. విధిహీనమ్=శాస్త్రోక్తవిధికి విపరీతమైనదియును (అశాస్త్రీయమైనదియును), అసృష్టాన్నమ్ = బ్రాహ్మణాదుల కన్నదానరహితమైనది యును, మన్త్రహీనమ్ = మంత్రస్వరవర్ణములయొక్క లోపములు గలది యును, అదక్షిణమ్ = యథోక్తదక్షిణారహితమును, శ్రద్ధావిరహితమ్ = శ్రద్ధ లేనిదియును, (అగు) యజ్ఞమ్ = యజ్ఞమును, తామసమ్ = తామస యజ్ఞమునుగా, పరిచక్షతే = (పెద్దలు) చెప్పుచున్నారు.

శాస్త్రవిరుద్ధముగాఁ జేయఁబడినదియును, బ్రాహ్మణాదుల కన్న దానము చేయక చేయఁబడునదియును, మంత్రలోపమును స్వరలోపమును వర్ణలోపమును గలదియును, శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిగా సంపూర్ణ దక్షిణలు లేనిదియును, శ్రద్ధలేక చేయఁబడునదియును, అనఁగా అశ్రద్ధతోఁ జేయఁబడునదియును అగు యజ్ఞమును తామసయజ్ఞమునుగా పెద్దలు చెప్పు చున్నారని తాత్పర్యము.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥ ౧౪

టీక. దేవద్విజగురుప్రాజ్ఞపూజనమ్ - దేవ = బ్రహ్మాదిదేవతల యొక్కయు, ద్విజ = బ్రాహ్మణులయొక్కయు, గురు=తండ్రి దేశికుఁడు మొదలగు గురువులయొక్కయు, ప్రాజ్ఞ = తత్త్వవేత్తలయొక్కయు, పూజనమ్ = పూజచేయుటయును, శౌచమ్ = (మృజ్జలములచే) శరీరశోధ నయును, ఆర్జవమ్ = ఋజుగతియును, బ్రహ్మచర్యమ్=బ్రహ్మచర్యమును (నియుక్తదినములయందు స్వస్త్రీసంగమును), అహింసా చ=హింసచేయ కుండుటయును, శారీరమ్ = శరీరముచేఁ జేయఁదగిన, తపః = తపస్సు, (ఇతి = అని) ఉచ్యతే = (పెద్దలచే) చెప్పఁబడు చున్నది.

బ్రహ్మాదిదేవతలను, సద్బ్రాహ్మణులను, తండ్రి మొదలగు గురువు లను, తత్త్వవేత్తలను పూజించుటయును; మృజ్జలములచేత శరీరశోధనను,

ఇతి = అను, ఏతత్ = ఇది, మానసమ్ = మనస్సుచేతఁ జేయఁదగిన తపః=తపస్సు, (ఇతి=అని) ఉచ్యతే= పెద్దలచేతఁ జెప్పఁబడు చున్నది.

మనస్సునం దెటువంటివిచారములను పెట్టుకొనక యుండుటయును, సకలప్రాణులకును యెల్లప్పుడును మేలు కోరుటయును, ఎప్పుడును పరమాత్మను మననము చేయుటయును, చిత్తము నితరవిషయములనుండి త్రిప్పుటయును, ఇతరుల మోసపుచ్చువలయు ననుతలంపే లే కుండుటయును మనస్సుచేతఁ జేయఁదగిన తపస్సని పెద్దలు చెప్పు చున్నా రని తా.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥　౧౭

టీక. పరయా=శ్రేష్ఠమైన, శ్రద్ధయా=శ్రద్ధతో (ఆస్తిక్యబుద్ధితో), యుక్తైః = కూడుకొన్నవారును, అఫలాకాంక్షిభిః = ఫలాభిలాష లేనివారును, (అగు) నరైః=పురుషులచేత, తప్తమ్=అనుష్ఠింపఁబడిన, తత్ = ఆ, త్రివిధమ్=(కాయిక వాచిక మానసికము లను భేదములచేత) మూఁడు విధము లయిన, తపః = తపస్సును, సాత్త్వికమ్=సాత్త్వికమునుగా, పరిచక్షతే = (పెద్దలు) చెప్పు చున్నారు.

శ్రేష్ఠ మగు శ్రద్ధతోఁ గూడుకొన్నవారును, ఫలాభిలాష లేనివారును అగు పురుషులచేత ననుష్ఠింపఁబడిన కాయికము, వాచికము, మానసికము అను మూఁడువిధము లైన తపస్సును సాత్త్వికతపస్సనుగా పెద్దలు చెప్పుచున్నారు, అట్లగా పైన చెప్పిన తపస్సే సాత్త్వికతపస్సనియును, సత్పురుషు లవలంబింపవలసిన దనియును తాత్పర్యము.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥　౧౮

టీక. సత్కారమానపూజార్థమ్ - సత్కార = (ఇతఁడు సాధువు, తపోవంతుఁడు అని తన్నితరులు చెప్పుకొనుటకొఱకును) సత్కారముకొఱ

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

టీక. దాతవ్యమ్=ఇయ్యవలసినదే, ఇతి=అను నిశ్చయముతో, దేశే=(కురుక్షేత్రాది) పుణ్యదేశమునందును, కాలేచ=(గ్రహణసంక్రాంత్యాది) పుణ్యకాలమునందును, అనుపకారిణే = ప్రత్యుపకారము చేయు శక్తిలేని వానికిని, పాత్రేచ=భక్తిజ్ఞానములు గలిగిన (షట్శాస్త్రవేత్త, వేదవేత్త మొదలగు) పాత్రునకును, యత్=ఏ, దానమ్=దానము, దీయతే=ఇయ్యఁబడు చున్నదో, తత్ = ఆ, దానమ్ = దానము, సాత్త్వికమ్=సాత్త్విక దానము, (ఇతి=అని) స్మృతమ్=ఎంచఁబడు చున్నది.

కురుక్షేత్రము గయ కాశి మొదలగు పుణ్యక్షేత్రములయందును, సంక్రాంతి గ్రహణము మొదలగు పుణ్యకాలములయందును, భక్తిజ్ఞానములు గలిగినట్టియు వేదములను వేదాంగములను నెఱింగినట్టియు సన్మార్గప్రవర్తకులగు పాత్రులకును, ప్రత్యుపకారము చేయ శక్తిలేని వారికిని ప్రత్యుపకారము చేయ శక్తి యున్న వారికిని, నిరభిలాషతో నియ్యవలెనను నిశ్చయబుద్ధిచే నిచ్చుదానము సాత్త్వికదానము; అని తాత్పర్యము.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

టీక. ప్రత్యుపకారార్థమ్ = సమయము వచ్చినపుడు నాకితఁడు బదులుపకారము చేయుఁ ననికాని, ఫలమ్=(పారలౌకిక మైన) ఫలమును, ఉద్దిశ్యవా పునః=ఉద్దేశించి గాని, యత్తు = ఏదానమైతే, దీయతేచ = ఈయఁబడు చున్నదో, పరిక్లిష్టమ్=మనఃక్లేశముతోఁ గూడిన, తత్=ఆ, దానమ్ = దానము, రాజసమ్=రాజసదానము, (ఇతి=అని) స్మృతమ్ = ఎంచఁబడు చున్నది.

బ్రహ్మవేత్తలచేత, ఉపనిషత్తులయందు) స్మృతః = నిశ్చయింపఁబడినది; తేన=ఆ త్రివిధనిర్దేశముచేత, బ్రాహ్మణాః=బ్రాహ్మణులును, వేదాశ్చ = వేదములును, యజ్ఞాశ్చ = యజ్ఞములును, పురా=పూర్వము విహితాః = నిర్మింపఁబడినవి.

పరబ్రహ్మమునకు ఓమ్ అనియును, తత్ అనియును, సత్ అనియును, బ్రహ్మవేత్తలు నామమును నిర్దేశించిరి. అట్టి నామత్రయము వలన విధిమార్గప్రవర్తకము లగు వేదములును, యజ్ఞకర్మముల కధికారు లగు బ్రాహ్మణులును, కర్మస్వరూపములగు యజ్ఞములును పుట్టినవి, కనుక యజ్ఞాదులకు వైగుణ్యము కలుగు నని తోఁచినప్పుడు పైన జెప్పిన నామత్రయము నుచ్చరించి నట్లైన యజ్ఞాదులకు సాద్గుణ్యము కలుగును, ఇంతయు నకే యజ్ఞాదులయందు నామత్రయమును స్తోత్రము చేయుట గాని తా.

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪

టీక. తస్మాత్ = (బ్రహ్మముయొక్క నిర్దేశము ప్రశస్తమైన దగుట వలన) అందువలన, బ్రహ్మవాదినామ్=వేదవాదులయొక్క, విధానోక్తాః=శాస్త్రచోదితము లయిన, యజ్ఞదానతపఃక్రియాః=యజ్ఞదానతపస్స్వరూపము లయిన సత్కర్మములు, ఓమితి=ఓమ్ అని, ఉదాహృత్య = ఉచ్చరించి, సతతమ్=ఎల్లప్పుడును, ప్రవర్తంతే=ప్రవర్తించుచున్నవి.

పరబ్రహ్మముయొక్క నామముగా నిర్దేశింపఁబడిన దగుటచేత ప్రశస్తమైన దగుటవలన వేదాధ్యయనసంపన్నులు శాస్త్రచోదితము లయిన యజ్ఞదానతపస్స్వరూపము లయిన కర్మములఁ జేయుటకు ముందుగా నోంకారము నుచ్చరించి యజ్ఞాదికర్మములను చేయుచున్నా రని తా.

శ్లో॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥ ౨౫

టీక. యజ్ఞే=యజ్ఞమునందును, తపసి=తపస్సునందును, దానేచ = దానమునందును, స్థితిశ్చ = స్థితియును (ఆసక్తియు), సత్=సత్తు, ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడు చున్నది; తదర్థీయమ్ =యజ్ఞదానతపస్సుల కొఱకైన (లేక) ఈశ్వరునికొఱకైన, కర్మచైవ=కర్మమును, సదిత్యేవ= సత్ అనియే, విద్వద్భిః=జ్ఞానులచేత, అభిధీయతే = చెప్పఁబడు చున్నది.

(ఓ యర్జునుఁడా! యజ్ఞదానతపస్సులు చేయవలయు నను నాశయమును, వానియందలి భక్తియును, యజ్ఞదానతపంబులకొఱకు సాధనములయిన కర్మములను, అనఁగా పనులను (లేక) సామత్రయవాచ్యుఁడయిన పరమాత్మనుద్దేశించి చేయఁబడు కర్మములను సచ్ఛబ్దవాచ్యములే యని పెద్దలచేతఁ జెప్పఁబడు చున్నవి; అని తాత్పర్యము.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥ ౨౮

టీక. హేపార్థ = ఓ అర్జునుఁడా! అశ్రద్ధయా = అశ్రద్ధతో, హుతమ్=వేల్వఁబడిన హోమమును, దత్తమ్=ఈయఁబడిన (దానమును), తప్తమ్ = చేయఁబడిన, తపః = తపస్సును. కృతంచ = ఇతర మగు స్తుతి నమస్కారాదికమును, యత్=ఏదో, తత్=అది, అసత్=అసత్తు, ఇతి = అని, ఉచ్యతే= చెప్పఁబడు చున్నది; (తేషామ్=అట్టి యసత్కర్మములకు) ప్రేత్య=పరలోకమునందు, న=(ప్రయోజనము) లేదు; ఇహచ=ఈ లోకమునందును, నో=(ప్రయోజనము) లేదు.

ఓ యర్జునుఁడా! అశ్రద్ధతో జేసిన హోమ దాన తపంబులును ఇతరములగు స్తుతి నమస్కారాదులను అసత్ అని చెప్పఁబడు చున్నవి; అట్టి యసద్వాచికములగు కర్మములకు శరీరత్యాగానంతరమును ప్రయోజనము లేదు, ఈ లోకమునందును ప్రయోజనము లేదు, కనుక యే కార్యములను కాని శ్రద్ధతో జేయవలయునే కాని యశ్రద్ధతో జేయ రాదు; అని తా.

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః



# శ్రీభగవద్గీత - అష్టాదశాధ్యాయము,

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

## మోక్షయోగము,

## లేక

## మోక్షసన్న్యాసయోగము.



అర్జున ఉవాచ:—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥ ౧

టీక. అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పెను. హృషీకేశ = ఇంద్రియనియామకుఁడవును, కేశినిషూదన = కేశి యను రక్కసుని సంహరించినవాఁడవును, మహాబాహో = గొప్పబాహుబలము గలవాఁడవు నగు ఓ వాసుదేవా! సన్న్యాసస్య = సన్న్యాసముయొక్కయొక్కయు, త్యాగస్య చ = త్యాగముయొక్కయు, తత్త్వమ్ = యాథార్థ్యమును, పృథక్ = వేఱువేఱుగా, వేదితుమ్ = తెలిసికొనుటకొఱకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించుచున్నాను.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు — ఇంద్రియనియామకుఁడవును, కేశి యను రాక్షసుని సంహరించినవాఁడవును, గొప్పభుజబలము గలవాఁడవును

టీక. ఏకే=మతికొందఱు, మనీషిణః=విద్వాంసులు, దోషవత్ = (బంధహేతు వగుటవలన) సకల మగు పాపము గల (లేక) రాగాది దోషములవలె, కర్మ = కర్మము, త్యాజ్యమ్ = విడువఁదగినది, ఇతి = అని, ప్రాహుః = చెప్పు చున్నారు; అపరే = మతికొందఱు, యజ్ఞదానతపః కర్మ = యజ్ఞమును దానమును తపస్సును అనెడి కర్మము, త్యాజ్యమ్ = విడువఁ దగినది, న = కాదు, ఇతిచ = అనియును, ప్రాహుః = చెప్పు చున్నారు.

కొందఱు విద్వాంసులు బంధహేతువు లగుటవలన సకలము లగు పాపపుకర్మములు చేయక విడువఁదగినవి యనియును (లేక) రాగాది దోషముల నెట్లు విడుచు చున్నామో యట్లే పాపపుకర్మములను విడువ వలయునని చెప్పు చున్నారు; మతికొందఱు విద్వాంసులు యజ్ఞదాన తపోరూపము లగు కర్మములను అనఁగా యజ్ఞదానతపంబులను విడువఁ గూడ దని చెప్పు చున్నారు; అని తాత్పర్యము.

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥ ౪

టీక. హే భరతసత్తమ = భరతవంశపురాజులలో శ్రేష్ఠుఁడ వైన యో యర్జునా! తత్ర = (త్యాగసన్న్యాసరూప మగు) ఆ, త్యాగే = త్యాగము విషయమై, నిశ్చయమ్ = యథార్థమును, మే = నామాటగా, శృణు = వినుము; హే పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడ వైన యో యర్జునుఁడా! త్యాగః = త్యాగము, త్రివిధః = (తామస రాజస సాత్త్విక భేదములచేత) మూఁడువిధములుగా, సంప్రకీర్తితః హి = (శాస్త్రముల యందు) చక్కఁగా జెప్పఁబడి యున్నది గదా.

తా. అర్జునా! అందఱు అన్నివిధములుగా తలఁచు చున్న త్యాగము, అనఁగా త్యాగసన్న్యాసములు రెండును శాస్త్రములయందు తామ సాది భేదములచేత మూఁడువిధములుగాఁ జెప్పఁబడి యున్నవి; ఈ త్యా

తా. అర్జునుఁడా! యజ్ఞాదికర్మములయందు కర్తృత్వాభిమానమును, యజ్ఞాదికర్మములయొక్క ఫలములను వదలి నిరభిలాషతో యజ్ఞ దాన తపోరూపంబు లయిన కర్మంబులు చేయవలసిన వే యని నాయొక్క నిశ్చయమైన యభిప్రాయ మని తాత్పర్యము.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ ౭

టీక. నియతస్య=నియత మైన (నిత్యము చేయఁదగిన దైన), కర్మణః = (సంధ్యావందనాది) కర్మముయొక్క, సన్న్యాసస్తు = త్యాగ మన్ననో (విడుచుట యన్ననో), నోపపద్యతే = (ముముక్షువుచేత) పొందఁబడఁదగదు, మోహాత్ = అజ్ఞానముకలన దైన, తస్య = ఆ నిత్యకర్మము యొక్క, పరిత్యాగః = పరిత్యాగము (వదలుట), తామసః = తామసత్యాగము, (అని) పరికీర్తితః = చెప్పఁబడినది.

కామ్యకర్మములు బంధహేతువు లగుటవలన ముముక్షువు, అనఁగా నంతఃకరణశుద్ధిఁ గోరువాఁడు అట్టి కామ్యకర్మములను విడుచుట యుక్తమే కాని, అంతఃకరణశుద్ధికి కారణము లయిన సంధ్యావందనాది నిత్యకర్మములను విడువరాదు; మోహ మనఁగా తమస్సు కనుక అట్టి తమస్సువలన, అనఁగా నజ్ఞానమువలన విడువఁబడు నిత్యకర్మత్యాగము తామసత్యాగము అని చెప్పఁబడు చున్న దని తాత్పర్యము.

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥

టీక. కాయక్లేశభయాత్ = శరీరమునకు క్లేశ మను భయమువలన, దుఃఖమిత్యేవ = కష్ట మైనదే యని, యత్ = ఏ, కర్మ = నిత్యకర్మమును, (యః = ఎవఁడు) త్యజేత్ = వదలిపెట్టునో, సః = వాఁడు, రాజసమ్ = రజోగుణప్రవర్తిత మగు, త్యాగమ్ = త్యాగమును, కృత్వా = చేసి, త్యాగఫలమ్ =

జ్ఞానలక్షణ మగు ప్రజ్ఞతోఁ గూడిన చిత్తము గలవాఁడును), ఛిన్నసంశయః= నశించిన సకలసందేహములు గలవాఁడును (మాయాకృతి సర్వసందేహరహితుఁడుష్షు) అగు, త్యాగీ= సాత్త్వికత్యాగి, అకుశలమ్=దుఃఖావహము ను సంసారబంధకారణము నగు, కర్మ=కర్మమును (కామ్యకర్మమును), నద్వేష్టి= ద్వేషింపఁడు; కుశలే=శోభనమగు (చిత్తశుద్ధిద్వారా మోక్షహేతు వగు), (కర్మణి=నిత్యకర్మమునందు) నానుషజ్జతే=ప్రేమనుంచఁడు.

ఆత్మానాత్మ వివేకజ్ఞానమునకు హేతు వైన సత్త్వగుణముతోఁ గూడుకొన్న వాఁడును, అట్టివాఁడు గనుక నే మేధావియును, అనఁగా ఆత్మ జ్ఞానలక్షణ మైన ప్రజ్ఞాసహిత మగు చిత్తము గలవాఁడును, అట్టి చిత్తము గలవాఁడు గనుక నే మాయాకృతము లగు సకలసందేహములు లేనివాఁడును, చిత్తస్థైర్యము గలవాఁడు నగు సాత్త్వికత్యాగి సంసారబంధకారణము గనుక దుఃఖావహ మగు కామ్యకర్మమునందు ద్వేషబుద్ధియును, చిత్తశుద్ధి ద్వారా మోక్షదాయకము గుటచేత శోభన మగు నిత్యకర్మమునందు ఆపేక్షయును లేక విలక్షణుఁడుగా నుండును, అనఁగా శుభాశుభదాయకము లగు నిత్యకామ్య కర్మములయందు సమచిత్తుఁడుగా నుండు నని తాత్పర్యము.

శ్లో॥ నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ ౧౧

టీక. దేహభృతా=దేహాత్మాభిమానము గలయవివేకిచేత, అశేషతః=శేషము లేకుండునటుల (సర్వమును అగు), కర్మాణి=కర్మములు, త్యక్తుమ్=విడుచుటకు, నశక్యం+హి=శక్యము కాదు గదా! యః=ఎవఁడు, కర్మఫలత్యాగీతు=కర్మఫలముల నైనను విడుచుచున్నాఁడో, సః=వాఁడు, త్యాగీ=త్యాగి, ఇతి=అని, అభిధీయతే=చెప్పఁబడుచున్నాఁడు.

లోకమునందు ఎవ్వరును, అనఁగా దేహాత్మాభిమానము గలవా రెవ్వరును నిత్యనైమిత్తికాది సకలకర్మములను త్యజించ లేరు అట్లు చేయ లేరు

కృతాంతే = కర్మాంతము గల (తత్త్వజ్ఞానోత్పత్తియే యంతముగాఁ గల); సాంఖ్యే = వేదాంతశాస్త్రమునందు, ప్రోక్తాని = చక్కఁగాఁ జెప్పఁబడినవి యును, ఇతాని = ముందు శ్లోకముల నాల్గింటిచేత జెప్పఁబోవునట్టి అధిష్ఠానాదులను, పంచ = అయిదైన, కారణాని = కారణములను, మే = నాయొక్క (వచనాత్ = మాటవలన) నిబోధ = తెలిసికొనుము.

ఓ యర్జునుఁడా! సకలకర్మములయొక్క సిద్ధికొఱకు, తత్త్వజ్ఞానోత్పత్తియే యంతముగాఁ గల వేదాంతశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్న అధిష్ఠానము మొదలుగాఁ గల యైదుకారణములను నేను చెప్పెదను వినుము! అని తాత్పర్యము.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ ౧౪

టీ. అధిష్ఠానమ్ = (సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, జ్ఞానము మొదలగువానియొక్క ప్రకాశమున కాశ్రయమగు) శరీరమును, తథా = ఆప్రకారముగా, కర్తా = (శరీరాద్యభిమానము గల) భోక్తయును, పృథగ్విధమ్ = నానావిధములు (జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు, బుద్ధి యని పండ్రెండువిధములు) అయిన, కరణం చ = కరణమును (చర్మము, కన్నులు, చెవులు, నాలుక, నాసిక, నోరు, చేతులు, పాదములు, మలద్వారము, మూత్రద్వారము, మనస్సు, బుద్ధియును) అను నింద్రియములును, వివిధాశ్చ = నానావిధములును, పృథక్ = భిన్నములును అయిన, చేష్టాః = (ప్రాణాపానాది పంచవాయువులయొక్క) వ్యాపారములును, అత్ర = ఈ యధిష్ఠానాదులలో, పంచమమ్ = అయిదవదైన, దైవం చైవ = చక్షురాదులయొక్క నియామకదేవతయును (లేక) చక్షురాదులయొక్క నియామకదేవత యయిన సూర్యాదులకు ప్రేరకుఁడగు నంతర్యామియును, (ఇతి = అను), ఏతాని = పైన జెప్పిన

టీక. తత్ర=(పూర్వము చెప్పియున్న) సకలకర్మములు, ఏవసంసతి= అధిష్ఠానాదిపంచకము కారణము అయిన దగు చుండఁగా, కేవలమ్ = నిరుపాధికుఁడును సంగరహితుఁడును అగు, ఆత్మానంతు=ఆత్మను (జీవుని), కర్తారమ్ = కర్తనుగా, యః = ఎవఁడు, పశ్యతి = చూచు చున్నాఁడో (తలఁచుచున్నాఁడో) అకృతబుద్ధిత్వాత్=(వేదాంతాచార్యులయొక్క ఉపదేశ న్యాయములచేత) సంస్కరింపఁబడని చిత్తము గలవాఁ డగుటచేత, దుర్మతిః = నిందింపఁదగినదియును - విపరీత మైనదియును-మిక్కిలి చెడినదియును-జననమరణరూపదుఃఖములకు కారణమును అయిన బుద్ధి గల వాఁడును అగు, సః=వాఁడు, నపశ్యతి = (ఆత్మయొక్క కాని, లేక కర్మముయొక్క కాని తత్త్వమును) చూడఁడు, అనఁగా తెలియఁగఁడు.

సకలకర్మములకును అధిష్ఠానాదికము లయిదును కారణము లగుచుం డఁగా, నిరుపాధికుఁడును సంగరహితుఁడును అగు నాత్మను (తనను) కర్త నుగా దలఁచువాఁడు సద్గురూపదేశముచేత సంస్కరింపఁబడని చిత్తము గలం గుటవలన తాను బండియందుండి పక్కనున్నబండి పోవు చుండఁగా తనబండి పోవుచున్న దను విపరీతబుద్ధిగల వానివలె విపరీతబుద్ధిగలవాఁడై ఆత్మయొక్క గాని, కర్మముయొక్క గాని, సత్యమును తెలిసికొనఁడు; అని తాత్పర్యము.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాం ల్లోకాన్నహన్తి న నిబధ్యతే॥౧౭

టీక. అహంకృతః = నేను చేసినవాఁడను అను (నేను కర్త నను), భావః = అభిప్రాయము, యస్య = ఎవనికి, న = లేదో, యస్య = ఎవని యొక్క, బుద్ధిః=బుద్ధి, న లిప్యతే=(నే నీపాపమును చేసితిని గాన నాకు నరకము కలుగును, నే నీ పుణ్యకార్యమును చేసితిని గాన నాకు స్వర్గము కలుగును అను ఫలాభిలాషతో) జేరదో, సః=వాఁడు (సద్గురువుచే నుపదే శింపఁబడి శ్రవణ మనవనాదులచేత సంస్కరింపఁబడిన చిత్తము గలవాఁడు),

కర్మలకు ఆధార మేదో యది కర్మసంగ్రహ మని చెప్పఁబడు చున్నది; అట్టి కర్మ సంగ్రహము కర్త, కర్మ, కరణము అని మూఁడువిధములుగా నున్నదని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥

టీక. జ్ఞానమ్ = జ్ఞానమును, కర్మచ = కర్మమును, కర్తాచ = కర్తయును, గుణసంఖ్యానే = (గుణములను కార్యాదిభేదములచేతఁ బక్కాగాఁ బ్రతిపాదించునదియును, కపిలమహర్షి ప్రోక్తమైనదగు) సాంఖ్యశాస్త్రమందు, గుణభేదతః = సత్త్వాదిగుణభేదములవలన, త్రిధైవ = మూఁడు విధములుగానే, ప్రోచ్యతే = చెప్పఁబడుచున్నది; తాన్యపి = సత్త్వాదిభేదములచేత నైన జ్ఞానమును కర్మను కర్తనుగూడ, యథావత్ = శాస్త్రోక్త ప్రకారముగా, శృణు = వినుము.

(శ్రీ సర్వజ్ఞుఁడగు) కపిల మహర్షిచేతఁ జెప్పఁబడినదియును, కార్యాదిభేదములచేత గుణములను చక్కఁగాఁ బ్రతిపాదించునదియును అగు సాంఖ్యశాస్త్రము సత్త్వాదిభేదములచేత జ్ఞానము మూఁడువిధము లనియును, కర్మము మూఁడువిధము లనియును కర్త మూఁడువిధము లనియును చెప్పుచున్నది. కనుక సత్త్వాదిగుణములచేత మూఁడుమూఁడు భేదములుగా నున్న జ్ఞానము కర్మము, కర్త యనువానిని శాస్త్రోక్తప్రకారముగాఁ జెప్పెదను, స్థిర చిత్తముతో వినుము అని తాత్పర్యము.

శ్లో॥ సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ ౨౦

టీక. విభక్తేషు = వేఱ్వేఱుగానున్న, సర్వభూతేషు = (బ్రహ్మాదిస్తంబ పర్యంతము లగు) సకలభూతములయందును, అవిభక్తమ్ = (ఆకాశమువలె) ఎడతెగకయుండునదియును, ఏకమ్ = అద్వితీయ మైనదియును, అవ్యయమ్ =

వాఁడొక్కఁడే యను నీజ్ఞానము, రాజసజ్ఞానము ఇదియే ద్వైతజ్ఞానము అని తెలుసుకొనుము, దీనినే భేదజ్ఞాన మని చెప్పుదు రని తాత్పర్యము.

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవ దల్పం చ తత్తామసముదాహృతమ్ ౨౨

టీక. ఏకస్మిన్ = ఒక, కార్యే = కార్యమునందు (దేహమునందు, లేక ప్రతిమ మొదలగువానియందు), కృత్స్నవత్ = సమస్తమునువలె నే, సక్తమ్=(దేహ మాత్మ యనియును, విగ్రహముతే ఈశ్వరుఁ డనియును తలంపుతో) కూడుకొనినదియును, అహైతుకమ్ = యుక్తి (కారణము) లేనిదియును, అతత్త్వార్థవత్ = తత్త్వార్థరహిత మైనదియును, అల్పంచ = స్వల్పవిషయములు గలదియును (లేక) స్వల్పఫలము గలదియును, (అగు) యత్తు=ఏజ్ఞానము కలదో, తత్=ఆ జ్ఞానము, తామసమ్=తామసజ్ఞానము, (ఇతి = అని) ఉదాహృతమ్ = చెప్పఁబడినది.

దిగంబరులు క్షపణకులు మొదలగువారివలె దేహమే యాత్మ యనియును, ప్రతిమలు మొదలగునవియే ఈశ్వరుఁడు కాని యింతకన్న నేమి యును లేదను తలంపుతో దేహమునందు (లేక) విగ్రహమునందు అభిమానముతోఁ గూడిన యును, దేహమే యాత్మ యనియును పాషాణాదివిగ్రహముతే యీశ్వరుఁ డనియును చెప్పుట కేమి ప్రమాణ మని యడిగినయుక్తిరహిత మైనదియును, తత్త్వము గుర్తెఱుంగనిదియును, స్వల్పవిషయములు గలదియును (లేక) స్వల్పఫలము గలదియు నగు జ్ఞానము తామసజ్ఞానము, భేదబుద్ధి గలది కనుక మోక్షదాయకము కాదు; అని తాత్పర్యము.

శ్లో॥ నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే ౨౩

టీక. అఫలప్రేప్సునా = కర్మఫలమును పొంద నిచ్ఛ లేనివానిచేత (నిష్కామునిచేత), నియతమ్=నిత్య మైనదియును, సంగరహితమ్=కర్తృత్వ

హింసను (బాధను), పౌరుషం చ = (తనయొక్క) సామర్థ్యమును, అన
పేక్ష్య = లక్ష్యముగా యోచింపక, మోహాత్ = అజ్ఞానమువలన, యత్ = ఏది,
కర్మ = కర్మము, ఆరభ్యతే = మొదలు పెట్టఁబడు చున్నదో, తత్ =
అకర్మము, తామసమ్ = తామసకర్మము, (ఇతి = అని) ఉచ్యతే = చెప్పఁ
బడు చున్నది.

తాను చేయు కర్మమువలన మేలు కలుగునా? కీడు కలుగునా? అని
యును, దేహశక్తియొక్కయు ధనముయొక్కయు నాశమును, ఆ కర్మము
వలన పరులకుఁ గాని తనకుఁ గాని కలుగుబాధను, తనదు సామర్థ్యమును
యోచింపక అజ్ఞానమువలన చేయఁబడుకర్మము తామసకర్మ మని చెప్పఁ
బడుచున్న దని తాత్పర్యము.

శ్లో॥ ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ ౨౬

టీక: ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలాభిసంధి (ఫలాభిలాష) గల
వాఁడును, అనహంవాదీ = నేను కర్త ననియును భోక్త ననియును చెప్పెడు
స్వభావము లేనివాఁడును, ధృత్యుత్సాహసమన్వితః = ధైర్యము, ఉత్సా
హము అను వానితోఁ గూడుకొనినవాఁడును, సిద్ధ్యసిద్ధ్యోః = (ఆరంభించిన
కార్యముయొక్క) సిద్ధ్యసిద్ధులయందు (ఫలించినను ఫలించకపోయినను),
నిర్వికారః = వికారరహితుఁడును (సుఖదుఃఖములు లేనివాఁడును), (అగు)
కర్తా = కర్త, సాత్త్వికః = సాత్త్వికుఁడు, (ఇతి = అని) ఉచ్యతే = చెప్పఁ
బడుచున్నాఁడు.

దారాపుత్త్రాదులయం దభిలాష యను సంగము లేనివాఁడును,
నేను కర్తను నేను భోక్త ననునట్టి యభిమానరహితుఁడును, ధైర్యోత్సా
హములు గలవాఁడును, ఆరంభించిన కార్యము ఫలించినను ఫలించకున్నను
సంతోష వ్యసనములు లేనివాఁడును నగు కర్త సాత్త్వికుఁ డని చెప్పఁబడు
చున్నాఁడని తాత్పర్యము.

వాఁడును, విషాదీ=ఎల్లప్పుడును వ్యసనము గలవాఁడును, దీర్ఘసూత్రీచ = మందుఁడును (చురుకు లేనివాఁడును) అగు, కర్తా=కర్త, తామసః=తామసుఁడు, (ఇతి = అని) ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

చిత్తస్థైర్యము లేనివాఁడును, మూఢుఁడును, నమ్రత లేనివాఁడును, మోసగాఁడును, ఇతరులజీవనమును చెఱుపుటయందు ఆసక్తి గలవాఁడును, సోమరియును, ఎల్లప్పుడును వ్యసనశీలుఁడును, మందుఁడును - అనఁగా చురుకుఁదనము లేనివాఁడును అయిన కర్త తామసుఁడని చెప్పఁబడుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ॥ ౨౯

టీక. హేధనంజయ = ధనమును జయించిన యోయర్జునుఁడా! అశేషేణ=శేషము లేకుండునట్లు (సంపూర్ణముగాను), పృథక్త్వేన=వివరముగాను, ప్రోచ్యమానమ్ = చెప్పఁబోవునది, గుణతః= సత్త్వాదిగుణముల వలన, త్రివిధమ్ = మూఁడువిధము లయినదియును, (అగు) బుద్ధేః = బుద్ధియొక్క, భేదమ్=భేదమును, ధృతేః=బుద్ధివృత్తి యగు ధైర్యముయొక్క, భేదంచైవ = భేదమునుగూడ, శృణు = వినుము.

దిగ్విజయసమయమునందు అధికముగా దేశములయొక్కయు మనుష్యులయొక్కయు ధనమును జయించిన యోయర్జునుఁడా! సంపూర్ణముగాను, వివరముగాను నేను చెప్పఁబోవునట్టియును సత్త్వరజస్తమోగుణ భేదముచేత మూఁడువిధము లయినదియును అగు బుద్ధియొక్కయును, బుద్ధి వృత్తి యగు ధైర్యముయొక్కయును భేదమును వినుము; అని తాత్పర్యము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥

కార్యాకార్యములను సందేహాస్పదముగా తెలుసుకొను చున్నాఁడో, ఆ బుద్ధిరజోగుణప్రధాన మైనదని తాత్పర్యము.

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽవృతా ।
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ॥ 32

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! తమసా = అజ్ఞానముచేత, ఆవృతాసతీ = ఆవరింపఁబడినదై, అధర్మమ్ = శాస్త్రనిషిద్ధ మైన యధర్మమును, ధర్మమితి = శాస్త్రోక్తధర్మమునుగాను, సర్వార్థాన్=సకలవస్తువులను (తెలియఁదగిన వస్తువుల నన్నిఁటిని), విపరీతాంశ్చ = విరుద్ధములనుగాను, యా=ఏ. బుద్ధిః=బుద్ధి, మన్యతే=తలఁచు చున్నదో (తెలుసుకొను చున్నదో), సా = ఆ బుద్ధి, తామసీ = తమోగుణప్రధాన మైనది.

ఓ యర్జునుఁడా! అజ్ఞానముచే నావరింపఁబడినదై యేబుద్ధి శాస్త్రనిషిద్ధ మైన యధర్మమును శాస్త్రవిహిత మైన ధర్మమునుగాను, తెలియఁదగిన సకలవస్తువులను విపరీతములనుగాను తెలుసుకొను చున్నదో యా బుద్ధి తమోగుణప్రధాన మైనది, అనఁగా విపరీతజ్ఞానము గల బుద్ధి తామసీ బుద్ధి యని తాత్పర్యము.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ॥ 33

టీక. హేపార్థ = ఓ యర్జునుఁడా! యోగేన = యోగముచేత (చిత్తైకాగ్రతచేత), అవ్యభిచారిణ్యా=వ్యభిచరించని (విషయములయందు ప్రవేశించని), యయా = ఏ, ధృత్యా = ధైర్యముచేత (తెలివిచే), మనః ప్రాణేంద్రియక్రియాః = మనస్సుయొక్కయు ప్రాణముయొక్కయు ఇంద్రియములయొక్కయు క్రియలను, ధారయతే=ధరించు చున్నాఁడో విషయములయందు ప్రవేశింప కుండునట్లు యోగముచేత కట్టివేయు చున్నాఁడో, సా=ఆ, ధృతిః=ధైర్యము (తెలివి), సాత్త్వికీ=సత్వగుణప్రదాన మైన తెలివి.

చేయవలయు నను పట్టుదలతో నుండుటను) గర్వమును, నవిముంచతి=విడు వఁడో, సా=అ, ధృతిః=ధైర్యము (తెలిరి), తామసీ=తమోగుణ ప్రధాన మైనది, (ఇతి = అని) మతా = సమ్మత మైన .

ఓ యర్జునుఁడా! దుష్టబుద్ధి గల పురుషుఁడు నిద్రను, భయమును, శోకమును, దిగులును, శాస్త్రనిషిద్ధము లయిన విషయములయందు మనస్సును ప్రవేశపెట్టి వానినే చేయవలయు నను పట్టుదలతో నుండుటను అను వీనిని యేధైర్యముచేత విడువఁడో యదియే తమోగుణప్రధాన మైన ధైర్య మనియు, సమ్మత మైన దనియుఁ దాత్పర్యము.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తంచ నిగచ్ఛతి॥ ౩౬

యత్తదగ్రే విషమివ పరిణామే౽మృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికంప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥ ౩౭

టీక. హే భరతర్ష భ=భరతవంశపురాజులలో శ్రేష్ఠుఁడ వైన యో యర్జునుఁడా! ఇదానీమ్ = ఇప్పుడు, త్రివిధమ్ = మూఁడువిధము అయిన, సుఖంతు = సుఖమును, మే = నాయొక్క, (వచనాత్ = మాటవలన) శృణు=వినుము; యత్ర=ఏ సుఖానుభవమునందు (సమాధియోగమునందు) అభ్యాసాత్ = అనుష్ఠానపరిచయమువలన, రమతే=క్రీడించుచున్నాఁడో (ఆనందమును పొందుచున్నాఁడో), దుఃఖాన్తంచ=దుఃఖములయొక్క నాశ మునుగూడ, నిగచ్ఛతి=(సత్యముగా) బొందుచున్నాఁడో, యత్తత్=ఏ సుఖము, అగ్రే=ముందుగా (జ్ఞానవైరాగ్యధ్యానసమాధులయొక్క ఆరం భమునందు), విష మివ=(మొదట నధికాయాసమును కలిగించునది యగుట వలన) విషమువలె, (దుఃఖాత్మకమ్ = దుఃఖరూపముగా, భవతి = అగు చున్నదో), పరిణామే=(జ్ఞానవైరాగ్యధ్యానసమాధులయొక్క)పరిపాకము నందు, అమృతోపమమ్ = అమృతముతో తుల్య మైనది, (భవతి = అగు

ప్రక్చందనవనితాసంగాదులచేత ప్రసిద్ధ మైనదియును, విషయముల యందు ఇంద్రియములు చేరుటవలన మొదట అమృతతుల్య మైనదియును, అనఁగా నతిప్రేమాస్పద మైనదియును, పిమ్మట బలము, వీర్యము, రూపము, ప్రజ్ఞ, జ్ఞాపకశక్తి, ఉత్సాహము అను వీనియొక్క హానికి కారణ మగుటవలన విషమువంటిదియును, అనఁగా ప్రేమాస్పదము కానిదియును అగు సుఖ మేదో యదియే రాజససుఖము అని చెప్పఁబడు చున్నది.

శ్లో॥ యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ ౩౯

టీక. యత్=ఏ, సుఖమ్=సుఖము, అగ్రేచ=ప్రథమక్షణమునందును (ఆరంభమునందును), అనుబంధేచ=అంతమునందును (పిమ్మటను), ఆత్మనః=తనకు, మోహనమ్=మోహము గలుగఁజేయునదియును, నిద్రాలస్యప్రమాదోత్థమ్=నిద్ర ఆలస్యము (సోమరితనము) ప్రమాదము (పొరపాటు) అను వానివలన కలుగునదియును, (భవతి = అగు చున్నదో), తత్=ఆ సుఖము, తామసమ్=తామససుఖము, (ఇతి=అని) ఉదాహృతమ్=చెప్పఁబడినది.

ఆరంభమునందును అంత్యమునందును తనకు మోహమును కలుగఁజేయునదియును, నిద్ర, ఆలస్యము, ప్రమాదము అనువానివలన కలిగినది యును అగు ఏసుఖము కలదో యది తామస సుఖమని చెప్పఁబడు చున్న దని తాత్పర్యము.

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభి ర్గుణైః ॥

టీక. యత్=ఏది, ఏభిః=ఈ, ప్రకృతిజైః=ప్రకృతివలనఁ బుట్టిన, త్రిభిః=మూఁడైన, గుణైః=సత్త్వరజస్తమోగుణములచేత, ముక్తమ్=విడువఁబడినది, స్యాత్=అగునో, తత్=ఆ, సత్త్వమ్=ప్రాణిసముదాయము (లేక) అచేతనసముదాయము, పృథివ్యాంవా=భూలోకమునం దైనను, దివివా=స్వర్గమునందైనను దేవేషువాపునః=దేవతలయం దైనను, నాస్తి=లేదు.

టీక. శమః = అంతరింద్రియనిగ్రహమును, దమః=బాహ్యేంద్రియ నిగ్రహమును, తపః = (కాయిక వాచిక మానసికము అను మూఁడువిధము లయిన) తపస్సును, శౌచమ్=(బాహ్యమును అభ్యంతరమును అను రెండు విధములు అయిన) శుద్ధియును, క్షాన్తిః=ఓర్పును, ఆర్జవమ్+ఏవంచ=ఋజుత్వమును. జ్ఞానమ్=శాస్త్రీయజ్ఞానమును, విజ్ఞానమ్=బ్రహ్మైకత్వానుభవజ్ఞానమును, ఆస్తిక్యమ్ = ఆస్తిక్యబుద్ధియును, (ఇతి = అను, ఏతత్=ఈ సముదాయము) స్వభావజమ్ = స్వభావసిద్ధ మైన, బ్రాహ్మంకర్మ = బ్రాహ్మణజాతియొక్క కర్మము.

అంతరింద్రియనిగ్రహమును, బాహ్యేంద్రియనిగ్రహమును, కాయికము, వాచికము, మానసికము అను మూఁడు విధములయిన తపస్సును, అభ్యంతరము, బాహ్యము అను రెండువిధము లయిన అభ్యంతరశుద్ధియును, బాహ్యశుద్ధియును, ఓర్పును, ఋజుత్వమును, అనఁగా న్యాయప్రవర్తనయును, శాస్త్రీయజ్ఞానమును, బ్రహ్మైకత్వానుభవజ్ఞానమును, ఆస్తిక్యబుద్ధియును అను నీతొమ్మిదియును బ్రాహ్మణజాతికి స్వభావసిద్ధ మైన కర్మము లని తాత్పర్యము.

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్॥ ౪౩

టీక. శౌర్యమ్=శౌర్యమును (పరాక్రమవంతున కుండఁదగిన ధర్మమును), తేజః=ప్రాగల్భ్యమును (కీర్తియును), ధృతిః=ధైర్యమును (గొప్ప దాపదయందుఁగూడ దేహేంద్రియసముదాయమున కుపిరికి తోఁచకుండుటయును), దాక్ష్యమ్=సమర్థతయును, యుద్ధే=యుద్ధమునందు, అపలాయనం చాపి=(శత్రువులవలన భీతిఁ జెంది) పాఱిపోకుండుటయును, దానమ్=దానమును (సత్పాత్రత్యాగమును), ఈశ్వరభావశ్చ=ఈశ్వరభావమును (ప్రజలను పాలించుటకొఱకు సంపదభివృద్ధికరము అగు కార్యములయందు ప్రభుశక్తిని వెలిబుచ్చుటయును), ఇతి=అను, ఏతత్=ఈ సముదాయము) స్వభావజమ్=స్వభావసిద్ధ మైన, క్షాత్త్రంకర్మ = క్షత్త్రియజాతియొక్క కర్మము.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ ౪౫

టీక. స్వేస్వేకర్మణి = తన తనకర్మమునందు (తన గుణవర్ణమునకుఁ దగినట్లు చెప్పఁబడిన కర్మమునందు), అభిరతః = ఆసక్తి గల, నరః = మనుష్యుఁడు, సంసిద్ధిమ్ = (నిరభిలాషతో స్వకర్మము ననుష్ఠించుటవలన ఇంద్రియ పాపశుద్ధ్యము కలుగఁగా తద్వారా) జ్ఞానాధిష్ఠాన యోగ్యతను, లభతే = పొందుచున్నాఁడు; స్వకర్మనిరతః=తనకు (తనజాతికి) శాస్త్రవిహిత మైన కర్మమునందాశ గలవాఁడు, యథా=ఏప్రకారము, సిద్ధిమ్ = జ్ఞానాధిష్ఠాన యోగ్యతను, విందతి = పొందుచున్నాఁడో, తత్ = దానిని, శృణు = వినుము.

ఆయా గుణవర్ణములకు విధింపఁబడిన ప్రకారము కర్మములయందాసక్తిగలవాఁడు జ్ఞానమును పొందఁదగిన యోగ్యతను, అనఁగా చిత్తశుద్ధిని పొందుచున్నాఁడు; అట్లు ఆయాగుణములకుఁ దగినట్లు చెప్పియున్న కర్మములయందాసక్తి గలవాఁ డెట్లు చిత్తశుద్ధిని పొందుచున్నాఁడో చెప్పెదను వినుము; అని తాత్పర్యము.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ ౪౬

టీక. యతః=ఎవనివలన, భూతానామ్=ప్రాణులకు, ప్రవృత్తిః = పుట్టుక (లేక) వ్యాపారము, స్యాత్ = కలుగునో), యేన = ఎవనిచేత, సర్వమ్=సకల మగు, ఇదమ్ = ఈ జగత్తు, తతమ్ = వ్యాపింపఁబడినదో, తమ్=ఆ యంతర్యామి యగు నీశ్వరుని, కర్మణా=వెనుక చెప్పియున్న వర్ణాశ్రమానుగుణ్య మయిన శాస్త్రోక్త కర్మముచేత, మానవః = మనుష్యుఁడు, అభ్యర్చ్య=పూజించి (ఆరాధించి), సిద్ధిమ్ = చిత్తశుద్ధిని (జ్ఞానాధిష్ఠానయోగ్యతాస్వరూప మైన సిద్ధిని), విందతి = పొందుచున్నాఁడు.

టీక. హే కౌంతేయ = కుంతీపుత్త్రుఁడ వైన యో యర్జునుఁడా! సదోష మపి = దోషములతోఁ గూడిన దైనను, సహజమ్ = జన్మముతోఁ గూడఁబుట్టిన, కర్మ = కర్మమును, నత్యజేత్ = విడువఁగూడదు; సర్వారంభాః = సకలకర్మములును, ధూమేన = పొగచేత, అగ్నిరివ=నిప్పువలె, దోషేణ = (త్రిగుణసంబద్ధమైన) దోషముచేత, ఆవృతాహి=ఆవరింపఁబడియున్నవి గదా (కప్పఁబడి యున్నవి గదా),

తా. యర్జునుఁడా! సకల కర్మములును పొగ చేత నెట్లు నిప్పు కప్పఁబడి యున్నదో యట్లు సత్త్వాదిత్రిగుణసంబంధ మైన దోషము చేత నాక్రమింపఁబడియే యున్నవి. కనుక దోషయుక్తమైనను జన్మముతోఁ, బుట్టిన కర్మమును, అనఁగా వర్ణాశ్రమ విహితకర్మము నెవ్వఁడును విడువఁదగ దని తా.

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥ ४९

టీక. సర్వత్ర = (పుత్త్రులు దార మొదలగు) సకలమునందును, అసక్తబుద్ధిః=సంగరహిత మైన యంతఃకరణము గలవాఁడును, జితాత్మా= జయింపఁబడిన చిత్తము గలవాఁడును, విగతస్పృహః=(దేహము, జీవితము భోగములు అను వీనియందు) పోయినతృష్ణగలవాఁడును (తృష్ణా రహితుఁడును) అగు నాత్మజ్ఞాని, సన్న్యాసేన=చక్కఁగా చూచుటచేత (లేక) సమ్యగ్దర్శనపూర్వక మైన సన్న్యాసముచేత, పరమామ్ = శ్రేష్ఠ మైన నైష్కర్మ్య సిద్ధిమ్=నిష్కర్మసిద్ధిని (క్రియారహిత మైన యాత్మస్వరూపావస్థానసిద్ధిని), అధిగచ్ఛతి = పొందు చున్నాఁడు.

దారాపుత్త్రాది సకలములయందును సంగరహిత మయిన యంతఃకరణము గలవాఁడును; జయింపఁబడిన చిత్తము గలవాఁడును; దేహమునందును, జీవితమునందును, భోగములయందును ఆశ లేనివాఁడును అగు

టీక. విశుద్ధయా=మాయారహితమైన, బుద్ధ్యా=(బ్రహ్మాత్మ నిశ్చయాత్మకమైన) బుద్ధితో, యుక్తః=కూడినవాఁడును, ధృత్యా=ధైర్యము చేత, ఆత్మానమ్=బుద్ధిని, నియమ్య చ=వశము చేసికొనియును, శబ్దాదీన్=శబ్దస్పర్శరూపరసగంధము లనునట్టి, విషయాన్=విషయములను, త్యక్త్వా=వదలి, రాగద్వేషౌ=(శరీరధారణకు ముఖ్యముగా నావశ్యకము లయిన వస్తువులయందుఁ గూడ) రాగద్వేషములను, వ్యుదస్య చ = బాగుగా విడిచియును, వివిక్తసేవీ = పవిత్రమును జనరహితమును అయిన అరణ్యము నదీతీరము పర్వత గుహ మొదలగు ప్రదేశములను సేవించు స్వభావము గలవాఁడును, లఘ్వాశీ = మితముగా భుజించుస్వభావము గలవాఁడును, యతవాక్కాయమానసః=స్వాధీనము చేసికొనఁబడిన వాక్కు కాయము మనస్సు గలవాఁడై, నిత్యమ్=ఎల్లప్పుడును, ధ్యానయోగపరః+సన్=ఆత్మస్వరూపచింతనము ఆత్మస్వరూపమునందే చిత్తైకాగ్రత అను ధ్యానయోగములయం దాసక్తి గలవాఁడునై, వైరాగ్యమ్ = (ఇహపరభోగములయందు) వైరాగ్యమును, సముపాశ్రితః=ఆశ్రయించినవాఁడును, అహంకారమ్=(నేను విరాగము గలవాఁడ నను) అహంకారమును, బలమ్ = కామరాగాదులతోఁ గూడిన సామర్థ్యమును, (శరీరాది సామర్థ్యము కాదు) దర్పమ్=దర్పమును, కామమ్ = ఇచ్ఛను, క్రోధమ్ = ద్వేషమును, పరిగ్రహమ్=(దేహసంరక్షణార్థము గాని, (లేక) ధర్మకార్యములకొఱకు గాని) పరిగ్రహమును (ఇతరు లిచ్చుదానిని స్వీకరించుటను), విముచ్య = విడిచిపెట్టి, నిర్మమః=(దేహధారణయందుఁ గూడ) మమకారము లేనివాఁడును, (అత ఏవ=అందువలననే) శాన్తః = పరమశాంతుఁడును అగువాఁడు, బ్రహ్మభూయాయ = "బ్రహ్మాహమ్" అను నిశ్చలచిత్తముతో నుండుట కొఱకు, కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

మోహరహితమైనది కనుకనే బ్రహ్మాత్మనిశ్చయాత్మకమైన బుద్ధితోఁ గూడినవాఁడును, ధైర్యముచేత బుద్ధిని స్వాధీనము చేసికొనియును,

నేను బ్రహ్మ మైతి నను దృఢనిశ్చయము గలవాఁడు, అనఁగా బ్రహ్మజ్ఞాని అధ్యాత్మప్రసాదస్వభావమును పొందినవాఁడై అర్థమును గూర్చి (లేక) ఆత్మనైన గణ్యమును గూర్చి దుఃఖింపఁడు, ప్రాప్తించని దానిని కోరఁడు (లేక) లభించినదానిని గూర్చి సంతసింపఁడు. అందువలన సమస్త భూతములయందును సముఁడై పరమేశ్వరుఁడ నైన నాయందు ఉత్తమ మయిన భక్తి గలిగి యుండునని తాత్పర్యము.

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥55॥

టీక. భక్త్యా=(జ్ఞానలక్షణ మైన) భక్తిచేత, యావాన్=(ఉపాధి చేతఁ జేయఁబడిన భేదముచేత) సర్వవ్యాపకత గలవాఁడను, యశ్చ = ఏ వశించిన సర్వోపాధిభేదము గలవాఁడను (సచ్చిదానంద ఘనుఁడను), అస్మి=అగుచున్నానో, (తమ్ = ఆ) మామ్ = నన్ను, తత్త్వతః=యథార్థముగా, అభిజానాతి=తెలుసుకొనుచున్నాఁడు; తతః=పిమ్మట, తత్త్వతః=యథార్థముగా, జ్ఞాత్వా = తెలిసికొని, తదనంతరమ్ = తెలుసుకొనిన పిమ్మట, మామ్=నన్ను, విశతే=చేరుచున్నాఁడు.

జ్ఞాని యగువాఁడు జ్ఞానలక్షణ మైన భక్తిచేత నన్ను సర్వవ్యాపకునిగాను, సచ్చిదానంద ఘనునిగాను, అద్వైతునిగాను, చైతన్యమాత్రైకరసునిగాను, అజునిగాను, అజరునిగాను, అమరునిగాను, అభయునిగాను, అనిధనునిగాను తెలుసుకొనుచున్నాఁడు; అట్లు తెలుసుకొని నన్ను పొందుచున్నాఁడు, అనఁగా జ్ఞానము గలిగినతోడనే సచ్చిదానంద స్వరూప మైన పరబ్రహ్మమగుచున్నాఁడు అని తాత్పర్యము.

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥56॥

టీక. సర్వకర్మాణి+అపి=(శాస్త్ర చోదితములును నిషిద్ధములును నిత్యనైమిత్తికములును అగు) సకలకర్మములను, సదా=ఎల్లప్పుడు, కుర్వా

అయిన) సకలదుఃఖములను, తరిష్యసి = దాఁటఁగలవు; అహంకారాత్ = (నేను పండితుఁడ ననునట్టి) అహంకారమువలన, నశ్రోష్యసి + అథ + చేత్ = వినకపోతి వేని, త్వమ్ = నీవు, వినఙ్క్ష్యసి = వినాశమును పొందెదవు (మోక్షభ్రష్టుఁడ వగుదువు).

నన్ను ధ్యానించుచున్న నీవు నాయనుగ్రహమువలన సకలము లయిన సాంసారికదుఃఖములను దాఁటెదవు. నేనే తెలివి గలవాఁడను నాకొకరు చెప్పవలసిన దేమి యున్న దనునట్టి యహంకారము గలిగి వినకపోతి వేని వినాశమును పొందెదవు, అనఁగా మోక్షభ్రష్టుఁడ వగుదు వని తా.

శ్లో॥ యద్యహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥ 59

టీక. అహఙ్కారమ్ = (ఒకరు చెప్పినదాని నెందుకు వినుట యను) గర్వమును, ఆశ్రిత్య = ఆశ్రయించి (చెంది), నయోత్స్యే = యుద్ధమును చేయను, (ఇతి = అని) మన్యసే యత్ = తలఁచితి వేని, తవ = నీయొక్క, వ్యవసాయః = నిశ్చయము, మిథ్యైవ = వ్యర్థమైనదియే, ప్రకృతిః = (రజోగుణరూపముగా పరిణమించిన) క్షత్రియస్వభావము, త్వామ్ = నిన్ను, నియోక్ష్యతి = యుద్ధమునందు ప్రవర్తింపఁజేయును.

(ఓ యర్జునుఁడా!) ఒకరు చెప్పినదాని నెందుకు వినుట యనునట్టి గర్వమును చెంది యుద్ధము చేయనంటి వేని నీప్రయత్నము, అనఁగా యుద్ధము చేయ నను తలంపు వ్యర్థమైనదియే. ఏల యనఁగా, నీ వటుల నెంచినను రజోగుణరూపముగాఁ బరిణమించిన క్షత్రియస్వభావము నిన్ను యుద్ధమునందు ప్రవర్తింపఁజేయును; అనఁగా నీచేత యుద్ధమును చేయించు నని తా.

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోఽపి తత్॥

టీక. హే కౌన్తేయ = ఓ యర్జునుఁడా! స్వభావజేన = (క్షత్రియ జన్మమునకుఁ గారణమైన) పూర్వకర్మసంస్కారమువలనఁ గలిగినదియును,

టీక. హే భారత – ఓ యర్జునుఁడా! సర్వభావేన = సమస్తవిధ ములచేత, తమేవ=హృన్నివాసి యగు నారాయణుని, శరణమ్=(సంసార దుఃఖము అను వారించుకొఱకు) రక్షకునిగా, గచ్ఛ = పొందుము (అట్లు యొంపుము;) తత్ప్రసాదాత్ = ఆ యీశ్వరునియొక్క యనుగ్రహమువలన, పరామ్=శ్రేష్ఠమైన, శాన్తిమ్=ఉపరతిని (బంధనివృత్తిని), శాశ్వతమ్ = నిత్యమైన, స్థానంచ = పరమపదమును (మోక్షమును), ప్రాప్స్యసి = పొందెదవు.

ఓ యర్జునుఁడా! సమస్తవిధములచేత సకలప్రాణుల హృదయముల యందు వసించు నారాయణుని (స్వస్వరూపమును) సంసార దుఃఖముల వారించుకొఱకు రక్షకునిగాఁ బొందుము; ఆ యీశ్వరుని యనుగ్రహము వలన నుత్తమమైన శాంతిని, నిత్యమైన పరమపదమును (సర్వవ్యాపి యగు పరమాత్మయొక్క స్థానమును), అనఁగా మోక్షమును పొందఁగలవని తా.

శ్లో॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

టీక. ఇతి=ఈప్రకారముగా, గుహ్యాత్=గోప్యమునకంటె (దాచఁ దగినదానికంటె), గుహ్యతరమ్ = అతిగుహ్యము (మిక్కిలి రహస్యము) అగు, జ్ఞానమ్ = ఆత్మజ్ఞానము, తే = నీకొఱకు, మయా = (సర్వజ్ఞుఁడను ఈశ్వరుఁడను నగు) నాచేత, ఆఖ్యాతమ్=చెప్పఁబడినది; ఏతత్ = (ఆత్మజ్ఞాన మగు) ఈ శాస్త్రమును, అశేషేణ = సమస్తమును, విమృశ్య = చక్కగా నాలోచించి, (ఎవరెవరు ఏయేప్రకారముండఁగలరయు నను విషయమును తెలిసికొని), యథా = ఏప్రకారము, ఇచ్ఛసి=ఇచ్ఛయించుచున్నావో తథా=ఆప్రకారము, కురు = చేయుము,

ఓ యర్జునుఁడా! రహస్యములకంటె నతిరహస్యమైనది యగు నాత్మజ్ఞానమును సర్వజ్ఞుఁడ నగు నేను నీకు చెప్పితిని, నేను చెప్పియున్న యాత్మజ్ఞానసాధన మగునట్టి యీ గీతాశాస్త్రమును, దాని సకలయర్థము

అయితివి, (తస్మాత్ = అందువలన) తే = నీకు, సత్యమ్ = సత్యముగా, ప్రతిజానే = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

ఓ యర్జునుఁడా! నాయందు చిత్తము గలవాఁడవును, నాయందు భక్తి గలవాఁడవును, నన్నే నమస్కరించువాఁడవును అగుచు సకలమును భగవంతుఁడ నగు నాయందు సమర్పించితివేని నన్నే పొందెదవు; నా కిష్టుఁడవైనందున నీకు సత్యముగా ప్రతిజ్ఞ చేయుచున్నాను కాన నా మాటను నమ్మి భగవంతుఁడ నగు నాయందు భక్తి గలవాఁడవై మోక్షమును బొందు మని తాత్పర్యము.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

టీక. (హే అర్జున = ఓ యర్జునుఁడా! త్వమ్ = నీవు) సర్వధర్మాన్ = సకలధర్మములను (ధర్మాధర్మముల నన్నిటిని), పరిత్యజ్య = వదలి, ఏకమ్ = సర్వాత్ముఁడను - సర్వభూతములం దుండువాఁడను - ఈశ్వరుఁడను - అచ్యుతుఁడను - జన్మమరణవివర్జితుఁడను, (అగు) మామ్ = నన్ను, శరణమ్ = శరణమును, వ్రజ = పొందుము (నాకంటె నితరుఁడు శరణము లేఁడని తెలుసుకొనుము), అహమ్ = నేను, త్వా = (పైన చెప్పినట్లు నన్ను నమ్మియున్న) నిన్ను, సర్వపాపేభ్యః = (బంధరూపము అయిన) సకలపాపముల నుండి, మోక్షయిష్యామి = (అ-10, శ్లో-11, నందు చెప్పినప్రకారము స్వాత్మభావమును ప్రకాశింపఁజేయుటచేత) విడిపించెదను; త్వమ్ = నీవు) మాశుచః = దుఃఖింపకుము.

ఓ యర్జునుఁడా! ధర్మాధర్మరూపము అయిన సకలకర్మములను విడిచిపెట్టి సర్వాత్ముఁడను, సర్వభూతాంతర్యామిని, ఈశ్వరుఁడను, అచ్యుతుఁడను, జన్మమరణ వివర్జితుఁడను అగు నన్నే శరణమును పొందుము; అనఁగా నాకంటె మఱియొక శరణము లే దని తెలుసుకొనుము.

యుం దాఁకపించెడి నాదు మహిమ నెఱుంగనివానికి యెంతమాత్రమును చెప్పఁదగదు; అనఁగా పైన జెప్పియున్న తపోభక్తిశ్రద్ధలు నాయందుంచు వానికిఁ జెప్పవచ్చు నని తాత్పర్యము.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

టీక. యః=ఎవఁడు, పరమమ్ = ఉత్తమమును, గుహ్యమ్ = అతిరహస్యమును, (అగు) ఇదమ్=కృష్ణార్జునుల సంవాదరూప మైన) ఈ గీతాశాస్త్రమును, మద్భక్తేషు=నాయందు భక్తి గలవారియందు, అభిధాస్యతి=ఉంచునో (నాభక్తులకుఁ జెప్పునో), (సః = అట్టివాఁడు) మయి = నాయందు, పరామ్ = శ్రేష్ఠ మైన, భక్తిమ్ = భక్తిని, కృత్వా=చేసి, (భగవంతుఁడును పరమగురువును అగు నచ్యుతునకు నాచేత శుశ్రూష చేయఁబడుచున్నది యనుకొని) మామేవ=నన్నే, ఏష్యతి=పొందుచున్నాఁడు (మోక్షమును జెందుచున్నాఁడు), అసంశయః=ఇందుకు సందేహించవలసినది లేదు.

ఉత్తమమును, అతిరహస్యమును, కృష్ణార్జునులయొక్క సంవాదరూపము అగు నీ గీతాశాస్త్రమును నాభక్తులకుఁ జెప్పువాఁడు భగవంతుఁడును పరమగురువు నగు నచ్యుతునకు శుశ్రూష చేయుచున్నా నని తలఁచి నన్ను పొందుచున్నాఁడు, అనఁగా మోక్షమును పొందుచున్నాఁడు; ఇందుకు సందేహించవలసినది లేదు; అని తాత్పర్యము.

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥ ౬౯

టీక. మనుష్యేషు = మనుష్యులలో, తస్మాత్ =(నాభక్తులకు గీతార్థమును జెప్పునట్టి) వానికంటె, ప్రియకృత్తమః=అధికప్రియమును చేయువాఁడు, కశ్చిత్ = ఒక్కఁడును, మే=నాకు, నచ=లేనేలేఁడు; భువి = భూమియందు, తస్మాత్ = వానికంటె, అన్యః=ఇతరుఁడు, ప్రియతరః = మిక్కిలి యిష్టుఁడు, మే= నాకు, నభవితాచ=కలుగనుకూడ గలుగఁడు.

టీక. యః = ఏ, నరః = మనుష్యుఁడు, శ్రద్ధావాన్ = శ్రద్ధ గల వాఁడును, అనసూయశ్చ=అసూయ లేనివాఁడును, (సన్=అయినవాఁడై), శృణుయాదపి=అర్థజ్ఞానము లేకయే వినునో, సోఽపి=అటువంటివాఁడును (అర్థజ్ఞానము లేక వినువాఁడును), (పాపాత్ = పాపమునుండి) ముక్తః= తొలంగింపఁబడినవాఁడై (పాపరహితుఁడై) పుణ్యకర్మణామ్ = అగ్నిహోత్రాది పుణ్యకర్మము లాచరించినవారియొక్క, శుభాన్=శుభకరములయిన, లోకాన్=లోకములను (పుణ్యలోకములను), ప్రాప్నుయాత్=పొందును.

అర్థమును తెలిసికొను శక్తి లేకున్నను శ్రద్ధయును, అనసూయయును గలిగి గీతాశాస్త్రమును వినువాఁడుగూడ పాపములనుండి తొలఁగి, అగ్నిహోత్రాది పుణ్యకర్మములను చేసినవారు పొందు పుణ్యలోకములను పొందును; అని తాత్పర్యము.

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥ ౭౨

టీక. హే పార్థ = పృథ యను పేరుగల కుంతియొక్క కుమారుఁడవైన ఓ యర్జునుఁడా! ఏతత్ = (నాచేతఁ జెప్పఁబడిన) ఈ గీతాశాస్త్రము, త్వయా = నీచేత, ఏకాగ్రేణ=నిశ్చలమైన, చేతసా=చిత్తముచేత, శ్రుతం కచ్చిత్ = వినఁబడినది గదా! హే ధనంజయ = ఓ యర్జునుఁడా! తే = నీయొక్క, అజ్ఞానసమ్మోహః = అజ్ఞానము నిమిత్తముగాఁ గల మోహము (అజ్ఞానమువలనఁ గలిగిన మోహము), ప్రనష్టః కచ్చిత్ = నశించినది గదా.

ఓ యర్జునుఁడా! నేను చెప్పినదానిని నిశ్చలచిత్తముతో వింటివా? అజ్ఞానమువలనఁ గలిగిన మోహము నశించెనా? అని శ్రీకృష్ణుఁ డడిగెనని తాత్పర్యము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—మిక్కిలి వింత యైనదియును, తలఁచినపుడెల్ల గగుర్పాటును గలిగించునదియును అగు నింతకు పూర్వము నేఁడు చెప్పియున్న మహానుభావు లగు కృష్ణార్జునులయొక్క సంవాదమును నేను యీప్రకారము వింటిని; అని తాత్పర్యము.

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥

టీక. వ్యాసప్రసాదాత్ = వ్యాసమహర్షియొక్క యనుగ్రహము వలన, గుహ్యమ్ = అతిరహస్య మైనదియును, పరమ్ = ఉత్తమ మైనదియును అగు, ఏతత్ = ఈ, యోగమ్ = (జ్ఞానయోగమును తెలియఁజేయునది కనుక యోగ మనుపించుకొను) గీతాశాస్త్రమును, స్వయమ్ = స్వయముగానే, కథయతః = చెప్పుచున్న, యోగేశ్వరాత్ = సకలయోగములకు నీశ్వరుఁ డగు, కృష్ణాత్ = శ్రీకృష్ణునివలన, సాక్షాత్ = ప్రత్యక్షముగా, అహమ్ = నేను, శ్రుతవాన్ = విన్నవాఁడను,

భారతయుద్ధమునంతయు చూచివచ్చి నీకుఁ జెప్పఁగలందులకుఁగా వ్యాసమహర్షి యొసంగిన దివ్యజ్ఞానమువలన అతిరహస్యమును, ఉత్తమమును, జ్ఞానయోగమును తెలియఁజేయునది గాన యోగ మనియును జెప్పఁబడుచున్న యీ గీతాశాస్త్రమును స్వయముగా నర్జునునికి యోగేశ్వరుఁ డగు శ్రీకృష్ణుఁడు చెప్పుచుండఁగా దగ్గఱనుండి నేను వింటిని; అని తా.

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

టీక. హే రాజన్ = ఓ ధృతరాష్ట్రమహారాజా! అద్భుతమ్ = ఆశ్చర్యకర మైనదియును, పుణ్యమ్ = (విన్నంతమాత్రముననే) పాపమును పోఁగొట్టునదియును, (అగు) ఇమమ్ = ఈ, కేశవార్జునయోః = కృష్ణార్జునులయొక్క, సంవాదమ్ = సంవాదమును, సంస్మృత్యసంస్మృత్య = మాటి

మును, భూతిః = ఐశ్వర్యాభివృద్ధియును, నీతిః = న్యాయమును, ధ్రువా = స్థిరముగ నిలుచునది, (ఇతి) = అని, మమ = నాయొక్క, మతిః = నిశ్చయము.

ఓ ధృతరాష్ట్రుఁడా! యోగసిద్ధులకు ప్రభు వగునట్టి యీశ్వరుఁడును, విల్లుని ధరించిన యర్జునుఁడును ఉన్నటువంటిపక్ష మేదో అచ్చటనే, అనఁగా పాండవపక్షమునందే రాజ్యలక్ష్మియును, జయలక్ష్మియును, ఐశ్వర్యాభివృద్ధియును, న్యాయమును తొలఁగిపోక నిలుచును; అని నాయభిప్రాయ మని సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పె నని తా.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం
సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః.

టీక. వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్త మైనదియును, శతసాహస్ర్యామ్ = నూరువేలశ్లోకములు కలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, (అయిన) శ్రీమహాభారతే = సంపత్కర మైన మహాభారత మనునట్టి యితిహాసమునందు, భీష్మపర్వణి = భీష్మపర్వమునందు, శ్రీభగవద్గీతాసు = ప్రశస్తజ్ఞానసంపద కల భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్త మైన కృష్ణార్జునులయొక్క సంవాదరూపము, (అయిన) బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమునందు, (అనఁగా, బ్రహ్మజ్ఞానవిషయక ముపాయములను తెలుపునట్టి గ్రంథమునందు) యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, మోక్షసన్న్యాసయోగో నామ = మోక్షసన్న్యాసయోగ మనియెడు పేరు గల, అష్టాదశః = పదునెనిమిదవదైన, అధ్యాయః = భాగము, ఇతి = ముగిసెను.